పితృతుల్యులూ

స్వాతంత్ర్య సమరయోధులూ

అయిన

కీ ॥ శే ॥ కల్లూరు సుబ్బారావు గారికి

అంకితం

# మనవి

గోదావరినది సముద్రసంగమానికిముందు ఏడుపాయలైనది. అన్ని బాహువు లతోగాని ఆ సంగమానంద మనుభవంలోకి రాదనేమో !

ఈ సప్తగోదావరములలో యానం కాకినాడలమధ్య ప్రవహించే కోరంగి ఒకటి. కోరంగిగట్టుమీద కోరంగి ఊరుంది. నాటికి, సముద్రం కోరంగి ఊరికింకా చేరువగా ఉండేదట.

18 వ శతాబ్ధపుటుత్తరార్థరంలో ఆంధ్రలో బందరు తరువాత ఒక ప్రధానమైన రేవుగా వర్తక కేంద్రంగా, మనతూర్పుతీరాన ఏకైకమగు నౌకానిర్మాణకేంద్రంగా కోరంగి ప్రసిద్ధి చెందింది. ఈ ఊరు ఆంధ్రదేశంలో ఇంకాగొప్పరేవుపట్నంగా ముందు ముందు పెంపొందగలదనిపింపజేసింది.

నాటియూరోపులోని నదులపై ద్వితీయశ్రేణికి చెందిన రేవులకు దేనికీ తీసిపోని రేవు కోరంగి. తరువాతి కాలంలో నదీముఖాలలోని రేవు పట్నాలకంటే సముద్ర తీరంపై రేవులప్రాధాన్యతపెరిగింది. అయినా పాశ్చాత్యనదీముఖాలరేవులూఎదుగుతూనే వచ్చాయి. కోరంగిరేవుమాత్రం శిథిలావశిష్టమైపోయింది.

కోరంగిలాంటి రేవులెన్నున్నాయో ఆసియా ఆఫ్రికాఖండాల్లో.

పదునెనిమిదవ శతాబ్దంలో పతనాన్ని చూసి ఏడ్చిన కవులు మనకు తెలుసు. ఆయుగానికి చెందిన బ్రహ్మంగారివంటి తత్త్వవేత్తలు తెలుసు. బొబ్బిలియుద్ధంగురించి వినని తెల్గువాడుంటాడా? అనేక సంస్థానాధీశుల చరిత్రలు ఇతిహాసాలు తెలుసు.

ఎక్కడో సూచనప్రాయంగామాత్రం కన్పడే నాటి ఒకతరహ యువకులను గురించి మనకు బొత్తిగా తెలియదు. ఆ తరహ యువకులు కంపెనీల వాణిజ్యంలో లాబాసాటి భాగాస్వాములుకారు. దివాణాల్లో చేతులునలిపే ఆశ్రితులుకారు. తెలియని శక్తులు ఉసిగొల్పితే జనులమీద విరుచుకుపడిన తోడేళ్లుగారు. దీనులుకారు. ఇవన్నీ అందుబాటులోఉన్నా, కాదని, సర్వజనీనమైన అభ్యుదయంకోసంప్రవాహాని కెదురొడ్డి నిల్చినారు కొందరు. కారుమేఘాలు కమ్మిన మన ఆ చరిత్రాధ్యాయంలో కాంతిరేఖలు

వారు. ధీరులు.పరాజితులై ఉండవచ్చు. విస్మృతులై ఉండవచ్చు. అయినాకాదనరాని యథార్థజీవులు. మనకు సదా సంస్మరణీయులు.అనుసరణీయులు.

ఇందులో వారిని గురించి వ్రాశాను.

ఆ కాలపు పాఠాలీ కాలానికి ప్రత్యేకంగా నేర్చుకోవలసినవి చాల ఉన్నాయి.

పారిశ్రామిక విప్లవం ముంగిటి రోజుల్లో మనం వెనుక బడిపోయాం. ఆపతనానికి దారితీసిన శక్తులీ కాలానికీ చావకుండా మనల దిగలాగుతూనే ఉన్నాయి. వాటి ప్రభావం గణనీయం. వాటి పట్ల మనమెంతవరకు అప్రమత్తులమై ఉన్నాము ?

ఇప్పుడు మరొక యుగంలోని కడుగు పెట్తోంది మానవజాతి. ఈ పోటీలోనూ మనం వెనుకేనా?

ఈ విషయం పాఠకుల దృష్టికి తేగల్గితే చాలు కృతార్థుణ్ణి.

ఇందులో పాత్రలూ, సన్నివేశాలూ కల్పితాలు, అయినా నాటిసాహిత్యంలోనో ఇతిహాసంలోనో ఈ కల్పనలకు, పాత్రలకు స్ఫోరకాలైన దృఢమైన ఆధారాలున్నవి.

ఇరవైయేళ్ళ వ్యవధిలో సుమారు నాలుగైదేళ్ళఅవిరళకృషి ఈ పుస్తకం వెనుక ఉన్నది. పని క్రమబద్ధం కానందునా, కృషి hobby కనకా, చదివిన పుస్తకాలాజాబితా పెట్టుకోలేదు. ఉంటే పెద్దలిస్తే ఔనని మాత్రం మనవి. అలాగే కోరంగి చుట్టుపక్కం ఇరవై ఏళ్ళనాడు ఇతిహస దృష్ట్యా కల్సుకొన్న వయో వృద్ధుల జాబితా కూడానూ. కోరంగి తాళ్ళరేవుపరిసరాల్లో వారికళ్ళల్లో కోరంగి పూర్వప్రసక్తి తెచ్చినప్పుడు ప్రకా శించిన తళ తళలే ఈ పనికి నన్ను మొదట పురమాయించాయి.

నా మట్టుకు నాకే ఈ కృషి పరిపూర్ణ మనిపించదు. తగు ఆదరణ లభిస్తే ఇదే కాలాన్ని గురుంచి మరింత చక్కగా లోతుగా బొబ్బిలి యుద్ధమో ప్లాసీయుద్ధమో వృత్తంగా మరొక చిన్న పుస్తకం రాయాలి.

– రచయిత.

# " బంకోలా " చదివాక

ఆవుల సాంబశివరావు

ఉపాధ్యక్షులు ఆంధ్ర విశ్వ విద్యాలయం

ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి

పరిచయాలు, ముందు మాటలు - ఇతరులు రాసేవి - కొన్ని పుస్తకాలకు అవసరముండదు. స్వయం ప్రకాశ కాలయిన రచనలకు అద్దం పట్టడం దేనికి ? అటువంటి వాటిల్లో " బంకోలా " ఒకటి.

పేరు కొత్తగా ఉన్నది. రాసిన రీతి మార్పుగా వుంది. ఇది ఒక కథ పెద్దదయిన కథ . నవల అనుకున్నా నాకు ఆభ్యంతరం లేదు. అయితే కథ చెప్పిన వైనంలో ఒక ప్రత్యేకత వుంది. అనగనగా ఒక ఊరు అంటూ మొదలు పెట్టిన కథనం కాదు. కొంత మంది కాలేజీ అబ్బాయిలు దేశాన్ని చూడ్డానికి వెళ్తారు. వాళ్ళు తెలుగు పిల్లలు. తెలుగువాళ్ళకి, అదిలాబాదులో వున్నా, కోటిపల్లిలో వున్నా, గోదావరి పంచప్రాణాల్లో ఒకటి. అందుచేత ఈ తెలుగు అబ్బాయిలు గోదావరి వైపుకే పయనం సాగిస్తారు. గోదావరి అనగానే అందులో పయనించే పడవలూ, పడవ వాళ్ళు వుండ కుండా వుండడానికి వీలులేదు. గోదావరీ జలాల ప్రభావము అనుకుంటాను, దానిమీద పడవలు నడిపే వారికందరికి మాట, పాట గోదావరి పొంగులాగానే ఉ రికి వస్తూ వుంటాయి. అటువంటి పడవ వాడు ఒకడు ఈ అబ్బాయిలకు తగిలాడు. పదాల పాడి వినిపించాడు. అందుకు రుచి మరిగి కథ గూడా చెప్ప మన్నారు అతగాడిని ఈ పిల్లలు. ఆ నావ మీదే అ నావికుడే బంకోలా కథను చెప్పాడు. ఈ మాదిరిగా కథ ఎత్తుగడలో కొత్త దనం ఉంది.

రచయిత సుబ్రహ్మణ్యం శర్మగారు గోదావరితోనే కథకు ఓనమాలు రాయ డానికి ఒక కారణం వుంది. తాను రాయబోతున్న కథకు గోదావరి పారే తెలుగునాటి

సాగరసీమ రంగస్థలము. అందుకని తన కథకు గోదావరితో శ్రీకారము చుట్టడం రచయిత చూసిన నేర్పరితనం.

తరువాత కథా ప్రదేశం తెలుగు దేశములోని సాగరసీమ కాగా, కథా కాలం 18 వ శతాబ్దం . ఆ ప్రాంతపు ఆ నాటి తెలుగు వాళ్ళ జీవితం, చరిత్ర , సంస్కారం, సంస్కృతి, నాగరికత ఇవన్ని యిందులో కళ్ళకు కట్టినట్లు కనిపిస్తాయి కథ చదువుతూ వుంటే అ నాటి తెలుగు జీవితాన్ని అంది పుచ్చుకున్నట్టు లేక అద్దంలో చూచినట్టు, మనకు అనుభూతి కలుగుతుంది. పాఠకుణ్ణి తాను నిర్మించిన వాతవరణంలోకి, అనుభూతులలోకి తీసుకువెళ్ళగలగడం అందులో అతని మనస్సును లగ్నము చేయగలగడం శర్మగారి రచనా నైపుణ్యాన్ని రుజువు చేస్తాయి.

ఎంతగానో నాకు నచ్చిన విషయం మరొకటి వుంది. అది పుస్తకములోని భాష. కమ్మగా, హాయిగా, మనం మాట్లాడు కుంటున్నట్లుగా వుంది. ఆదినుండి తుది వరకు ఆ శైలిని నిటబెట్టడం శర్మగారికి భాష మీద వున్న అధికారన్ని సూచిస్తుంది .

పుస్తకము చదివేక ఒక తృప్తి ఒక హాయి నాకు కలిగాయి. మంచికథ పసందయిన కథనం, నాజూకైనా భాషకలిసి ఒక మంచి పుస్తకాన్ని చదివాననే అను భూతిని కలిగించాయి. ఆ అనుభూతిని తెలియజేయడానికే యీ నాలుగు మాటలు రాసాను.

**– ఆవుల సాంబశివరావు.**

# బంకోలా వెలుగు జిలుగులు

పద్దెనిమిదవ శతాబ్దం ప్రారంభంలో మొగల్ చక్రవర్తి ఔరంగజేబు మరణించటంతో భారతదేశం అల్లకల్లోలమయింది. ఔరంగజేబు తర్వాత రాజ్యానికి వచ్చిన మొగల్ చక్రవర్తులు అసమర్థులు కావడంవల్ల అంత: కలహాలతోను. విదేశి దండయాత్రల వల్లను, మొగల్ సామ్రాజ్యం క్షీణించింది. దక్షిణాపథంలో మహారాష్ట్రులు. ఉత్తరాన శిక్షులు, మరికొందరు తమ రాజ్యాలను విస్తరించుకొనడానికి ప్రయత్నించ సాగారు. ఈ కల్లోల పరిస్థితి వర్తకంకోసం మనదేశానికి వచ్చిన బ్రిటిష్ ఫ్రెంచివారినికూడ రాజకీయాధికారానికై ప్రాకులాడేట్టు చేసింది. వీరిద్దరు స్థానికరాజులవైపు చేరి పోరాటాలు నడపటమేకాక. అవకాశం కల్గినప్పుడు కొన్ని ప్రాంతాలను ఆక్రమించుకొన్నారు, కాని, ఈపోటిలో చివరకు నెగ్గినవారు బ్రిటిష్ వారు.

బ్రిటిష్ పరిపాలనలో తర్వాత కొన్ని సంస్కరణలు ఏర్పడినా, ప్రారంభంలో భారతదేశ ఆర్థిక పరిస్థితి అస్తవ్యస్తమైంది. బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీపాలన దేశాన్ని అధోగతికి తెచ్చింది. పూర్వకాలంలో నూలు, పట్టువస్త్రాలకు, ఉన్నితివాచీలకు, లోహ చర్మ పరిశ్రమలకు ప్రసిద్ధి చెందిన భారతదేశానికి ఈ కాలంలో వన్నెవాసిపోయాయి. వ్యవ సాయం, వాణిజ్యం కూడ దిగజారాయి. పెక్కు చేతిపనులు నశించాయి. కొన్ని బాగ దెబ్బతిన్నాయి ఇలాంటి పరిశ్రమల్లో ఇనుప పరిశ్రమ, నేత పరిశ్రమ ప్రధానమైనవి. వడ్రంగులు, కమ్మరులు, ఇతరులు వాడే పనిముట్లకు వ్యవసాయదారులువాడే సాధనాలకు కావలసిన ఇనుము దేశంలో దుర్లభమై విదేశాలో యంత్రాలపై తయా రయ్యే చౌక ఇనుము పై ఆధారపడవలసి వచ్చేది, కంపెనీ ప్రభుత్వం దేశియ పరిశ్రమలకు తోడ్పడనందున అవి అడుగంటసాగినవి నేతపరిశ్రమ యంత్రసాహయ్యంతో దిగుమతిఅయ్యే బ్రిటిష్ బట్టల పోటీకి తట్టుకోలేక పోయింది. తెలుగు

ప్రాంతంనుంచి ఏటాజరిగే కోటిరూపాయల విలువగల సన్నని వస్త్రాలు అద్దకపు బట్టల ఎగుమతి ఆగిపోవడంతో చేనేత పరిశ్రమ సన్నగిల్లింది. కంచర్లు. చర్మకారులు, కుమ్మర్లు మొదలైనవారు ఆనువంశిక వృత్తులనుమాని వ్యవసాయ కార్మికులుగాగానీ, విదేశీయుల కార్ఖానాల్లో పని వారుగా గానీ చేరవలసి వచ్చింది

ఈ సంక్షోభ పరిస్థితి బంకోలా నవలకు ఇతివృత్తం. బంకోలా అంటే లైట్‌హౌస్‌గా దీపగృహం. ఈ బంకోలామిషతో మిత్రులు శ్రీ సుబ్రహ్మణ్యం శర్మ 18, 19 శతాబ్దాల తెలుగుదేశం చరిత్రను మన ముందు పెట్టారు. ఈస్టిండియా కంపెనీ నివేదికలు, జిల్లాగెజిటీర్లు. మరాఠా. నిజాం, మైసూరు పాలకుల పరస్పర యుద్ధాల చరిత్ర, జానపదుల నాలుక లపై నాట్యమాడే గాథలు, వైయక్తిక లేఖలు మున్నగు వాటిని క్షుణ్ణంగా చదివి మననం చేసుకొన్న దానిఫలితమే ఈ నవల. ఈ రచన చరిత్రను జీర్ణించుకొని కాంతాసమ్మితమైన కమనీయతతో పెనవేసుకొని ముందుకు సాగిందిగానీ, చరిత్ర పాఠంగా కాదు,

సప్తసముద్రాలలో తిరిగిన తెలుగువారి ఓడవ్యాపారం చివరకుఎలా సర్వనాశనంమైందనడానికి ఈ నవలలోని ఖైరి. పరదేశి పాత్రలు ప్రత్యక్ష సాక్షులు. తెలుగుజాతి బింకానికి, త్యాగానికి కర్మరత్వానికి, కలిసికట్టుతనానికి ప్రతీకలు ఈ పాత్రలు. రాజ్యస్థాపనకు ఇంగ్లీషువారి కుట్రలు, స్థానిక రాజ్యపాలకుల అనైకమత్యంవల్ల దేశానికి కల్గినపాట్లు సామాన్యుల పాత్రలతో పెనవేయించారు రచయిత. దానివల్ల అవి మనకు సంబంధంలేని చరిత్రాంశాలుగా కాక నిత్యజీవితంలోని సంఘటనలలాగే మనస్సుకు హత్తుకుపోతాయి. కోరంగి బంకోలా భూమికతో తెలుగుదేశపు దుస్థితిని ఒకపడవవానితో విలాస యాత్రికులైన విద్యార్థులకు కథగా చెప్పించడంలో రచయిత చాల ఔచిత్యం పాటించారు. చరిత్రకారుడు శుష్కంగా ఏదో గత వృత్తాంతాన్ని చెప్పినట్టుకాక.

పడవ వాడయితే తనదైనందిన జీవితానికి తన పూర్వుల వైభవానికి సంబంధించిన గాథను మనస్సుతో
భావావేశోద్వేగోత్సాహంతో చెప్పగలడు మరి !

నవల నేడు మహాకావ్య స్థానాన్ని సంపాదించింది. దానిలో ఎన్నో కథలు, అవాంతర కథలు పతాకస్థాయిని అందుకొని ప్రధానాఖ్యాయికను ఉపనదులు మహానదినివలె పోషిస్తాయి. ఈ బంకోలా అప్పటి తెలుగువారి జీవితంలోని వివిధాచారాలు, వ్యవహారాలు, సంస్థానాల, జమీందారీల పుట్టు పూర్వాలు, భారతదేశంపై కొంత సానుభూతిగల విదేశీయుల ప్రవర్తన, విదేశి కార్ఖానాల యజమానుల క్రౌర్యం మున్నగువాటిపై తన వెలుగులను విరజిమ్మి మనకు వినోద విజ్ఞానాలు కల్గిస్తుంది. విషాద విచారాలూ కల్గిస్తుంది. మొదట కలిగేవి విషాద విచారాలే. అవి సమకాలికాలు కానందున మనహృదంతరాళంలో అలజడి కలిగించి చర్వణావిషయమై వినోద విజ్ఞా
నాలుగా పరిణమిస్తాయా

శ్రీ శర్మ లేఖిని అవసరాన్నిబట్టి అగ్నికణాలు రాల్చుతుంది. అమృతాన్ని వర్షిస్తుంది. అది సమయ సందర్భాలనుబట్టిచేసే వర్ణనలు మనకుచైతన్యం కలిగిస్తాయి.

ఉత్తమ మేధావికి కన్పించే విషయ సమన్వయంలా వివిధ ప్రదేశాల సారూప్య స్థానాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి, (పుట 10)

దూరాన కోరంగిపాయ పుందుమాని నిల్చిన కత్తికోత చారికలా కన్పిస్తుంది. (11)

ప్రగతి నిల్చిన సమాజంలా పడవా బురదలో కూరుకొని పోయింది. (13)

తెరువు చూపని విద్యాలయాల్లోకంటే వేషధారులైన పండితుల వద్దకంటే నిత్యజీవితంలో నిత్యనిష్ఠాపరుడుగానిల్చి ఎట్టి శీతాతపాగ్నులకూ చలించని సాహసి అయిన సామాన్యునివద్దనే తెలుసుకొనవలసిందెక్కు వుందని ........ (15)

నిరంతరం ఓడల రాకపోకలవల్ల పడవల ప్రయాణలవల్ల రేవువద్ద జిడ్డోడుతూ మురికిగా కన్పించినా, కోరంగిపాయ ఎంతో కళ కళలాడుతూనే ఉండేది. తల్లి కొత్త ఉడుపులు కట్టుకొన్నదే తడవ చిన్న పిల్లలు వారి చంకలలోని కెగబ్రాకి వాటిని మాపుతూనే ఉంటారు. అయితే మాత్రమామె అందానికేంలోటు (18)

దీనినే కాళిదాసు
" అంకాశ్రయ ప్రణయిన: తనయాస్వహంతో
ధన్యా : తదంగరజసా మలినీభవంతి"
అన్నాడు, పిల్లల ఒంటిమట్టితో మలినమయ్యేవారే ధన్యులట.

గ్రుడ్డునుండి వెలువడే పిల్లలా ఆర్థిక ప్రగతి సాంఘికమయిన కట్టుబాట్లను అధిగమించి పెరుగుతూంటుంది.(22)

శిశువుకు సోకుతున్న వ్యాధిని గమనించని తల్లిలా కోరంగి తన లోకంలో తానుండిపోయింది.(23)

తల్లిగర్భంనుంచి వెలికివస్తూనే శిశువుకు నాళవిచ్ఛేదం కానట్టుగా కోరంగి గ్రామసామాజానికింకా కులవృత్తుల వ్యవస్థతో తెగతెంపులు కాలేదు.(27)

అపురూపంగా శ్రోతలు దొరికిన ద్వితీయ శ్రేణి కవిగాయకుల్లా వారి సొద వారు కానిచ్చుకొంటున్నారు,(29)

తల్లి పురెక్కించగా కోపంతో తండ్రి, చేస్తున్న పనినివదిలేసి, బెత్తంతీసుకొని లేచినట్లుగా కడలిరాజు లేచాడు .....

......కోపంతో విచక్షణ నశించిన తండ్రి తల్లిని వ్యథపెట్టుతున్న పిల్లల మీదలా కడలిరేడు లేచాడు.(87)

ఇలా అడుగడుగునా సునిశితమైన పరిశీలనతో కథాకథనంలో రచయిత అక్కడక్కడా చేసే ఇలాంటి పరిశీలనలు ధారాపాతంలో మెరుపుల వలె మిరుమిట్లు గొలుపుతూ కొత్త పుంతలు చూపుతాయి.

కోరంగి–ఓడల నిర్మాణానికి సముద్రపు వర్తకానిక ప్రపంచఖ్యాతి చెందిన కోరంగిగా నాశనమయింది 19 వ శతాబ్ది ప్రారంభంలో. కోరంగి ఓడలు కొన్ని లండన్‌లోని థేమ్సనదిలో లంగరు వేశాయి. వాటిగొప్పదనానికి ఆ దేశంలోని ఓడల యజమానుల గుండెలు మండి పోయాయి. ఇంగ్లాండు భారతదేశాలమధ్య తిరిగే భారతీయ వాణిజ్య నౌకలలో భారతీయులు బాధ్యతగల పదవులలో పనిచేయరాదని బ్రిటిష్ పార్లమెంటు 1801 లో చట్టంచేసిందట. తర్వాత కొన్నేళ్ళకు బ్రిటిష్ నావిలకూ, భారతీయ నావికులకూ అంతరం పెంచుతూ మరొకచట్టం చేసిందట.
పిదప ఆంగ్లేయుల ఆధిపత్యంలేని నౌకలకు లండన్‌లో ప్రవేశాన్ని నిషేధిస్తూ మరొక చట్టం వెలువడింది. దీనితో కోరంగి, దానివంటి ఎన్నో రేవులు మూతబడ్డాయి.

శ్రీ శర్మ తెల్గువారి నౌకానిర్మాణచణత్వాన్ని, నిర్వహణను చక్కగా వర్ణించారు. మౌలింలు, నఖోదాలు, తండేలులు, కళాసీలు, సరంగులు, భండారీలు, ఓడకరణాలు, మున్నగు ఓడసిబ్బందినీ మనకు తెలిపారు.

స్వాతంత్ర్యోద్యమాన్ని చిత్రించే నవలలు కొలాయిగట్టితే నేమి మాలపల్లి వంటివి తెలుగులో చాలవెలువడ్డాయి. బ్రిటిష్‌పాలన కాలంలోని 18,19 శతాబ్దాల తెలుగు దేశపు పరిస్థితి, ద్యుతిని, ముఖ్యంగా నౌకావాణిజ్య పరిశ్రమలు ఆధారంగాగల కోరంగివంటి నౌకాశ్రయాల దుస్థితి చిత్రించే ఇలాంటి నవల వెలువడలేదు. దీనికిదేసాటి.

ఇట్టి అపూర్వ నవలను తెలుగుజాతికి అందించి, తెలుగు నవలా సాహిత్యాన్ని సంపన్నంచేసిన శ్రీ శర్మ కృషిని – ఒకతరంపైగా ఆయన జిజ్ఞాసను తదనుగుణమైన పరిశీలన పరిశ్రమలను చూస్తున్నవాడిని గనుక–హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

దుర్మతి వైశాఖ పూర్ణిమ — భాషా సేవకుడు
హైదరాబాదు — తిరుమల రామచంద్ర

# సందేశాత్మక నవల - బంకోలా

భారతదేశం మీద పాశ్చాత్యుల కాధిపత్యం ఎల్లావచ్చింది ? మధ్యయుగాల అంతందాకా అనేక రంగాల్లో పాశ్చాత్య దేశాల కంటే అగ్రగామిగా ఉన్న భారతదేశం అధునిక యుగారంభాని కొచ్చేసరికి తన సృజనాత్మక శక్తి ఎందుకు కోల్పోయింది ? ఆకాలపు భారతీయుల్లో అసలు సృజనాత్మక శక్తే లోపించిందా ? లేక ఆ సృజనాత్మక శక్తి బలవంతంగా హత్య చెయ్యబడిందా ? ముస్లిం దండయాత్రల్లో

కూడా ఎరుగని ఘోర పరాజయం పాశ్చాత్యుల చేతుల్లో భారతదేశం ఎందుకు పొందింది ? పాశ్చాత్యులసలు భారతదేశానికి ఏవుద్దేశంతో వచ్చారు ? భారతదేంలో ఏపరిస్థితులు వాళ్లకి అనుకూలంగా ఉన్నాయి? ప్రతికూలమైన పరిస్థితుల్ని వారు ఏవిధంగా అధిగమించ గలిగారు? ఐరోపాఖండమంత భారతదేశంలోనూ ఏప్రాంతంకూడా ఈ పాశ్చాత్యుల బెడదని ఎందుకు ఎదుర్కో లేకపోయింది? సముద్రతీరాన ఉన్న తెలుగుదేశం పరిస్థితి ఎల్లా ఉంది ? తెలుగుదేశం కూడా మిగతా భారతదేశంలాగే నిద్రాణంగానే ఉందా ? ఆనాటి తెలుగుదేశం రాజకీయ, సాంఘిక పరిస్థితులేమిటి? యావద్భారతదేశం మొత్తంమీద రాజకీయ, సాంఘిక పరిస్థితులేమిటి? ఇల్లాంటి అనేక ప్రశ్నలంటూ ఎవరిలోనైనా ఉత్పన్నం అయితే వారికి అరటిపండు వొలిచిపెట్టినట్టు వివరిస్తూ హృద్యంగా నిూడంబరంగా ఏమాత్రం అవాస్తవికతలేని ధోరణిలో వ్రాయబడిన చారిత్రాత్మక నవల "బంకోలా". చరిత్ర అంటే పరిపూర్ణమైన సమగ్రమైన అవగాహన ఈ రచయితకుందని తోస్తుంది. రెండున్నర శతాబ్దాల క్రితం భారతదేశంలోని, ఆమాటకొస్తే పాశ్చాత్య దేశాల్లోని రాజకీయ సామాజిక ఆర్థిక పరిస్థితులను తెలుగుదేశపు ఇతివృత్తంలో జోడించి ఎబ్బెట్టు లేకుండా, వ్యక్తి పరంగాను, సంఘపరంగాను, వివరణలు యిస్తూ రచయిత ఒక బహు ప్రయోజక ప్రణాళికని

విజయవంతంగా సాధించారు. దేశచరిత్రలో అతి కీలకమైన కాలాన్ని రచయిత తన కథాకాలంగా తీసుకోవడాన్ని చూస్తుంటే రచయిత ముఖ్యోద్దేశం భారతదేశ చరిత్రలో ముఖ్యాతిముఖ్యమైన ఘట్టాల్ని (న్ని) పాఠకులమనసుల్లో ఆలోచనలు ప్రేరేపించే విధంగా చెప్పాడనే అనిపిస్తుంది. అయితే ఇదేదో చరిత్ర సంబంధించిన అచ్చు పుస్తకంలాంటిది మాత్రంకాదు. అంతకన్న ఎక్కువేనని చెప్పాలి. వేలకొద్దీ చరిత్రపుటలు సాధించలేని ప్రయోజనాన్ని ఈ పుస్తకం సాధించిందంటే అతిశయోక్తికాదేమో! వింతేమిటంటే చరిత్రంటే తెలియని, ఏ మాత్రం ఆసక్తిలేని, వారికికూడా ఈ పుస్తకం ఎంతో నచ్చుతుంది.

అసలు ఈ తూర్పు గోదావరి జిల్లాలోనే కోరంగి పేరు ఎందరువిని ఉంటారు ? అల్లాంటిది, ఈ కోరంగి. కథా కాలంనాటికి ఎంతో సందడైన ఓడరేవనీ, ఎంతో వృద్ధిలో ఉన్న నౌకవ్యాపార కేంద్రమనీ ఆ కాలంలో పెద్ద పెద్ద ఓడలకి సైతం మరమ్మత్తులు చెయ్యడానికిక్కడ సదుపాయలుండేవనీ చదివిన తర్వాత ఆశ్చర్యంతో తలమునకలవకమానరు. పాశ్చాత్యుల రాక నాటికి తెలుగు దేశంలో ఉన్న రాజకీయ సాంఘిక పరిస్థితులు, ముఖ్యంగా రాజకీయచరిత్ర విపులంగా వివరించ

బడ్డాయి, నిజానికి ఆ నాటి తెలుగుదేశ చరిత్ర మీద, చిన్నా పెద్దా సంస్థానాలు, వాట పాలకులమీద, వారి మధ్య ఉన్న కక్షలూ కార్పణ్యాలు, పాశ్చాత్యుల గురించి కాని, వాళ్ళ వల్ల భవిష్యత్తులో జరగబోయే ఘోరవిపత్తు గురించి గాని, దూరదృష్టి ప్రదర్శించనివారి వైఖరి, ఒక వేళ ఆ విపత్తును గురించి దూరదృష్టి గలవాళ్ళు హెచ్చరించినా పట్టించుకోనివారి ధోరణి, ఇటువంటి విషయాల మీద (తెలుగు దేశ చరిత్రకి సంబంధించినంత వరకు) అధారిటేటివ్ పుస్తకం ఇదేనేమో.

ఇంక కథా భాగం లోకొస్తే కథా స్థలం తెలుగు దేశం లోని కోరంగి రేవే. కథా నాయకుడు భైరి ఆకతాయి కుర్రాడు. అయితే సునిశితమైన మేధ, సాహసం ఉన్నవాడు. మంజరి సాహచర్యంవల్ల అతడికి పాశ్చాత్యుల రాకలో ఉన్న ఆంతర్యం, దాని వల్ల భారత దేశానికి భవిష్యత్తులో రాబోయే ప్రమాదం బాగా అర్థం అయ్యింది. ఉత్సాహి కాబట్టి తను తెలుసుకున్న సత్యాన్ని పాలకులకి విశదీకరించి వారిద్వారా పాశ్చాత్యుల ఆటలు కట్టించాలని బయలు దేరుతాడు. పాపం ఎంత

ప్రయత్నంచేసినా అతడి మాటలు అర్థం చేసుకున్న వాళ్ళే లేరు. ఆప్రయత్నంలో దేశంలో చాలా ప్రాంతాలు తిరిగాడు. ఎక్కడ చూసినా పరిస్థితి మరింత ఘోరంగా ఉంది. భారతదేశం మీద జరిగిన రెండు భయంకరమైన దండయాత్రలు – నాదిర్‌షా, ఆహ్మద్‌షా అబ్దాలీల దండయాత్రలు–వాళ్ళు జరిపిన ఘాతుకాలు, వాళ్ళు దోచుకు పోయిన సంపద, వాళ్ళ దండయాత్రలవల్ల దేశంలో ఏర్పడిన రాజకీయ శూన్యత, ఆశూన్యాన్ని ఆక్రమించలేని మహారాష్ట్రుల అసమర్థత, క్రమంగా వలస పోరాటంలో ఫ్రెంచివాళ్ళు వెనకబడి ఆంగ్లేయులు ముందుకు రావడం ఇవన్నీ భైరి కళ్ళ ముందే జరిగాయి. చూస్తుండగానే స్వదేశ వర్తకుల సముద్ర వ్యాపారం అంతా క్షీణించడం, వాటిస్థానే పాశ్చాత్య వర్తకులు విజృంభించడం భారతీయ నౌకా నిర్మాణ కౌశలం కళ్ళముందే హతం కావడం గమనిస్తాడు భైరి, కోరంగి రేవును సముద్రపు ఉప్పెన ముంచి వేయడం ఈ సంఘటన లన్నింటికీ పరాకాష్ఠ. భైరి శత్రువుల్లాంటి వ్యక్తుల ప్రయత్నాలు తనకు ఎంత మాత్రం ఇష్టంలేదని దైవ సంకల్పం అన్నట్టుగా ఉంటుందీ సంఘటన. భార్య సమేతంగా భైరి సముద్రానికి ఎదురీదుకుంటూ పోతాడు చివరివరకు పోరాటమే నాలక్ష్యం అన్నట్లుగా. బహుశ ఇది, తరువాత రెండు శతాబ్దాలూ అంటే స్వాతంత్ర్యం సిద్ధించే వరకూ–దేశ భక్తులు జరిపిన ఎదురీతకు సంకేతమేమో.

ఒక పడవ నడపుకునే వాడి చేత వినోద పర్యటనకు వచ్చిన విద్యార్థులకు చెప్పించిన కథ యిది. కథాప్రారంభం బుర్రకథ ప్రారంభించినట్లుగా ఉన్నా వర్ణన వాస్తవ దూరం మాత్రం కాదు. ముగింపు మాత్రం విలక్షణంగా ఉంది. సందేశాత్మకంగా ఉంది. విశ్వనాధ వారి చారిత్రాత్మక నవలలో ఉన్న ఉత్సకత, విడువకండా చదివించే గొప్పతనం, ఉన్నా వారి రచనలలోని అవాస్తవికత లేదు. ఉపమానాలు చక్కగా ఉన్నాయి. మొత్తం మీద బంకోలా అన్ని రకాల పాఠకులనూ ఆనందింప చేసి ఆలోచింపజేపే చారిత్రాత్మక నవల.

– జి. దయాసాగర్

(ఒక పాఠకుడు)

# I

ఈ శతాబ్దం అరవయ్యోపడి దాటిన ఏదోఒక సంవత్సరంలో ఏదో ఒక రోజు. కాకినాడాయానాం రోడ్డుమధ్య కోరంగి వంతెనవద్ద బిలబిలమంటూ కొందరు కాలేజి విద్యార్థుల బృందమొకటి బస్సుదిగినారు. కోరంగిలో చారిత్రక అవశేషాలను చూసేందుకు బయలుదేరినవారి బృందమది. వారిలోరాముడు మాత్రం బృందనాయకునికి మిత్రుడు, ఆరోజు యాదృచ్ఛికంగావారి కతిథి. చిత్తశుద్ధిగల విద్యార్థితత్వమింకా మైలబడని లేతఉద్యోగి.

గోదావరి పెద్దపాయల్లో ఉత్తరాన చివరిదైన కోరంగిమీద నిర్మితమైన ఓవంతెన వారు చూడవలసిన మొదటి అవశేషం. ఇది హౌరాబ్రిడ్జిలాగా ఎత్తిదించగల వంతెన. దానిక్రింద కొంతకాలం సముద్రపు నీరెగువకూ కొంతకాలం తియ్యటి నీరు దిగువకూ ప్రవహిస్తుంది. కోరంగీ కడలీ సరసాలాడినట్లుగా. ఇటువంటి liftable వంతెన దేశంలో మరెక్కడోగానీలేదు. అది కోరంగివారికి గర్వకారణం. 1945 తరువాత ఎప్పుడో దీన్ని ఎత్తడానికిలేకుండా బిగించేశారు. ఇది యీశతాబ్దారంభంలో గోదావరిపాయమీద ఇంగ్లీషు ఇంజనీరునిర్మించాడు.

ఒకనాడు ఘనమైన ఓడలిక్కడకు తెరిపిలేకుండా వస్తూ పోతూండేవని గతవైభవాన్ని గూర్చి గుసగుసలాడుతుంది కోరంగిపాయ. వృద్ధురాలిబోసి కబుర్లువిని విసిగిన వేదాంతివలె వంతెన ఏ కదలికా చూపదు. అలిగిన కోరంగిపాయ వంతెన పునాదిరాళ్ళను కోస్తానంటుంది. దానికీ వంతెన చలించదు. పూర్వవైభవాన్ని నిల్పుకోలేని కుమారులను తల్చుకొనో అన్నట్లు జాలిగా ప్రవహిస్తుంది కోరంగి. కోరంగి కెరటాల చూపులు వంతెన మీదే ఉంటాయి. "నోరువిప్పితే నాగుండె కోతగా భీకరార్తారావం వెలువడుతుందనిపెదవులు బిగించావా నాయనా?" పొర్లిపొర్లి పారుతుంది కోరంగి. వంతెన నిశ్చలంగా బిగుసుకొంటుంది.

"నీవేం చూశావురా ! నీవు వచ్చేనాటికంతా ముగిసేపోయింది !"

వంతెన పాదాలను క్రూరంగాగీస్తూ నిల్చిన ముండ్లకర్రలను మెల్లిగా తీస్తుంది కోరంగి. నాడు ఓడలకు తెరువిచ్చి ఆహ్వానించిన చేతులను చేర్చికొట్టిన

చీలలను తల్చుకొని పండ్లు పటపట లాడిస్తుంది వంతెన.

ఆ చీలలమీద తెలుగుబండ్లే నిర్ధయగా సాగిపోతూంటే ఆపాద మస్తకం చలించిపోతుంది. "ఎన్నాళ్లురా ఈ క లి !" అని కోరంగి హోరున ప్రవహిస్తుంది.

"ఎప్పుడు దీనికంతము కడలిరాజా. నీవైనా చెప్పవయ్యా !" అని భోరున ప్రవహిస్తుంది కోరంగి.

కడలిరాజు చెలియలికట్ట నతిక్రమించివచ్చి పిచ్చిపట్టిన కోరంగిని తన హస్తాలలో పొదువుకొంటాడు.

కోరంగిమీద మక్కువకొద్దీ చెలియలికట్ట నధిగమిస్తున్న నేరానికి భూమాత చెలియలికట్ట నటువైపు పెంచుతూంది.

సముద్రుడా కట్టడిని రహస్యంగానైనా అతిక్రమిస్తూనే ఉంటాడు. భూమాత ఆ ధిక్కారాన్ని చూసీచూడనట్లుగా సహిస్తుంది. ఓర్మినశించి గట్టిగా మందలించినప్పుడు తాల్మిలేనిసముద్రుడు వివేకహీనునివలె ఉప్పెనై పొంగుతాడు. వెంటనే నొచ్చుకొని తీసిపోతాడు. భూమాత హృదయం క్షారపుపోర దాలుస్తుంది. ఆ ఉప్పుపొరను కోరంగి కన్నీళ్ళే తొలగిస్తూంటాయి.

కోరంగి పిచ్చినిచూసి కన్నీళ్లు కార్చనివాళ్లులేరు. చందమామ కన్నీటి బిందువులు తెల్లటిసోనలై కొబ్బరాకులమీద జారిపడతాయి, మేఘాలు కోరంగి పిచ్చి అరుపులను అనంతాకాశంలో ప్రతిధ్వనింపజేస్తాయి. అయినా ఏ కారుణ్యమూర్తి దీనిని పరిష్కరించరాడు. విద్యుదాఘాతం వల్ల పిచ్చి నయంకావచ్చునన్న ఆశతో మేఘాలు పిడుగులను పడనిస్తాయి. కానీ ప్రయోజనం కానక కన్నీళ్ళు కురిపిస్తాయి.

ఆ వంతెన చూస్తున్న ఆంధ్ర యువకులకివేవి తెలియవు పాపం.

వాళ్ళు వంతెనమీది బోర్డు చదివారు. వంతెన నటూఇటూ పరిశీలించారు. దానిమీద నిల్చుకొని ఫోటోకూడ తీసుకొన్నారు. తరువాత యానాంవెళ్ళే రోడ్డువెంబడి కొన్ని ఫర్లాంగులు నడువగా ఎలిమెంటరీ స్కూలుగానూ, భిక్షగాళ్ళ నీడగానూ ఉపయోగపడుతున్న ఒక పాడుపడుతున్న బంగళా కనిపించింది.

“ ఇక్కడ మొదటి టీచరుగా పనిచేశారుటయ్యా కందుకూరివారు” ఒకడు ప్రకటించాడు.

“ఆయననెవర్రోయ్ ?”

“ నీవు తెలుగువాడివా మరేమైనానా?” అన్నాడు కోపంతో ఇంకొకడు.

మొదటివాడు జ్ఞాపకం చేసుకొంటున్నట్లుగా నటించాడు. “నాకు తెలిసిన సినీతారలేకాదు. ప్రొడ్యూసర్సు, డైరెక్టర్సు, టెక్నీషియన్లు అందరి పేర్లూ జ్ఞాపకం చేసుకొని చూశాను. వారి పూర్వాశ్రమనామధేయాలూ జ్ఞాపకంచేసుకొన్నాను. ఆయినా నీవు చెప్పన పేరుమాత్రం – ఏదది – కందుకూరివారు, అ:? జ్ఞాపకం రాలేదు మిత్రమా. నీవే దయచేసిచెప్పు. కోపగించుకోకు”

“ఆయన తెలుగుదేశానికి యుగకర్తరా అప్రాచ్యుడా ! ఆయన పేరే మరిస్తే ... ’

“ఓ ! ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. కందుకూరి వీరేశలింగం పంతులు గారా? మరలా చెప్పు. ఆయనపాఠం చదివానుకదూ నాల్గవఫారంలోనో ఐదవఫారంలోనో. ఆయన పాఠం మీదేప్రశ్నైనా అడుగూ మంచినీళ్ళ ప్రాయంగా గటగట చెప్తాను.”

మిగిలినవాళ్ళు నవ్వుతున్నారు. అతడు తిరిగి ఎత్తుకొన్నాడు పాఠం అప్పగిస్తున్న ధోరణిలో, “ కందూకూరి వీరేశలింగముగారు ఆంధ్రజాతికి చేసిన మేళ్ళేమి? కందుకూరి వీరేశలింగము పంతులుగారు విధవా వివాహములు చేయించిరి, బోగము మేళములను నివారించుటకు కృషిచేసిరి. తెలుగుబాషకు సేవచేసిరి”

“ ఆపరా నాయానా ! నీకు దండంపెట్తాము”

“మరి నన్ను వీడెంత మాటన్నాడో ! అప్పుడు మీరంతా సహించి ఎందుకూరుకొన్నార్రా? నేను కందుకూరి వీరేశలింగం పంతులుగారి విగ్రహానికి రాజమండ్రిలో పూలమాలకూడా వేస్తుంటాను తెలుసా, ఆయన జన్మదినంనాడూ జ్ఞాపకంవస్తే (మరో స్పెషల్ ప్రోగ్రామేదీలేకపోతే)”............ మిత్రుడురాముణ్ణి లాగుకొనిపోయినాడు.

"మిగిలినవారు బయలుదేరితే వాడు వెనకాల ఆటోమాటిక్‌గా వస్తాడు. లేదా వాడివాగుడు కంతముండదు"

"ఇదంతా కొత్తకోరంగి అంటారు. ఇక్కడిప్పుడు కనబడుతున్న ఇండ్లవెనుక అన్నీదిబ్బలే "

"ఏం దిబ్బలు ? "

"భవనాలు కూలిపోగా ఏర్పడిన దిబ్బలు"

"ఓడవర్తకం బాగా జరిగే రోజుల్లో ఇవన్నీ గొప్ప భవంతులు "

"అంటే ఎప్పుడు ?"

"అసలు గోదావరినది ఒడ్డునగల రేవుపట్నాన్ని గురించి రోమ్ సామ్రాజ్య చరిత్రకారులూ వ్రాశారు. అదెక్కడిదో ఇప్పుడు తెలీదు. గోదావరి బహు భీకరమైన నదికావడంచేత ఇక్కడ శాశ్వతంగా రేవు పట్నమేదీ వెలయలేదేమో ననిపిస్తుంది. ఎప్పటికప్పుడు రేవుపట్నాలు వెలయడము అవి ఘనమైన రేవులుగా రూపొందకుండానే గోదావరి ముంచివేయడం జరుగుతూఉండి ఉండవచ్చు. తెలుగు వాణిజ్యానికి మోటుపల్లి కొన్ని శతాబ్దాలు, మచిలీపట్నం కొన్ని శతాబ్దాలు ప్రధానమైన రేవులుగా ఉండేవి 18 వ శతాబ్దానికి కొంచెం:ముందుగా ప్రాధాన్యతకు వచ్చినరేవుల్లో కోరంగిఒకటనుకొంటా"

ఇలా మాట్లాడుతూ వారు కొత్తకోరంగిలో బస్సురోడ్డుకూ కోరంగి నదికి మధ్యనున్న దిబ్బలన్నీ చూశారు. దేవళం చూశారు. కోరంగిగట్టుకు తిరిగి చేరుకొన్నారు. నది కావలిగట్టుమీద ఒక చిన్నగ్రామముంది. అది పాతకోరంగి. పాత కోరంగిలో ఓడ యజమానులవని పేరువడిన భవనాలను, భవనాల అవశేషాలనూ చూశారు. కోరంగి ఒడ్డున కప్పడిపోయినఎద్దబొదులను గ్రామస్థులు సగర్వంగా చూపారు. "ఈ ఒడ్డుపొడుగానా ఓడల మరామత్తు జరిగేదండి."

1802 భారతీయ నౌకాదళానికి ఛెందిన నావలెంతటివైనాసరే రాగల్గేం దుకూ, వచ్చినవాటిని మరమ్మత్తు చేయడానికి అనువైన బొది నౌకదాన్ని ఇ . రోబక్ అనేఆయన త్రవ్వించినట్లు చెప్తారు. 155 అడుగుల పొడవూ అందులో

సూమారు సగం వెడల్పూ, 50 అడుగుల లోతూ ఉండేదట అది. దానిచిహ్నం కూడ కన్పడకుండా ఇప్పడు కప్పబడిపోయింది. వీళ్ళు చూపించే బొదులన్ని ఇటీవలివి. పెద్దపడవలూ చిన్న ఓడలూ రిపేరీ చేయడాని కుపయోగించినవి"

"బొది అంటే ?"

"డాక్ అని అర్థం"

"అంటే ?"

నది చేరువగా ఓడలు పట్టేంతటి గోతులు, అడుగు తగలనంత లోతుగా తవ్వుతారు. వాటిలోకి ఓడలను సరాసరి వెళ్లనిచ్చి తరవాత నది నుండి వేరుచేసి గోతిలోనీళ్ళు తోడివేస్తే, మనుష్యులు ఓడ అడుగునకు వెళ్ళి మరామత్తులు చేయవచ్చు"

" ఇదిగో అక్కడొక పెద్దలంగరు? గట్టుమీద దీనంగా పడిఉంది" విద్యార్థి ఒకడువెళ్ళి దానిమీద నిల్చున్నాడు.

మృత శిశువు స్మృతిచిహ్నం చూసుకొన్నంత సున్నితంగా కోరంగి దాన్ని రాత్రిపూట కన్నీటితో అభిషేకం చేస్తుందని అతనికి తెలీదు.

అక్కడనుండి తూర్పుదిశగా బయలుదేరి తిరుగుడు మేడవద్దకు పోయారు.

మూడంతస్థులమేడ. ఒకప్పుడు పైకెక్కడానికి వర్తులాకారంలో మెట్లుండేవి. భవంతి పడిపోయినా ఆ వర్తులాకారపు మెట్లు మిగిలి ఉండేవి ఆ మెట్లుమీద పిల్లలు తిరుగుతూ ఆడుకొనేవారు. ఇప్పుడా మెట్లూ కూలిపోయి పేరుమాత్రం మిగిలింది.

ఇక్కడ కోరంగినది పన్నీటి జల్లుతో కూడిన తడిగాలివంటిదేదీ సోకదు కాబట్టి విద్యార్థులు చెమట మాటిమాటికీ తుడుచుకొనవలసి వస్తూంది.

అక్కడినుండి వారు దక్షిణ దిశగావెళ్ళి గోరీలు చూచారు. 1780 మొదలు 1825 నాటివరకు ఇక్కడ మరణించిన యూరోపియన్ల గోరీలు. ఎక్కడ. పుట్టినవారోగానీ ఇక్కడ గిట్టినారు. పొట్టగడవకనేవచ్చారో, ధనాశ చేతనేవచ్చారో, ఏఏదేశాలు తిరిగారో ఏమి కష్టసుఖాలు చూచారోపాపం! ఇక్కడ,వారివల్ల మనవారు సుఖమేకుడిచారో, కష్టమే పడ్డారో, ఏమైతేనేం? వారిపట్ల మనమేభావం వహిస్తేనేం?

దానితో వారికి నిమిత్తంలేదు. అవేశాల కంటే వారితరం జీవనంవల్ల మనం తెలుసుకొనగల్గిందేమైనాఉందా అని చూసుకొంటేచాలు. వారువిడిచిన సందేశమేమైనాఉందా అని చూడాలి. అది వారి ఆత్మలకు తృప్తినివ్వవచ్చు.

"అయిపోయిందా మీచారిత్రకావశేషాల పరిశీలన?"

"ఏం? ముఖం మొత్తిందా?"

"ఇక్కడికి మూడు నాల్గుమైళ్ళ దూరాల్లోఉండే జైనుల బొమ్మలను మలచినరాళ్ళు చూడవూ?"

"నావల్లకాదు, నేను నడవలేను" అప్పటికే అతను గసపోసుకొంటున్నాడు. అసలే స్థూలకాయుడు పాపం.

"అవిపోతేపోనీగానీ, నేను మాత్రం నీకు లైటుహౌసు చూపకుండావదలను"

"కందికుప్పకా ఇప్పుడు"

"వాజమ్మా అదికాదు. పూర్వం మనవాణిజ్యాని కుపయోగపడి ఇప్పుడు నిరుపయోగంగా శిధిలమై మిగిలిన లైట్ హౌస్‌కు."

"బంకోలాకు" సవరించాడు, తెలుగుభాషాభిమాని.

"నీవు కాలేజి మాగజైనుకు వ్యాసంవ్రాయకపోతేమానే గానీ మమ్మల్ని చంతున్నావయ్యా" ఆ స్థూల విద్యార్థి విసుగుకొన్నాడు.

రాముడౌత్సుక్యంతో చూస్తున్నవాడల్లా "ఇక్కడే వీరు పర్యటన చాలిస్తారేమో. ఆ లైటుహౌసూచూస్తే బాగుండును" అనుకొన్నాడు. చివరకా ఉత్సాహ విద్యార్థి పంతమే నెగ్గింది. కానీ దారిపొడుగునా స్థూలవిద్యార్థి అతన్ని నిందిస్తూనే ఉన్నాడు. అదొక సరసం వారిది. ఒకక్షణకాలమాస్థూల విద్యార్థి ఆ ఉత్సాహి విద్యార్థిని అనుసరించకుండా విడువడు, కానీ ఉన్నంత సేపూ సాధిస్తూనే ఉంటాడు. మిగిలిన వాళ్ళకు నవ్వులాటక్రింద ఉంటుంది కాబట్టి. కొంచె మెగద్రోయనూ తోస్తారు."డాక్టరేటు బిరుదుకు వ్రాసేవారు థీసిస్సులనే లైబ్రరీలో కూర్చొని పదిపుస్తకాలు ముందు పడవేసుకొని తలా నాల్గుముక్కలేరి వ్రాస్తారే. ఇతను కాలేజి

మేగజైనుకొక వ్యాసం వ్రాయడానికింత పరిశ్రమా వెధవగొప్ప కాకపోతే ! నీ బాధైనా చూడడేమిటయ్యా నీ మిత్రుడు?”

ఇంకా స్థూలకాయుడు సాధింపు మొదలుపెట్టినాడు. అతని నడక, అతని బాల్యపు తరహా మాటలు చేష్టలూ చూచి రాముడు లోలోపలే నవ్వుకొంటున్నాడు. మిగిలినవారు గట్టిగానే నవ్వుతున్నారు.

తూర్పుగా బయలుదేరి మిత్రులొక చిన్న అగ్నికుల క్షత్రియుల గ్రామం చేరుకొన్నారు. సంద్రంలోనూ, గోదావరి పాయల్లోనూ వేట వెళ్ళి చేపలను పట్టడమే వారివృత్తి. వారితో బేరమాడి ఒక పడవను కుదుర్చుకుని లైటుహౌస్‌కు పయనమైనారు.

గోదావరిలో ఎటుపోతున్నామో తెలియకుండా కోరంగినుండి గోదావరి ఇతర పాయల్లోనికిమారి ఐదారు మైళ్ళు ప్రయాణం చేశారు. పైన ఎండ చుర్రుమంటున్నా గోదావరి చల్లగాలివల్ల వారికి తాపం కలగటం లేదు.

పడవలోనే భోజనంలాంటి టిఫినూ కానిచ్చారు.

పడవ మెల్లిగా నడుస్తూంది. చుట్టూ, నిశ్శబ్దంగా ఉంది. పచ్చని టిల్ల, మడ తుప్పలు దట్టంగా అడవులై గోదావరిని కమ్మివేశాయి! ఆల్చి, గుగ్గిలం, పొన్న, పిసింగి మొదలైన వృక్షాలు అక్కడక్కడా పెరిగి ఉన్నాయి. ఉడ్డి గడ్డీ, దబ్బగడ్డీ పుష్కలంగా ఉన్నాయి. ఎంతపచ్చదనమైతేనేం?దుర్బుద్ధితోచేసేవాని సాయంవలె క్షారమయమైన ఆ గడ్డిని పశువులు కూడా మేయలేవు. అందమైన గుడ్లింకలు నీలపురెక్కలల్లార్చుతూ నీటిమీద. వాలి చేపను తెలివిగా పట్టుకొని మింటికెగసి పోతున్నవి. ఇంక కొంగలు మెందుగా చేపలకోసం వాలుతున్నాయి. ఒక్కొక్కప్పుడు బారులుదీరి నీటిలో నిల్చుకొని ఉంటాయి జపంచేస్తూ. “బాబూ మడ పామదిగో” దూరానఒకపామును పడవవాడు చూపినాడు.

“దాన్ని పట్టగలమా? ” అడిగినాడొక విద్యార్థి. “దొరుకుతుందా, బాబూ ! అదెప్పుడూ మడబెట్టుకు చుట్టుకొని ఉంటుంది. మనిషిని చూస్తూనే బహువేగంగా విప్పుకొంటుంది. ఆ విప్పుకోవడంలో ఎదుటివారికి గొప్ప దెబ్బతగిలిస్తుంది.

తరువాత పొడుస్తుందికూడాను. దానిముల్లు దిగితే మనిషి ఎండిపోతాడు. ఆయుస్సుంటే మంత్రాలకు బాగు కావచ్చుకానీ లేకపోతే బ్రతకడు''

"ఇంకే జంతువు లుంటాయి?" మరొక విద్యార్థి అడిగినాడు.

''ఇక్కడే ముంటాయి బాబూ? ఏటికుక్కలు, అడవిపిల్లులు, అడవి ఎలుకలు, నక్కలూ అంతే"

హటాత్తుగా బృందంలో ఒక రడిగారు "అదేం పక్షి?"

"సురలాం బాబూ"

"ఏమేం చేపలు దొరుకుతాయి ఇక్కడ"

"ఇక్కడ దొరికే చేపలు చెప్పడం ఎవరితరంబాబూ. ఉప్పునీటి చేపలు, చప్పనీటి చేపలు, సముద్రపు చేపలు, పీతలు, రొయ్యలే వేలకు వేలరకాలుంటాయి."

కొంతసేపు సంభాషణలన్నీ నిల్చిపోయాయి. పడవ ఒక్కొక్క చోట గోదావరి వడికే పోతూంది. ఒకచోట గడపెట్టి తోయవలసి వస్తూంది. పడవ నడుపుతున్న విసుగును పోగొట్టుకొనేందు కప్రయత్నంగా పడవవాడు ఒక చిన్నరాగం తీశాడు.

తరువాత విద్యార్థులు హుషారుపడి మరి రెండు పదాలు పాడించారు.

తరువాత తను తన హుషారుకొద్దీ విప్పి చెప్పండంటూ రెండుసమస్యలను పాడినాడు.

"నడుము గట్టులేని చెరువికి  
నాలుగైదూ తూములన్నా  
అదను గనుకూని పదునుచూపితే  
రోజుకైదూ పంటలన్నా  
పంట ప్రాపము గనండన్నా  
పంటచోద్యా మినండి.  
మహానుభావా దీనిభావం గనండన్నా  
దీని శోద్యా మినండీ – –"

"వీధులే నాలూగు వీధులు

భామలే పదివేలుమంది

వారికీ తగువంటివారూ

ఇద్దరే కొంటన్నగాళ్ళూ

వీధి ప్రాపం గనండన్నా

వీధిచోద్యా మినండీ

మహానుభావా దీనిభావం గనండన్నా

దీని శోద్యామినండి.

ఈ సమస్యలను విడదీసే చర్చలో పొద్దు కొంత వడిగా నడిచింది.

మొదటి సమస్యకు విడుపు గేదె పొదుగు:,

రెండవ సమస్యకు విడుపు వీధులు: దిక్కులు: భామలు: నక్షత్రాలు కొంటెన్న గాళ్ళు సూర్యచంద్రులు.

(2)

హటాత్తుగా "అదిగో అదేనా లైటుహౌసు? " అని అడిగినాడొక విద్యార్థి అందరూ అటు చూశారు.

"ఆంకార వాకకు వచ్చేశాం. అదే బంకోలా" అన్నాడు పడవవాడు.

పడవ ఒడ్డు చేరింది. కొంతదూరం నడిచి బంకోలా చేరుకొన్నారు. మొదట క్రిందచుట్టు తిరిగినారు. ఎనిమిది దిక్కుల్లో కట్టడానికి దన్నుగా నిలబెట్టిన ఎనిమిది ఏటవాలు గోడలు చూచారు. ఎనిమిదడుగుల పొడవూ, గజము మందమూ కలిగి నేలనుండి వేదిక వరకు ఏటవాలుగా లేచిన గోడలవి. అన్నీ ఇప్పటికీ గట్టిగా ఉన్నాయి. తరువాత ఎనిమిది మెట్లెక్కగా ఒక విశాలమైన వేదిక. సుమారు 50 అడుగుల వ్యాసముండవచ్చు. దానిమీద స్థూపాకారపు బంకోలా కట్టడం. దాని లోపల పైకెక్కేందుకు మెట్లు. సుమారు నూటపాతిక. వేదిక వద్ద స్థూపం వ్యాసం 20 అడుగులు. స్థూపం యొక్క మెట్లన్నీ ఎక్కి పైకిపోగా అక్కడ ఆరడుగులు. దానీమీద ఐదారడుగుల ఎత్తుకు ఒక ఇనుపచట్రం. దాని మీదింకా మరికొంత

కట్టడం ఉండి ఉండాలనీ అందులోనే మంటవేసే ఏర్పాటుంటుందనీ ఉహించడం కష్టంకాదు, అక్కడికి సముద్రంమైలున్నరకు మించి ఉండదు.

ఈ బంకోలా చూశాక అందరి మనస్సులూ ఆశ్చర్యంలో నిండినవి. వారూహించుకొన్న దానికంటే ఎత్తైన కట్టడం. పైన నిల్చిచూస్తే సముద్రమూ, అక్కడక్కడా గోదావరి పాయలూ కాకినాడ పట్టణపు కట్టడాలు అందంగా కన్పిస్తున్నాయి. ఉత్తమ మేధావికి కన్పించే విషయ సమన్వయంలా వివిధ ప్రదేశాల సారూప్యస్థానాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

వేటకత్తితో (ఏనక్కలో తోడేళ్ళో వాసమేర్పాటు చేసుకొని ఉంటే ప్రమాదంకాదూ.) ముందు నడిచి త్రోవ చూపిన పడవవాడు పై వరకు వచ్చి క్రిందికి వెంటనే దిగిపోయినాడు. పొద్దు పోకుండా వచ్చివేయమని అరుస్తూ తన పడవద్దకు వెళ్ళిపోయాడు. కబుర్లలో పడిన మిత్రులకు ఎంతకాలం గడిచిందీ తెలిసిరాలేదు.

ఇప్పుడతడు వీరిని పడవ వద్దనుండీ అరుస్తూ పిలుస్తున్నాడు. అతడు లేందే వీరిక్కడికి రాలేరు. ఇక్కడి నుంచి పోనూలేరు. అతడు వీరికంటే ఒడ్డు పొడుగుల్లో తక్కువ కాదుగానీ ఈక్షణాన ఆసనాల స్థాయీభేదాన్ని పట్టి వీరికితడు చీమంతైపోయాడు.

అతని మాటలు వీరికి తెలియరావడంలేదు. అతను త్వరపెట్టున్నాడన్నది మాత్రమర్థమౌతూంది. దాన్ని పైవారంతగా లక్ష్యపెట్టడంలేదు. "వస్తున్నాముండవయ్యా" అని మాత్రం అరిచారంతే.

"వెయిటింగ్ చార్జెస్ ప్రత్యేకం లేవుకాబట్టి వానికి త్వరగా ఇంటికి పోవాలనుంటుంది, కానీండి. తిరిగి ఇదంతా ఎప్పుడు చూస్తాం?" అన్నాడొక విద్యార్థి.

పడమట పొద్దు వాలేందుకారంభమైంది. తూర్పున చూపుమేరాఉన్న సంద్రం అపురూపమైన నీలిమతో ప్రకాశిస్తూంది. నిండుగా ప్రవహిస్తున్న గోదావరి సముద్రునితో కలిసినచోట ఏర్పడిన నిశ్చలమైన సంగమజలాలు రతిపార వశ్యంలోని

జంటను జ్ఞప్తికి తెస్తున్నాయి. ఆ ఒండు నీటిరేఖ కావల దివ్యమైన నీలిమతో సంద్రం పడి లేస్తూంది. దూరాన కోరంగిపాయ పుండు మానగా నిల్చిన కత్తికోత చారికలా కన్పిస్తూంది.

స్థూలకాయుడైన విద్యార్థి ఎక్కి దిగడంలోగల కష్టాన్ని పరిహసించడంలో కొంతప్రొద్దు, ఫోటోలు తీసుకునేందుకు కొంతపొద్దు, రాజకీయాలను గురించిన శుష్కవాదాలకు కొంత పొదు ఇలా చాలాసేపు గడిపినారు.

మధ్య మధ్య వారి లీడరు "పదండి. పొద్దుపోతుంది. పడవవాడెందుకో తొందర చేస్తున్నాడు" అని హెచ్చరిస్తున్నా ఎవరూ లెక్కపెట్టలేదు. వారి ఉత్సాహంలో వారు సాగిపోతున్నారు. అతను రాముని వైపు చూసి "పడవ ప్రయాణం అనుకొన్న దానికంటే చాల సమయం తీసుకొంది. మీరు సకాలానికి యానాం చేరుకోలేరనుకుంటా. మాతో కాకినాడ రావలసిందే రాత్రికి!" అన్నాడు. "పరవాలేదులెండి. అపూర్వ విషయాలు చూస్తున్నాను. ఎల్లాగా ప్రయాణాని కర్జంటు పనేమీలేదు" అన్నాడు. కొంత మౌనం వహించి రాముడతనిని ప్రశ్నించినాడు. "చరిత్రంటే ఉత్సాహమే గానీ చరిత్ర చదివినవాణ్ణి కాకపోతిని. ఈ లైట్‌హౌస్ ప్రాముఖ్యత నాకర్థం కాకుండా ఉంది. "

అతను సమాధానం చెప్పినాడు.

"నాకుమాత్రం పూర్తిగా తెలుసుననా? రెండు శతాబ్దాలనాడు మచిలీపట్నాని కుత్తరాన ఉన్న తెలుగు ఓఢ్ర కోస్తా రేవుల్లో యావత్తు కోరంగి ముఖ్యమైన రేవని భావిస్తాను. ఈ కోస్తా పొడుగునా ఓడలకు మార్గదర్శకాలుగాను, సంకేతాలు తెల్పేవిగానూ ఈలైట్‌హౌసులువెలిశాయి. ఫుల్‌స్టాఫ్ కోరంగి సమీపాన భారతీయులు నిర్మించిన బంకోలా ఒకటుండేదని పాశ్చాత్య చరిత్రకారులు వ్రాశారు. 19వ శతాబ్దం మధ్యలో ఇంగ్లీషువారు ఒకటి కట్టించారు. మనం చూస్తున్నాది భారతీయుల నిర్మాణమేనని భావిస్తాను. దీనిమీదెక్కడా తేదీలు ఇతర నిర్మాణ వివరాలూ లేవుమరి. దీన్నిబట్టి ఈకోస్తానంటి ఓడలనేకం ప్రయాణం చేస్తూండాలని భావిస్తాను."

" అదిగో సర్దాగా గడపకుండా లెక్చరు మొదలు పెట్టాడు" అంటూ లీడరును కొందరు విద్యార్థులు సాధించ సాగినారు. సంభాషణ ఇతర విషయాల మీదకి మళ్ళింది.

చివరకీ కాలక్షేప విలాసాలతో విసిగి అందరూ క్రిందికి దిగినారు. పడవవాణ్ణి త్వరపెట్టసాగినారు. పడవవాడి ముఖం కోపంగానూ, నిస్సహాయంగానూ ఉంది

"ఇంక తొందరెందుకుబాబూ. పిల్చినంతేసేపు రాకనేపోయారు. ఈ లోపున కాలవనీరు తీసేసింది."

లీడరు నెత్తిబాదుకొని కూర్చున్నాడు.

'ఏం జరిగింద' న్నారర్థంకానివాళ్ళు.

"ఏడెనిమిది గంటలపాటీ అడవిలో కాలవలో నీరెక్కేవరకూ"

"నీవు మమ్మల్ని పెట్టే తిప్పలొక్కక్కటి కాదురా" అంటూ అందరూసాధింపుమొదలు పెట్టినారు. స్థూలకాయుడి గురించి ప్రత్యేకంగా చెప్పవలసిందేముంది?

ఒక విద్యార్థి జేబు తడుముకొని ఆఖరి సిగరెట్ తీసుకొని ప్యాక్ పారవేస్తూ "సిగరెట్లయి పోయాయి. ఎలాగైనా ఇంక వెళ్ళి తీరాలోయి. సిగరెట్లుంటే ఎన్నిరాత్రులైనా బాధలేక పోనుగానీ ఇప్పుడొక్క క్షణం ఆగలేను."

అతన్ననుసరించి మరొకడు ఫ్లాస్కు తీసి చూసుకొని బిక్క ముఖం వేశాడు.

"కాఫీ కూడా అయిపోయిందిరా. వెంటనే వెళ్ళితీరాలి."

పడవవాడు పాపం జాలిగా "ఒడ్డుమీద కూడా నడవడానికి బొత్తిగా వీలులేదు, మామూలు రాకపోకలున్నది కాదాయె. లేకపోతే ఈ బురదలోనే పడవను లాగుకొని పోదును. ఈమైలున్నరకే ఈ బాధ. ఆ తరువాత ఏబాధాలేదు. ఓడలైనా తేలిపోగలలోతు."

ఎంతచర్చ జరిగినా చివరకు వారక్కడే ఉన్నారు. ప్రగతి నిల్చిన సమాజంలా పడవ బురదలో కూరుకొనిపోయిఉంది.

క్రమంగా చీకటి పడింది. నిద్ర కుపక్రమించినవాని తెలివివలె క్రమంగా అంతా చీకటైపోయింది.

ఒకరిమీద నొకరెంతగా నెపాలువేసు కొంటునప్పటికీ పడవ అంగుళ మైనా కదలదని గ్రహించుకొని నీరెక్కేవరకు ఆగక తప్పదని తేలిపోయిన తరువాత వారు సరస సంభాషణ కుపక్రమించినారు.

"తుపాకైనా ఉంటే వేటైనా సాగునేమో" అన్నాడొక ఆటగాడు. పడవవాడు జ్ఞాపకం వచ్చినట్లుగా వెళ్ళి బురదలో దిగి పడవను చేరుకొని అందులోనుండి కొన్ని దుంపలు తెచ్చాడు. చిదుగులేరి మంటవేసి వాటి నందులో కాలుస్తూ చుట్టూ కూర్చొన్నారు.

"మనకొక్క పూటకే ఇలాఉందే ఎపుడూ నీళ్ళలోనే బ్రతికే వాళ్లకెలాఉంటుందో" రాముడు పడవవాని పట్ల సానుభూతి వాక్యం పల్కినాడు.

పడవవాడు తన అనుభవాలను చెప్పసాగినాడు. తుపానులకు గురైనప్పుడు పడే బాధలు సింపిల్‌గా చెప్పుకొని పోతూంటే మిగిలిన వారు నోర్లు తెరచుకొని వింటున్నారు.

''కొట్టుకొనిపోతే మచిలీపట్నంలో తేలతావొకొక్కసారి'' అంటున్నాడతడు.

"సముద్రమీత నేర్పవయ్యా ఇతని బొజ్జంతా కరిగేట్టుగా" స్థూలకాయుణ్ణి వేలితో పొడుస్తూఅడుగుతున్నాడొక విద్యార్థి.

"నాది కసరత్ చేసిన శరీరమే తెలుసా? కసరత్తు మానివేశా కిలా అయ్యానుగానీ. " అందరూ నవ్వుతున్నారు.

" సముద్రపు ఈత బలె సరదాగా ఉంటుందిలే. తరువాత మంచినీళ్ల స్నానమైతే చేయాలిగానీ" అంటూ కోస్తున్నాడు మరొక విద్యార్థి.

"కొయ్యే!" అంటున్నారు మిగిలినవారు.

"కెరటాలతో పాటు పడిలేసూ ఈదితే సముద్రం ఈత సులభమే బాబూ! లేకపోతే మాత్రం ...."

"ఎంత చక్కగా చెప్పావయ్యా!" అనుకొన్నాడు, దాన్ని జీవితాని కన్వయించుకున్న రాముడు,ఆమాటే ఒకసారి తనలో తాననుకొన్నాడు.

ఇంతైనా కాలవకు నీరెక్కిన జాడలేదు. పడవ వానితో పదాలు పాడిస్తున్నారు.

దుంపలన్ని తినివేసి నిప్పుల్లో కెలుకుతున్నారు. వారిని చూసి మిగిలినవారు పరిహాస మాడుతున్నారు.

"నీ పదాలు చాలుగానీ, ఒక కథేదైనా చెప్పవయ్యా" అన్నారొకరు.

"ఔనౌను.కథకావాలి" బలపరిచారు మరికొందరు.

"నాకేం కథ వచ్చును? నేనేం చదువుకోందే?"

"ఏదో ఒక కథ చెప్పాలి"

"మీకులాగే చదువుకొన్న ఒకాయన చాలాకాలం క్రిందట నాపడవలో

అప్పుడప్పుడూ డెల్టా కోస్తా అంతా తిరిగేవాడు. లావు లావు పుస్తకాలేవో ఎప్పుడూ చదువుతునే ఉండేవాడు. లేకపోతే ఆలోచనలో మునిగి ఒండేవాడు.ఆయనొకసారి నాకీ కోరంగి కథ చెప్పారు. వింటారా బాబూ? అదికాక వేరేకథేదీరాదు."

"చెప్పు! చెప్పు" అని గొంతులూ ఒకేసారి పలికాయి,

అందరూ కథ చెప్పమని కోరినవారే అయినా, ఆ కోరడానికి కారణా లొక్కక్కరివీ వేరు. పొద్దుపోక ఒకరు: నిశ్శబ్దాన్ని భరించలేక ఒకరు: ఆకలి మరిచేందు కొకరు: భయం భరించలేక ఒకరు ఇల్లాగ రాముడూ ఆ విద్యార్థి నాయకుడూ మాత్రం అలా కాకుండా కుతూహలానికే అడిగేరు. తెరువు చూపని విద్యాలయాల్లో కంటే చెదలు పట్టిన పుస్తక భాండాగారాల్లో కంటే. వేషధారులైన పండితులవద్ద కంటే నిత్యజీవితంలో సత్యనిష్ఠాపరుడుగా నిల్చి ఎట్టి

శీతాతపాగ్నులకూ చలించని సాహసియైన సామాన్య మానవుని వద్దనే తెలుసుకొనవలసిందెక్కువని తెలిసే సంస్కారమా యిద్దరికే ఉంది. వారెరుగుదురు. వజ్రాలు మట్టిలోనే ఉద్భవిస్తాయి. మరెక్కడా కాదు. నాగరికలోకం వాటిని సానమాత్రమే పెట్టుకొన గలదు. నీచలోకమైతే వాటిని దోచుకొని దాచుకొంటుంది. కాని ఎవ్వరూ వాటిని సృష్టించలేరు.

పడవవాడు కథ మొదలు పెట్టాడు. అందులో అతను విన్నదీ ఉంది. అతని కనుభవానికి రానిదీ ఉంది. కంఠత పెట్టింది ఉంది. మైమరపు తెచ్చిన కథాభాగాల్లో స్వయంగా కల్పించుకొన్నదీ ఉంది. అతనిది ఖణేల్మంటున్న కంచుకంఠం. అది ఆ నిశ్శబ్ద నిశీథి వాతవరణంలో చిన్నగానే అయినా స్ఫుటంగా మ్రోగ నారంభించింది.

## II

"భూమాతకు మొలనూలువలె అమరిన భారతదేశములో ఒకమేలైన మణి మన తెలుగునాడు. అందులో లేని సిరులులేవు. దట్టమైన అడవులు పెరిగేందుకు వీలైన కొండలు. అందరికీ తిండిపెట్టగల సారవంతమైన మైదానాలు, నిడుపైన సముద్రతీరం, గొప్పనదులూ, చక్కని శీతోష్ణస్థితీ, అన్నీ అమరి ఉన్నాయి. పక్షపాత మెరుగనిదా తెలుగుతల్లి, అందరు పుత్రులు ఆమెకు సమానమే, కొండలడ్డుకొని కొన్ని ప్రాంతాలకు వానలు తక్కువచేస్తే, నదులు సముద్రుణ్ణి చేరుకోవాలన్న ఆత్రంలో దగ్గర త్రోవ చూసుకొని అన్ని ప్రాంతాలకు వెళ్ళకపోతే ఆ బిడ్డలకై ఆమె భూమిలో బోలెడునీరు పెట్టడమేకాదు, వెలలేని గనులూ దాచింది.

ఇట్టి తెలుగునాడులో ప్రవహించే పెద్ద నదులన్నిటికంటే గోదావరి గొప్పది, త్ర్యంబకములో పుట్టిన ఆ నది పాపికొండల వరకు నాట్య రాణిలా పరుగులిడుతూ అందాల అందలాలవంటి దృశ్యాలను సృష్టిస్తూ ప్రవహిస్తూ వచ్చి అవిదాటిన తరువాత విశాలమై నెమ్మది వహిస్తుంది. శ్రీరామచంద్రుని దర్శనం వలన తన్మయురాలైన మహాభక్తురాలి నడక వలె ఆ ప్రవాహమప్పుడుంటుంది. అక్కడి

నుండి రాజమహేంద్రవరానికి కొంచెం దిగువగా ఆప్రవాహం చీలి ఏడుపాయలై సముద్రంలో కలుస్తుంది. విస్తారమైన వరిపైరులతోను, కొబ్బరి తోటలతోను ఈ ప్రాంతం విలసిల్లుతుంది. ఈ ప్రాంతమూ, దక్షిణాన కృష్ణా పెన్నా నదులు ప్రాంతాలూ కలిసి మనదేశంలో తెలుగుతల్లికి 'అన్నదాత' అన్న పేరు తెచ్చాయి. ఎంతటి వారికైనా నోరూరించే ఇతర ఫలజాతులెన్నో ఇక్కడ పండుతాయి. ధాన్యాలకూ ఇక్కడ లోటులేదు.

నదీ ముఖాలనేగాని ఇతర రేవులను మనిషి వినియోగించుకొన నేర్వని పూర్వపు రోజుల్లో గోదావరి పాయ ఒక్కొక్కటి కడలిలో కలిసిన సంగమాల ఒడ్డున ఒక్కొక్క రేవుపట్నముంటూండేది. చాల ఆనాదికాలంలోకూడ ఇక్కడ సముద్రయానమూ, విదేశ వర్తకమూఉండేవి.

రాముడు విద్యార్థి బృంద ప్రముఖుని వైపు చూచి సన్నగా నవ్వినాడు. తాతలు నేతులు తాగిన పుక్కిటి కథలు స్మరించుకోవడం మనమెప్పుడు మానుతామన్న హేళన ఆ విద్యార్థి కానవ్వులో స్ఫురించింది, చప్పున అతను పడవవాడు చెప్పిందాన్ని సమర్థిస్తూ గుసగుసగా చెప్పినాడు. "క్రీ.శ. రెండవ శతాబ్దపు రోమన్‌సామ్రాజ్యమున అలెగ్జాండ్రియాకుచెందిన (ప్) టాలెమీ అన్న భూగోళ శాస్త్రజ్ఞుడు తనకు తెలిసిన ప్రపంచాన్ని గురించి వర్ణిస్తూ ఒక గ్రంథం వ్రాసి దానిలో కొక మ్యాపు కూడ చేర్చి ప్రకటించాడు. అందులో గోదావరినదీ ముఖంపై ఒకరేవును గుర్తుపట్టాడని ఊహించేందుకు వీలుంది."

రాముడు తల ఊపినాడు.

"మరి మచిలీపట్నం వంటి చరిత్ర ప్రసిద్ధమైన పట్నమేదీ ఇక్కడ వెలసినట్లు లేదేమని మీరడగవచ్చు. నిజమే గోదావరి ఏం చిన్నా పొన్నా నదికాదు. దీని గొప్ప వరదల మూలంగా లేచిన ప్రతి పట్నము ఒక శతాబ్దం పాటైనా నిలువకుండా తుడిచి పెట్టుకొనిపోయేదేమో. లేక ఎప్పటికప్పుడు నదీ ముఖాల్లో ఇసుకతిప్పలు మేటవేశేవో లేక ఇతర సాంఘిక భౌగోళిక కారణాలేవైనా ఉన్నాయో తేలీదు......."

రాముడీ మాటలకంటే కథవైపే ఎక్కువ దృష్టి నుంచుతున్నాడని ఆ విద్యార్ధి గమనించి చాలించాడు.

"ఏడెనిమిది తరాలకు పూర్వమీ ప్రాంతంలో నరసాపురం, వాడరేవు, బెండమూర్లంక, ఇంజరం, పాలకొల్లు, వీరవాసరం మొదలైన రేవుపట్నాలు కొన్ని తలఎత్తినవి. వీటన్నిటికంటే కోరంగి బాగా పేరుకువచ్చింది. ఇక్కడ సహజస్థితి దీన్ని పెద్దరేవుగా చేసింది. లంగరు దించి ఓడలను నిల్పేందుకు కావలసిన భద్రత ఇక్కడ లభించేది. ఇక్కడ ప్రవాహవేగం నిలకడగా ఉండేది. ఏ ఋతువులోనైనా ఎంతటి ఓడలైనా సునాయాసంగా సముద్రంలో నుండి కోరంగి చేరుకొనగల్గేవి. ఎప్పుడు కావలస్తే అప్పుడక్కడనుండి తిరిగి సముద్రం చేరుకొనగల్గేవి. ఎగుమతి దిగుమతులకు యోగ్యమైన సంపన్న జనులతో నిండిన విశాలప్రాంతం, వెనుక ఉండనేఉండె. పైగా ఇంకా సంపన్నములైన దక్షినాది రాజ్యాలకు ఉత్తరాన వంగ రాజ్యానికీ మధ్యనాయె. కాబట్టి కోరంగి పెద్దపేరుగల రేవుపట్నం కావడంలో విశేషంలేదు. సమీపాన మన్యం కొండల్లో చక్కని కలపదొరకడం కూడా ఇందుకు తోడ్పడింది.

సుమారు రెండు వందల యాభై సంవత్సరాల క్రితమీ గ్రామాన్నొక పెద్ద ఉప్పెన ముంచివేసింది. జరిగిన నష్టం జరిగి పోగా ఆ తరువాత కొంతకాలానికే తిరిగి కోరంగి పుంజుకొని వృద్ధిపొందసాగింది. వరద వచ్చిన మరుసటేటి పంటలా ఊరుపెరిగింది. కుబుసం విడిచిన సర్పరాజులా ద్విగుణితమైన వీర్యంతో వెలుగసాగింది.

ఆ రోజుల్లోనే ఓడలమీద వర్తకానికీ ఓడల బాగుసేతకూ, వాటి నిర్మాణానికీ కోరంగిపట్నం పేరు వహించింది. ఆదేపేరుగల గోదావరిపాయ కా రోజులే నేటికీ కన్నీళ్లు తెప్పిస్తూంటాయి. తల్లితండ్రుల నడుమ చేతులు మారుతూ ఉల్లాసపుటుయ్యాలలూగే శిశువుల్లా నాటి ఓడలు సంద్రానికీ కోరంగికీ నడుమ పయనిస్తూండేవి. తండ్రి ఆగ్రహానికి వెరచిన శిశువులను తల్లి కుచ్చెళ్లనడుమ దాచుకొన్నట్లుగా కోరంగిపాయ ఓడలను సముద్రుని ఆగ్రహంనుంచి రక్షించేది.

నిరంతరం ఓడల రాకపోకలవల్ల పడవల ప్రయాణాల వల్ల రేవువద్ద నీరు జిడ్డోడుతూ మురికిగా కన్పించినా కోరంగిపాయ ఎంతో కళకళలాడుతూనే ఉండేది. తల్లి కొత్తఉడుపులు కట్టుకొన్నదే తడవు చిన్నపిల్లలు ఆమెచంకలోని కెగబ్రాకి వాటిని మాపుతూనే ఉంటారు. అయితే మాత్రమామె అందానికేంలోటు ? ఆకళ ఏనాటికైనా గొౖడాలికి వస్తుందా – ఉడుపుల మడతలు నలగకపోవచ్చు: ముఖంమీది పొదర్లు చెరగకనే పోవచ్చుగానీ.

ఇక్కడ కట్టుబడియైన ఓడల దార్ఢ్యాన్నీ మన్నికనూ, ఇక్కడ రిపేరి అయిన ఓడల మన్నికనూ విదేశీయులు పొగడగా విని క్షణం మురిసిపోయిన కోరంగి అంతలోనే దృష్టిదోషానికి వెరచి 'పిచ్చిసన్నాసులు వీళ్లు వీళ్ళ ఓడలూ' అనుకొని సాభిప్రాయంగా కడలిరాజువైపుచూచేది.

ఓడలనుండి గంపల్లో వెండి బంగారు నాణాలిళ్లకు చేరవేసే సవ్వడి విన్నప్పుడు కోరంగి శిశువుల అందెలమ్రోతలు విన్న తల్లిలా ఉప్పొంగి పోయేది.

కోరంగి పడమటిగట్టుమీద వెలసిన పట్నమే కోరంగిపట్నం. అక్కడ రేవుసమీపంలోనే నదిగట్టుపొడవునా బొదులనానుకొని పెద్దభవంతులుండేవి. కొన్ని వర్తకులకు చెందినవి కొన్ని ఓడల యజమానులకు, నిర్మాతలకు చెందినవి. ఒకటి రాజబంధువుకు చెందినది. ఆ మేడల కప్పులపైని జండాలు లంగరువేసి నిల్చిన ఓడలపై ఎగిరే జండాలతో ఎప్పుడూ ఎత్తులో పోటీపడుతుండగా చూచి కోరంగి నవ్వుకొని 'ఇంకాకళ్లు పూర్తి తెరుపుడు పడలేదు మిడిసిపడకండిరా' అంటూ వారించేది. ఆమేడలచుట్టూవిశాలమైన బయళ్లుండేవి. సరుకులు నిల్వచేసే గోదాములు వాటివెనుకగానే ఉండేవి. రేవునానుకొని వాసం కుదరని వారి గోదాములుకూడరేవువారనే ఉండేవి. రేవుదిగి కొన్ని అడుగులు పశ్చిమంగా నడిస్తే అక్కడొక పెద్ద రావిచెట్టు. దాని నీడన గ్రామదేవత కొక చిన్న గజమెత్తు ఆవాసం. గ్రామ దేవత వెండికళ్లూ, ముక్కూ నోరూ భీతిగొల్పుతూ దూరానికే కన్పిస్తాయి. అక్కడినుండి ఇంకా పడమరగా కొన్ని గజాలువెడితే విశాలమైన చతుష్పథం. అక్కడినుండి దక్షిణాభిముఖంగా వెళ్ళేది పెద్దబజారు. అటూఇటూ పెద్దకొట్లు, ఎతైన మేడలు. బజారులో జనులకు కావలసినవన్నీ దొరుకు

తాయి. అయితే టోకు వ్యాపారాలే ఈ పెద్దబజారులో జరిగేవి, చుట్టు ప్రక్కల ఉత్పత్తిఅయ్యే వస్తువుల వినిమయానికిదే పెద్దకేంద్రం. నీలపల్లి పంచలు, వొల్లెలు, సెల్లాలు, గొల్లపాలెపు టద్దకాలు, పూసలు, తాళ్లరేవు మోకులూఇనుపసరంజామా, కొబ్బరిమోకులు, తాళ్ళు, లంగర్లు, ఆయుధాలుఏలూరు తివాసీలూఅన్ని ఇక్కడినుండి ఎగుమతి అయ్యేవి. ముఖ్యంగా ఇక్కడి ఇనుపసామాన్లు తాళ్ళు సెల్లాలూఇవి నాణ్యతకు చాలప్రసిద్ధి చెందినవి. మోకులలో ఉప్పురాయిపెట్టి పేనితే ఏళ్ల తరువాత మోకు తెగవచ్చు గానీ ఉప్పురాయి మాత్రమలాగే ఉండేది. లోపలకి నీరుచొరకుండా అంతదిట్టంగా పేనేవారన్నమాట : తృణధాన్యాలు పప్పుదినుసులూ, జాతీయ విజాతీయ శాకఫలాలేగాక దీర్ఘప్రయాణాల కుపయోగపడే ఒరుగులు మురబ్బాలు ఊరగాయలూ సమృద్ధిగా దొరికేవి.

ఈ బజారు సంబరమంతా ఓడ ఏదైనా రేవువద్దకు చేరినప్పుడే ఎక్కువగా కన్పించేది. మిగిలిన సమయాల్లో చాల ప్రశాంతంగా ఉండేది. కవులు, గాయకులు కళాకారులు వీరి ప్రదర్శనలూ ఎప్పుడైనా సందండి కల్గించడం కద్దు

కొన్ని వందల గజాలీ బజారువెంబడిగా నడిస్తే కురంగీశ్వరాలయ ముఖద్వారం చేరుకొంటాము. ఈ ఆలయ పురాతనత్వాన్ని స్థాపించేందుకు పురోహితులూ పండితులూ చాల తాపత్రయపడుతూంటారు. రాముడు జింకను కొట్టినదిక్కడేనని ఆ సందర్భంలోనే ఈ లింగం నెలకొల్పినారనీ, వారు వాక్యార్థం చేస్తూంటారు.

ఈ ఆలయ ప్రాంగణంలో కొన్ని చిల్లరకొట్లు పూజాద్రవ్యాలను, పరిమళ ద్రవ్యాలను, సుగంధ ద్రవ్యాలను ముఖ్యంగా అమ్ముతుంటాయి. పరిమళ ద్రవ్యాలు అత్తర్లు సుగంథాలు ఎన్నివిధాలో చెప్పనలవికాదు. ఇక్కడ రోజా అత్తర్లు, మల్లెల అత్తర్లు, శ్రీగంథం, వట్టివేరు మొదలైనవన్నీ మన్మథుడే కనుక ఆనాడే ఎరిగిఉంటే కామదహనంకథే ఉండి ఉండదంటారిక్కడివారు. ఆకర్షవంతములైన దంతపు శిల్పాలు, దారుశిల్పాలు కూడా విరివిగా ఇక్కడ దొరుకుతాయి.

ఈ పెద్దబజారు తరువాత చిన్నబజారు. ఇక్కడకొనేవారు చిన్నగా బట్టి చిన్నబజారంటారు కానీ, ఎందులోనూ ఇదిచిన్నది కాదు. చాల విశాలమైనది. ఎప్పుడూ బాగా సందడిగా ఉంటుంది. పెద్దబజారులో ఉండినన్ని కొట్లూ ఇక్కడున్నాయి. కానీ, చిల్లరవర్తకం. వాతవరణాన్నీ దిక్కులను నక్షత్రశాస్త్రాన్ని అధ్యయనంచేసిన మౌలీమ్‌లూ, యజమాని పరంగా ఓడమీద సర్వాధికారాలు చెలాయించే నఖోదాలూ ఇక్కడనివసించేవారు.

తండేలులూ, కళాసీలూ ఉండేందుకొక వీధి సరంగులకొకవీధీ ఉన్నాయి. భండారీలు, ఓడకరణాలు, పురోహితులూ, దేవాలయసిబ్బందీ ఒక వీధిలో ఉండేవారు. నూలుపనివారు, నేతవారు, కమ్మరులు కొన్ని వీధుల్లో ఉండేవారు. గుప్తీలు, పుంజెరీలు, ఫిరంగిమనుషులు, ఖర్వాలు ఇతర నౌకర్లు వీరు మిగిలిన భాగమాక్రమించుకోగా దూరంగా మారుమూల ప్రదేశంలో మాల మాదిగలు నివసించేవారు.

అంటరానితన మిక్కడ, మిగిలిన కట్టుబాట్లతో, మిగిలిన గ్రామా లతో పోల్చిచూస్తే చాలతక్కువనాలి. నివాసవిషయంలోనూ వివాహాదికాల్లోనూ దేవాలయ ప్రవేశంలోనూ తప్పితే మిగిలిన విషయాల్లో అంత నిక్కచ్చితనం లేదు. అంత నిష్కర్షగా పాటించేందుకు వీలూలేదు. ఒక్కసారి పెద్దగిరాకీ వచ్చిపడినప్పుడితర కులాలవాళ్లలో తెలివైనవాళ్లనూ. ఆయా సరుకులను ముఖ్యంగా బట్టలను – తయారుచేసేందుకుపయోగించుకొంటేనేగానీ వీలులేదాయెమరి. ఒక్కొక్కసారి నిలవచేసుకొన్న బట్టలన్నీ వరదనీటిలోనో లేక ఏ అజాగ్రత్తవల్లనో పాడైతే తిరిగి అర్జంటుగా చలవ చేయించవలసి వచ్చేది. అప్పుడు చాకళ్లేచేయాలని చాదస్తానికిపోతే ఇటు గిరాకీపోతుంది. అందువల్ల ఎవరందివస్తే వారితో చేయించుకొనేవారు. మాలనూలని ఈసడించినా అదిలేకపోతే జరగదుగా. అలాగే నేతపనీ, పడుగుపనీ మరొకపనీ – ఓడలనిర్మాణ విషయంలోనూ అంతే. వెంటనే రిపేరీ అప్పటికప్పుడు కావాలని ప్రయాణావసరాలను బట్టి యజమాని ఒత్తిడి చేస్తుండగా కంసాలిగానీ ఉలిచేతపట్టకూడదని భీష్మించుకొంటే సాగేపనేనా? ఓడలపై పెద్ద ఉద్యోగాల్లో ఉ

న్నవారు చిన్నవ్యాపారాలు స్వంతంచేసుకోనేవారు. కొట్లుకూడా వైశ్యుల్లా, పెట్టుకొనేవారు.

ఇలాగ గ్రామీణ వ్యవస్థ, దాని పునాదిపై స్థిరంగా నిలిచిన కులవ్యవస్థ అప్పటికింకా బయటికి చెక్కు చెదరకపోయినా లోలోపలనే బీటలువేయ నారంభించిందనడానికివి తార్కాణాలంటే తప్పుకాదేమో. వస్త్రాల ఉత్పత్తి, నౌకల నిర్మాణం, శిల్పాలు చెక్కడం మొదలైన వృత్తుల్లో నైపుణ్యమవసరమైన ఉన్నత పదవులాయా కులాలవారికే ప్రధానంగా పరిమితమైనా క్రింది వారిలో మాత్రమన్నికులాలవారూ వచ్చి చేరుతున్న రోజులవి.

సముద్రోపజీవులైన అగ్నికుల క్షత్రియులీ వృత్తుల్లో బాగాపైకి వచ్చారు. వారిలో కొందరు వాణిజ్యమే కులవృత్తిగా గల వైశ్యులనుమించిపోయారుకూడ.

కులకట్టు బాట్లిక్కడ సడలినవి కనుకనే కోరంగిలాంటి గ్రామాలను లోతట్టున ఉన్న ఇతర గ్రామాల ఛాందసులు హీనంగా చూసేవారు. సాటి కులస్థులైనప్పటికీ, రేవుల్లో జీవించే వారితో వారు (వియ్యాలమాట దేవుడెరుగు !) మంచీనీళ్ళుకూడ పుచ్చుకోరు.

అయితేమాత్రం సాంఘిక కట్టుబాట్లు ఆర్థిక ప్రగతి నాపుతాయా? విత్తనాన్ని పగలదీసుకొని వెలువడే మొలకలా, గుడ్డు నుండి వెలువడే పిల్లలా ఆర్థిక ప్రగతి సాంఘిక కట్టుబాట్ల నధిగమించి పెరుగుతూంటుంది. ఛాందసుల పిల్లి శాపాలకు కోరంగి పెరుగుదల ఆగలేదు. ప్రయోజనం తీరిన తరువాత గుడ్డుపై పెంకు పగులక తప్పదు.

ఈ పెరుగుదలకు మరొక కారణమూఉంది. గోల్కొండ సామ్రాజ్యం పతనం తరువాత నైతేనేమి తరువాత ఔరంగజేబు మరణం తరువాత నైతే నేమి పటిష్టమైన విశాల దేశీన ప్రభుత్వ యంత్రాంగం మనకు లేకపోయింది అందువల్ల ఘనత వహించిన మచిలీపట్నంవంటి సంపన్న నగరాల్లోను, వాటి పరిసర ప్రదేశాల్లోను దూరదృష్టిలేని దురాశాపరులూ అల్పులూ అధిపతులయ్యారు. వారు, వారిసేవకులూ కొనసాగించే పీడన విపరీతమై అవి వృద్ధి చెందే అవకాశాలను

పోగొట్టుకొన్నవి. వాణిజ్యానికీ పరిశ్రమలకూ సన్నకారు జనం క్రొత్తప్రదేశాలకు వలసపోవలసిన వారైనారు. వారికి గోదావరి ప్రాంతం అనువుగా దొరకటంలో ఆశ్చర్యమేముంది?

ఇలా వృద్ధిపొందుతున్న గోదావరి మండలవాణిజ్యాన్ని మచిలీపట్నం లోని పాశ్చాత్య వర్తకులూ గమనించినారు. వారుకూడ మచిలీపట్నం పరిస్థితులతో అసంతృప్తులుగా ఉన్నారు. గోల్కొండ నవాబులేకాదు. మొగల్ చక్రవర్తి ఉత్తర్వులను కూడా ఖాతరుచేయకుండా సుంకాలను రుసుములను అక్కడి అధికారులు నిర్బంధంతో విపరీతంగా వసూలుచేస్తున్నారు. అసలే ఉన్న కొద్దిపాటి పన్నులను కూడ చెల్లించకుండా ఎగగొట్టచూచే రకాలాయిరి. ఎంత చవకగానైనా సరుకు గిట్టించుకోవాలని చూచేవారూ అయిరివారికీ విపరీతపుటన్యాయ శుల్కాలు చెల్లించవలసివస్తే కలిగేబాధ ఎంతనిచెప్పను ? కాబట్టి వారు ఇతర రేవులకోసం వెతుకుతున్నారు. సహజంగా వారిదృష్టి వర్థమాన కోరంగిగ్రామంపై పడింది. కాని కోరంగి అప్పుడే క్రిక్కిరిసి ఉండటంవల్లనో లేక స్థానిక సంస్థానాధిపతుల దృష్టినుండి తప్పించుకొనేందుకో, మరే కారణమోగానీ వారు మొదట్లో కోరంగిలోనే స్థావరా లేర్పరచుకోలేదు. కొంచెం కుడిఎడమలుగా ఏర్పరచు కొన్నారు. జగన్నాయకపురంలో డచ్చివారు, (ఇం) వింజరం సుంకరపాలెం గ్రామాల్లో ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు యానంలోను నివాసమేర్పడి గోదాములను నిర్మించుకొన సాగినారు. కొందరు కోరంగిపాయకు తూర్పుగట్టుమీదకూడ నివాసాల నేర్పాటు చేసుకొన్నారు. వీరిలో ఇంగ్లీషువారు మచిలీపట్నం లేక విశాఖపట్నంలోని ఇంగ్లీషు అధికారుల పర్యవేక్షణక్రింద పనిచేసేవారు. డచ్చివారు దూరప్రాచ్యంలోని కేంద్రాధికారులకు లోబడిఉండే వారు.

ఇలా ఇక్కడేకాదు మనదేశం తీరంపొడుగునా అక్కడక్కడా ఏర్పడిన స్థావరాలు క్రమంగా మశూచికం పొక్కుల్లా మనదేశమంతా వ్యాపించి సమాజానికి ప్రాణాంతకంగా పరిణమిస్తాయనిఎవ్వరూ ఊహించలేదు. శిశువుకు సోకుతున్న వ్యాధిని గమనించని తల్లిలా కోరంగి తన లోకంలో తానుండిపోయింది.

ఈ కోరంగి పట్నంలో నరసింహనాయకర్ పేరుతో ఒక ఓడయజమాని ఉండేవాడు. ఆయన తన ఓడలద్వారా బర్మా, మలయా, జావా, సింహళం మొదలైన రాజ్యాల రేవులలో వర్తకంనెరపేవాడు. బట్టలు, ధాన్యమూ, ఉక్కు వస్తువులు, చక్కెర ఇతల చిల్లర సరకులనూ ఆయనిక్కడ ఓడలకెక్కించుకొని తూర్పుదీవులకుగానీ లేదా దక్షిణాదికీ, అటు నుండి లంకకుకానీ వెళ్లేవాడు. తిరుగుపయనంలో యాలకులు, లవంగాల వంటి సుగంధ ద్రవ్యాలు, దంతపుబొమ్మలు, చెక్కబొమ్మలు మొదలైనవి తెచ్చేవారు. సురేకారము, ఏనుగులు. గుఱ్ఱాలుకూడ పిఠాపురం సామర్లకోట పెద్దాపురం మొదలైన రాజుల పురమాయింపులమీద మన పెద్దరేవులనుండి తెచ్చేవారు. ఎప్పుడు అమ్మకమే ఎక్కువగా ఉంటున్నందున వెండిబంగారాలు నాణెములరూపంగా కానీ, గట్లరూపకంగా కానీ కొంతవరకు ఇల్లు చేరేవి.

తమ సరుకేకాక ఓడలలోకేవ్వకై ఇతరవర్తకుల సరకులనూ రవాణా చేసేవారు.

తండ్రి కాలంలోవచ్చిన పెద్ద తుపాను దెబ్బవల్ల ఓడలు మునిగిపోగా కుటుంబం సామాన్యస్థితికి వచ్చింది. ఆ బెంగతోనే తండ్రి చనిపోయినందువల్ల బాల్యంలోనే నరసింహనాయకర్ పెద్ధబాధ్యతలు మోయవలసివచ్చింది. పినతండ్రి ఆయనను తండ్రివలె కాపాడి పైకితెచ్చాడు. నరసింహనాయకరావృద్ధిని నిల్పుకొని చాకచాక్యంతో కుటుంబాన్నింకా పైకితెచ్చాడు ఎన్నో ఓడలను తిరిగి సంపాదించాడు.

కానీ రెండేళ్ల క్రితం పయనమై తూర్పుదీవులకేసి వెళ్ళిన ఆ ఓడలింత వరకు తిరిగిరాలేదు. కారణామూ తెలియరాలేదు. దానితో గుండెచెదిరిన నరసింహనాయకర్ దాదాపు పిచ్చివాడైపోయినాడు. ఒక సంవత్సరంగా ఆయన దొక్కటే కార్యక్రమైపోయింది. ఉదయమేలేచి ఉత్తరంగా చొల్లంగి తీరంవరకూ ఒంటిగా నడిచివెళ్తాడు. అక్కడేదైనా నీడచూచుకొని కడలివైపేచూస్తూ సాయంకాలం వరకూ ఉండిపోతాడు. రాత్రికెప్పుడో ఇల్లు చేరుకొంటాడు. ఎవ్వరితోనూ మరేవిషయమూ మాట్లాడడు. పలుకరించినా వెర్రిచూపులే పెట్తాడు.

అతన్నీలోకంలోని కీడ్చేందుకు చేసిన ప్రయత్నాలన్నీ వమ్మైపోయాయి. కడలివద్ద అతనికే అపాయమూ కలగకుండా వీలు
న్నంతలో అక్కడి ఉప్పుకొఠారివారే చూచేవారు.

ఇటువంటి విపత్తులో పూనుకొని వ్యవహారాలు చేపట్టి సాధించగల మగదిక్కు కరువైంది, బాబయ్యా వృద్ధుడు, సలహాలిచ్చి చేయించడానికే గానీ ఇప్పుడు స్వయంగా ఏపనీ చేయగల దార్ఢ్యం లేనివాడు.

ఇప్పుడిప్పుడే ఈడువస్తున్న కుమారుడు భైరిచూస్తామా ఇంకా బాధ్యతలు తెలుసుకొనే స్థితికి రాలేదు. అతనికి తెలియజెప్పాలని అమ్మా, అమ్మమ్మా చేసిన ప్రయత్నాలన్నీ అతన్నింకా బాధ్యతలనుండి దూరమే చేశాయి.

భైరి దుర్మార్గుడూకాడు. తెలివితక్కువ వాడూకాడు. కానీ, కొంటెతనం చాలఎక్కువ. సుపుత్రుడంటే ఎలాఉండాలి ! బుద్ధిగా చెప్పినట్లువిని పెద్దబాలశిక్ష పూర్తిచేసి, గణితం నేర్చుకొని ఈపాటికి ఓడ వ్యవహారాల్లో కాలుపెట్టి ఉండాలి ! తల్లిదండ్రులకు నచ్చిన సంబంధం చేసుకొని తల్లికొక కోడలినప్పచెప్పాలి ! వ్యవహారంలో మెలకువలన్నీ చిటికెల్లో నేర్చుకొని గొప్ప సంపాదన పరుడు కావాలి. భైరినడత ఈ సూత్రాలన్నిటికీ భిన్నంగా ఉంది. అతని ఆగడాలకంతులేదు. ఎప్పుడూ ఏదో కొత్తబెడద కల్పిస్తూనే ఉంటాడు. కొత్త ఓడ వచ్చిందా. అతనింకెప్పుడూ దానిలోనే ఉంటాడు.ఇట్టే ఆ ఓడవాళ్లతో నేస్తంకలిపేసి వాళ్ల దగ్గిర కొత్తవస్తువులు తెచ్చి మిత్రులందరికీ పంచేస్తాడు. ఆ ఓడవాళ్లు చెప్పిన ఎన్నెన్నో కొత్త కథలు ప్రచారంలో పెట్తాడు. ఆ ఓడల్లో కొత్తనమూనా లేవైనాఉంటే అటువంటివి మట్టితోనో చెక్కతోనో చేసేందుకు ప్రయత్నిస్తాడు. ఆరోజుల్లో ఇంక బడికి సున్నే.

ఆ ఓడవాళ్లలో ఈ ఊరికి కొత్తైనవారెవరైనా ఉంటే వారిమీద తమాషాలెన్నో ప్రయోగిస్తాడు. నీళ్ళులోతుగా ఉన్నచోట రేవుందని భ్రమపెట్టి వారుపడేపాట్లు చూసి నవ్వుతాడు. రేవున్నచోట లేదనిభయపెట్టి దిగనివ్వకుండా చుట్టుత్రోవలు తిప్పుతాడు. మంచిపడవగానీ చూశాడో ఇంక తనివితీర దానిమీద

ఎన్నైనా షికార్లుకొట్టవలసిందే, కొత్తఓడలులేని రోజుల్లో అయితే అతనిచేష్టలు బాల్యమిత్రులమీద ఉంటాయి. లేదా చుట్టుపక్కల తోటలమీద దండయాత్ర చేస్తాడు.

ఇంతచేసినా భైరిఅంటే అసహ్యించుకొనే వాళ్లెవరూ ఆగ్రామంలో లేరు. అందరికీ ఉపయోగపడే సాహసకార్యమేదైనా చేయవలసివస్తేఅతనే ముందుదిగుతాడు. ఒకసారి పాఠంచెప్తూన్న పంతులు గారింట్లో పెద్దనాగుపాము పసిపిల్లవానిపై ఆడుతూంటే అందరూ హహకారాలు చేసేవారేకానీదాన్ని తప్పించేందుకు పూనుకొన్నవాడు లేడు. కాని భైరి పాములవాడి కోసం ఆగకుండానే చాకచక్యంతో దానివడగ గట్టిగానొక్కివట్టుకొని ఉయ్యాలనుండి ఇవతలికిలాగివేసినాడు. తరువాత పాములవాడువచ్చి కోరలు

పీకగా ఆ పామును పటుకొని పిల్లలను పెద్దలనూ కొన్నాళ్లు జడిపిస్తూండేవాడు.

భైరి ఎన్ని ఆగడాలుచేసినా అతన్నెంటువంటి పరిస్థితుల్లోనైనా వెనకేసుకొని వచ్చేవారిద్దరే. మొదటివ్యక్తి బాబయ్య. తరువాత పరదేశి. పరదేశి భైరికి మేనమామకూతురు. పిల్లలఆటల్లోనైనా సరే, పెద్దలు యథాలాపంగా మాట్లాడుకొన్నప్పుడైనా సరే వారిని కాబోయే దంపతులుగానే వ్యవహరించేవారు.

ఆ యిద్దరి లేతమనసుల్లోకూడ అనురాగబీజం మొలకెత్తుతున్న రోజులవి. కానీ పరదేశితండ్రి మీరయ్య దాన్ని నిర్దాక్షిణ్యంగా ఒకరోజున త్రుంచివేశాడు. ఆరోజందరికీ జ్ఞాపకమే. ఆరోజు కోరంగిలో కటకట పడనివారు లేరు.

ఆ రోజు శ్రీరామనవమి గడిచిన దశమిరోజు. ఉగాదినాడు మొదలైన వేడుకలన్నీ నిన్నటికే పూర్తై పోయినాయి. కోరంగిలో జరిగే ఈవేడుకలీ ప్రాంతానికంతా ప్రసిద్ధిచెందినవి. కాబట్టి ఈవేడుకల్లో పాల్గొనేందుకసంఖ్యాకంగా జనంవచ్చారు. ఆ వచ్చినవారందరూ ప్రయాణ సన్నాహాల్లో ఉన్నారు. కళాకారులనేకులు సంభావనలందినా, ప్రత్యేకాభిమానుల గృహసన్మానాలందుకొంటూ వెళ్ళిపోవడానికి త్వరపడుతున్నారు. పగటివేషగాండ్రు

తోలుబొమ్మలాటగాండ్రు, దొమ్మరివారు, నాట్యకత్తెల బృందాలు, వీధిభాగవతులు, హరిదాసులు, సంగీతవిద్వాంసులు, నాటకాలజట్లు,బుర్రకధబృందాలు ఓ హో అనేకరకాలవారు వచ్చారు. ఎన్నోరకాలైన వస్తువులమ్ముకొనడానికి, కొనడానికి వచ్చినవర్తకులూ, ఆయానిపుణులూ, తమవ్యవహారాలు ఫైసలు చేసుకొన్నారు. గ్రామానికివచ్చిన దగ్గిరబంధువులింకా తీరుబడిగా నిల్చిఉన్నారు. పందిళ్లూ మిగిలున్నాయి.

ఆ రోజు సాయంకాలం కురంగీశ్వరాలయంలో ప్రత్యేకమైనఉత్సవం, ఊరికట్టడులను బ్రతుకుతెరువులను ఒకసారి పరామర్శచేసుకొని అవసరమైన మార్పులతో ఖరారు చేసుకొనడం! ఆనాటి ఉత్సవంలోని ప్రత్యేకత. పూర్వమెలా జరిగేదోగానీ, ఈనాటికది నిర్జీవమైన ఆచారంగా మాత్రమే నడుస్తూంది, అవసరాలకొద్దీ కులవృత్తుల నధిగమించి ఓడలకు సంబంధించిన ఏదోవృత్తిమీద బ్రతికేవారితోనే గ్రామమంతా నిండిఉంది. కానీ తల్లిగర్భం నుండి వెలికివస్తూనే శిశువుకు నాళవిచ్ఛేదం కానట్లుగా, కోరంగి గ్రామసమాజానికింకా కులవృత్తుల వ్యవస్థతో తెగతెంపులు కాలేదు. స్వయంపోషక గ్రామీణవ్యవస్థ నిర్మూలమై కొత్తసమాజం సర్వాంగసుందరంగా రూపొందలేదు. పాతవాటిని ఆచారపు మూసలో జ్ఞాపకం చేసుకొంటున్నారు. సామాన్యుల కెవ్వరికీ అర్థంకాని సంస్కృతంలో ఇది జరుగుతూంది. మధ్యమధ్య తెలుగులో కొంత తతంగం నడుస్తూంది.

నైవేద్యము ముగిసిన తరువాత, మంగళహరతిచేసి అర్చకుడు మంగళహరతి పళ్లేన్ని దేవాలయము నౌకరుచేతికిచ్చి గర్భగుడి ప్రవేశం వద్ద నిలబడినాడు. హరతి నందరూ అందుకొన్న తరువాత. అర్చకుని ప్రక్కనే నిల్చుకొన్న పురోహితుడు సభాపూజ ప్రారంభించినాడు.”

సభాపూజ ప్రస్తావన మిగిలినవిధ్యార్థులు యధాలాపంగా తీసుకొన్నా, రాముని మనోనేత్రంముందు ఆసభ ఎలాఉంటుందో ఒకక్షణంపొడగట్టింది. అతను తండ్రిగారివద్దనుండి మనపూర్వ గ్రామీణవ్యవస్థలోని ప్రజాతంత్ర పరత్వాన్ని

గురించి అవి అమలుజరిగే పద్ధతులను గురించి విని ఉన్నాడు. అతనిలా ఊహించాడు.

దేవాలయ మండపం. అందులో గర్భగుడిద్వారం. దానిముంగిట హారతిపళ్లెం పట్టుకొన్న అర్చకుడు. అతని ప్రక్కనే పురోహితుడు అతని ప్రక్కనేకరణము.అతని ప్రక్కగా బడిపంతులు,సిద్ధాంతి,ఇతర బ్రాహ్మలు. ఆ వరుసచివర బ్రాహ్మలకు కొంచెమెడంగా గ్రామణి. ఇతర పల్లె పెద్దలు, వెనుకవరుసలో బ్రాహ్మణులవెనుక బ్రాహ్మణులు, గ్రామణి వెనుక ఇతర కులాలవారు నిల్చుకొని ఉన్నారు. ఎదుటి వరుసలో గర్భగుడి ద్వారం వద్దనే పిఠాపురరాజప్రతినిధి, రాజబంధువు అయిన వెలమ వంశీయుడు. ఆలయంలో రాజుల కేమర్యాదలున్నవో అవన్నీ ఆయనకక్కడ జరుగుతున్నాయి. ఆయనకు ప్రక్కగా మరికొందరు క్షత్రియులు. రావు వంశీయులు, వైశ్యులు. వారివెనుక ఇతరకులపెద్దలూ, ఈ ఉత్సవాన్ని చూసేందుకు వచ్చినపెద్దలూ నిల్చుకొన్నారు. మండపానికి బయట ఆలయ ప్రాంగణంలో పిల్లలు, స్త్రీలు, సామాన్యులు నిల్చుకొని ఉన్నారు. పురోహితుడు చతురంబోధి పరీతమైన భూవలయంలో భరతఖండము నందు గంగా గోదావరీ పుణ్యనదుల మధ్యనున్న కోరంగిగ్రామంయొక్క స్థానాన్ని కలియుగ కాలమానంలో నాటి తిథి. వార, నక్షత్రాలు ఇతర వివరాలను వర్ణించి సభాకార్యక్రమారంభానికి సంకల్పంచెప్పి దానికి సభానుమతి నొందుతాడు.

రాముని ఊహలతో నిమిత్తం లేకుండా పల్లెవాడు కథచెప్పుకొని పోతున్నాడు.

"గ్రామంలోని అందరిని గోత్రాలవారీగా పిలిచి బహుపరాకు చెప్పటంతో కార్యక్రమం మొదలైంది.

వెలమలదే అక్కడధికారం కాబట్టి మొదట వారిగోత్రాలు బిరుదులతో సహా మొదట చదువుతున్నాడు."

ఈసారి స్థూలకాయుడైన విద్యార్థి కథ కద్దువచ్చాడు.

'వెలమల గోత్రాలా ? నాకుదెబ్భైఏడూ కంఠతావచ్చు ఒకొక్క గోత్రపు బిరుదులన్నీ కూడా చెప్పగలను. నేను సంస్థానాల చరిత్రలు చదివానుతెలుసా? ఒకపుస్తకంచదివానంటేముఖ్యమైనవన్నీఅట్టేబట్టీపెట్టి పారేయ్యనూ? చూసుకో ! పునుగోటి గోత్రం. బిరుదులు. నిశ్శంక భయమల్లా! జాజువరాయ పరుసలింగమ ! సప్తాది దళపతినాయకాచ్చామ్లా ! పుట్టకోట విడిచి కలుకోటబెట్టే నాయకాచ్చామ్లా ! మలకానేమాళునేదళ భయంకరా ! గజగంధ తలాటరాయా : రాహెూత్త వేశ్యాభుజంగా ! సరగరుద్రదేవునిపున: పట్టనంబుగట్టిన కాకతిరాజ్య స్థాపనాచార్య! ఇంకా కావాలా!ముట్నూళ్ళ గోత్రరా చోళరాజ్య స్థాపనాచార్య !......... " కోర్టువాడు సాక్షులను పిలిచినట్లుగా అతనీ బిరుదులు చదువుతూంటే మిగిలిన వారికి కఠోరంగాఉంది.

"నాయనా చాలించు " ఏకగ్రీవంగా అందరూ అతన్ని కోరుతున్నారు.

"అప్పుడే? ఇదిగో మరొకగోత్రం బిరుదు! వాలుచెవులును వ్రేలు గడ్డమును కుమరకుంగొండ వారికెగలరెడ్డి నాయకాచ్చామ్లా ! నల్లని రేవులో తెల్లనికూడినతిని వాసాలక్రిందబడ్డ రెడ్డినాయకచ్చామ్లా !.............గుడిచెర్వుకట్టయెక్కి బెడ్డమార్గంచు గవినిదూరే రెడ్డినాయకాచ్చామ్లా ! ......"

ఇంకాగలేక మిగిలిన వారతన్ని నిర్బంధంగా నోరు మూసేశారు !

కథ కొనసాగింది.

"దేవభాగం, రాజుభాగం నిర్ణయించడం, రేవులో హద్దులు పంచడం " మొదలుకొని, కల్లునిమిత్తమైన చెట్లపంపకం పశువుల పుల్లరి, బీళ్లకేటాయింపు వరకూ అన్ని వ్యవహారాలూ భగవంతుని సాక్షిగా ఖరారవుతున్నాయి, కులాలవారీ పిన్నపెద్దల నిర్ణయాలౌతున్నాయి.

ఈ ఉత్సవంలో ఉత్సాహంతో పాల్గొంటున్నవారు గ్రామాధికారులు రాజప్రతినిధీ, కొందరు బ్రాహ్మలూ, వారిగొప్ప పదిమంది ఎదుటా కనిపించేది ఈరోజేనాయె. మిగిలినవారికి వేళ గడుస్తున్నట్లల్లా కాళ్లనెప్పులూ విసుగూ కల్గుతున్నాయి. పొద్దు గడుస్తున్నట్లల్లా జనంలో అలజడి. సంచలనం పెరుగుతూంది.

పిల్లల ఏడ్పుల రూపంలోనూ, తుమ్ములు దగ్గుల రూపంలోనూ ఇది వెల్లడౌతూంది. అయినా వారు దీన్ని గమనించుకొనే స్థితిలోలేరు. అపురూపంగా శ్రోతలు దొరికిన ద్వితీయశ్రేణి కవి గాయకుల్లా వారిసొద వారు కానిచ్చుకొంటున్నారు. మధ్యమధ్య మీరయ్యవంటి పెద్దలెవరైనా జనాన్నిగద్దించి ఊరుకొబెట్టినా నిశ్శబ్దమెంతోకాలం నిలవడంలేదు. సందెజాము వేళప్పుడనగా మొదలైన ఈ తతంగం ముంతవేళ కావచ్చినా ముగిసేసూచన లేకపొయేప్పటికి జనమింక బొత్తిగా ఆగలేకపోతున్నారు.

ఈ సందర్భంలో చివరి విషయంగా మన నరసింహనాయకర్ గారికి కేటాయింపబడిన మాన్యాల ప్రస్తావన నెవరోతెచ్చారు. సభయావత్తు వెంటనే నిశ్శబ్దం వహించింది. ఆ మాన్యాల నెవ్వరూ శ్రద్ధపట్టక ఏళ్ళపర్యంతంగా బీళ్లై ఉన్నందున అవి కొత్తవారి కెవరికైనా కేటాయించాలనీ కొందరు వాదిస్తున్నారు. ఈవాదానికి జవాబు చెప్పేందుకు నాయకర్‌లేదు.ఆయనీవేళకూడ చొల్లంగిత్రోవే పట్టిపోయాడు. అందరి సానుభూతి నాయ కర్‌వైపే ఉన్నప్పటికీ ఎవ్వరూ మాట్లాడలేకపోతున్నారు. ఓడల వ్యాపారం ముమ్మరంగాఉన్న రోజుల్లో నిర్లక్ష్యంవల్ల, ఇప్పుడు దక్షతలేక ఆ యిద్దము (రెండూతూముల విత్తనాలు చల్లగల్గిన) భూమి బీడుగా ఉన్నమాట నిజమేమరి ! భూమి మీద తీయవలసిన పంటంతా తీయకపోతే పాపంకాదూమరి ! దాన్నెట్లా సమర్ధించడం?

జనం మీరయ్యవైపు చూస్తున్నారు. నాయకర్ పక్షాన ఏదో నాల్గు మాటలుచెప్పి సమస్య నీయేటికతడు తప్పిస్తే వచ్చేఏటికి చూసుకోవచ్చు. నందోరాజా భవిష్యతి, అని అందరూ ఆశిస్తూన్నారు. కానీ మీరయ్య బెల్లంకొట్టిన రాయిలాగ మాట్లడకుండా నిల్చుకొన్నాడు.

బాబయ్య అక్కడే ఉన్నాడుకానీ స్వవిషయంలో దయాభిక్ష కోరలేక మిన్నకున్నాడు. తుదకు మరొక వృద్ధుడు నాయకర్ కుటుంబ పరంగా సర్దిచెప్పనాడు. దైవికంగా కల్గిన ఇబ్బందులవల్ల దీనస్థితిలోఉన్న కుటుంబం పట్ల కొంత ఉదారంగా నడుచుకొనవలసిన ధర్మాన్నాయన ఉటంకించి చెప్పినాడు. అభ్యంతరాన్ని సభ

కొట్టిపారెసింది. ఇలా కార్యక్రమం కొనసాగి చివరకు తీర్థప్రసాదాలు పంచడంతో ముగిసింది.

అందరూ రకరకాలుగా మాట్లాడుకొంటూ పోతున్నారు. చాలమంది మీరయ్యా వేళెందుకలా మౌనంగా ఉన్నాడా అని తర్కించుకొంటున్నారు.

ఒకబ్రాహ్మలజంట యధాలాపంగా జరిగిన విషయాన్ని నెమరు వేసుకొంటూంది.

"ఇక్కడెలా గడుపుతున్నావుబావా? నేనైతే ఈ మరకాళ్ళతొంబతో ఒక క్షణం బ్రతకలేను."

"అలా అనకయ్యా, ఎవరైనా వినేరు! వీళ్ళంతా అగ్నికుల క్షత్రియులు!"

"బ్రాహ్మలలా నిల్చుకొంటే చీమచిటుక్కుమనడమే ! చింతబరికెలు నాట్యంచెయ్యవా ? చర్మం లేచిపోదా?"

"మీకేం ? అగ్రహారీకులు! ఎలా మాట్లడినా చెల్లుతుంది. చిన్నప్పుడు నేను వేదాలు వల్లెవేయలేదు. శాస్త్రాలూ వల్లెవేయలేదు. ఇంక కావ్యాలూ. నాటకాలు వాటిసంగతికేం చెప్పను! అందుకే ఇక్కడపడి అఘోరిస్తున్నాను."

కోరంగి బ్రాహ్మణుని కొమారుడు తండ్రిని కాదని మరోసమాదానమిచ్చాడు. "మర్కాళ్ళటమర్కా ళ్ళు ! మీరుకొలిచే వాళ్ళతో పోలిస్తే వాళ్ళెందులో తీసికట్టని? అగ్రహారాల్లోకంటే ఇక్కడేం తక్కువని? నాఎత్తు సొమ్ముపోసినా నేనే అగ్రహారంలోనూ కాపురం పెట్టను."

అగ్రహారీకునికి చురుక్కుమన్నా విననట్టేనటించి, తండ్రితో–

"నీవు సైగలుచేసి వారించావుగానీ లేకపోతేనా!"

"బాబ్బాబు అల్లాటి హైతకపుపనేదీ చేయబోకు"

మరోకచోట ఈ తతంగ మింతసేపు కొనసాగినందువల్ల తమ వినోద కార్యక్రమం భంగపడిపోయినందుకు కొందరు విసుగుకొంటున్నారు.

వెనుక రాజబంధువుకు త్రోవచేస్తూ జన్నాన్ని తొలగచేస్తున్నారు. ఆయన వెనుకనున్న వెలమ ఒకతను ఈ సారీశిస్తు ధాన్యం దివాణానికి తోలే విషయం చర్చకు రానందుకు రాజబంధువుతో అసంతృప్తి వెళ్ళబోస్తున్నాడు.

"గోల్కొండ వర్తమానాలు తేలలేదు. ఈలోపున ధాన్యం అక్కడున్నా ఇక్కడున్నా ఒక్కటేకదా !" రాజబంధువు ముక్తసరిగా ఆ సంభాషణను త్రుంపివేశాడు. అన్వారుద్దీన్ ఆర్కాటు నవాబుగిరీవహించిసర్కారులను విడిచివెళ్ళిపోయాక కొన్నేళ్లుగా కోరంగివారు శిస్తులు వసూలివ్వడంలేదు. ఎంత మిగిలితే అంత గోవిందా! ఎవరు మిగిలించుకోగల్గితే వారికి గోవిందా! తాము గట్టిగా నిర్బంధించినా రాబట్టుకొనలేమని రాజబంధువుకు తెలుసుకాబట్టి తమ ఔదార్యం వల్లనే దాన్నిక్కడుంచినట్లుగా నటిస్తే పెద్దరికమైనా మిగిలి ఉంటుదన్నసీతి ఆయన పాటిస్తున్నాడు.

రాజరికపుటైశ్వర్య పటాటోపాన్ని మాత్రమే చూసి భ్రమపడుతున్న ఆ వెలమ భృత్యునికావిషయ మెలా తెలుస్తుంది? తమదొర మంచితనాన్ని గ్రామము దుర్వినియోగపరుచు కొంటున్నదనీ, ఆ గ్రహింపు తమ దొరకు కల్గించి వారిఅభిమానానికి పాత్రుడు కావాలనీ వెలమ భృత్యుని తాపత్రయం.

మరోకచోట రాజబంధువును సాగనంపి వెనుక నడుస్తున్న మీరయ్యా, ఆయన మిత్రబంధువులూ మాట్లాడుకొంటూ ఇళ్ళు చేరుకొంటున్నారు.

ముసలాయ నౌకరు మీరయ్యను మందలిస్తున్న ధోరణిలో మెల్లిగా మాట్లాడుతున్నారు. "మీరయ్యా, ఎంతకాలమని ఇలాజరుపుతావురా! నీ ముసలి బావగారికేదో దారిచూపు. ఆయనల్లా రోజూ చొల్లంగినుంచి ఒంటిగా తిరిగి వస్తూంటే కడుపు తరుక్కొని పోతూందిరా"

"నేనేంచేయను. ఆ ఓడలు వెతికించడానికెంత ప్రయాసపడాలో అంతాపడుతూనే ఉన్నానే. దైవవిధిని తిప్పగలవాడినా నేను?"

"దానికి నిన్నెవ్వరేమంటున్నార్రా? ఓడలు బళ్ళౌతాయి. బళ్లోడలౌతాయని ఊరికే అన్నార్రా? పరదేశిని ఆ భైరయ్యకు ముడివేసి అరణంగా ఒకటి రెండోడలిస్తేగానీ ఆ కుటుంబం నిలదొక్కుకొనేమార్గ మింకొకటి లేదురా. వాండ్లమ్మ ఎవరు పరాయిదా?నీకు తోడబుట్టువేనే !"

ఈ సంభాషణిప్పటికి చాలకాలంగా జరుగుతూంది. మొదట్లో మీరయ్యకు కూతురును మేనరికానికివ్వాలనే ఉండేది. చిన్నతనంలో చెల్లెలంటే అతని కలవిగానిప్రేమ. అయినా అతను మచిలీపట్నంవారి ఆడపడుచును రెండవపెళ్ళి చేసుకొన్నప్పటినుండి ఇంట్లోపెత్తనమంతా ఆమెది. ఆమెకి సవతికూతురుపేర కొంత ఐశ్వర్యం వేరుపోవడం సుతరామూ ఇష్టంలేదు. పరదేశి తనవాళ్లలోనే ఒకరికి కట్టబెట్టాలని ఆమె భర్తకెన్నో విధాలుగా నూరిపోస్తుంది. ఇప్పుడు మేనల్లుడు దాదాపు బికారి ఐపోవడంతో మీరయ్య మనస్సటే మొగ్గుతూంది. ఇంతవరకూ బయటికి తేలలేదుగానీ ఇవాళ బయటవడకుండా ఆపుకొనలేకపోయినాడు. వ్యవహారంలోదిట్టకాబట్టి అప్రయత్నంగానే చాల నెమ్మదిగా చెప్పినాడు.

"దైవమే బికారిగా చేసినవాణ్ణి నేను బాగుచేయగలనా మామాయ్యా?" "అంటే ?"మామాయ్య ముక్కుమీద వేలువేసుకొన్నారు. అయినా తనచెవులనే తాను నమ్మలేని ధోరణిలో వివరమైన జవాబు కోరినాడు.

"దైవమేవాణ్ణి బికారిగా చేసిందికదా, నేనరణమిచ్చి నిలబెట్టేందుకు ప్రయత్నిస్తేమాత్రం నిలద్రొక్కు కుంటాడా ?" అని మీరయ్య మరల అమాటే చెప్పినాడు.

"అయితే ?"

ఇలా మాటకు మాట పెరిగిపోయింది. ధర్మబుద్ధి కలవారు సూక్ష్మంగా ముసలాయన పక్షాన మాట్లాడి చూచినారు. కానీ ప్రయోజనం లేకపోయింది.

మీరయ్య ఈసంభాషణ తరువాత కరుడు గట్టుకొని పోయినాడు. ఇంటికి వెళ్ళిందే తడవు కోపంగా కాళ్ళకు నీళ్లైనా సరిగా అందుకొనకుండానే "పరదేశి ఏదీ" అన్నాడు. పరదేశి ఎప్పూడు తన ఇంట్లో ఉండదని అతనికి తెలుసు. సవతి తల్లి ఏం ప్రేమ ఒలకబోస్తుందని. ఇక్కడుంటుంది? తనతోబుట్టువు ఇంటికే పోయివుంటుంది. ఈపాటి కింకా ఇల్లు చేరుకొనకపోతే ఇంకక్కడే పడుకొంటుందన్నమాటే.

పరదేశి ఇంట్లో ఒకపూటుంటే అక్కడ నాల్గుపూటలుంటుంది. భైరీ పరదేశీ కలసి ఆదే ఆటల కంతేలేదు. ఆస్తమానం భైరి ఆపిల్లని ఆట పట్టించే ప్రయత్నం చేస్తాడు, వాళ్ళమ్మ కోడలికి తన ఒడిలో రక్షణనిస్తుంది, ఇలా ఆడుతూనే ఎప్పుడో పరదేశి నిద్రపోతుంది. బలవంతానలేపగా వచ్చిన సగం మెలకువలో పరదేశి నాల్గు మెతుకులు తింటుంది.

ఉదయం భైరయ్యా పరదేశి కలిసి వీధి బడికిపోతారు. అక్కడి నుంచి భైరయ్య ఇంటికి భోజనానికి వెళ్తాడు. పరదేశిని మాత్రం వాళ్ల యింటికే నయాన భయాన భైరయ్య తల్లి సాగనంపుతుంది. కోడలికన్నం పెట్టలేకకాదు. తాను పెట్టగల్గిన లేకి మెతుకులు రెండుపూటలా తింటే పరదేశి ఎదిగేవయస్సులో చిక్కిపోతుందని: ఒకపూటైనా యింట్లో లక్షణంగా భోజనం చేయాలని.

చంటిపిల్లగా ఉన్నప్పుడే తల్లిపోగా తనచేతులారా పరదేశిని వైభవంగా పెంచింది. ఇప్పుడా చేతులతోటే పరదేశిని భోజనానికి దాని సవతి తల్లికప్పజెప్పవలసి వచ్చేటప్పటికామె మనస్సెంతో విలవిలలాడిపోతుంది. ఆ బాధయావత్తు మరవడానికి భైరయ్య ఒకడే ఆమెకున్న ఆస్కారం. భైరయ్యా కిప్పుడిప్పుడే పెళ్లంటే సిగ్గుచూపించే వయస్సు వస్తూంది. పరదేశికింకా ఆవయస్సూలేదు.

ఈ విషయాలన్ని ఒక క్షణంపాటు మీరయ్య మనస్సులో మెదిలాయి. తన తోబుట్టువువల్ల కూతురు తల్లిలేనిలోటే ఎరుగదని అతనెన్నో మార్లు కండ్లుతుడుచుకొని ఉన్నాడు. కానీ ఈరోజతని మనస్సు కరుడు కట్టుకొని పోయిఉ ంది.

మొదటిసారతని ప్రశ్నకు భార్య ఈర్ష్యగా నవ్వింది. కాని రెండవ సారా ప్రశ్ననే అతను రెట్టించి అడిగేసరికామె కలకవచ్చింది.

“కూతురెలా ఆడితే అలా ఆడనిస్తూ మధ్యనన్నదుగుతారేమి” అని ఛర్రుమని అంటించింది. ఆయన వెంటనే నౌకరును పిలిచి “నిద్రపోయినాసరె, పరదేశిని ఉన్నపళంగా తీసుకొనిరారా” అని ఆజ్ఞాపించాడు. వాడు మామూలు నౌకరుకాదు, చాలకాలంగా ఆయనింట్లోఉన్నాడు. మీరయ్యకు సలహదారూ, ఆయనలేనప్పుడు పెత్తందారూకూడా. కాబట్టి ఈ ఆజ్ఞను పాలించేందుకు సందేహించాడు.

ఆ నౌకరుకూడా పరదేశిని ఖైరయ్యతో అలా తిరగనివ్వకూడదని చెప్పినవాడే. తనమాటనా ఒక్కవిషయంలో మాత్రమే తన యజమానీ నిర్లక్ష్యంచేసినాడు. ఈవేళిదేమిటీమార్పు !ఇంత హఠాత్తుగా ?

అతని సంకోచాన్ని పోగొట్టుతూ మీరయ్య అదే ఆజ్ఞను రెట్టించాడు. “ఇంకమీదట ఆస్తమానమూ పరదేశిని పరాయిండ్లకు పోకుండా కట్టడి పెట్టండి” అంటూ తన ఆజ్ఞనింకా మరవేసి బిగించాడు.

నౌకరు తనసలహ ఈనాటికైనా యజమాని తలకెక్కినందుకు పరమానంద భరితుడై వెళ్లిపోయాడు,

“నీవు కొంచెం ప్రేమాదరాలు చూపించి చేరదీస్తే అదిలా పరాయిండ్ల వెంటబడి ఎందుకు తిరుగుతుంది? ఎన్నేండ్లు వస్తేమాత్రమేం జ్ఞానంరాకపోయాక?” అంటూ తనకోపాన్ని భార్యమీద చూపించినాడు. ( ఏం ? మీరయ్యమాత్రం భారతీయుడుకాడా?)

ఆమె మాత్రం భారతీయ పురుషపుంగవులు మలచి చూపే ఆదర్శ భారతనారిగా భర్తతిరస్కారాన్ని మహభాగ్యమని స్వీకరించలేదు.

“మీతోబుట్టువు మందుమాకులు పెట్టి మీపిల్లను వశంచేసుకొంటే నేనేంచేస్తాను ? అందరికీ సవతితల్లే చెడ్డదిరామో” అంటూ ఏడ్పులు ప్రారంభించింది.

"మందులు మాకులు పెట్టేవారెవ్వరే? మా వంశంలోనే లేదటువంటి వ్యవహారం !" అని మీరయ్య కోపగించుకొన్నాడు.

"మాతండ్రికి నేనేంద్రోహంచేసి పుట్టానురా రామా. పిల్లల తండ్రికి కట్టబెట్టి చేతులు కడుగుకొన్నాడే తల్లీ" అంటూ మరింత బిగ్గరగా శోకాలు ప్రారంభిస్తూ విసవిసలోపలికి నడిచిపోయింది.

ఈ పరిణామానికి క్షణం స్తబ్ధుడై తిరిగి ఆమెననునయించేందుకు మీరయ్య ఆమెననుసరించాడు.

అతను తన కూతురు భవితవ్యం విషయంలో ఇంతకఠోర నిర్ణయానికీవేళ హఠాత్తుగా అవేశపరుడై రాలేదు. కొంతకాలంగా అతని నౌకా వ్యాపారం కొంత ఒడుదుడుకులకు లోనౌతూంది. పరులకు తెలియనివ్వక లోపలే ఆయన దాన్ని హలాహలాన్నివలె దాచుకొంటున్నాడు. సాక్షాత్తు పరమేశ్వరుడు కాదుకాబట్టి దాన్ని శాశ్వతంగా నిగ్రహించుకొని నిబ్బరం వహించలేడు. అతని వర్తక సంబంధాలన్నీ ఎక్కువగా డచ్చివారితో ఉన్నాయి. ఇతనెక్కువగా సరుకులు వారికే వేస్తాడు. కేవులకుకూడా వారి వస్తువులనూ, వారి మనుష్యులనే ఎక్కువగా తిప్పుతారు. ఇప్పుడువారి ప్రాబల్యం బాగా తగ్గిపోవస్తూంది. వారిక్కడి రాకపోకలు తగ్గించి ఇంకా తూర్పున పడి సుమత్రా, జావా మొదలైన ద్వీపాలవైపు వారిదృష్టిని కేంద్రీకరిస్తున్నారు. పైగా వారు బేరాల్లోచూపించే నికృష్టతను భరించడం దుర్భరంగాఉంది. పోని డచ్చివారి నొక్కసారిగా వదిలించుకుందామాఅంటే ముందుముందెల్లా ఉంటుందో. ఈఫ్రెంచివాళ్లెటువంటివాళ్లో ! వారూకర్కోటకులే అంటారు వారితోమెదిలేవాళ్లు, అంతాఒకరకంవాళ్లే . ఇంజరంలో ఒక తరహావాళ్ళున్నారు. వారిపేరు నోరేతిరగదు (ఇంగ్లీషువారు!) కానీ వారి వ్యాపార మదెంతమహా ! అందుచేత ఫ్రెంచివర్తకులతో పరోక్షపుసంబంధం నెలకొల్పుకోవాలి. దానికొక్కటే మార్గం. తనభార్యవైపువారికి ఫ్రెంచివర్తకులతో మంచి సంబంధాలున్నాయి. వారుసరుకంతా ఫ్రెంచివారికేయిస్తారు. వారితోనెయ్యం పెరిగేందుకు తనకూతురు నటువైపివ్వాలను కొంటున్నాడు. వారుకూడా అమ్మాయిపట్ల అభిమానం

చూపుతున్నారు. అక్కడైతేనే కూతురు సుఖపడుతుంది. ఇక్కడేముంది. ఉన్నప్పుడే అంతంత. ఇప్పుడసలేలేదు. (పాపంశమించుగాక!) ఒకవేళ ఓడలువచ్చినా వాటిని తిరిగి సముద్రంలో వదిలేందుకు వీలైన మరమ్మత్తులు చేసేందుకే ఎంత పెట్టుబడీ చాలదు. కాబట్టి అన్నివిధాల మచిలీపట్నంలో తన భార్యవైపువారితో వియ్యాన్నే మనస్సులో స్థిరపరుచుకొన్నాడు. ఈవేళ దాన్ననుకోకుండా బయటపెట్టినాడు. లోపలే నల్గుతున్న విషయమై ఒక్కసారి బహిరంగ నిర్ణయమైపోగానే ఇంక తీసుకొనవలసిన చర్యలన్నీ మీరయ్య చకచకా తీసుకొన నారంభించినాడు.

నౌకరువెళ్లి పరదేశిని తెచ్చేశాడు.అతడు యజమాని ఆజ్ఞలకు తన వ్యాఖ్యానాలు కూడ చేర్చి వారినెంత నెప్పిపెట్టవచ్చునో అంతాపెట్టి మరీ నిద్రలోఉన్న పరదేశిని మోసుకొనివచ్చినాడు.

నౌఖరుకు మీరయ్యతోబుట్టువుమీదగానీ బాబయ్యగారిమీదగానీ ఎట్టిద్వేషమూలేదు. కానీ భైరయ్యమీదమాత్రం మహచెడ్డకోపం. భైరయ్య ఈనౌఖరు నణుమాత్రమూ లక్ష్యపెట్టడు. పైపెచ్చు పరదేశమ్మతో ఎన్నికొంటెపనులో చేయిస్తాడు. అసలు భైరయ్య తత్వమేఅంత. శుద్ధకొంటె ఈమధ్య అతని కొంటెతత్వం మరీ పెరిగిపోయింది. బొత్తిగా అణుకువలేదు భైరయ్య ఇలా కావడానికి తల్లీ, ఆ ముసలిబాబయ్య వీరే కారణమని కూడా ఆ నౌకరుభావన. "తప్పుచేసిన కొడుకును వాళ్ళు దండిస్తే అతనలా ఎందుకౌతాడు !"

ఇకపోతే భైరయ్య ఆగడాలందరికీ తెలిసినవే అయినా మీరయ్య ఇలా మేనరికం తప్పించడానికి చేసుకొన్న నిర్ణయానికి గ్రామంలో ఎవ్వరూ హర్షించలేకపోయారు. ధర్మబుద్ధిగల పెద్దలుకొందరు మీరయ్యకుచెప్పి చూచారు కానీ , ఆడవాళ్ళుమాత్రం సాహసించి మీరయ్యయింట్లో ఈ ప్రస్తావన చెయ్యలేదు. వారందరూ, భైరయ్య యింటికివచ్చి భైరయ్య అమ్మమ్మానూ, తల్లినీ ఎగద్రోసినారు. ఆ యిద్దరూ,మీరయ్యా ఇంటికివెళ్లి తాము చెప్పవలసినవన్నీ చెప్పి అనవలసినవన్నీ అని వచ్చినారు.

"సిరులే శాశ్వతమా అన్నయ్యా" అని అభ్యర్థించింది.

"చిన్ననాటి ముచ్చట్లన్నీ ఎలా మరిచిపోయావన్నయ్యా ! ఆ అభిమానమంతా ఎక్కడికి పోయిందన్నయ్యా" అని గతాన్ని స్మరణకుతెచ్చింది. చిన్ననాడు ఆటలాడుతూ ప్రమాదవశమున తాను గోదావరిలో కాలునిలువక కొట్టుకొని పోతూంటే మీరయ్య తోబుట్టువును తన ప్రాణానికి తెగించి ఒడ్డుకు చేర్పినాడు. ఆమె ఇప్పుడా సంఘటనను జ్ఞప్తికితెచ్చి " ఈ పాట్లు చూసేందుకేనా అన్నయ్యా ఆవేళనన్ను కాపాడావు? అలా గోదావరితల్లి కడుపున పడిపోయినా పొయ్యేది" అని నిష్ఠురం వేసింది.

మీరయ్యా ఆరక్తమును పంచుకొని పుట్టినవాడు కాబట్టి అంతకంటే నిష్ఠురంపడేట్టుగాను నెమ్మదిగాను ఒక వాక్యమే మాట్లాడి కళ్ళొత్తుకొన్నాడు.

"కాదమ్మా. ఈనాడిన్ని మాటలూ నీవద్దపడేందుకే రక్షించినానమ్మా" అన్నాడు. భైరయ్య తల్లి ఇంక భరించలేక వెళ్ళిపోయింది.

ఇలా మాటలు పడవలసి వస్తున్నకొలది మీరయ్య మనస్సు ఇంకా ఇంకా బండ బారిపోయింది.

అతని కట్టడిని నిరోదించడానికే పరదేశి ప్రయత్నిస్తూందని భైరయ్యతో చనువు మానుకొనలేదనీ తెలిసి బడికి పంపడం మానివేసినాడు. పైగా వివాహ సంప్రదింపులు బహిరంగంగా కొనసాగించ నారంభించినాడు. నివారించలేక అందరూ తమ ప్రయత్నాలు మానుకొన్నారు.

భైరయ్య అమ్మమ్మసరిగా కళ్ళు కనిపించని ముసలిది. కూతురి మీది మక్కువచేతనైతేనేం, కోడండ్రతో పడకనైతేనేం మీరయ్య ఇంట్లో ఉన్నది తక్కువ. అయినా కొడుకును దండించేందుకు వెళ్ళింది. చివరి ప్రయత్నంగా తనవంతు తానూ నెరవేర్చింది.

ఆమె మాటల తీరు మరొకలా నడిచింది. "పరదేశికేం వయస్సు వచ్చిందనిప్పుడీ కార్యనికీ తొందర చూపుతున్నావు. దాని మనస్సు తెలిసి కొనపనిలేదా ?"

మీరయ్యలాంటి వారికైశ్వర్యమైతే కల్గింది. దానితో గ్రామంలో పెత్తనమూ వచ్చింది. కానీ, కుల మెక్కడినుంచి వస్తుంది, కులంలో కూడా గొప్పకావడానికి ! సమాజంలో ఇంకా చాల మార్పులు రావలసి ఉండెనాయె. అయినా అగ్నికుల క్షత్రియులంటూ, పల్లవులంటూ పేర్లు పెట్టుకొని సమాజంలో ఉన్నత స్థానానికి ప్రాకులాడుతున్నారు. అంతేకాక గొప్పకోసం కులీనుల ఆచారాలను గ్రుడ్డిగా అనుకరించడానికి మొదలు పెట్టినారు. అందులో ఈబాల్య వివాహపు తంతు ఒకటి. ఈవిషయాలు పూర్వకాలం మనిషి కామెకేం తెలుస్తాయి? ఆమాటకొస్తే మీరయ్య వర్గీయులంతా తెలిసిచేస్తున్నారా? మీరయ్య తల్లికెదురు చెప్పలేక నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

అప్రయత్నంగా కన్నీళ్లతని చెక్కిళ్ల మీదుగా జారుతున్నాయి. తల్లి ఎన్నో విధాలుగా అతనికి నచ్చజెప్పేందుకు ప్రయత్నించింది,

"తెలియని తనంలో నీవు కట్టిన వాణ్ణి కాదని అది మనువు పోతే అప్పుడేం చేస్తావురా?"

ఇది మీరయ్య భావిసౌధాన్ని పునాదికడ కదిల్చింది. దాన్నతను భరించలేకపోయాడు. తను కృతకంగా కల్పించుకొన్న ఒక కఠోరాదర్శాన్ని తల్లికై సమాధానంగా యావత్తు బలాన్ని కూడదీసుకుని విసరినాడు.

"నాకూతురు పేరంటాలౌతుంది. కానీ, ఎన్నటికి మనువువెళ్లదు."

"పరమేశ్వరా !" అని ముసలిది చెవులుమూసుకొంది.

"ఇంత పాపపుమాట వచ్చిందేమిరా నీనోట ! నీమనస్సెంత రాయై పోయిందిరా !" అని దారి తడుముకొంటూ బయటికి నడిచి వేచియున్న మనిషి ఆసరాతో యింటికి వెళ్లింది.

ఇంతసేపు పరదేశిని నోరునొక్కి పట్టిఉంచి ఈమాటలు వింటూండిన సవతితల్లి. తలుపుగొళ్లెం పెట్టి ఇవతలికివచ్చి భర్తను లోపలికి లేపింది.

"శుభమాఅని పెళ్ళిమాటలు జరుగుతూంటే ఎంత తల్లైతే మాత్రం అంతంత మాటలా ! మారుమనువులు పేరంటాలు తనాలూనా."

అతని మనస్సు విరిచేందుకెన్ని మాటలాడాలో అన్నీ మాటాడి, ఎంతకూ అతను కలకదేరపోగా చివరి ఆయుధంగా చక్కని మద్యాన్నతని పెదవులకందిస్తూ హొయలంతా చిక్కగా రంగరించి కౌగలించుకొంది. ఈ ఆయుధం చక్కగాపనిచేసింది. మీరయ్యకు మతిపోయింది. అంతకు ముందెప్పుడూ అతను పగటిపూట మద్యంసేవించి ఎఱగడు. సేవించినామితి తప్పినవాడూకాడు.



# III

భైరయ్య అమ్మమ్మ ఇంటికివెళ్ళిన తరువాత జరిగిందివిని బాబయ్య చాలనొచ్చుకొన్నాడు. కూతురూ నొచ్చుకుంది. ఇద్దరూ ఆమె అలా తమకు

తెలియకుండా వెళ్ళినందుకు కూకలువేశారు. వాదులాడుకొన్నారు. ఎంత చేసినా చివరకు కడుపుకోత మిగిలేఉంది.

తనతోనే జీవితాంతం కష్టసుఖాలు పంచుకొనవలసిన పరదేశి మరొక రికి సంతానక్షేత్రం కావడంలో ఉన్న బాధ భైరికి పూర్తిగా అవగతంకాకపోయినా, ఏదోతెలియని మూగబాధ అతన్ని కలచివేస్తూంది. తనతో ఎప్పుడు త్రుళ్ళుతూ ఆలపాటలతో తిరుగుతున్న పరదేశి తనకు దూరమైనందుకే అతనిలోఎంతో వెలితి ఏర్పడింది.

దీనికితోడు అతని అల్లరిపట్ల సంఘంచూపే సహనంకూడా బాగతగ్గి పోయింది. మీరయ్య అభిమానం తొలగినందుకు కావచ్చు లేదా భైరికుటుంబ మిక ఆర్థికంగా కొల్కొనలేదని దాదాపు రూఢియైనందుకు కావచ్చు – అతని అల్లరిని బహిరంగంగా ఈసడించుకొనేవా రెక్కువైనారు.

ఏ సమాజంలోనై నా ఆయా జనానికి కొన్ని కొన్ని రీతులుగా ఆదర్శ ప్రవర్తనలేర్పడి ఉంటాయి. దాన్నెవ్వరూ తూ.చ. తప్పకుండా ఆచరించి నడువలేనంతగా అవి సంకుచితమై ఉంటాయి. వాటిననుసరించక పోవచ్చుగానీ ఎవ్వరూ ప్రత్యక్షంగా ధిక్కరించకూడదు. ధిక్కరించివారిని సమాజం సహించదు. భైరయ్య బాల్యచేష్టలన్నీ ఆ వయస్సువారు మాములుగా నడుచుకొన వలసిన రీతికి పూర్తిగా భిన్నమైనవే, కానీ పూర్వము నడవడిక పట్ల అసంతృప్తులైన జనంకూడా, కల్గినవారిబిడ్డకదా ఎలాచేసినా చెల్లుతుందనో. అతనిని కఠినంగా శిక్షిస్తే సంపన్నులైన అతని తల్లిదండ్రులకు కోపం రావచ్చుననో, కొన్నాళ్ళుపోతే అతనే సత్ప్రవర్తనపరుడౌతాడనో సహిస్తున్నారు. మందలిస్తే పెద్దవాళ్ల కనుసన్నల్లో నౌఖర్లలాంటివాళ్లే మందలించేవారు. వారిని భైరయ్య మరింత కుచోద్యం పట్టించి ఏడ్పించేవాడు. కానీఇప్పుడు భైరయ్య మారవలసిన తరుణంలోకూడా మారడంలేదనిసంఘం కోపం వహిస్తూంది. ఇప్పుడతన్నందరూ ఈసడించుకొనేవారే అయినారు. ఇతన్ని హీరోగాభావించి పిల్లలందరూ అనుసరిస్తున్నందున ఇతనివలెనే తమపిల్లలూ చెడిపోతున్నారన్న బాధొకటి దీనికి తోడైంది.

"ఇన్నేండ్లు గడిచినా బుద్ధిరాకపోతే ఇంకెప్పుడు వస్తుందిరా ?"

"ఇలా ఇన్నేండ్లైనా అల్లరిచిల్లరగా నడుచుకొంటూంటే ఏ తండ్రి మాత్రం పిల్లనిస్తాడు !" ఇది ఇప్పుడు పడవలసివస్తున్న మాటలు. దీనితోపాటు అతనికున్న సౌష్టవమైన భారీశరీరమతని చిన్నవయస్సును ఇతరుల దృష్టిలో బాగ పెంచేసింది. ఇందువల్లకూడ అతని నడవడిక నొరవడిపెట్టి చూచేస్థాయి పెద్దదైంది. ఇవన్నిటిమూలంగా అతనీమధ్య ఊళ్లోతిరగటం తగ్గించి ఇతరచోట్ల తన ఉత్సహానికి పాదులు కల్పించుకొన వలసివచ్చింది. ఇప్పుడు రేవులోనే ఎక్కువకాలం గడుపుతున్నాడు. సందర్భాన్ని బట్టి ఓడల్లో ఏ మరమ్మత్తు పనిలోనో చేయిదూరుస్తాడు. లేదా పడమటివాళ్ళు నివసించే కొత్తకోరంగి వెళ్తాడు. కొత్తకోరంగిలో అతని నేస్తాలసంఖ్య పెరుగుతూంది. అక్కడనేస్తాల మూలంగా అతనికెన్నో కొత్త విషయాలు తెలిసేవి. కొత్త దేశాలు ఆయా దేశాల్లోజనం నివసించే విధానాలు మొదలైనవతనికి తెలిసివచ్చేవి. ముఖ్యంగా తమ ఆచారవ్యవహారాల విషయంలో ఎన్నో విబేధాలున్నాయనీ అవి అలాఎందుకున్నాయనీ ఆలోచనలతనిలో కల్గేవి. 'అబ్బె ! వారు స్నానాలేచెయ్యరు ! వాళ్ల దేశంలో చక్కని దూదిపింజల్లా మంచుకురుస్తుందట. వాళ్ల దేశంలో మామిడిపళ్ళే పండవుట ! అవేవోపళ్లు తింటారుగాని యాక్కిరి రుచేలేదు! మామిడికి సమానమా? వారు కూర్చొనే తీరు, బట్టలతీరు అన్నీ విడ్డూరంగా ఉండేది. "వారు కట్టే ముతక బట్టలు రామ రామ వారి ఆడవాళ్ల గౌన్ల కెన్ని తానులగుడ్డ కావాలో! వారి ఉంగరాల జుట్టు ఎంతందమో !" అతను వారి ఆచారాలను భాషను అనుకరిస్తు కొత్త విషయాలనేకం సాటినేస్తులకు చెప్తుంటే గ్రామంలో అతనంటే ఎంతో అబ్బురం కల్గేది.కానీ అంతలోనే "మ్లేచ్ఛులురావాళ్ళు ! వాళ్ళతోఅట్టే కలవకూడదు. వ్యాపారరీత్యా తప్పదు కానీ, మిగిలిన విషయాల్లో కలిస్తే పాపము చుట్టుకొంటుంది" అని వారించేందుకు ప్రయత్నించేవారు. భైరిని వారించలేక పోయినా తమ పిల్లలైనా ఆ చాయలకు వెళ్లకుండా జాగ్రత్తలు తీసుకున్నారు.

పరదేశస్థుల ఓడల్లోనూ భైరయ్య స్వేచ్ఛగా తిరిగేవాడు. వారి ఓడల్లో పద్ధతులను, మన ఓడల్లో పద్ధతులను, వారోడలను నిర్మించే పద్ధతులు మనవారోడలు నిర్మించే పద్ధతులు అతనడిగి వారు చెప్పినంత మట్టుకు తెలుసుకునేవాడు. వారి ఓడల తీరుకేం పరవాలేదు కానీ ఆకలప మాత్రం రామ రామ పట్టుమని గట్టిగా తిరిగితే నాలుగేళ్ళురావు' అనేవాడు. ఓడల్లో పనిచేసే వారందరికీ ఇతనంటే మంచి అభిమానంగా ఉండేది. భైరయ్య నిర్భయత్వానికే అందరూ అతన్నలా అభిమానించేవారు.

పరదేశిని బయటకు రాకుండా చేసినందువల్ల తనకేం నష్టంలేదని చూపేందుకో అన్నట్లుగా కొత్త కోరంగిలో కాపురముంటున్న ఒక విదేశీ కంపెనీ వారిపిల్లతో నేస్తం కట్టినాడు. ఆపిల్లకు సుమారు భైరయ్య ఈడేఉంటుంది. ఆ అమ్మాయిని గురించి రాజబంధువు భృత్యుడొకడు చులకనగా మాట్లాడినందుకు భైరయ్య వాణ్ణి చావగొట్టేశాడు.

ఒకసారితను వెళ్ళినవాడు నాల్గురోజులు ఆ అమ్మాయియింటిలోనే ఉండిపోయినాడు. ఇంట్లో ఇతనెక్కడికి వెళ్ళిందీ తెలియక అందరూ అగ్గగ్గలాడిపోయారు. ముసలిబాబయ్య వెతికివెతికి చివరికితని ఉనికి తెలుసుకొని పిలుచుకొని పోయినాడు.

"మీ అబ్బాయి మా అమ్మాయితో మాదేశం వచ్చేస్తానంటున్నాడు" అన్నాడు వాళ్లనాన్న బాబయ్యతో.

"దానికేం ? మాకొక అల్లరిపిల్లవాడు తగ్గుతాడు."

"మాటలైతే అంటారుగానీ ఇంత సుభిక్షమైన సంపన్న దేశంలో పుట్టిన మీబోటి అదృష్టవంతులు మాబోంట్ల దేశాలకు వస్తారా ?"

"పోనీ మీరే ఇక్కడుండిపొండి. లేదా అమ్మాయిని విడిచిపోయినాసరే"

ఇతనెంతఅఘాయిత్యపు పనులచేసినా బాబయ్యమాత్రం భైరయ్యను దండించేవాడుకాదు.

ఒకనాడు భైరయ్య దూలగొండిచెట్టుతెచ్చి భద్రపరుస్తున్నాడు. బాబయ్యదెందుకన్నాడు. "ఉండుతాతయ్యా మేరీ మొన్ననాతో 'పండ' నీ ఏదో

ఎఱ్రటి కాయొకటి ఇచ్చి తినమంది. నోటబెట్టగానే నోరంతా మంటలెక్కిపోయింది. నేనూ బాకీతీరుస్తాను. మల్లెమొగ్గలతోను దవనం మరువాలతోను దీనిఆకులు కలిపి ఇచ్చేస్తాను. చూసుకోమజా"

బాబయ్య ఆపండు వివరాలు తెలుసుకొని పకాలున నవ్వినాడు. "మిరపకాయా ? నీకింతవరకూ దాని విషయం చెప్పకపోవడం నాదేతప్పు. అదిప్పుడు దేశంలో బాగా వ్యాపిస్తోంది. అలగాజనం మిరియాలకు మారుగా దాన్ని వాడుతున్నారు. ఆమాత్రానికి తప్పుకాదురా. తెలియనివాళ్లలను హింస పాల్జేయడం ? నీకు నోరు కొంచెం కారమైతేనే అంతనొప్పైతే ఒళ్లంతా దురదలువేస్తూ గోకినట్లల్లా రక్తాలుకారుతూ వారికెలా ఉంటుందో ఊహించుకో. పాపం జానెడుపొట్టకోసం ఎన్నికష్టాలనో ఓర్చుకొని ఎంతలేసి దూరాలో వచ్చినవాళ్లనలా హింసపెట్టితే పాపంచుట్టుకోదూ ?" అని నెమ్మదిగా బాబాయ్య వారించజూశాడు గానీ, మనుమడు పట్టువదిలేలాలేడు.

సరే ఇదికాదనుకొని వారినే మనుమని పన్నాగంగురించి హెచ్చరించి నాడు. దీనివల్ల వారైతేబాధపడకుండా తప్పించుకొన్నారు గానీ, ఆ అమ్మాయికి మల్లెపువ్వులు తీసుకెళ్ళి.ఇచ్చినభైరయ్యనందరూ ఆటపట్టించేందుకు వీలు కలుగజేసింది.

పరదేశి ఈ ఘటనను గురించి విన్నది. అసలే అర్ధంకాని కట్టడులతో అవస్థపడుతున్నది. ముక్కు మొగమెరుగని పరాయివానికి సంతాన క్షేత్రము కాబోతున్నందుకు బాధపడే వయస్సు లేదుకాని, భైరి తనకొసమెంత ఉత్సాహంగా, ఎలా ప్రమాదాలను లెక్కచెయ్యకుండా మొగలిచెండ్లే కావచ్చు. సంపంగి పూవులుకావచ్చు. గిట్టనివారింట్లో మల్లెపూవులు కావచ్చు ఏవైనాసరే కోసుకొనివచ్చి ఇచ్చేవాడో జ్ఞాపకంచేసుకొని ఏడ్చింది."భైరింక నాతో ఎప్పుడూజతకట్ట లేదుకదా" అని కుమిలింది.

భైరి చేష్టలింతవరకే అయితే సంఘంపెద్దగా పట్టించుకోక పోవునేమోకానీ, అతను నాటిసంఘంలోని కట్లుబాట్లను. మతాచారాలను గురించిన విమర్శలను పాశ్చాత్యులనోటవిని గ్రామంలో కొత్తసమస్యలను సృష్టించసాగినాడు.

ముఖ్యంగా కొత్త కోరంగిలో క్రైస్తవమత ప్రచారకుడొకడుండేవాడు. అతను భైరిని క్రమంగా చేరదీశాడు. చేరదీసి నెమ్మదిగా అతన్ని తన మతంలో కలుపుకొనేందుకు ప్రయత్నించ సాగినాడు. మొదట అతను తెలుసుకున్నంత మట్టుకు హిందూమతంలోని లోపాలనెత్తి చూపుతూ తన మత మెలాగొప్పదో తెలియజెప్పేవాడు. ఆ విమర్శల్లో తనకు నచ్చని వాటికి భైరి సమాధానం చెప్పేవాడు. లేదా బాబయ్య నడిగి చెప్పేవాడు. నచ్చినవాటి విషయంలో వెళ్లి పంతులు గారితోనూ, పురోహితులతోనూ వాదానికి దిగి ఎద్దేవా చేసేవాడు.

వాళ్లలో అంటరాని తనమేలేదు, ఎవ్వరెవ్వరిని ముట్టుకొన్నా ఆపళంగా కట్టు బట్టలతో స్నానం చేయనవసరంలేదు! అంటరాని వాళ్ళుకోసిన ధాన్యం తినగా రానిమైల, వాళ్ళు కుట్టిన చెప్పులు తొడుగుతున్నప్పుడు రానిమైల, వాళ్ల చెయ్యిపడిన ఓడల్లో, పడవల్లోను ప్రయాణం చేయగా రాని మైల వాళ్ల నంటితే ఎలా వస్తుందో ! రహస్యంగా వారితో అక్రమసంబంధాలున్నవారిని మనము దాచుకొని కలుపుకోవటంలేదా" అనీ నిలదీసి అడిగేవాడు. మరొకసారి "విష్ణువు దేవుడైతే జలంధరుణ్ణి చంపేందుకుతులసిని మానభంగం చేశాడే ఇదెక్కడి న్యాయం ? ఆ విష్ణువే రాముడైపుట్టినప్పుడు సీత పాతివ్రత్యం విషయంలో ఎంతోపట్టుదల చూపినాడే !"

ఇలాగే తద్దినాల పేర జరిగే తంతులను, జంతుబలులనూ, సతీ సహగమనాలనూ, ఇలాంటి ఇతర ఆచారాలను. వాటితో పెనవేసుకున్న మూఢ విశ్వాసాలనూ ఎద్దేవా చేయడంలో ఆ మత ప్రచారకునికి పరోక్షంగా తోడ్పడేవాడు.

"చక్కగా వారి ప్రార్ధనలు వారికితెలినిన భాషలో చేసుకొంటారు. చిన్నపిల్లలకుకూడ తాముచేసే ప్రార్ధనలకర్ధం తెలుసు. ఇక్కడిలాగే వారిదేశంలోనూ,

పూర్వం ఎవ్వరికీ అర్ధంకాని పరాయిభాషలో ప్రార్ధనలుండేవిట కానీ ఇప్పుడాకాలాలు పోయాయిట ! మనకూ తెలుగులో పూజావిధానాలుంటే ?......"

ఇలా భైరయ్య లేవదీసే వాదాలపై ఘాటైనచర్చలు చెలరేగేవి. యువకులతని చుట్టూ గుంపుచేరేవారు. దీన్నిచూసి పెద్దలు సహజంగానే ఆందోళన పడేవారు.

అందరూ బాబయ్యతో మొరబెట్టుకోనేవారు, 'నీవు గట్టిగాచెప్పకనే అతడిలా ఉన్నాడ" ని.

ఆయన నవ్వి "ఏదోకుర్రతనం. వయసువస్తే వాడేసర్దుకొంటాడు" అనేవాడు, అంతే.

చిలిపిచేష్టలపై వచ్చిన పితూరీలనుగురించి ఎక్కువగా పట్టించుకొనక పోయినా మతాన్నిగురించి 'పెద్ద" విషయాలనుగురించి భైరిచేసే ఆగడాలను గురించి ఏంచేయాలో మాత్రమతనికి తోచేదికాదు. అతనికీ అందులో సబబు కొంత కన్పించేది. నాల్గుదేశాలు చూసినవాడుకాబట్టి తమ సంఘంలోని లోటుపాట్లు సరిదిద్దుకొనవలసిన అవసరమతనూ గుర్తించేఉన్నాడు. కానీ పాశ్చాత్య వ్యాపారుల అమానుషత్వం ఎఱిగిఉన్నవాడుకాబట్టి వారికృత్రిమ ఆకర్షణలకు యువకులు లోనుకావడం ప్రమాదకరమని ఆయనకుతెలుసు. దానినుండి భైరిని వారించడమెలాగ ? భైరివంటి యువకుని లేనిపోని కట్టడుల పాల్జేసి నిర్బంధంగా అణిచిపెట్టినా వికటిస్తుందాయె ! మరెలాగ పరిష్కారము ? దైవంమీద భారంవేసి మంచి రోజులకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

"మన ఓడలు తిరిగివచ్చి భైరికూడ ఓడలమీద నాల్గుచోట్ల తిరిగి వస్తే ఎవ్వరూ చెప్పకుండానే అతనికీ తెలిసివస్తుంది. కానీ అవి తిరిగి వస్తాయా ? మా కుటుంబం భవిష్యత్తెలా ఉంది భగవంతుడా !'' అని లోపలే కుమిలిపోయేవాడు.'

విద్యార్థి బృందంలో ఒకడు కథకద్దువచ్చినాడు. "ఔనౌను. యువకుల అసంతృప్తిని రెచ్చగొట్టి స్వార్థానికి వినియోగించుకొనే విదేశీయులెప్పుడూ మనదేశంలో ఉంటూనే ఉన్నారు."

విద్యార్థినాయకుడు చురచుర చూశాడు. క్షణంలో తమాయించుకొని "వాజమ్మా ! అసంతృప్తులైన యువకులు పాత వ్యవస్థను ఏన్గులుకలయ ద్రొక్కినట్లుగా నిర్మూలించే సాహసక్రియలతో తృప్తిపడక. నూతనవ్యవస్థను నిర్మించేందుకు కావలసిన స్తోమతనూ సంపాదించుకోవాలని నాకుతెలుసు కానీ ఉన్నదానితో తృప్తిచెంది, ఏ సాహసానికైనా వెరచి దూరంగా ఉంటూ ఉన్నతోద్యోగాలు ఉన్నత స్థానాలు తప్ప మరిదేన్నీ దృష్టిలోనికి రానివ్వని యువవృద్ధులమాట చెప్పు మొదట !" అన్నాడు.

పడవవాడు కథ కానిచ్చినాడు.

"ఈవిషయమై ఇంట్లోవారు కూడా బాబయ్యతోదెబ్బలాడినప్పుడాయన తన వ్యాకులపాటు నంతటినీ దాచుకొని చిన్ననాటి అనుభవమొక్కటి చెప్పి వారిని మరి మాట్లాడకుండా చేశాడు.

"అక్కా నీవు వచ్చిన కొత్తలో మల్లెతీగ మనపెరట్లోది జ్ఞాపకం ఉందా ?"

"లేకేం. నీవు నాకు పూజకు రోజూ ఉదయమే ఆ పూవులేకదూ కోసి తెచ్చేవాడివి ?"

"ఆ చెట్టు నీవురాకముందు మూడు నాలుగేళ్ల క్రిందట నాటినారు. తీగ బ్రహ్మాండంగా ఇంటి పైకప్పుమీదంతా ప్రాకింది కానీ ఒక్కమొగ్గ తొడగలేదు. వారూవీరూ చెప్పిన దోహదక్రియలన్నీ ఎన్నెన్నోచేశాము. ఉహు: ప్రయోజనం కలగలేదు. చివరికి నాన్న విసిగి "వెధవమొక్క, కొట్టిపారెస్తా" నని బయలుదేరాడు. ఇంట్లోఉన్న ఆడంగులు పచ్చనిచెట్టు కొట్టివేయకూడదని వారిస్తే ఆవేళటికి విరమించాడు. కానీ ఆయన దాన్న న్యాయంగా కొట్టివేస్తారేమోనని నేనుమాత్రం హడలిపోతూండే వాడిని. ఎందుకో ఆ తీగంటే నాకంతభిమానం. రోజూ

పొద్దున్నే అదేపని నాకు, ఏమైనా మొగ్గతొడిగిందేమోనని ఆశగా చూడటం ! అలా చూడగాచూడగా ఒకరోజు నిజంగానే మొగ్గలు తొడిగింది. ఆరోజున పరుగెత్తుకొనివెళ్లి ఇంట్లో ఎంతసంబరంగా అందరికీ చెప్పేశానో ! అందరూ అంత సంబరంగానూ వచ్చిచూసి సంతోషించారు. అప్పుడు మాఅన్నభార్య అల్లరిపిల్లవాడుగా ఊరినంతా గడగడలాడిస్తున్న తనకొడుకును చూపుతూ నిన్ను దెప్పింది "వొదినా ! ఇప్పుడు నీఅల్లుడు ప్రయోజకుడు కాడంటావుగానీ దీనిలాగే ఒకరోజు మొగ్గవేయకపోడు. అప్పుడు నీకూతురికి మావాడికంటేమంచి సంబంధమెక్కడనుంచి తెస్తావో చూస్తాను" అని తరువాత వాడు పెద్దవాడై సంసారమెంత వృద్ధికి తెచ్చాడో తెలీదా ? అలాగే వీడూను. ఊరంతా వాణ్ణి మందలిస్తూనేఉంది. ఇంట్లో మీరూ మందలిస్తూనేఉంటిరి. ఇక నేనూ మందలిస్తే వాడెక్కడికిపోతాడు ? కష్టకాలము! మనము కొంచెమోర్పుచూపించాలంతే "

ఇదివిన్న తరువాత యింట్లో భైరిని సాధించడం మానివేశారు కానీ, గ్రామస్తులుమాత్రం భైరిని మరింత కఠినంగా మందలించసాగినారు. ఇంతే కాదు. కొత్తకోరంగిలో భైరినీరీతి చేరదీసి ఉసిగొల్పుతున్న ఫాదరుమీద కూడా వారు కక్ష సాధించజూస్తూ, అతని నక్కడినుండి వెళ్ల గొట్టాలనికూడా పెద్దలతో మొరబెట్టుకొన నారంభించినారు. అక్కడికీ ఫాదరీ కార్యకలాపాలు తగ్గకపోతే రాజబంధువుకు ఫిర్యాదుచేశారు.

రాజబంధువుకు భైరిమీదా విదేశీవాళ్లమీదా ఈమధ్య గుర్రుగాఉంది. తనసేవకుణ్ణి భైరి చితకబాదాడు. ఇక ఫ్రెంచివారో హైదరాబాదులో నిజాం దివాణంనుండి రాజమండ్రి శ్రీకాకుళం షల్లస్కరు వార్లకొక ఉత్తరం వ్రాయించారు. యానాంలో ఫ్రెంచివారి జోలికి పోవద్దని. అక్కడికి తనేదోవారిని పీడిస్తున్నట్టు. అనవసరంగా వారిమూలంగా తను మాటపడ్డాడు. అంతేకాక ఫ్రెంచివారి పేరుమీదుగా వారి స్నేహితులుకూడా సరుక్కు సుంకాలివ్వకుండా ఎగవేస్తున్నారు. ఇప్పుడు ఫాదరీ నెపమతనికి తనగొప్పనొకసారి ధృవపర్చుకొనేందుకు చక్కని

అవకాశాన్నిచ్చింది.  వాడలరేవు మొదలు కాకినాడదాకా గల విదేశీప్రతినిధుల నందరీనీ ఈఆరోపణగురించి హజరు కావలసిందిగా తాఖీదిచ్చాడు. అందరూ అగ్గగ్గలాడుతూ బరాబరులుచేస్తూ వచ్చినారు. వచ్చినవారొక్కక్కరూ చక్కని అపురూపపు బహుమానాలు తెచ్చారు. ఒకరు పింగాణీ బొమ్మతెచ్చారు.  ఒకరు దంతపుబొమ్మ తెచ్చారు. ఒకరు పాన్‌దాన్ తెచ్చారు. ఒకరు చీనీసిల్కు  తానులోముక్కతెచ్చారు. ఒకరు పులిగోరు తెచ్చారు. అందరూ వీటికి మోహరీల తాంబూలాలూ చేర్చారు. ఆయన ఇంట్లో ఇటువంటి  అపురూప బహుమానాలెన్నోఉన్నాయి. అయినా వాటిని మించినవి సరికొత్తవివ్వాలని  ఎప్పటికప్పుడువిదేశీయుల తాపత్రయం. ఆయన్ను తమ వినయపు మత్తులో ఉంచుకోవాలిమరి !

రాజబంధువు వచ్చినవారిమీద అక్కస్సు  వెళ్లగక్కి  "మీరు మామతం కులంవంటి స్వవిషయాల్లో  జోక్యంకల్గించుకొంటే  ఇక్కడిజనం ఓర్చరు. మీమీద మద్రాసుకూ హైదరాబాదుకూవ్రాసి మీ ఫాక్టరీలు పీకించవలసి ఉంటుంది. జాగ్రత్త !" అని  హెచ్చరించాడు.

తగాదావ్యాపార విషయంలో కాకుండా మతంలోనేకదా అనుకొనివారు 'దానికేంభాగ్యం ఫాదరీని క్షణాలమీద వెళ్లగొట్టేస్తాం. దీనికి  మీరింత శ్రమ తీసుకోవాలా ? కబురుపెట్తేచాల్దా ?' అన్నారూ.

గ్రామపెద్దలకు  కులపెద్దలకు ఆ మాట చెవిలో  అమృతంపోసినట్లైంది. రాజబంధువుకా వ్యవహారమంత సుళువుగా  నిర్మూలం కావడం కంటగింపుగానే ఉంది. నాన్చితే ఉన్నలాభం తెగితే ఏముంటుంది ? అయినా బయటకేమీ అనలేదుగా ! సంతోషం ప్రకటించి –

"ఫాదరీ ఉంటే మాకేంబాధలేదు. అతన్ని మీపూజా పునస్కారాలేవో చూస్కోమనండి. అంతేగానీ మా విషయాల్లో కలుగజేసుకోవద్దనండి. మా పిల్లలకు నాస్తిక దుర్బోధలు వద్దంతే !"

ఊళ్ళో పెద్దలకు మాత్రమీపీడ సమూలంగా వేరుతో  పీకేయాలని ఉంది.

"లేదుదొరా ! అతగాడుంటే ముందుముందింకా బెడిసికొడ్తుంది. కుర్రవాళ్లిప్పుడే మాట వినడంలేదు.

"ఈరోజే ఓడఒకటి బంగాళానికి బయలుదేరుతూంది. దాంట్లోఅతన్ని పంపేస్తాం. కుర్రవాళ్ళు మీమాట తీసేస్తే ఒకటీ మామాటతీసేస్తే ఒకటీనా?" నిష్కర్షగా చెప్పేరు విదేశి ప్రతినిధులు.

ఇక భైరికి శిక్షమాటను సేవకుడు లేవనెత్తాడు. 'కుర్రవాడేకదా! ధిక్దండంచాలు. తండ్రిఉన్నా లేనట్లే ఉందాయె, పాపం !' అన్నారు కొందరు పెద్దలు. మీరయ్యరాలేదు, సాకుచెప్పి బహుమతిపంపి ఊరుకొన్నాడు. భైరయ్య సంకోచంగా బయట నిలబడిఉన్నాడు. తన్నులుతిన్న సేవకుడూ అతనితరఫు పెద్దలూ కొరడాదెబ్బలైనా తగలనివ్వాలన్నారు. అక్కడేఉండి వ్యాజ్యవిషయమంతా విన్న విదేశీయులకు మహాఅభిమానం పుట్టుకొచ్చింది. ఈవిషయంలో భైరిమీద ఈగవాలడానికి వీలులేదన్నారు. 'అతనుమాగౌరవంకోసం నిలబడిన వీరుడు మాదృష్టిలో. కాదంటే మా ఆచారం ప్రకారం అతనితో సేవకుడు ద్వంద్వయుద్ధానికి సవాలు చేయవచ్చు. అంతే'

భైరికి శిక్షపడితే బాగుణ్ణు అనుకొన్నవారుకూడ ఫాక్టరీవారికి కోపం తెప్పించే పనైతే ఎందుకులెమ్మనీ, శిక్షించాలనుకొంటే సవాలక్ష ఆస్కారాలు భైరే కల్పిస్తాడనీ అనుకొని ఆ విషయమంతటితో వదిలేశారు.

ఎవరో బయటనుంచి రేవులోకి కొత్తఓడొచ్చిందని ప్రకటించారు. ఉత్సాహం కట్టలుతెంచుకోగా ఎవరికివారు బయటికి వచ్చేశారు. ఎవరి అంతస్తుకొద్దీవారు పల్లకీలమీద, గుర్రాలమీద, కాలిపరుగులమీద కోరంగి ఒడ్డుకు బయలుదేరినారు.

ఓడరాకడ రేవులో అనేకులకు అనేకవిధాలుగా వరప్రసాది. పనివాళ్లకు చేతినిండాపని, కంజాయింపుదార్లకు తీరుబడిలేని గిరాకీ. సుంకరులకు బహుమానాలూ, సుంకాలూ, రాజబంధువు కపురూప వస్తువులలాభం. వర్తకులు తమ నిల్వలను పదిలించుకోవచ్చు. కొత్తవి కొనవచ్చు. విదేశీయులకు పెట్టుబడికి

నగదుగానీ, వారి దేశకాల వర్తమానాలు కానీ ఇందులోనే రావాలి. దేశీయ వార్తలూ ఇందులో కొంతవరకొస్తాయి. వర్తకుల ఏజెంట్లకు మిత్రులూ యజమానులూ కూడా ఇందులోనే వస్తారు. వెళ్లేవాళ్లూ ఓడలోనే వెళ్ళి వియోగంకల్గిస్తారు.

ఒకజంట విదేశీవారు రాజబంధువు భవనంనుండి బయట పడుతూ మాట్లాడుకొంటున్నారు.

'ఏం ? ఫాదరీని వాళ్ళన్నంతలో తోలేయాలా ?'

'అన్నంతలో అయిపోయిందేం ? కొంచమతను, వాడి తగ్గించుకొంటే వేడి అదే చల్లారిపోతుంది. తరువాత చూసుకోవచ్చు.'

'కుర్రాడెవరు ? ఖైరీ ! గొప్పచెలాకీలా ఉన్నాడే !'

హ: ! హ:! మనకు ప్రమాదకారిగా తయారుకాకపోతే చాల ఉ పయోగపడతాడు.'

'ఏమిటి నాగురించా మాట్లాడుతున్నారు ?' అంటూ వెనకాలేవచ్చాడు ఖైరి.

హుర్రా ? వచ్చేయి ఓడదగ్గిరకు.'

తరువాత వారి సంభాషణ నఖోదాల తండేలుల కేకల్లోనూ బేళ్ళు ఎత్తి దింపే హంగామాలోనూ జనం అటూఇటూ వచ్చిపోయే ఉత్సాహపు కోలాహలం లోనూ కల్సిపోయింది.

సుంకాలులేని కంపెనీల సరుకూ సుంకాలు చెల్లించాల్సిన ప్రైవేటు సరుకునూ కల్గాపుల్గంచేసి సుంకాలెగవేతకు తోడ్పడే సరంగులూ కళాసీలూ చేసే హంగామాకైతే అసలేమితి ఉండదాపరిసరాల్లో.

## IV

"మాథ్యూస్ !' ఓడనుంచి నోరార కేక.

"ఆంద్రూస్ !" ఒడ్డునుంచి దానికాప్యాయత నిండిన ప్రతిధ్వని. క్షారపు నీళ్లలో గెంతుకొంటూ ఎదురుపరుగులతో వెళ్ళి చిరకాల మిత్రులొకర్నొకరు ఆనందబాష్పాలతో అభిషేకించు కొంటూ కౌగిలించుకొంటున్నారు.

"ఆంద్రూస్ !"

"మాథ్యూస్ !"

"ఎలాసాగింది ప్రయాణం ? సుఖంగా సాగిందా?"

"ఎలా ఉన్నావిక్కడ ? బాగున్నావా ?"

"అబ్బ ! ఎన్నాళ్లకు కల్సుకొన్నానయ్యా నిన్ను. నీవిక్కడున్నట్లు మద్రాసులో మాటల సందర్భంగా తెలిసింది. వెంటనే నిన్ను చూడందే వెళ్ళకూడదనుకొన్నాను. కబురుపంపాను. అందలేదా ?

"ఆహా ! అందింది. ఎలిజబెత్‌లో వాళ్ళు ప్రత్యేకం మనిషిని పంపి కబురందించారు. నీగురించే ఎదురుచూస్తున్నా"

పక్కనే నిలబడిన భైరి తెరిపిస్తే సెలవుతీసుకొని వెళ్లిపోయెందుకు కెదురుచూస్తున్నాడు. అతని మిత్రబృందమప్పుడే అతనిచుట్టూ చేరుతూంది. వారికెవరికీ భైరి వ్యాజ్యానికి గురైనట్లే తెలియదు.

"ఎవరితడు? సిపాయి ? తొపాసీ ? ప్యూన్ ? దుబాసీ ?" ఆంద్రూస్ అడిగాడు.

"నో నో నో ! ఇక్కడ ఒక జెంటూ ఓడ యజమానికొడుకు. మనలో బాగాకల్సిపోయేరకం !" అంటూ భైరితో "నామిత్రుడు, ఆంద్రూస్ గొప్ప పాటకాడు. నాటకాల్తో ప్రభుత్వాన్నే గడగడ లాడించినవాడు. ప్రభుత్వం దెబ్బతీసినా తలవంచని కళాకారుడు."

భైరీ ఆంద్రూస్ పరస్పరం ఆలింగనం చేసుకొన్నారు,

భైరి సెలవు తీసుకొంటానన్నాడు "సరెగానీ తొందరగా వచ్చేయి ఇతనుంటాడని వచ్చేందుకు మొగమోడవద్దు. నామిత్రుడున్నన్నాళూ నీవూ. నీబృందమూ అంతా మాఇంట్లోనేఉండాలి. నామిత్రుడు మీబోటి యువకులంటే చాలా అభిమానిస్తాడు. అతనికి చక్కని కాలక్షేపమివ్వాలి. బిక్కు బిక్కు మంటూ దిగాలుగా కాలంగడపడతను. ఈవేళ దూడమాంసం. కనక మీఇంట్లో భోంచేసి

వచ్చేయండి. రాత్రికిమాత్రం మీకందరికీ మాఇంట్లో మామూలువిందు. ఇంట్లోచెప్పేవచ్చేయి పొద్దుపోయివస్తానని"

"నాకుపరవాలేదు. నాబ్రాహ్మణ మిత్రునికి శక్తి పూజోమరీ ?"

"దానికేం ? మోతాదు మించనంతవరకు లక్షణంగా కావచ్చు"

భైరీ మిత్రులు దూసుకొంటూ కొత్తఓడలోకి వెళ్ళిపోయారు.

"ఏమిటి దేశంలో విశేషాలు?" ఉత్సాహంగా అడిగాడు మాథ్యూస్. "ఓ ! బోల్డు ! యంగ్‌ప్రింటెండర్ తతంగం విన్నావుకదా ! దేశమంతా అదేగోల. పత్రికలూ, పుస్తకాలూ, ఉపన్యాసాలూ, నాటకాలూ, చర్చిలో ప్రార్ధనలూ, లండన్నంతా ఒక సంవత్సరంపాటు దానిమీద ఊదరగొట్టేశారు."

"ఔనౌను ! ఏదో చూచాయగా వినడమేగాని, ఇంత తీవ్రమని తెలియదే ? ఏమైంది ? ఎలాజరిగింది ?"

"స్కాట్‌లాండ్ పర్వతకులూ, పోప్ మరియు ఫ్రాన్స్ వీళ్లసానుభూతి సహయాలతో జార్జిప్రభువు అసలైన రాజుకాడనీ, తానే అసలైన రాజనీ బయలుదేరాడొకడు. దొంగ. ఎడిన్‌బరో మొదలైనచోట్ల స్వాగతం లభించింది. అక్కడినుండి లండన్‌దాకా వచ్చేశాడు. కానీ అక్కడనుంచి అదృష్టం తిరగబెట్టింది. ప్రజలు ఎక్కువగా బలపర్చలేదనో, సైన్యాదిపతులు ద్రోహంచేశారనో లేక లండన్‌ప్రజల శక్తిసామర్ధ్యాలకు జడిశాడో ఏమైతేనేం జోరుగా సాగుతున్న జైత్రయాత్రల్లా డెర్బీనుంచి తిరోగమన యాత్రగా మారిపోయింది. ఏప్రిల్ నలభై యారుకల్లా చిత్తుక్రిందోడగొట్టేశారు. ఆతరువాత, నాసామిరంగా ! ప్రింటెండర్ సైన్యాల్ని వెతికి, వెతికి ఏరిపారేశారు, చూడూ, అంత కలి చరిత్రలోనే లేదనుకొా ! జాలేస్తుంది కానీ తప్పుతుందా ? కురుపు చిదిపినట్లు చీము కొద్దిగా ఓడిస్తామన్నాడు మాటకు పార్లమెంటులో, కానీ, నిజానికి చాల కసాయితనము వహించాడనుకో, సైన్యాధ్యక్షుడు కంబర్‌లాండ్, కసాయిబిల్లీ అంటారిప్పుడతన్ని."

"అబ్బా !"

"కొంపలో తిరుగుబాటుదార్లను గొళ్ళెంపెట్టేసి తగులబెట్టడాలా,

యుద్ధభూముల్లో గాయపడిన నిస్సహాయులను కుళ్లబొడిచి చంపడాలా. ఇళ్లలో దాక్కొన్నవారిని బయటికీడ్చి నెత్తిమీద చావ మోది చంపడాలా. ప్రాణంకోసం దాక్కొన్న గడ్డివాములు కగ్గిపెట్టడాలా, పశువులను తోలుకొని పోవడాలా, గ్రామాలకు గ్రామాలనే చెదరగొట్టడాలా. అబ్బ. చెప్పనలవికాదు ! దేశమే స్మశానమైందనుకో ! ఏంచేస్తాం ? జాతికోసం ! 'గాడ్ సేవ్ ది కింగ్' అంటూ జాతిజాతి, ఒకగొంతై దేవుడికి మొరపెట్టింది !"

"అయితే రాజు గొప్పవిజయం సాధించాడన్న మాట !"

"ఏమో? అది ఎవరికి విజయమో! ఏంచెప్పను? రాజువద్ద ఈ విషయ ప్రసక్తి తెచ్చినప్పుడల్లా సిడిముడిపడి వినిపించుకో నిరాకరించాడనీ అవసరమైతే రాజభవనంనుండి క్షేమంగా తప్పించుకోవడానికి పడవలుండీగా పెట్టుకొన్నాడనీ ఒక పుకారుంది మరి ! రాజులను నమ్మిందెవరు ? అయినా వారి సామర్థ్యమెంత మహ ఈ కాలానిక భానికైనా శుభానికైనా ?"

"బహులక్షణంగా ఉంది ! పోనీలే ! ఇంకేమిటి ?"

"మద్రాసులో పునర్నిర్మాణం జోరుగా సాగుతూంది. పశ్చిమ తీరంలో ఆంగ్రియాపీడ శాశ్వతంగా త్వరలో వదిలిపోయేలా ఉంది. వారిలో ముసలం బయలుదేరింది! వారి శత్రువుల అండదండలూ మనకందుబాటులోకొస్తున్నాయి". చెవికి దగ్గిరగా లోగొంతుకలో "ఆవిషయం బయటికనబోక!"

"ఆమాత్రం తెలియదేమిటి."

ఆంధ్రూస్‌చెప్తూన్న వార్తలు మాథ్యూస్ దాహంపుచ్చుకొంటున్నాడు

ఇలా హుషారుగా మాట్లాడుకొంటూ వారిల్లు చేరుకొనే సమయానికి మాథ్యూస్ శ్రీమతి గబగబ టేబుల్ సర్దేస్తూంది.కూతురు విసవిస తిరుగుతూ తల్లి కందింపులిస్తూంది. నల్లటి చేవకర్ర టేబుల్.చుట్టూ అదేచేవకర్ర కుర్చీలు. నల్లటి టేబిల్‌మీద తెల్లటిపంచ. దానిమీద తళతళమంటూ మెరుస్తున్న

వెండీపళ్ళేలూ, ఆబ్కారాలు.పొడుగు గళాసులూ, కూజాలు, సువాసనగొలిపే అత్తరు ఘుమఘుమలతో వంటకాల సువాసనలు పోటీపడుతున్నాయి.

మాథ్యూస్ పరిచయం చేయగా ఆండ్రూస్ తల్లీకూతుళ్ళిద్దరికీగౌరవం నెరపి మిగిలిన వాళ్లందరినీ తగురీతి పల్కరించాడు.

"ఏటికీరోజు పోటుచాల తొందరగా వచ్చినట్లుంది. ఓడ మాములవేళకంటే చాల తొందరగా రేవుకొచ్చేసింది. మేమింకా అంతా రెడీచేసిముస్తాబై బయలుదేరుదా మనుకొనే లోపలే మీరు వచ్చేశారు! లేవండి ! సేదదీర్చుకొండి ! క్షణాల్లో అన్నీ సిద్ధంచేస్తాను" అంది నొచ్చుకొంటూ. భర్తవైపుతిరిగి 'ముందాయన భోజనమూ విశ్రాంతీ చూడండి ! మాటలు తరువాత ! "

ఆండ్రూస్‌తో "స్నానంచేస్తారా ? "

"మీకూ ఇక్కడి స్నానంపిచ్చింకా పట్టుకొందాలేదా ?"

స్నానం చేసేప్పుడూ, బట్టలు మార్చుకొనేప్పుడూ, భోజనంచేసే ప్పుడూ మిత్రులిద్దరూ ఏదో మాట్లాడుతూనే ఉన్నారు.

ఆండ్రూస్‌కు సంగీత విద్వాంసుడుగా లండన్‌లో ఒకమాదిరి పేరుం డేది. గేయనాటకాల్లో వేషాలు వేశేవాడు. నాటకాలు ప్రమాదకరమైన ప్రతి పక్ష అభిప్రాయాల్నెక్కువగా, అందునా వ్యక్తిదూషణలను, లండన్‌జనుల్లో జయప్రదంగా వ్యాపింప జేస్తున్నాయని ప్రధానికి కన్నెర్రై వాటిని చట్టం ద్వార అణిచేశాడు. ప్రభుత్వంతో కుమ్మక్కైన కంపెనీల్లో ఎక్కవజీతాలిస్తామని ఎరజూపారూ కానీ, స్వేచ్ఛ చచ్చి చట్టానికి వెరిచి కుదించుకోవలసి వస్తే ఇక నాకళకు ప్రాణమెక్కడిదంటూ, ఆవృత్తి వదిలేసి, ఇతర వృత్తులేవో చూసుకుంటూ, ఎందునా జరుగుబాటు సరిపోక తుదకు కంపెనీ కొలువులో చేరాడు. బంగాళం పోతున్నాడు. ఇందునా అసంతృప్తుడే, ఎక్కడా స్థిరపడలేక పోతున్నాడు.

అతనికున్న ప్రతిభకు బొంబాయిలోనో మద్రాసులోనో స్థిరపడి ప్రైవేటువర్తకం లౌక్యంగా చేసుకునిఉంటే ఈపాటికి మంచిగా సంపాదించి ఉండు నంటారు ఎరిగున్నవాళ్ళు. శేషజీవితమంతా కాల్మీద కాలేసుకొని లండన్‌లో హాయిగా గడపగల్గినంత, అంటారు.

వాళ్లమాటలకతను నవ్వుతాడు. మిత్రులింకా రెట్టిస్తే "ఇక్కడ సంపాదన పరులక్కడికంటూ తిరిగివస్తే వచ్చాక పడేపాట్లు మీరేంచూశారులే ! కంపెనీవాళ్ళు, ప్రభుత్వం, కోర్టులుపెట్టేతిప్పలు పగవాడికీ వద్దం"టాడు'

అతడెప్పుడూ బహుసందడి మనిషి ఉల్లాసపురుషుడు. నిర్మొగమాటి.

అతన్ని చూడడానికి వచ్చిన గ్రామవర్తకశ్రేష్ఠులతనికి చక్కని శెల్లాలను ఉడుపులను ఉడుగర లిచ్చారు. అతనికి ప్రత్యేకంగా ఉడుపులను కుట్టించి తెచ్చారుకూడా. సంతోషంగా పుచ్చుకొన్నాడుకానీ తొడుక్కో మంటే నిరాకరించాడు.

"ఇవి వ్యాపారానికేగానీ, మేం తొడుక్కోవడానిక్కాదు. ఇండీస్ గుడ్డలనాణ్యతమెచ్చి వేలంవెర్రిపడేవాళ్ళు మాదేశంలో ఇంకా కొల్లలున్నారు. ఎన్ని చట్టాలుచేసినా శిక్షలు విధించినా వాళ్ళసంఖ్య ధనికుల్లో ఇంకా పెరుగుతూనేఉ ంది. అలాగే కొందరికి చైనా పింగాణి వస్తువులమీద వెర్రి. వారి రాజకుమార్తెలుంటారు చూడండి ! సింగారానికద్దం ఎదుట నిల్చుకొంటారు. ప్రపంచంలో నలుమూలలు వస్తువులూ ముందుంచుకొంటారు. మ్యాచింగ్ కుదరక ఛస్తూంటారు. "ఈ ఇండీస్ పెట్టెలో ఏ ఉడుపుకట్టను? ఏనగపెట్టను? ఈ ఆఫ్రికా పెట్టెలో ఏ దువ్వెనతో దువ్వను ? ఏనుగుదంతందువ్వెనా? తాబేటిచిప్ప దువ్వెనా? ఏ అరేబియా అత్తరు రాయను? రోజా? మల్లె? పునుగు?" అని. కానీ నేను అచ్చం నూటికి నూరుపాళ్లింగ్లీషువాణ్ణి. మాబట్టలంటే మాకుగర్వం. ముతకవైనాసరే. అవితప్ప వేరేతొడగను. మీరిచ్చిన గుడ్డలు అమ్మితే వచ్చేడబ్బుతో నా దేశముడుపులు నాల్గుకొనితొడుగుతాను. మా నూలూ మానేతా మా చలువా మీ నాణ్యతను సంతరించుకొనెదాక మా ముతకవే మా కందం, తృప్తీ, ప్రకృతిమాత

వితరణ లేకుండా వరాలిచ్చి సంపదలు వృథాచేసింది. ఆల్ప్సుమీద దేవత లెంత గొప్పవాళ్లైనా కావచ్చు. నాచిన్ని కొండలమీద దేవతలిచ్చిన గొర్లమందలు చిట్టి అడవులు పంటలూ మాకుచాలు. సంపన్నమైన మాపరిశ్రమ మైదానా లాక్రమించి చిరునవ్వు లొలికిస్తూంటుంది. అదే మాకుగర్వం" అన్నాడు.

దీనికి నొచ్చుకొన్నవారున్నారు. సెబాసన్నవారూ ఉన్నారు. "ఆ అభిమానమేదో లోపలేదాచుకొని ఒకసారి మనఎదుట ధరిస్తే ఏం పోయింది?తరువా తమ్ముకొంటేనేం? తగలేసుకొంటేనేం? ఎవరికి కావాలి?"అన్నారు కొందరు. "ఎందుకింత ఆవేశం?" అన్నవారున్నారు.

"మీ ఓడల పనితనమద్భుతం, కానీ ప్రాణలకు తెగించైనా మా ఓడలే వాడుతాంమేం" అని అన్నాడింకో సందర్భంలో. ఆమాట మాత్రం కోరంగిలో అందరికి నచ్చింది. "మావారికా తెల్వితేట లెప్పటికి వస్తాయో మరి !" అనీ అనుకొన్నారు.

ఈ ప్రసక్తి వచ్చినప్పుడు రాజబంధు వన్నాడుకదా 'మాకు కాలం ముఖ్యం. అనుకొన్నవన్నీ తక్షణం జరగాలి. ఎన్నాళ్లీపదవుంటుందో ? ఎప్పూడూడుతుందో ? నవాబుకెప్పుడు కోపంవస్తుందో, లేదా, ఎప్పుదు మృత్యువు వాతపడ్తామో ? ఎవరు చెప్పగలరు ? ఉన్నంతలోనే అనుభవించాలి. ఎవరిదైతేనేం ? ఎక్కడిదైతేనేం ? ఎలావస్తేనేం? సరుకు కావాలి. తొందరగా. అనుభవించేసెయ్యాలి,"

మరొకసారి రేవులో మాలింలతో "మీ ఓడలు చక్కనివే. రష్యా చక్రవర్తిపీటర్‌కు తెలిస్తే లండనుకు కాకుండా కోరంగివచ్చి నౌకలనిర్మాణం గురించి తెల్సుకొని ఉండును. కానీ మీ జ్యోతిశ్శాస్త్రం, భూగోళజ్ఞానం చాల వృద్ధిపొందా"లన్నాడూ. సూర్యుడు గ్రహంకాదనీ, సూర్యుడిచుట్టూగ్రహాలు తిరుగుతాయనీ, భూమీ ఒకగ్రహమేనని, అవి తిరిగే మార్గాలు. వేగాలు ఒక

శాస్త్రవేత్త కనుగొన్నాడనీ చెప్పినప్పుడు మాలింలు నోరు వెళ్లబెట్టారు. "ఇంకా మీరు సప్తసముద్రాలూ నవద్వీపాలూ నవగ్రహాలూ అంటున్నారు. ఇతరులు భూమి పటాన్ని ఎంతో మెరుగుపర్చారు. భూమి స్వరూపాన్ని ఎంతో ఎక్కువగా తెల్సుకొన్నారు. కొత్త భూఖండాలు తెల్సుకొనిఅక్కడ కొత్తరాజ్యాలు స్థాపిస్తున్నారు. కంపాసే వాడటంలేదు మీరు. మే మిరవై ఏళ్లుగా వాడుతున్నాం !"

"చూశాంకానీ కంపాసు మాకవసరంలేదు. చూపుతోటీ, అనుభవంతోటీ చెప్తాం దిక్కులు" అన్నారు.

"జౌనౌను తెలిసిన చోట్లకేగానీ పోరుగా ?"

"టెలిస్కోప్‌లు కొని వాడుతున్నాంగా!" అన్నాడొకడభిమానంగా. తయారీ కనుగొనగల్గిన వారిమాటో ? గ్రహాలు తిరగే దారీ కనుగొన్నాడు. గ్రహాలామార్గాల్లోనే ఆవేగంతోనే ఎందుకు తిరుగుతున్నామోకూడ కనుగొన్నాడు ! శాస్త్రజ్ఞుడు."

"అవన్నీ దైవకృపవల్ల అని మా వాళ్ళెప్పుడో తేల్చేశారు" ఆంద్రూస్ పకపకా నవ్వేడు. ఇలాంటి చర్చలవేడి కొంచమమితమైనచోట ఆంద్రూస్‌ను వారించి బలవంతంగా నోరూనొక్కేవాడు మాథ్యూస్

భైరికీ అతని మిత్రులకూ ఆంద్రూసొక గొప్ప హీరో ! కాదు! అవతార పురుషుడు ! ముఖ్యంగా పూజారిగారబ్బాయ్, రంగన్నా ఆంద్ర్యూసుకు భక్తులే అయినారు. ఒకసారి వారు ఆంద్రూసును కాలక్షేపానికై కాకినాడనుండి ఇంజరం వరకు తిప్పినారు. ఒకసారి పిఠాపురం రాజదర్శనానికివెళ్లినప్పుడు వెంటవెళ్ళారు. ఊళ్ళోఉంటే మాథ్యూస్ ఆంద్రూస్ కలిపి మాట్టాడుకొనే విషయాల నాసక్తితో వినేవారు. ఈ సావాసాలను కోరంగి అనుమానంతో భయంగా చూసేదని వారెరుగరు.

ఆంద్రూస్ వారికి లండన్ పెరుగుదలను గురించి వర్ణించేవాడొకసారి. ఎన్నో భవనాలులేస్తున్నాయి. థేంస్ మీద ఒకవంతెన చాలదన్నట్లు రెండవ వంతెన కేర్పాట్లౌతున్నాయి. వంతెన సంగతే తెలియని మనవారికిదెంతో విడ్డూరం.

వార్తాపత్రికలుచూపి అందులో విషయాలేమిటో చెప్పేవాడు. థేంస్‌నదిలో ఓడకూలీలకు పడవల కూలీలకు చేపలు పట్టేవారికీమధ్యవచ్చిన తగాదాలుగురించి చెప్పేవాడు. లాటరీలగురించి లాటరీలో మోసాలగురించిచెప్పేవాడు. క్షణంలో లక్షాధికారులుకావలన్న కాంక్షను దుర్వినియోగపరచుకొని, బీదల్ని లాటరీ యజమానులూ లాటరీచీటీలనమ్మేవారూ ఎలామోసం చేస్తారో చెప్పేవాడు. లండన్‌లో అమాయకులను కొత్తవారిని గ్యాంగులుగా ఏర్పడి కొందరు పేకాటల్లోనూ, దబాయించి చెత్తవస్తువుల్నంటగట్టడంలోనూ, ఎలాకట్టుకట్టి దోచేస్తారో చెప్పేవాడు. లండన్ లంజల్ని గురించి చెప్పేవాడు.లండన్ దొమ్మీలగురించి చెప్పేవాడు.

"ఒకసారేమైందనుకొన్నారు? లండన్‌లో సుఖరోగాలు మితిమీరి వ్యాపిస్తున్నాయని గగ్గోలు బయలుదేరగా లంజల ఇళ్లమీది పోలీసులు రెయిడ్ చేశారు. ఈ సందర్భంలో ఒక ఆడంగుల కొజ్జాను పట్టుకొన్నారు క్షణాలమీద వందలాదిజనంపోగై వాణ్ణిభుజాలమీద అలా అలా మోసేసి విడిపించేశారు. వాడిమీద అందరికీ ఎంతమక్కువో. వాడెంతమందికెన్నివిధాల ఉపయోగపడేవాడో?"

భైరి బృందానికాంద్రూస్ బలవంతంగా పొగాకురుచీ కాఫీరుచీ చూపించాడు.

"అబ్బా ! ఎలాతాగుతారో! ఏంరుచనో?" అన్నారు మనవారు.

లండన్‌లో నాటికాఫీక్లబ్బుల ఘూలు చర్చలగురించి విన్నారు.

ఒక్కసారి నేరస్థులను దుంగల మధ్యకన్నాల్లో చేతులూ, కాళ్ళు బంధించి బహిరంగ ప్రదేశాల్లో కూర్చోబెడితే జనం చేసేగోల గురించి వర్ణించేవాడు. నిర్బంధంలో కూర్చున్న వాడి పాట్లూ కుడుపుబ్బ వర్ణించేవాడు.

"మిగిలిన ప్రపంచ మంతటా ఉన్న జ్ఞానాన్ని పోగుచేసినా లండన్‌లోనూ ఆ చుట్టుప్రక్కల పదిమైళ్ల పరిధిలోను ఉన్న జ్ఞానరాశి కీడురాదు, నాకు తెలియవుగానీ అక్కడ అకాడమీలున్నాయి. ఎంతగా జ్ఞానాభివృద్ధి కవి దోహదం చేస్తాయో చెప్పనలవికాదు. సైన్సు గురించి సామాన్యుని కుచితంగా

తెలియ జెప్పడానికి ప్రతి వారమూ కొన్ని చోట్ల ఉపన్యాసాలిప్పిస్తున్నారు. నేనూ అప్పుడప్పుడూ పోయి వింటుంటాను, తెలిసినా తెలియక పోయినా,"

"మన ప్రాంతం ప్రభువెలా ఉన్నాడు"?

"అతనికేం నిక్షేపంగా ఉన్నాడు, వాళ్లమ్మాయి నీ మధ్యనే లండన్‌లో వ్యాపారి అబ్బాయి కిచ్చి పెళ్లిచేశాడు, భూములన్నిటినుంచీ రైతులందర్నీ వెళ్లగొట్టించి మొత్తానికి గొర్ల పెంపకం చేబట్టినాడు. ఉన్ని వ్యాపారం రంజుగా సాగిస్తున్నాడు.

"నక్కలవేటో"

"అబ్బో? అవన్నీ ఏనాడో పోయాయి"

"అమ్మాయికి పట్నవాసపు వ్యాపారి అల్లుడేం ఖర్మ? ప్రభువు. కొడుకెవడూ దొరక లేదా?"

"డబ్బోయి! డబ్బు! కల్తీలేని కులీనరక్తం సంకరంకాని రక్తం మానవజాతి మొత్తంమీద ఎవరిలో ఉందో కొంచెం చెప్పు.సామ్యం చెప్పినట్లు టర్కిష్ గుఱ్రంబీజశుద్ధి నంతకంటే ఎక్కువ ఖచ్చితంగా నిరూపించ వచ్చునేమో, గుఱ్రమంటే జ్ఞాపకం వచ్చింది. ఆమధ్య బొంబాయిలో చూశాను, ఏం గుఱ్రమో! రాజా గుఱ్రం. ఎక్కడా చూడలేదు, ఎక్కాలంటే నిచ్చెన వేసుకొని ఎక్కాలి. ఇంక దౌడు మొదలుపెట్టిందా రౌతు కాళ్ళు నేలకు తగుల్తాయనుకొ !"

"మంచిగుఱ్రా లిక్కడికి రావు."

ఒక్కోసారి ఆండ్రూస్ పద్యాలు చదివి పాడి విన్పించే వాడూ. పెద్ద కథలు విన్పించే వాడు. గలివర్ యాత్రలను గురించి చెప్పి కడుపుబ్బ నివ్వించే వాడు.

ఓ రోజు రాబిన్ సన్ క్రూసో కథచెప్పి అబ్బుర పరిచాడు. జోనాథన్ వైల్డుకథ వారినాకట్టుకొంది. ప్రపంచంలో ఇంతకలీ ఉంటుందా అన్నారు. మద్రాసు పుదుచ్చేర్చీల ముట్టడులను గురించి వాటివల్ల కల్గిన కల్లోలాన్ని గురించి చెప్పేవాడు.

ఒకరోజున ఆహ్వానితుల సమక్షంలో మాధ్యూస్ ఆండ్రూస్‌తో నాటక భాగా లాడించాడు. "మా నాటకాలు మీకు పరిచయం చెయ్యడం నామిత్రుణ్ణి గౌరవించడమూ నా ఉద్దేశ్యము. నాటకాలు వైద్యం మొదలైనవి మీలో కొందరు నిరసిస్తారనీ, అవి నీచ వృత్తులక్రిందఎంచుతారని తెలుసు కానీ అందు కాస్కారం లేదని మనవి చేస్తున్నామన్నాడు మాధ్యూస్,ముందుపోద్ఘాతంగా. ప్రదర్శన బహురక్తి కట్టింది.

ఫేటల్ క్యూరియాసిటీలోని భాగాలు ప్రేక్షకుల్లో కన్నీళ్ళు రప్పిం చాయి.

విల్మాంటూ, ఆగ్నీస్ ముసలిదంపతులు. వారి కొడుకు ఇండియాకెళ్ళి చాల ఏళ్లైంది. దాదాపు చనిపోయుంటాడనే ఆ వృద్ధదంపతులు మనసు రాయిచేసుకొన్నారు. అనుకోకుండా ఆ కొడుకు తిరిగొచ్చాడు. భార్యకు కన్పించాడు. తరువాత తల్లిదండ్రుల ఇంటికి వెళ్ళాడు. సమాగమపుటానందాన్ని మెరుగు పరచే ఉద్దేశంతోను, ఏంజరుగుతుందో చూడాలనీ, తల్లిదండ్రులను ఆశ్చర్యంలో ముంచెత్తాలనీ, ఇలా తమాషాకోసం తానెవరో చెప్పడు. వారూ గుర్తించరు. మామూలు బాటసారిగా వెళ్లాడు. తల్లిచేతిలో నగలపెట్టె పెట్టి దాచమంటాడు. ముసలామె అతను నిద్రపోయినప్పుడాపెట్టెను రహస్యంగా తెరిచిచూసి ఆసొమ్ము కాజేస్తే తమ దరిద్రం తీరుతుందని భావిస్తుంది. మొగుణ్ణి ఎగదోసి కుర్రవాణ్ణి చంపిస్తుంది. తరువాత కొడుకు మిత్రులు వస్తారు. భయంకరసత్యం బయటపడుతుంది. ముసలి విల్మాంట్ భార్యను చంపి ఆత్మహత్య చేసుకొంటాడు.

నాటకం ఇంగ్లీషు మధ్యతరగతి బీద వాతావరణాన్ని చక్కగా చూపించింది. ఒకొక్కప్పుడు, ఒక అదృశ్యశక్తి మనుష్యులనెలా ఒక విషాద పరిపాకాని కీడుస్తుందో చూపించి. మనిషిలో థ్రిల్ సెంటిమెంట్‌ను చూపింది.

సామాన్య విషయాలిలా అందరితో మాట్లాడేసినా, ఆండ్రూస్ కొన్ని విషయాలు గుంభనగా మాధ్యూస్‌తోనే మాట్లాడేవాడు. కొన్ని విషయాలు మాధ్యూస్‌వద్ద కూడా దాచాడు. వ్యాపారవిషయాలు ధరవరలు, ఫ్రెంచివారితో

జరిగిన కల్లోలాలు, జరుగనున్నవి, వారిద్దరే మాట్లాడుకొనేవారు. ఆర్కాటు నవాబుతో జరుగుతున్న వ్యవహారాలు, హైదరాబాదు విశేషాలు కూడా ఏ కాంతంలోనే మాట్లాడుకొనేవారు.

ముందుముందు వర్తకం ద్వారకాకుండా సైనిక శక్తిగా రాజ్యాల మీద పెత్తనం చేసేరోజులు దాపులో ఉన్నట్లు ఆంద్రూస్ గ్రహించాడు. అది మాథ్యూస్‌కు అర్థంకాలేదు. అందు కింకా అతని మనసు ఎదగలేదనీ పరిస్థితులే అతిన్ని మారుస్తాయనీ అనుకొన్నాడు. "నా ఊహ మాత్రం రైటని ఎట్లా నిర్ధారం ? ఈ విషయ మతనితో ప్రస్తావించి కల్లోలపరచడమనవసరం."

మాథ్యూస్ శ్రీమతికి ఆంద్రూస్‌లో తనకూతురుకు చక్కనివరుడే కన్పించాడు. తన కూతురు నతనికి కట్టబెట్టే ఆలోచనచేసి ఆమె భర్త నెగదోసింది.

"అయ్యో ! వయసు చాల తేడారాదా ?"

"ఏం పరవాలేదు."

"ఇప్పుడు మాదేశం వాళ్లకిస్తే ఎల్లాగ ? ఈ దేశం పిల్లల్ని మాదేశం రానివ్వడం లేదుట."

"దేవుడేదిక్కు. అప్పటి కెల్లాగోచేసి తోస్తాం"

"ఇక్కడే రంగన్నకో భైరికో ఇవ్వకూడదా ? భైరిమేనరికం చెడింది కూడాను"

"ఇద్దరూ సుఖపడరు"

'ఏం?"

"కులం కట్టుబాట్లు వారిని సంఘంలో ఇమడనివ్వవు. కలకాలం తరతరాలు వెలిగా ఉండవలసిందే."

"అక్కడా జన్మనుబట్టి స్థానం ఏదోరూపంలో ఉండనేఉంది. అది సంపాదనబట్టి మెరుగు పడడమో హీనమవడమో జరుగుతూంటుంది.

ఇక్కడా మంచిరోజులు రావా ? పోనీ ఇక్కడే మా ఫాక్టరీవాళ్లలోనే ఎవరినో ఒకరినిచూస్తే ."

"చూస్తూ చూస్తూ తెలిసినచోట అమ్మాయిగొంతు కోస్తామా ?"

"కానీ చూద్దాం"

ఇలా ఆమె భర్తనొప్పించింది. తరువాత మాథ్యూస్ ఇంజరం ఫాక్టరీ అధికారిద్వార ఈ విషయం ఆంద్రూస్‌తో కదిపించాడు.

"మాథ్యూస్ నాకు పరమిత్రుడైపోయె, అతనికి ద్రోహంచేయలేను. ఇంగ్లాండులో ఇలాంటి ఆడపిల్లలతో జంట కల్పుకొని డబ్బుసంపాదపన చేసే వారు ఆస్తులు గడించేవారు 'నవనాగరిక' భర్తలిప్పుడు చాలమందే బయలుదేరినారు. నేనలాంటివాణ్ణికాను. నా మనస్సు సుసాన్ కేనాడో అంకితమై పోయింది. నా సుసాన్ నాకోసం ఇంగ్లాడులో ఎదురుతెన్నులు చూస్తూంటుంది."

"చోద్యం"

"మీరేమనుకొన్నాసరె నిజం ! ఎక్కడికెళ్ళినా ఆమే నాకు జ్ఞాపకం వస్తూంటుంది. ఆమెస్మృతి నాకురక్ష. నాకుప్రోద్బలం. ఇండీస్ వజ్రాల తళు కుల్లో నాకామె అమాయకపుకళ్ళ తళతళలే కన్పిస్తాయి ! ఏనుగు దంతాలో ఆమె వన్నెచిన్నెలే చూస్తాను ! ఫిరంగులు గర్జించినప్పుడామె అదృశ్య హస్తాలే మృత్యువును వారిస్తాయి!"

శ్రీమతి మాథ్యూస్ స్వయంగా మరోప్రయత్నం చేసిచూసింది.

"నీవు ప్రపచంమంతాచుట్టి దేశంచేరేనాటికామె వయసు మీరిపోదా? ఇప్పుడున్న ఆకర్షణ కలకాలముంటుందా?"

"మొదటిచూపునాటి రూపు నా కళ్లల్లోశాశ్వతంగా నిల్చేఉంటుందిగా మాయకుండా, మాడం!"

"పట్టపగ్గాలులేక ఆమె లౌల్యంలో పడకూడదా? లేక ఇతరుల మోసానికో ఘాతానికో బలైపోకూడదా?"

విచారంగా "అలాజరిగినా మేడం, గతానుభవాలకు, గతక్షణాలకు, కృతజ్ఞుడనై తరువాత జరిగిందానికేడుస్తూ ఉండిపోతాను"

"పిచ్చి !"

"పిచ్చివాడూ, కవీ, ప్రేమికుడూ, ముగ్గురు దట్టమైన భావనాటవిలో దారి తప్పిన వాళ్ళు !"

## V

ఆంద్రూస్ ఉన్నన్నాళ్ళూ నెలలకు నెలలే క్షణాలుగా గడిచి పోయాయందరికీ. ఊళ్ళో వాళ్ళకు భైరి బృందపుటాగడాలు తగ్గిందే చాలు, వాళ్ల నడగే వాళ్ళే లేరు. ఆంద్రూస్ వెళ్ళాక కూడ అతను రేపిన కల్లోలానికి జవాబుగా కోరంగి వారి మనస్సులో భావతరంగాలు లేచిపడుతూనే ఉండేవి. "తండ్రిచ్చిన కొద్దిపాటి ఎకరాలూ ఏనాడో వదిలి పోయాయికదా, దానితో ఆ గ్రామజీవనమూ పోయె. పొట్టచేతబట్టుకొని ప్రపంచమంతా చుట్టి, పోనీ ఇక్కడ ప్రశాంతంగా ఉంది, ఎవరికి అక్కరలేనిచోటు, ఐనవారికెవరీకి తెలీకుండా కనీటిచుక్క రాల్చేవాళ్ళు లేకుండా ఎక్కడో దూరంగా ఇక్కడ పండి ప్రశాంతంగా రాలిపోదామనుకొన్నా. ఆంద్రూస్ చెప్పిన విషయాలన్నీ చూడగా ఫాక్టరీల కుమ్ములాటల్లో దిక్కులేని చావు చావాలి కాబోలు !" అనుకొనేవాడు మాథ్యూస్.

"మనకూ నౌకాసైన్యముండాలి. కనీసం మన తీరంలోనైనా ఏ విదేశీయుడూ మన శాంతియుత జీవనంతో చెలగాటమాడకుండా ఏర్పాటైతే బావుణ్ణు" అనేవారు భైరీ రంగన్నా.

"మనలోవాళ్లూ ప్రపంచాన్ని చుట్టివచ్చి విదేశీ శాస్త్రాలన్నీ అభ్యసించి మనవాటిని అభివృద్ధి చేయగల్గితే బాగుణ్ణు." అనేవాడు పూజారిగారబ్బాయి.

ముగ్గురూ అనేక విషయాలపై తర్జనభర్జన పడేవారు. అనుమానాల

నివృత్తికై మాథ్యూస్ దగ్గిరకు వెళ్లేవారు. ఫాదరీ తోచింది చెప్పేవాడు. కానీ ఆండ్రూస్ చెప్పినట్లుగా ఫాదరీమాటలు పథ్యాలయ్యేవికావు.

వీరి ఘాటుచర్చలు వింటున్న కోరంగి తనలోతాను నవ్వుకొనేది.

ఈ విషయా లిలాగే కొనసాగిఉంటే ఎలా ఉండునోకానీ, భైరి బృందానికి కొత్తఆకర్షణ గ్రామంలోనే కన్పించి కొత్తకోరంగివైపు వెళ్ళడం తగ్గించివేసినారు.

ఇంతవరకూ ఆంతర్యములో సామాన్య జనులెంత క్షోభ పడుతున్నప్పటికీ, పైకి ప్రశాంతంగా కన్పిస్తున్న కోస్తాప్రాంతమంతా తీవ్రకల్లోలాలకు గురయ్యే ప్రమాదం సమీపంలోనే ఉన్నట్లందరికీ తేటతెల్లంగా కన్పించినది. నిజాం మరణించిన తరువాత అతని గద్దెకోసమై పోట్లాటలో ఇంగ్లీషువారూ, ఫ్రెంచివారు బహిరంగంగా జోక్యం తీసుకొంటున్నదీ, దానికిసంబంధించిన యుద్ధాలూ కర్ణాకర్ణిగా ఎన్నో వింటున్నారు.

ఇటువంటి జోక్యం వల్ల ఆర్కాటుప్రాంత మొుక రావణకాష్ఠమైమండుతూంది. ఇప్పుడీ కోస్తాకూడ అటువంటి కల్లోలానికే గురికాబోతూంది. అందువల్ల ప్రతిచోట యుద్ధప్రయత్నాలు, ఆత్మరక్షణకు కావలసినఏర్పాట్లుమొదలైనాయి. కోరంగిలోనూ సాముగరిడీలు కిటకిట లాడసాగినాయి. ప్రతివారూ కత్తియుద్ధాలు, కుస్తీపట్లు, గుఱ్ఱపుస్వారి, ముఖాముఖీ బాహబాహి పోరాటాలూవీటిపట్ల సుముఖత చూపుతు వీటిసాధన కవకాశాలను కల్పించుకొన సాగినారు. భైరివంటి యువకుణ్ణి ఆకర్షించడంలో ఆశ్చర్యమేముంది ?

పాతనైజాం పోయాక కొత్త నైజామెవరో బలాబలాలు తేల్చుకోగా కొత్త నైజాము ప్రభువు కోస్తాప్రాంతాల్లో తిరిగి తలెత్తిన సంస్థానాధిపతులనణిచివేసిపన్నుకట్టుదిట్టంగా వసూలుచేసుకొనేందుకు వీలుగా పెద్దసైన్యాన్ని పంపుతున్నాడని వదంతులు బయలుదేరినాయి. ఇదిగో పులంటే అదిగో తోకన్నట్లు, సైన్యమప్పుడే ఖమ్మంమెట్టుదాక వచ్చిందంటే, కాదు మచిలీపట్నం చేరుకొందని కొందరు చెప్పుకొనేవారు. ఆ సైన్యం ఎంత క్రూరమైనదో

చెప్పుకొనేవారు. ఒక్కొక్క ఊళ్లోనూ ఆ సైన్యంమెంత ఘోరంగా ప్రవర్తిస్తూ వస్తూందో చెప్పుకొనేవారొకసారి. పిఠాపురం, పెద్దాపురం, విజయనగరం. మొగల్తుర్రు మొదలైనచోట్ల నిజాం సైన్యాన్నెదిరించి ఓడించేందుకు జరిగే ప్రయత్నాలను గురించి చెప్పుకొనేవారు. యుద్ధ ఫలితాలను గురించి ఊహగానాలు చేసేవారు. ఇవన్నీ సాహసవంతులైన యువకుల్లోమరింత పట్టుదలను రెచ్చగొట్టినాయి. కంపెనీలవాళ్ళూ తమ బలగాన్నిరక్షణకోసం పెంచుకోనారంభించారు. రంగన్న ఇంజరంలో ఇంగ్లీషువారి కొలువులో సైనికుడుగా చేరాడు. భైరి రాత్రింబవళ్ళు సాముగరిడీలలోనే మిత్రులతో గడిపేవాడు. "ఇవన్నీ బోయకుర్రవాళ్ల విద్యలుబాబూ ! మీకు వీటితో ఏంపని ? ఓడలమీద వెళ్ళేవారైతిరి ! ఆపోరాటాల బాణీలు వేరు కదా ?" అని గరడీలవారు వారించారు కానీ అతను వినలేదు. ఆ విద్యలన్నీ నేర్చుకొన్నాడు. అందు గొప్పనేర్పరీ అయినాడు. గుర్రపుస్వారి గుర్రంపైనుండి యుద్ధంచేయడం ఇవి నేర్చుకొన్నా స్వంతంగా గుర్రంలేక తగినంత పటిష్ఠంగా అలవాటు చేసుకొనలేక పోయాడేమో కానీ మిగిలిన విద్యలన్నిటిలోనూ అతనారితేరిపోయాడు. కత్తిదాకా అక్కర్లేదు. దిట్టమైన బాణాకర్ర ఉంటే ఎనిమిదిమంది జట్టీలను అవలీలగా గంటలకొలదీ భైరయ్య ఆపకలడు.

ఇంట్లో వారుకూడ భైరిని "ఇవెందుకురామనకు ? దండులో చేరు తావా ఏమన్నానా ?" అని వారించారు. కానీ, బాబయ్యమాత్రం "ఆమాత్రం చేతిలోవిద్య ఉంటే ఎప్పటికైనా మంచిదేలే" అని ఊరుకొన్నాడు.

ఎన్నాళ్లైనా ఓడలు రానందువల్ల రోజురోజుకూ భైరయ్యయింట్లో పొట్ట గడవడమే దుర్భరంగా ఉంది. ఆవిషయం భైరయ్యకూ అతని తండ్రికీ మాత్రమే తెలియదు. ఓడలు రేవుచేరవలసిన నాటికి కొంచెమటుఇటుగా వాటిలో పనిచేసేవాళ్ల కుటుంబాలకు మొన్న మొన్నటిదాక భరణాలిస్తూండటంవల్ల నైతేనేమి, ఇంట్లో పెట్టుపోతలు మొదలుకొని ఏఖర్చులూ తగ్గనందువల్ల నైతేనేమి. డబ్బెక్కువగా వెనకేసుకొనే అలవాటు మొదటినుంచీ లేనందువల్లవైతేనేమి ఇప్పటికున్న నిల్వలు యావత్తు హరించుకొనిపోయాయి. ఎవరినడుగుతారప్పు ? ఏమనడుగుతారు ?

ఒకవేళెవరైనా ఇస్తేమాత్రం తీర్చేమార్గం? ఇంక మరొక వృత్తిలో దేనిలోనైనా పొట్టపోసుకొనవలసిందే. ఎవరాపని చేయాలి ? భైరయ్య నాయన దాదాపున్మాద స్థితిలో ఉన్నాడు. ఎన్నడూ ఏపనీచేసి ఎరుగని బాబయ్య ఈవయస్సులో కొత్తవృత్తి చేసుకొనడం అసంభవం. భైరయ్య విషయం సరేసరి. మన సమాజంలో అయితే ఎటూపాల్పోని ఇటువంటివారికాకలిచేత మాడిచావ డమో, నూతిలో ఉ మ్మడిగా పడి చావడమో రెండే శరణ్యాలు.

మిగిలిన విషయాలలో కాకపోయినా ఈ విషయంలోమాత్రం ఆ సమాజం చక్కని సహృదయత చూపేదనాలి. ఎందుకంటే గ్రామంలో ఒక నిర్ణీతమైన బహిరంగ ప్రదేశంలో భోజన పదార్థాలను సాయంకాలంపూట జంతువుల కందకుండా పెట్టేవారు. అవి పాంథులుపమోగించుకొనవచ్చు. లేదా గ్రామంలో విధిలేని గౌరవనీయ కుటుంబాలు రహస్యంగా తెచ్చుకొనవచ్చు. ఇప్పుడిదే భైరయ్య కుటుంబానికాధారంగా ఉంటూంది. ఊరంతా మాటుమణిగిన తరువాత రహస్యంగా ఆపదార్థాలింటికి చేరవేసేవారు. ఊళ్లో చాలమందికి తెలిసినా ఎవ్వరూ పల్లెత్తుమాటనేవారు కాదు.

కాని భైరయ్యకు బాధ్యత తెలియజెప్పాలన్న ప్రయత్నాలుమాత్రం గ్రామస్థుల్లో ఎక్కువయ్యాయి. ఆమేరకే భైరయ్యలోనూ గ్రామస్థుల కంటబడకుండా గరిడీలలోనో, కొత్తకోరంగిలోనో రేవులో నిల్చిన ఓడలమీదోకాలమంతా గడిపే స్వభావమూ దృఢమైపోయింది.



ఈ కుటుంబమిలా ఒడుదుడుకులతో సాగుతుండగా పరదేశివివాహ ప్రయత్నాలు ఫలోన్ముఖానికి వచ్చాయి. తాంబలాలకు పెళ్లివారు తరలివచ్చారు. వాళ్లు గ్రామంలోఉన్న నాలుగురోజులూ మహా అట్టహాసంగా తిరిగినారు. మీరయ్యా, వాళ్ల ఐశ్వర్యగర్వాన్ని సంతృప్తి పరచేందుకు, పాపం లోటులేకుండా

ఏర్పాట్లన్నీ చేసినాడు. సిరుల పరమార్థం తెలియకుండా, కలిమికి మురిసేవాళ్లకు తప్ప, మిగిలిన సహృదయు లందరికీ వీరిబండారం తెలిసి పోయింది. డబ్బుకు ఏ అశుద్ధమైనా తినగల్గినవారు. స్వభావానికి సిసలైన పచ్చివర్తకులు. అభిమానాలకు పోకుండా, వెన్నలోనుండి దారంలాగినట్లుగా తమ కార్యాలు సాధించుకొంటారు.

వీరి చేష్టలవల్ల గ్రామంలో అందరి కుతూహలమూ పెరిగింది. కాబట్టి మచిలీపట్నంలో వీరి విషయాలు చెప్పగలవారికి గిరాకీ బాగా పెరిగి పోయింది. ఉన్నవీ, లేనివీ, అతిశయోక్తులూ అన్నీకలిపి వారు చెప్తూంటే కూటాలు కూటాలుగా జనం వినేవారు.

"వర్తకంలో అందెవేసిన చేతులువీరివి. అటు అమ్మేవాడైనా కొనేవాడైనా వీరినీడను పడితే ఇక వాడిమీద ఆశను వదలుకొన వలసిందే. వాడారిపోవడమేకానీ మరి లేవడముండదు. ఏ ఎండకాగొడుగు పట్టడంలో వీరిని మించినవారు లేరు. ఇంక నవాబులవద్ద వారి అధికారులవద్ద ఆశ్రయం సంపాదించే నేర్పువిషయమా, చెప్పనే అక్కర్లేదు. డచ్చి ఫ్రెంచి మొదలైన పాశ్చాత్య వర్తకులే వీరికి సరిరారు. మిగిలిన వారనగా ఎంత ? వీరు పాతుకొన్న కొలువు కూటములలో వీరినికాదని ప్రవేశించిన మరొకవర్తకులింతవరకెవ్వరూలేరు.

ఎవరివద్దనైనా ఒకచిన్నపని సాధించదల్చుకొంటే వారినెంతపయ్ యిచ్చి యిచ్చి కెత్తుతారో అవసరంలేని మనుష్యులనంత పురుగులుగానూ చూస్తారు. తామింతకూడా ఆవేశపడకుండా ఎదుటి వాళ్లలో ఉద్రేకాన్ని రెచ్చగొట్టి వాడిచేత ఎంతకఠోర కార్యమైనా చేయిస్తారు." ఇవన్నీ విని గ్రామస్థులు "ఎటువంటింట్లో వెళ్ళిపడుతూందే మన పరదేశి!" అని జాలిపడుతున్నారు.

పెళ్ళికొడుకు వయస్సెక్కువ లేదంటారుగానీ ముసలిముఖం పడిన వాడు. పళ్లుకొంచెముబ్బు. వికారపుతెలుపు. ముఖంమీద మశూచికపుమచ్చలు

‘‘భైరయ్యకూ వీడికి పోలికెక్కడే ? పావం పరదేశి తల్లిలేనిపిల్లైపోయిందికానీ” అని ఆడంగులు బుగ్గలు నొక్కుకున్నారు.

“ఇప్పుడైతే తెలీక తాళి కట్టించుకొంటుందేమో గానీ, ఈడొచ్చి తెలిశాక వాడితో కాపురం చేస్తుందంటావా ? ” సందేహం వెలిబుచ్చుతూందిమరొకతె.

“చెయ్యకపోతే కాళ్ళూ చేతులూకట్టిపడవేసి చేయిస్తారు” తెగవేసి సామాజిక సత్యాన్ని ఉద్ఘాటిస్తోంది మరొకామె.

“నిజమేమరి, మనస్సులు కలవకపోయినా సంతతికలుగుతుందన్నంత వరకే సమాజానికి తెలుసు. మనస్సులు కలవని సంసారాల్లో పెరిగిన సంతతి గురించిన ఆలోచన ఈనాటకీ మనంచేయడంలేదు.” బృందనాయకుడు రాముని మానసిక దౌర్బల్యాన్ని చెవిలో గుసగుసలాడినాడు, రాముడు నవ్వినాడు.

మీరయ్య వియ్యాలవారు కోరంగిలో విడిసిన ఈ నాల్గురోజులుగా భైరయ్య ఇంట్లో అందరూ యమయాతననుభవిస్తున్నారు. ఇంట్లోనుంచి బైటికి కదలనివ్వకపోవడంవల్ల భైరయ్యకు యాతన. బయటికి వెళ్ళితే వియ్యాలవాతోనే ఏదైనా కయ్యంతెస్తే పుండుమీద కారంచల్లినట్లు అప్రతిష్ఠకూడానని, అతన్నలా నిర్బంధించినారు.

పరదేశి తననుంచీ ఎక్కడో దూరంగా పోతున్నందుకు తెలియని ఆవేదన భైరయ్యలో లేకపోలేదు. కానీ అదివెల్లడైతే అపహసిస్తారని తెలుసుకాబట్టి పరదేశి అంటే తనకేమి లక్ష్యంలేనట్లే నటిస్తున్నాడు. అతనికింట్లో ఈ నిర్బంధం భరించడ మతికష్టంగాఉంది.

మీరయ్య భార్య ఈ కొత్త సంబంధంపట్ల ఎంతఉత్సాహం చూపుతున్నదో పదదేశి అంత విముఖతచూపుతూంది. అయినా సవతితల్లి పరదేశి మీదెంతో ప్రేమ ఒలకబోస్తోంది, అమెకీరోజుల్లో ఒకగొప్ప ఊహకల్గింది. పరదేశికి వరుడైన తమబంధువు ఏదోఒక అంశంలో భైరయ్యతో వివాదపడి అతన్ని ఓడించాలి, అతనిమీద మేలి వాడనిపించుకోవాలి.” దీనికి తగిన మంత్రాంగమూ జరిపింది. కానీ భైరయ్య బయట కనబడితేగా? ఆమెకిది చాల నిరుత్సాహంగాఉంది. “ఇదే

చివరిరోజు – పూట. భైరయ్య నెలాగైనా వెతికి పట్టుకొని అతనిమీద నీ గొప్పను నిరూపించి మరీవెళ్లరా..... ఎందుకైనామంచిది. కత్తియుద్ధాల్లో మాత్రం దిగకు"అని హెచ్చరించి వారి తిరుగు ప్రయాణానికి ముందురోజు సాయంకాలం మరీ పంపింది.

భైరయ్య తల్లి, మరొకవైపున భైరయ్యమూణ్ణాళ్ళుగా చెరలోపడుతున్న వ్యధను చూసి భరింపలేక, వియ్యాలవారి జోలికెట్టి పరిస్థితుల్లోనూ వెళ్లనని వాగ్దానం చేయించుకొని మరీ అతన్ని బయటికివదిలింది. "రేపుదయమేగావారి ప్రయాణం–వారి గొడవల్లో వారుంటారు. వీడు తిన్నగా గరిడీకిపోతే అక్కడికెవ్వకు వస్తారు ? " అనుకొని సమాధానపడింది.

మీరయ్య కాబోయే అల్లుణ్ణీ, అతని పరిమిత పరివారాన్నీ మీరయ్య నౌఖరు వెనకుండి కాచుకొని వస్తూన్నాడు.

ఇంటినుంచి బయలుదేరిన భైరయ్యకు గరిడీవద్ద ఈమూక తారసపడింది. అతన్ని వియ్యాలవారివైపు మనుష్యులు సూటిపోటీమాటల్తో ఎద్దును పొడిచినట్లు పొడుస్తూ కయ్యానికి కాలుదువ్వుతున్నారు. భైరయ్య నిగ్రహించుకొని తన సాములో తాను లీనమౌతున్నాడు. కాని వీరతన్ని ప్రశాంతంగా ఉండనిస్తేగా? "ఇక్కడివాళ్ళకు కత్తిసామేమివచ్చు?" "అబ్బే అన్నీ తప్పులే!"

ఎంతకవ్విస్తున్నా భైరయ్య కనుపరుస్తున్న నిర్లక్ష్యమౌనాన్ని అసమర్ధతగా పరిగణించి కవ్వింపులు మరింత జోరుచేశారు. మాటలూ పెంచుతూ పోవడంలో చివర చాల నొప్పించే మాటన్నారు.

"అందరూ గ్రామంలో మొండి శిఖండులుండగా తగిన వరుండ్లకు పాపం తలిదండ్రులు దూరాలకు పోకేం జేస్తారు?" అన్నాడు వరుడు. ఆ మాటకు గరిడీలోని మిగిలినవారు రెచ్చిపోయి హుంకరించారు. కలహం మాటల్లో నుంచి కర్రల్లోకి కత్తులలోనికి మారుతూంది. నౌఖరూ, సాములు నేర్పుతున్న యోధుడూ వారించబట్టి ఆగారు కానీ లేకపోతే కోరంగి యువకులంతా ఈపాటికి వారిని చిత్తుక్రింద కొట్టివేసి ఉందురు.

భైరయ్య తల్లికి చేసినబాస మరచిపోయి ఉద్రేకంతో అందరి తరఫున ఒక సవాలు చేశాడు. "మీరుకోరిన విద్యలో దేనిలోనైనా మాలో మీరెంచుకొన్న ఏ వ్యక్తి అయినా పోటీపడేందుకు సిద్ధం. చేవఉంటే చూపండి!"

ఈ సవాలుమీద కొంత చర్చజరిగి చివరకు ఈతలో పోటీ పెట్టేందుకు నిర్ణయించు కొన్నారు, వరుడూ భైరయ్యా కోరంగిలో నిర్ణయించిన దూరం ఇటునుంచిఅటూ, అటునుంచిటూ రెండూసార్లీదాలి. ఎవరుముందీదితే వారుగెల్చినట్లు.

వెంటనే అందరూ కోరంగి ఒడ్డుకు తరలి వెళ్లారు. అనువైనచోటు నెన్నుకొని అక్కడున్న పడవలనన్నిటినీ ఖాళీ చేయించారు.

తీరా పోటి ప్రారంభం కాబొయ్యేప్పుడు వియ్యాలవారి పక్షంనుండి మరొకవస్తాదు ముందుకు వచ్చాడు "మొదట నన్నుగెలవండి. మాయజమాని చేతిలో నేనెన్నోసార్లోడిపోయే ఉన్నాను. నన్ను గెలిస్తే కదా అతనితో మీరు పోటీకీపోవలసింది ?" భైరిపక్షం వారభ్యంతరం చెప్పారు. భైరి వారికిలా నచ్చచెప్పినాడు. "వరుడి పసచూస్తేనే తెలుస్తూఉంది. అతని మీద మనకేమైనా పగఉందా ? అతన్నోడించటంలోకంటే, ఈవస్తాదునోడించడంలోనే ఎక్కువ ఘనత ఉందంటాను నేను"

ఈతగాండ్రిద్దరూ బయలుదేరినారు. పొద్దుమునిగేందుకెంతో వ్యవధి లేదు. ఈతగాండ్రిద్దరి వెనుక రెండు పడవలు బయలుదేరినాయి. ఒక పడవనిండా భైరయ్య అభిమానులు కూర్చొన్నారు. మరొక పడవనిండా వియ్యాలవారి తరఫువారు, భైరయ్యంటే గిట్టనివారూ కూర్చొన్నారు. పోటీదారులిద్దరినీ ప్రోత్సహించుతూ ఈపడవలురెండూ అటూఇటూ ఉంటున్నాయి. కోరంగి గట్టుమీదనుండి సమీపంలోని ఓడలమీది నుండి జనం విరిగబడి చూస్తున్నారు.

భైరయ్య వియ్యాలవారిఈతగానికంటే చాలవేగంగాను అవలీలగానూ ఈదగలడని త్వరలోనే అందరికీ తెలిసిపోయింది. వియ్యాలవారి పడవలో ఇప్పుడు వృధాగా కంఠశోష చేసుకొంటున్నావారు భైరయ్యంటే గిట్టనికోరంగివారే.

మిగిలిన వారేం చేయాలా ? ఎలా పరువు నిల్పుకోవాలా అని ఆలోచనలో పడినారు. వారిలో వరునికి నమ్మిన బంటూ, శకునిలాంటివాడూ మిగిలినవారిని కనుసన్నలతో ఓదార్చాడు. ఆతనభయం ఇచ్చాడంటే ఏదోతంత్రం పన్నేందుకు సిద్ధంగా ఉన్నాడని అందరికీ ధైర్యం.అతనిజిత్తులను మాయలను గెల్చినవాడిదివరకూ లేదు. బందరు పాశ్చాత్యా వర్తక వీధుల్లోనే లేరు. కోరంగి అనగా ఎంత ? తనవారిలో నల్గురినొకప్రక్కగారమ్మన్నాడు. పడవ చుక్కానినడుపుతున్న సరంగుకు చెవిలో
అవసరమైన సలహాలిచ్చాడు. భైరయ్య చాలాముందుగానే అవతలిగట్టు తాకినాడు. కొందరు వెంటనే ఇటువైపీత మొదలుపెట్టమన్నారు. భైరయ్యనవ్వుతూ "ఇంత ముందుగా పోయేంచేయను ? వాళ్ళురానీ"అన్నాడు.

ఎవ్వరో పడవలోనుంచి "నిజమే మనంముందెళ్ళిపోతే వాళ్లసలొడ్డు తాకకుండానే వెనక్కుమళ్ళితేనో! వాడొడ్డు తాకినాకే మనం మళ్ళుదాం!" అన్నారు. సరె అంటె సరె అన్నారు. సమ ఉజ్జీలైతేగాపోటీ అందం. ఇప్పుడిది నవ్వులాటక్రింద ఉంది. ఎదుటి వాడింకా చాల గజాలవతల గసపోసుకొంటూ ఈదుకొస్తున్నాడు. వాణ్ణిచూసి భైరయ్యను చూస్తూంటే సహృదయులకభిమానం పొంగుకొచ్చేస్తూంది. "ఏం రాగ్గా వచ్చేశావ్రా భైరి !"

తూర్పున చీకట్లుకమ్ముతున్నాయి. పడమటినుండి సూర్యుని బంగారు కిరణాల చామరంతో కోరంగి నది తన పేరు నిల్పిన పుత్రునికి ముద్దు మీర సేద తీరుస్తూంది.

నల్లని ఉంగరాల జుట్టు విశాలమైన నుదురు, ముక్కుమాత్రం తప్పట. అది పసిగట్టే సామర్థ్యం తక్కువనేందుకు సూచనా? ఏమో ! ఎర్రని పెదవులూ, నిగనిగమని కండలుదీరిన దండలూ, విశాలమైన వక్ష స్థలమూ, కొంచెం లోపలికున్న పొట్టా, సన్ననినడుము, నున్నని తొడలూ, నీళ్ళలో వింతరంగుతో ఊగుతున్న కాళ్ళూ పాదాలూ, సానిపిల్లలు కూడా

ముచ్చటపడే అందం మన భైరయ్యది.

ఎలాఅయితేనేం అవతలివస్తాదూ గట్టుచేరుకొన్నాడు. అతని కంట్లో కసిచూసి భైరయ్యకు మరింత నవ్వు వస్తూంది. అతని నవ్వు చూసినట్లల్లా వస్తాదు మరింత పండ్లు బిగబట్టుతున్నాడు.

"భైరయ్య పాపమలసిపోయి కూర్చున్నాడు. నీవు వెంటనే బయలు దేరకు వస్తాదూ!" అంటూ వరుడంటున్నాడు, క్రిందపడినా మనమేగెల్చామనగల్గిన నేర్పు సంపాదించిన వాళ్లుమరి.

భైరయ్య అభిమానులు వారిని వెక్కిరిస్తున్నారు. "కృష్ణమ్మ గోదావరీ ఒకటే అనుకున్నారు కామోసు!" "గోదావరిలో ఈదటమంటే ఏమిటో తెలియక దిగినారు పాపం" ఇలాగే కొంతసేపు గడిచింది.

శకునిలాంటి యువకుడు వస్తాదుతో అంటున్నాడు. "వసాదూ, ఇంక దిగు. ఎందుకాలస్యం ? నీప్రాణానికి నా ప్రాణమడ్డుగానీ ఇంక దిగు.

వస్తాదు కిప్పుడు కొత్త ఆశ గోచరించింది. "జైరామచంద్రా" అంటూ నీళ్ళలోనికురికినాడు. వియ్యాలవారి పడవా జై కొట్టుతూ ముందుకు సాగింది.

కొన్ని గజాలేగనిచ్చి భైరయ్య కూడ "జై కోరంగీ!" అంటూ నీళ్ళలో దుమికినాడు. కోరంగి పడవలోవారూ ముందుకు సాగేందుకై తెడ్లు తిప్పసాగినారు. ఉహుః పడవ కదలడంలేదు. ఏమైంది? ముందుకు పోవాలన్న తొందరమీదున్నారేమో అవతల తెడ్డువేసే వాళ్ళివతలవారినీ, ఇవతలవారవతలి వారిని తరువాత చుక్కాని తిప్పుతున్న వాడినీ ఇలాగపరస్పరం "పోనీ" అంటే "పోనీ" అని అరుచుకొని కొన్నిక్షణాల్లో అర్థం చేసుకొన్నారు, ఏదో లోపముందని. తీరచూస్తేగొలుసుదింపిఉ ంది. (మామూలుగా చిన్న పడవలకు లంగరుండదు). గొలుసెవరు దింపారా నాకు తెలీకుండా అంటూ పడవవాడొకడు కేకవేసి గొలుసు పైకి లాగబోయినాడు గొలుసు పైకి రావడం లేదు. ఏదో మోసముందని పడవలోనివారికందరికి అర్థమైంది. ఒకడు వెంటనే నీళ్ళలో మునిగి "గొలుసును దేనికో బంధించి వేశారు. దగ్గరలో పడవను కేకేయండి. ఇది వస్తుందో లేదో" అన్నాడు. అందరి ముఖాలు

గంభీరమైపోయాయి. భైరయ్య ముందుకుపోయినవాడల్లా తనవాళ్ళు వెనక రావడం లేదేమా అని తిరిగి చూస్తునే ఉన్నాడు. ప్రత్యర్థిని చేరుకొని నాలుగడుగులు ముందుకీదినాక తెరిపిగా వెనుకకు చూచినాడు. వాళ్ళు రావడంలేదు. తాను తిరిగి వెనుకకు మళ్ళినాడు. వాళ్ళితని వెనుకకురావద్దనీ, తాను జాగ్రత్తగా ముందుకు పోవలసిందనీ హెచ్చరిస్తున్నారు.

భైరయ్య బాగా ముందుకు సాగిపోతున్నాడు. పడవకన్పించడంలేదు. ప్రత్యర్థి బాగ వెనుకబడుతున్నాడు. క్రమంగా మసక వెన్నెట్లో అతను స్పష్టంగా కన్పించడమేలేదు. ఎదుటివాళ్ళ పడవ వస్తాదుకు దగ్గరగా ఉందిప్పుడు. అందులో ఒకడు అదనుచూసుకొని అందరినీ మరిపించి నల్లని గుర్రపువెంట్రుకలతో చేయబడిన సన్నని తాడుతీసి వస్తాదు కందించినారు. అది ఇతరులకు తెలియకుండా ముడివేసి దానికి అడ్డుగా కూర్చున్నాడు. అవలీలగా అతనిప్పుడు తాడు పట్టుకొని ఈదుతూ వస్తున్నాడు.

అయినా భైరయ్య ముందే ఉన్నాడుగా? ఈరెండే కుతంత్రాలైతే భైరయ్య పోటీలో గెలిచేందుకడ్డేమీలేదు.

కానీ వియ్యాలవారి బంట్లంతటి తెలివిలేనివారుకాదు. వారు భైరయ్య ఈదుకొనిపోయే మార్గంలో ఒక వింత చేపను మూతికట్టి నీళ్ళలోవదిలేరు. అదిభయం కల్గినప్పుడల్లా విద్యుత్తును శత్రువులమీద ప్రసరింపజేస్తుంది. ఆ ఆఘాతానికి దాన్ని సమీపించిన ఏజీవియైనా నవనాడులూక్కృంగినిశ్చేష్టం కావలసిందే. నీళ్ళలో లేకపోతేదాని ఆఘాతానికి మనిషి తట్టుకొనగలడు. నీళ్ళలోఅయితే మనిషికాదుకదా జవనాశ్వంకూడా పడిపోవలసిందే. ఆ కాలం వారికీ విద్యుత్తుకు సంబంధించిన సిద్ధాంతాలు తెలియవుగానీ, ఈ చేపవల్ల ఓడలోనుండి తప్పించుకొని పోతున్న మనిషి జవసత్వాలను నిశ్శేషంగా క్షణంలో కృంగ గొట్టేందుకుపయోగించేవారు. సామాన్యంగా ఓడల్లో చాల విశ్వసనీయులైన ఆంతరంగికులకు మాత్రమే ఇట్టి విశేషాలు తెలిసేవి. ఆందరికీ తెలిస్తే ఇంకేమన్నాఉ

ందా ? ఈచేపలను పశ్చిమ తీరాలనుండి తూర్పుతీరాలనుండి ఇప్పుడిప్పుడే కొంటున్నారు. కోరంగి వారికీరహస్యంతెలియదు.

"ఈల్ చేపా?" అన్నాడొక విద్యార్థి? "ఏమో" తల ఊపాడింకోడు. కథ కానిమ్మని సైగచేశారు మిగిలినవారు,

భైరయ్యా ఈదుకొంటూ వెనుక తమపడవ రాలేదేమో అని చూసుకొంటున్నాడు. వియ్యాలవారక్కడ పడవలోని గొలుసును నీళ్ళలోదించి ఆ గొలుసుకడుగున ఉన్న ఒక పెద్ద లంగరు ముక్కకు తాడుద్వారా చిక్కుముడివేసి బంధించి విడిచినారు. అది కనుక్కొని, ఆతాడును ఛేదించి ఇక్కడికి వచ్చేప్పటికి కొంతాలశ్యమైంది. అయితేనేం వారిలో బరువు తగ్గడానికి కొందరు నీళ్ళలో దిగిపోయినారు. పడవ వేగంగా భైరయ్యను చేరుకోవడానికి వస్తూంది. భైరయ్యకాకేకలు వినిపిస్తున్నాయి. వియ్యాలవారి పడవ చాల ఎడంగాపోతూంది. నీటివేగాన్నాపుకోలేక వాలుగా పోతున్నారేమో అనుకొని నవ్వుకొన్నాడు. భైరయ్య మిత్రులూ ఆపడవనీటి దిగువవాలున బాగా ఎడంగా పోతున్నది గమనించినా భైరయ్య ఉన్నచోటు చేరుకొనేందుకు వేగంగా వస్తున్నారు.

కాని వారతన్ని చేరుకొనేలోపుగానే భైరయ్య వింతచేపను సమీపించాడు. అందులో అతను వెనుక వస్తున్న పడవ ధ్యాసమీదున్నాడేమో ముందున్న శత్రువును కానుకోలేదు. ఒక్కసారి విద్యుత్ప్రవాహమతని ఒంట్లో ప్రసరించగానే శరీరం వశంతప్పిపోయింది.చేతూలూకాళ్లూఆగిపోవడంతోటే అల్లంతలోతుకుమునిగిపోయినాడు.

ఆ ఆఘాతంయొక్క శక్తినశించి పైకితేలేప్పటికింకా అతనీ చేప యొక్క ప్రభావానికి లోనుకాలేనంతదూరంకొట్టుకొనిపోలేదు. లేస్తున్నప్పుడు మాత్రం వింతరంగులతో మెరుస్తున్న దానినిడుపాటిఆకారం అతని ఊహలో మెదిలింది. అంతలోనే తిరిగి యావత్తు శరీరం స్తంభించిపోగా తిరిగి మునిగిపోయినాడు. మసక వెన్నెల వెల్తురులో దూరంగా గట్టునఉన్నవారికి గానీ, పడవల్లోవారికి గానీ ఈ ఆకారం కనపడలేదు. అతను మునిగింది మాత్రం కనిపించింది. తిరిగి

నీటి వాలున అల్లంతదూరాన లేవడం కనిపించింది. అంతలోనే అతను మునిగిపోవడమూ కన్పించింది. ఈసారతను చాలసేపు పైకి లేవనేలేదు. హా హాకారాలూ చెలరేగినాయి భైరయ్య తరఫు పడవీసారి అతన్ని వెతుక్కొంటూ వియ్యాలవారిపడవను దాటివేసి భైరయ్యకోసం పరుగు పెట్టింది. భైరయ్య ఈసారి మునిగినప్పుడు నీటిలో ఆ చేపను కట్టిబిగించిన చెక్కముక్కకు అడుగుభాగంలో వేలాడుతున్న తాడు భైరయ్య కాళ్ళకు చుట్టుకొంది. చేపపైకి తేలేందుకు కొట్టుకొంటూంది. భైరయ్య కాళ్ళువిదిలించుతూ లోపల చాలాప్రమాదంలో పడినాడు. ఈ లోపున వియ్యాలవారి తరపు బంటు మరొకడు ప్రమాదం పసిగట్టినాడు. చెక్కకు కట్టిన తాడిలా మధ్యలో భైరయ్య కాలికి చుట్టుకొంటుందని వారూహించలేదు. భైరయ్యకు ప్రాణాపాయమైతే లేనిపోని బెడద. పైగా ఆ చేపనిప్పుడు మెల్లిగా వెనక్కు లాగుకొందామంటే ముందు భైరయ్య వేలాడుతూ వస్తాడు. తమ పన్నాగం తెలిస్తే ఈగ్రామంలో బ్రతకనిస్తారా ? సరె పడవదగ్గర తాడు కోసేస్తే? తరువాతే
మైనా తమకేమీ సంబంధంలేనట్లుగా తప్పుకొనవచ్చును. వీలైతే గట్టుమీద సందడి తగ్గిన తరువాతేనెపంమీదైనా ఆ చేపను వలవేసి పట్టవచ్చు. లేకపోతే ఏదో వింతవస్తువేదో వచ్చిందని చెప్పుకొని జనం మరచిపోతారు. అంతగా ఆరాలెవ్వరైనా ప్రారంభిస్తే అప్పుడే ఫ్రెంచి ఓడల్లో వచ్చినవారి చేతనో ఒక కట్టుకథ అల్లించి ప్రచారం చేయవచ్చు.

ఇలాఆలోచించి పడవవద్ద కొసనుకోసివేసినారు. దానితో భైరయ్యకాలికి తగులుకొన్న తాడూ వదిలింది. తరువాత భైరయ్య చాలాదూరం ప్రవాహంలో కొట్టుకొనిపోయి పైకితేలి మామూలుమనిషై. ఏం జరిగిందీ ఊహించడానికి ప్రయత్నించేలోపలే, వియ్యాలవారి పడవ, వారి తరపు ఈతగాడూ లక్ష్యానికి చేరువగా వెడుతున్నారు.

కోరంగి పడవలోని వారతన్ని సజీవంగాచూచినందుకే మహా సంబరపడిపోయి ఆనందంతో కేకలు వేస్తూ ప్రత్యర్థుల విషయమే కొంతవడి మరచి

పోయినారు. తరువాత ఎచ్చరపడిచూస్తే ఇంకేముంది ? సమయం మించిపోయింది. వారిని వెనకవేయడం సామాన్య మానవునికి సాధ్యంకానంతముందుకన్పిస్తున్నారు. అయినా భైరయ్య ధైర్యం తెచ్చుకొని తిరిగి ఎగుమారు ఈదేందుకు తన యావచ్ఛక్తినీ వినియోగిస్తున్నాడు. అతని వేగంచూచి అందరూ చాలా అబ్బురపడుతున్నారు. పడవకూడా అతని వేగాన్నందుకొనలేక పోతూంది. అతను చావుతెగువతో ఈదుతున్నాడు. అతని వేగాన్నిచూచి 'భళా'అని గట్టుమీద ఉన్నవారందరూ మెచ్చుకొనిముక్కుమీద వేలువేసుకొంటున్నారు. అతనిపట్ల వ్యతిరేక భావమున్నవారుకూడాఈ క్షణానదాన్ని మరచిపోయి మెచ్చుకొంటున్నారు. అందరూ
మెచ్చుకొంటూంటే మీరయ్యకు తేళ్లుజెర్రులూ ప్రాకినట్లుంది. అతనూ ఇప్పుడిప్పుడే ఈపోటీ విషయం తెలియగా ఏమనాహుతమౌతుందోనని భయపడి గట్టుచేరుకొన్నాడు. ఒక పడవను రేవులోకొన్ని అడుగుల దూరం నిలిపి, అక్కడ దానిమీద నిల్చుకొన్నాడు. భైరయ్య ఎగుమారీదుతూ అతనున్నచోటికే చేరుకొంటున్నాడు. వియ్యాలవారి ఈతగాడిప్పుడు దిగుమారుగాఈదుతూ మీరయ్య ఉన్నచోటికే చేరుకొంటున్నాడు. భైరయ్యెంత "రాగ్గా" ఈదినా వియ్యాలవారి ఈతగాడే ఈపడవను ముందు చేరుకొన్నాడు. అతనికి సాదరంగా చేయందిచ్చి మీరయ్యే
స్వయంగా పడవలో ఎక్కించుకొన్నాడు. ఆ వస్తాదును భుజాలమీదెక్కించుకొంటున్నారతని ప్రక్కనున్నవారు. భైరయ్య కొన్ని క్షణాలలో ఆ పడవఅంచునే మరొకప్రక్క పట్టుకొన్నాడు. అతని వేళ్ళు పడవఅంచుకూ అక్కడనిల్చిన ఒక బల్లచెక్క చికరకూ మధ్య ఉన్నాయి. వియ్యాలవారిలో ఒకడు అదిగమనించని వాడిలా నటిస్తూ హడవిడిగా ముందుకుపోయి ఆ బల్లచెక్కను తన బలంకొద్దీనొక్కి ప్రక్కకు తప్పుకొన్నాడు. భైరయ్య ఆనొప్పికి "అబ్బ" అని మూల్గి నీటిలో తిరిగిపడిపోయినాడు. ఈలోపున వియ్యాలవారి వస్తాదుకు పూలమాలలు వేసి ఊరేగించుకొంటూ జనం చాలామంది మీరయ్యఇంటివేపు

వెళ్ళిపోయినారు. భైరయ్య పడవవారు వెనకగావచ్చి అతన్ని ఎక్కించుకొనిగట్టుకు చేర్చినారు. గట్టుచేరిందేతడవు భైరయ్య మిత్రుల భుజాలమీద సొమ్మసిల్లి పడిపోయినాడు.

జరిగిందేమో ఎవ్వరికీ తెలియదు భైరయ్య ఆ గెల్చిన ఈతగానికంటే అనేకరెట్లు మెరుగైన వాడని తెలుస్తూనేఉంది. అయినా అతను వెనుక పడిపోయాడు. మధ్యన రాహువు కొట్టింది. లేకపోతే ఈమాత్రానికి మనభైరిలాఔతాడా? అన్నారు. మొదట్లో అవతలగట్టుకుచేరగానే కాలహరణం చేయకుండా ఉండవలసిందని కొందరంటున్నారు. మనపడవ భైరినివెన్నంటిరాకుండా అక్కడెవర్రా బురదలో గొలుసును కూరేసింది ? ఆ తరవాతేదో మోసం జరిగుండాలి"అన్నారు.

"మోసమేముంది. వేళావిశేషం. రాహువు కొట్టిందంటూంటే"అంటున్నాడు గ్రామ దేవత పూజారి అబ్బాయి.

అక్కడ వియ్యలవారూ తమ విజయానికి సంజాయిషీ చెప్పుకోవలసిన స్థితిలోనే ఉన్నారు. "అలవాటులేని కొత్తనీళ్ళు కదూ ? అందుమూలాన మొదటిసారి భైరయ్యకంటే కొంతవెనుకబడింది నిజమేననుకోండి. అదయినా ఎంతమహా ? కొన్నిక్షణాలేగా !" ఔనౌను"అంటూ మిగిలినవారు వంతపలుకుతున్నారు. మీరయ్య భార్య అలవిగాని సంబడంతో వచ్చిన వారందరికీ సత్కారం చేస్తూంది. పరదేశికిదంతా ఓక అపశకునంగా కన్పిస్తూంది. "భైరి ఈతసంగతి వీళ్ళకేం తెలుసు? తన్ను భుజానమోసుకొని అలుపెరక్కుండా అటుఇటూ ఎన్నిసార్లో ఈదిన తన భైరేఇవాళిలా ఔత ? ఒంట్లో బాగలేదేమో !" ఆ ఆలోచన రాగానే అతన్ని వెళ్ళిఒక్కసారి చూడాలనుకొంది. కాని తన నిస్సహాయత గుర్తుకొచ్చి ఏడ్చుకొంది.
ఎవరి ఆనందోత్సవాల్లో వారుంటూ పరదేశినిగురించి పట్టించుకొన్నవారేలేరు.

భైరి సేదతీరి కళ్లుతెరిచినాడు. చుట్టూ నిశ్శబ్దంగా తనకుపచారాలు చేస్తున్న అభిమానులు కన్పించారు. వారిని తానీనాడు నట్టేట ముంచినంత పనిచేసినానని గుర్తుకు వచ్చింది. ఏంజరిగిందో ఊహించేదుకు కతను ప్రయత్నిస్తున్నాడు. అతనికంటి ముందొక్కొక్క విషయమేకన్పిస్తూంది. కానీ తన

శరీరం యావత్తు స్తంభించినక్షణంలో జరిగిన దేమిటా అని అతని మెదడు మహతపన పడుతూంది.

తానింతవరకీసడించిన రాహువు కొట్టడాలు మొదలైనవి నిజమా ? తానేదేవత కేమపకారం చేశాడని ఆదేవత తనకింతటి కీడుచేయాలి ? ఛ ఛ కోరంగి గంగకు తనమీద దయతప్పిందా ? ఛ ఛ. అలా అయితే ఈవేళ బ్రతికే ఉండదు.

ఒక్కొక్క వివరమే జ్ఞాపకం తెచ్చుకోవడానికి కృషిచేస్తున్నాడు. ఒక చెక్కముక్క తేలుతూంది, దానికి పాములాంటి ఒక ఆకారాన్ని మూతిబిగించి కట్టినారు. ఆ చెక్కదుగున గొలుసోత్రాడో ఏదో వేలాడుతూంది. ఎంత పొడవో గుర్తులేదు. ఆ ఆకారం ? తానెప్పుడూ చూసిందికాదు. చక్కని మచ్చలు. కళ్ళు జిగేల్మనిపించే వన్నెల తళుకులు. ఆ ఆకారం తనెక్కడైనా చూచాడా ? ఎక్కడచూచాడు ! ఆ:! చూచాడు! ఎప్పుడు ? ఎక్కడ ? ఎప్పుడో. ఎక్కడో. కొంతసేపటికదీ గుర్తుకు
వచ్చింది. ఆ:! తూర్పు దేశాలనుండి తెచ్చిన వింత బొమ్మల్లో ! అదిక్కడికెలా వచ్చింది ? ఎంతాలోచించినా అంతు తేలలేదు. భైరయ్యకొంతసేపటికి బాగ కళ్ళు తెరచాడు. కదిలాడు. లేచి కూర్చొనినాడు. అభిమానులతన్నోదారుస్తున్నారు,

"పోనీలే భైరీ. ఓడిపోతేమానెలే. మరొకసారి పందెం వేయమందాము. ఈరోజు వేళబాగాలేదు" "రేపేవాళ్ళు పయనమైపోతూంటే. అందులో ఈవేళ గెల్చామనిపించుకొని తిరిగి పందేనికివస్తారా ? అంతటిధీరులా ?"

"చూస్తే తెలీటంలేదూ ? వాడూ, వాడి ఈతాను !"

"అయితే వారికోటలోనే వారిని ఓడిస్తాము. మచిలీపట్నం మనకేం దూరామా ?"

ఈ మాటలన్నీ వింటూ భైరి ఏమనుకొన్నాడో లేచినాడు. లేచి నడవడం కష్టంగానేఉంది. వేళ్ళు బాగానెప్పిపెడుతున్నాయి.

"ఎక్కడికి భైరీ?" అన్నిగొంతులూ ఆశ్చర్యంతో ఒక్కసారే ప్రశ్నించినాయి. భైరి అలాగే నడుస్తున్నాడు. "ఎక్కడికి?" అందరూ అతన్ననుసరిస్తున్నారు.

భైరి నిశ్శబ్దంగా ఒక చిన్న పడవనెక్కి గెడపట్టుకొన్నాడు.

"ఒంటిగానా ?" అందరూ ఈ మాటన్నారు గానీ ఒక్కడూ పడవ నెక్కలేదు.

భైరికీ తిరిగి ఆచోట ఒంటిగా చేరుకొనడాని కనుమానంగానే ఉ ంది.

"ఎవరైనా రాదల్చుకొంటే రావచ్చు"

ఆటల్లో ఎప్పుడూ అతని కుడిభుజాలుగా ఉండేవారుకూడ ఈక్షణాన జడిసినారు.

"నేనువస్తాను పద" పడవలోనికిదూకి నిల్చుకొన్నాడురంగన్న. ఊరి కంటరానివాడైనా తెలివితేటలకూ ధైర్య సాహసాలకూ సుగుణసంపత్తికీ, నెత్తినెక్కించుకో వలసినవాడు. అందుకే భైరికి పరమాప్తుడు. పూజారిగారబ్బాయి ఈరోజుల్లో ఊర్లోలేదు.

భైరయ్య గెడ వేయబోయినాడు. ఇందాక చెక్కకింద నల్గిన వేళ్లు కందిపోయి గడను పట్టనియ్యటంలేదు. "నేనువేస్తాను" అని రంగడు గెదపుచ్చుకొన్నాడు, రెండుమూడు గజాలు దాటేరోలేదో నేలగెడకందటంలేదు. రంగడే తెడ్డువేస్తున్నాడు. ఇప్పుడిప్పుడే పోటుపొడుస్తోంది. పడవ లోపలికి కదలగానే కొందరేప్రమాదం ముంచుకొస్తుందోనని ఊళ్ళోకి చెప్పడానికి వెళ్ళినారు.

భైరయ్య రంగడి కెటుపోవలసిందీ చెప్పడం తప్పితే ఏమీ మాట్లాడటం లేదు. పడవ ఆ స్థలం చేరుకొంది. అక్కడేమీ కన్పించలేదు. కొంచెంచుట్టు పక్కలు వెతుకగా ఆ చెక్క అలాగే తేలుతూ కన్పించింది. కానీ ఇంతకుముందు దానితో కన్పించిన ఆకారంమాత్రంలేదు. భైరయ్య గెడతో ఆ చెక్కను లాగినాడు. చెక్క పడవ సమీపానికి వచ్చింది, భయంభయంగా దాన్నిపైకి తీసినాడు. ఏమీలేదు. చెక్క, చెక్కకింద గొలుసు చిన్నది వ్రేలాడుతుంది. దాని బరువు చెక్క

కొట్టుకొనిపోకుండా నిలిపేందుకు సరిపోతూంది. గొలుసుకు చాలపొడవైనతాడొకటి వేలాడుతుంది. అంతా పైకి తీసినా చెక్కవైనమేమి తెలియలేదు. చెక్కమీద కొన్నిమేకులు కొట్టినారు. ఏ ఓడలోగానీ, ఏ పడవలోగానీ అటువంటి భాగముండదు. మరి అక్కడికెలా వచ్చిందో దురూహ్యం. ఆలోచనెంతసేపటికీ తెగక చివరన భైరయ్య తలపంకించి "నే నో డి పో యా ను !" అన్నాడు.

"తెలియరాని కుతంత్రం ? అది ఓటమిలో లెక్కకాదు." అన్నాడురంగడు.

"కుతంత్రం తెలియకపోవడమూ వెనుకబడడంకిందే లెక్క."

"పడవను వెనుకకు మళ్లించినారు. భైరయ్య పడవ వెనుకకు చేరే సమయానికి వియ్యాలవారి తరఫు మనుష్యులూ కొందరు గట్టువద్దకు వచ్చారు. భైరయ్యగానీ ఆ రహస్యం కనుగొన్నాడేమోననివారి భయం. భైరయ్యతో రెండుమాటలు మాటలాడగానే వారిభయం తొలగిపోయింది. ఉప్పొంగుతూ వారు వెళ్ళిపోయారు. భైరయ్య తన ఓటమికి కారణమైన చెక్కముక్క తీసుకొని ఇల్లు చేరుకొన్నాడు.

ఇంట్లోవారి కెవరోఒకరు ఎప్పటికప్పుడు వార్తలు చెప్తూనే ఉన్నారు. బయటికి రాలేక, లోపలుండలేక వారు సతమత మౌతున్నారు. భైరిని చూస్తూనే 'వచ్చావా నాయనా" అంటూ అందరూ ఒక్కసారేచేరదీసి ఆవురుమన్నారు. భైరయ్యకు దు:ఖమాగలేదు.

" నే నోడిపోయాను" అంటూ ఏడ్చినాడు.

రాముడు విద్యార్థినాయకునివైపు జాలిగాచూచి నవ్వినాడు. అతడూ రాముని స్థితిలోనే ఉన్నాడు. కథచెప్తున్న పడవవాని గొంతుకూడ జీర పోయింది.

"కుర్రసన్యాసి. ఆటల్లో గెల్చేవయస్సేకానీ. నీకు దుర్మార్గులతో తలపడే వయస్సెకడిదిరా ? ప్రపంచంలో ఎంత ఘోరకలిఉందో ఇంకానీవు చూడనేలేదు! బ్రతికి వచ్చావు. అంతేచాలు"అని తెగించి అప్పుడే బయలుదేరబోతున్న బాబయ్యతన్ని

ఓదార్చినాడు. ఇతురులింటికివచ్చి చెప్పగావిన్న విషయాలనుబట్టి భైరయ్య ఏదో మోసానికి గురైనాడని వారి మనస్సుకు తెలుస్తూంది. ఐనా అది వాదిస్తే తేలేవిషయం కాదు. కాబట్టి మౌనంగా దు:ఖించడమే వారు చేయగల్గింది. పాపం కోరంగి వాళ్ళ దు:ఖంలో పాలుపంచుకున్నది.

పోటీ జరిగిన మరుసటి రోజే తాంబూలాలు పుచ్చుకొని వియ్యాల వారు వెళ్ళిపోయినారు. పరదేశి పెళ్ళి కొద్ది నెలల దూరంలో నిశ్చయమైపోయింది.

## V

భైరయ్య ఆరోజు తరువాతెక్కువగా గ్రామంలో కనపడటం మానివేశాడు. గ్రామస్థుల కది సహజంగానేఉంది. అతనంటే గిట్టనివాళ్ళకు ఆనందంగా కూడా ఉంది. "అదేం మిడిసిపాట్లు పడేవాడు! బాగా అయ్యిందిలేశాస్తి!" ఆ శాస్తికి వారి దృష్టిలో రెండర్థాలు. మీరయ్య కల్లుడుకాక పోవడం మొదటిది. ఈతపోటీలో ఓడిపోయి తల వంచుకొనవలసిరావడం రెంవడది.

రోజులు గడుస్తున్నకొద్దీ భైరయ్య తండ్రికి తప్ప మిగిలినవారందరికీ వారి ఓడలు తిరిగివస్తాయన్న ఆశ అడుగంటింది. ఆయన మాత్రం క్రమం తప్పకుండా రోజంతా కడలి ఒడ్డుమీదనే గడుపుతూంటాడు.

భైరయ్య ఎక్కువగా ఇంట్లోనే గడుపుతున్నాడు. ఇంట్లో విసుగు వేస్తే గరిడీకి పోతూంటాడు. గరిడిలో అతనూరకే నేర్చుకొన్న ఒడుపులను సాధనచేయడానికే కానీ కొత్తవి నేర్చుకొనవసిన వేవిలేవు. ఈ కాలంలో భైరయ్య తనకు ముందురోజుల్లో అవసరమైన విజ్ఞానాన్ని బాబయ్యవద్ద నేర్చుకొన్నాడు. బాబయ్య తన కాలంలో పదిదేశాలుచూసిన మనిషి, పదిరకాల మనుష్యుల్లో మెలిగిన మనిషి. అతను తన అనుభవాలను మనుమడికి ప్రేమమీద లాలిస్తూ చెప్పేవాడు. భైరయ్య అన్నీచక్కగా ఆకళించుకొనేవాడు.

భారత భాగవతాల్లో ముఖ్యమైన ఘట్టాలు పంతులూరికే వల్లెవేయించి ప్రతిపదార్థమూ తాత్పర్యమూ కంఠత పెట్టిస్తే బాబయ్య వాటిని భైరి మనస్సు పరిణితి పొందేందుకుపయోగించేవాడు. ఓడల్లో నిర్మాణ భేదాలు ఓడల

నిర్మాణానికవసరమైన వృక్షశాస్త్రమూ నేర్పినాడూ. ఓడల్లో పయనించేప్పుడు కావలసిన నక్షత్రమండల పరిజ్ఞానము, ఇతర దేశాల వివరాలు, వాతవరణ విజ్ఞానం మొదలైనవన్నీ తెల్పినాడు. కొంత వైద్యశాస్త్ర పరిచయమూ కల్గించినాడు.

భైరి చాల తెలివైనవాడు. ఆవిషయంలో ఎవ్వరికి అనుమానంలేదు. అందుకే పంతులికు కూడా అతనంటే అభిమానం. అతని శిష్యుల్లో కొత్త విషయాలను మొదటిసారి వినగానే తెలుసుకొనే పాటవం భైరికే ఉంది. మనసు పట్టి వినాలిగానీ. అయితే భైరి గురువు కెదురు ప్రశ్నలు వేస్తాడు. ఆయన చెప్పలేక ఇరకాటంలో పడినచోట కోపగించు కొంటాడు.

సప్త సముద్రాల వివరాలు, మేరుపర్వత వివరణవంటివి వస్తే భైరి వేసే ప్రశ్నలకు సమాధానమివ్వలేక పంతులు మరీకోపగించుకొనేవాడు. అటువంటి ప్రశ్నలేవేస్తే బాబయ్య నవ్వి మెచ్చుకొనేవాడు. "నాకు తెలీదురా, దరిద్రంలో పుట్టినావుగానీ, లేకపోతే నిన్నగ్రహారం పంపి చదివించుదుమురా" అనేవాడు.

"ఇంకా పెద్దయ్యాక నీవే వాటికి జవాబులు తెలుసుకొంటావు! తొందర పడకుమరి!" అనేవాడు.

ఆరోజుల్లోనే భైరయ్యకు తమ కుటుంబ దారిద్ర్యమూ, అది తన చేతిమీదగానే తీరవలసిన విషయమూ తెలిసివచ్చాయి, ఏ ఓడలోనో తండేలుగా చేరినా కొన్నాళ్ళలో అదృష్టముంటే నా వాధ్యక్ష పదవి వరకు పోవచ్చు. పొదుపుగా నాల్గువరాలు వెనకేసుకొని సొంత వ్యాపారమూచేసుకొంటే – కొన్నాళ్ళకొక ఓడ స్వంతంగానే నడుపుకొనవచ్చు. ఇలా పరుగెత్తేవతని ఆశలు. కానీ తమ ఓడల విషయం పూర్తిగా తెలియనిదే మరొకరి ఓడల్లో పనిచేయడానికింట్లో వాళ్ళొప్పుకోరు. ఈ లోపుగా బాబయ్య వద్ద నేర్చుకొనగల్గినంతానేర్చుకోవాలి. అబ్బ! బాబయ్య కెన్ని విషయాలుతెలుసో!

భైరి ఈఆశయం, పాపం, క్రిందపడిన అద్దంలా ముక్కలైపోయింది. అతనికి యధాలాపంగా గరిడీలో వచ్చిన ఒక వాదులాటలో తమ కుటుంబం గ్రామస్థుల ఉమ్మడి భిక్షమీద నెగ్గుకొస్తున్న విషయం తెలిసింది. అ క్షణమే

అతనుద్యోగాన్వేషణ ప్రారంభించినాడు. ఎవరి కొలువులో చేరడానికీ చిన్నతనంగా ఉంది. తాను దర్జాగా తిరిగినఊరాయె. మరీ దూరదేశమెక్కడైనా వెళ్ళడానికిక్కడ ముసలివాళ్ళను చూచే మగదిక్కు ? ఓడలమీద వెళ్ళేందుకా కాలం కాకపోయె. తుఫానుల, వరదల కాలం దాటినాకగానీ ఓడల్లో ముమ్మరంగా పనులుండవు. పాతవాళ్ళకే ఈ రోజులలో పనులుండవు. కొత్త వాళ్ళ నెవరు చేర్చుకుంటారు? ఇవన్నీ ఆలోచించి అతను ఫ్రెంచివారు నెలకొనియున్న యానాం వెళ్ళినాడు. యానాంలో ఫ్రెంచి కంపేనీవారి ఉద్యోగివద్ద అతని ప్రైవేటు వర్తకానికి సంబంధించిన వ్యవహారాలు చూచే గుమాస్తాగా కుదిరినాడు. ఆ కాలనికుద్యోగమే చేయవలసిన కొద్దిపాటి జనుల పాలిటికది నిజంగా పెద్ద ఉద్యోగమే. జీతమెంతో ఉండేదికాదు. బహుశ:మాసానికి కొకటి రెండు వరహాలేమో! అదైనా ఎప్పుడూ బకాయి క్రిందనే ఉండేది. ఓడలు వచ్చి దబ్బుందినప్పుడే ఆ వర్తకులు వీరికి జీతాలిచ్చేవారు. కానీ ఆ ఉద్యోగానికున్న ఆకర్షణ జీతంకాదు. చేనేతవారి నుండి శెల్లాలు, ఇతర వలువలనూ ఆ విదేశీవర్తకుల కమ్మటంలోనూ, కళాసీలకిచ్చేకూలిలోనూ, జరిపే మధ్యవ ర్తిత్వంలో వారికి బోలేడు డబ్బుసంపాదించేందుకు వీలుండేది. ఇదికాక చక్రవర్తులీ విదేశి వర్తకులకిచ్చిన సుంకాల తీరువుల మినహాయింపు వంటి ప్రత్యేక సదుపాయాలెన్నిటినో వారితో సన్నిహిత సంబంధంగల స్వదేశీ వర్తకులుకూడ అక్రమంగా అనుభవించేవారు. విదేశీయుల పేరుమీదనే తమ సరుకులు కూడా కొంతవేస్తూ వారు లాభాలార్జించేవారు. వారీ స్వదేశీ ఉద్యోగులనెప్పుడు సమయోచితంగా సత్కరించకుండా మరిచేవారుకారు.

భైరి ఈ కొలువులో చేరిన వార్త హటాత్తుగావిని గ్రామస్థులతన్ని మెచ్చుకొన్నారు. బంధువులు జాలితలచారు. ఇంట్లోవాళ్ళు కుర్రవాని సంపాదనమీదిలా బ్రతుకవలసి వచ్చినందుకు చాటుగా ఏడ్చుకొన్నారు. భైరి మాత్రం అదృష్టం పండిందని మహాసంతోషపడిపోయాడు. మిత్రులు భైరి ఇకపై ఎప్పుడో కాని కన్పించదు కదా అని విచారపడినారు.

భైరి యజమాని ఫ్రెంచి వర్తక కంపెనీలో ఒక ఉద్యోగి. వ్యవహారంలో సాహసి. తెలివైనవాడు. కానీ అతనికి లేని దురలవాట్లే లేవు. అవి మార్యాదస్థులు చెప్పవలసినవీ, వినవలసినవీకావు. సహజమే. వేల మైళ్ళుపొట్టచేత పట్టుకొని రావలసినస్థితిలోని వారి మనస్తత్వం మరొకలా ఎలా ఉంటుంది ? జీవితంలోని బహుకఠోరకోణాలను చూచి వారి మనస్సులు గిడసబారిపోయినాయి. వారిదొకటే ఆశయం. వీలైనంత ద్రవ్యాన్ని వీలైనంత త్వరగా సంపాదించాలి. తరువాత దానితో స్వదేశంలో హాయిగా చిరకాలం బ్రతకాలి. ఇదివారు చేరదల్చుకొన్న ఎండమావుల దృశ్య తాత్పర్యం.

దానికోసం వారెన్ని పరుగులైనా తీసేవారు. అందరిలాగే భైరి యజమానీను. అతనికి కావలసినప్పుడు డబ్బు అందిస్తూ, వ్యసనాల కవసరమైన అనువులు కల్పిస్తూ అతని దుబాసి వ్యవహారంలో పెత్తనమంతా తానేవహించేడు. దుబాసి అక్రమాలన్నింటినీ ఫ్రెంచి ఉద్యోగికి మోసుకోక తప్పేదికాదు.

పాండుచేరివారి దృష్టిలో ఎక్కువగాపడేస్థాయి నింకా ఈ కుగ్రామ కేంద్రమందు కొనలేదు, కాబట్టి మచిలీపట్నంవారే అప్పుడప్పుడూ తమ అధికారం చెలాయించేవారు. అధికారులకు తెలిసికొంత తెలియకుండా కొంత ఇక్కడ వర్తకం సాగేది. పైవారికి తెలియకూడని రహస్యాలెక్కడచెప్తారోనని ఇక్కడి యజమానులు దుబాసీలలో ఎక్కువగా కలహాలుపెట్టుకొనేవారుకారు. దుబాసీలిది అవకాశంగా తీసుకొని తామూ అక్రమాదాయాల్లో అవకాశం కొలది కొంత వాటా కొట్టేసేవారు.

సామాన్యంగా ఈ కేంద్రంవారి వర్తకమంతా ఒకే తీరులోనే ఉండేది. సూరత్‌లోగాని, అవధ్, వంగదేశాల్లోని పట్నాల్లోగానీ, దక్షిణాదిలోని పట్నాల్లోగాని దొరికే నాణ్యమైన జరీవస్త్రాలు, కోస్తాలో దొరికే నాణ్యమైన పంచలు, సెల్లాలు కలంకారీ అద్దకాలు వీటిని తూర్పుదీవులకు చేరవేసి అక్కడినుండి పింగాణీసరుకులు, మిరియాలు, కస్తూరి ఇతర సుగంధద్రవ్యాలు రాగి, బంగారు, వెండి మొదలైన లోహలను తెచ్చేవారు. వాటిని తిరిగి ఇక్కడ అమ్మి ఆ డబ్బుతో

సురేకారమూ దంతపుబొమ్మలూ, చెక్కబొమ్మలు, చక్కనివస్త్రాలను యూరోపు చేరవేసేవారు. నూటికినూరుపాళ్ళు లాభంకూడా వీరి కతిసామాన్య లాభంగా మాత్రమే లెక్కకువచ్చేది, మంచి లాభసాటిబేరమంటే రూపాయి ఒకటికి మూడు నాల్గు, ఆ పైనారావాలి,

భారతీయ వస్త్రాలమీద నిజంగా అంతరమేరలాభాలూ వర్తకులు సంపాదించేవారు. యూరోపియన్ దేశాలయం దారోజుల్లో భారతీయ వస్త్రాలు ధరించడమొక వేలంవెర్రిగా ఉండేది. వీటి దిగుమతి నెలా అరికట్టాలా అన్నదాప్రభుత్వాల కొక సమస్యగా ఉండేది. ఇంగ్లాండులో అయితే భారతీయ వస్త్రాల దిగుమతి నిషేధించడమేకాదు, వాటిని తొడుగుకొనడం నేరంగా కూడా ఎంచుతూ రెండువందల పౌనులవరకు జరిమానాలు విధించేందుకు చట్టాలుచేశారు. ఇతర యూరోపియన్‌దేశాల కెగుమతి చేసేందుకైతే మాత్రమే దిగుమతి ననుమతించేవారు. అయినా ఈవస్తువులు దొంగగా ఇంగ్లండు మార్కెట్‌కూడా ప్రవేశించేవి. దొంగరవాణావల్ల వారికి బోలెడు డబ్బు వచ్చేది. "Smuggling Universal మాత్రమే కాదు. All times Phenomenon కూడా అన్నమాట" ఆప్రస్తావన తెచ్చిన కితకితలు తట్టుకోలేని విద్యార్థి. "దొంగ రవాణాపద్ధతులీనాడు కోస్తాలో అందరికీ ఎరుకేకదా! దొంగ రవాణా గడియారాలు రేడియోలువాడని వారెవ్వరీకాలంలో ?" అన్నాడు మరొక విద్యార్థి. "అయితే ఒకతేడా. ఆ కాలపు దొంగరవాణాలో బ్రహ్మాండమైన సాహసముండేది. డబ్బు సంపాదన మాత్రమేకాక!" అన్నాడింకొకడు.

ప్రపంచంలోకల్లా వజ్రాలు మన భారతదేశంలోనే తెనుగుగడ్డమీదనే దొరికేవి. ఒక వజ్రమేదైనా ఛాన్సుపడి దొరికితే ఇంకేముంది! తామే కాదు తమ తరాలవారుకూడా కాలుమీదకాలు వేసుకొని దర్జాగా బ్రతకవచ్చు. (అప్పటికి దక్షిణాఫ్రికా వజ్రాల గనుల ఊ సెక్కడిది? వజ్రాలంటే గోల్కొండ వజ్రాలేగానీ)

ఇలాసాగే నాటి వ్యవహారాల్లో ప్రతివారికీ ఒక విధమైన సంకుచిత స్వార్థముండటంవల్ల ప్రతివారూ పరస్పరం ఏదో ఘర్షణపడుతూనే ఉండే

వారు. ముఖ్యంగా పాశ్చాత్యులు తమలో తామెప్పుడూ తీవ్రంగా కాట్లాడకొనే వారు. బట్టలు నేతవారినుండి సమకూర్చుకోవడంలో మాకు మాకనిపోటీ. తమ సరకులమ్మడంలో పోటీ. సంస్థానాధికారులను, నిజాంప్రభువు ప్రతినిధులను వలలో వేసుకోవడంలో పోటీ! స్థానిక వర్తకులను కూడగట్టుకొవడంలో పోటీ! వీరందరి కుట్రలకు తూర్పుకోరంగి ఒక కూడలి స్థానంగా ఉండేది.

ఈ పోటీలలో వారికేవైనా నీతి నియమాలంటూ ఉంటే అదొక్కటే ఒక్కటి. డచ్చి, ఇంగ్లీషు, ఫ్రెంచి వారేకానీ, మరే విదేశీయులేకాని, ఎవ్వరైనాా ఆ క్షణాన తమలో ఎవ్వరిదిపైచేయిగా ఉంటే వారిని దిగలాగేందుకు మిగిలిన వారందరూ చేతులు కలిపి కలిసేవారు. వీలుంటే ఒకరినొకరు కొల్లగొట్టుకొనేవారు. అవసరమైతే ఒకరిగొంతు లొకరు కోసుకునేందుకూ వారు వెనుదీయరు.

వారిలో ఇంత తీవ్రమైన కాట్లాటలూ ఎందుకోసం? మననుండి వీలైనంత సంపాదించుకొనిపోయేందుకే! అయినా మనవారెవ్వకీ ఈవిషయమిసుమంతైనా పట్టేదికాదు. పైగా వారలా మన గడ్డ చివర కాట్లాడుకొంటూంటేనే మన పరిశ్రమలకు మంచిదన్న ప్రమాదకరమైనధోరణీ మనవారిలో ఉండేది. వారి బెల్లింపులూ, ఉబ్బివేతలు, తేనెపూత మాటలూమనవారిలో బహుశ నల్లమందులా పనిచేసిఉండాలి!

గట్టు మీదలేస్తున్న విషవృక్షానికి తెలియకుండా నీరందించే ఏరులా మనజాతిజీవనం వారిని పెంచింది. పాపంపండి కూకటి వేళ్ళతో పెకలించబడిన తరువాత ఈ వృక్షమే ఏటి కడ్డుపడి ప్రవాహం సాఫీగా సాగిపోకుండా చాల ఆటంకంగా పరణమించింది.”

విద్యార్థి నాయకుడ ప్రయత్నంగా ఒక ప్రశ్నందరిమీదా విసిరినాడు,గమనించకపోవడమేకాదు. మనవారు వారిని వాస్తవానికి సర్వనాశన మయ్యేవరకూ ఆహ్వానిస్తూనే ఉన్నారు కూడా. మన దిగుమతులను నిషేధించి, మన వస్తువులపై విపరీతమైన సుంకాలువిధిస్తూ, మన వర్తకులకు దూరప్రాచ్యదేశాల్లో

తీవ్రమైన పోటీయేకాదు, నీచమైన కుట్రలతో గొడ్డలిపెట్టుగా పనిచేస్తూ. అతిశైశవ దశలోనే ఈ దేశాల్లో రాజకీయ పెత్తనానికై అర్రులు చాస్తూవచ్చిన ఈవర్తకులను మనదేశమూ, ఇతర ప్రాచ్యదేశాలూ ఎందుకు నాశనమయ్యేవరకూ కూడా చేతులెత్తి ఆహ్వానిస్తూనేఉన్నారు? పదునెన్మిదవ శతాబ్దపు ఉత్తరార్ధమందు దేశమంతటా చెలరేగిన సంక్షోభకర పరిస్థితులలో ఎందువల్ల ఏదేశీయంశక్తీ నిలిచిగెలవలేకపోయింది? అంతవరకు పాదుషాలకెగాదు, సామంతులకెకాదు చోపుదార్లకు, వారిభృత్యభృత్యులకును మేస్వంచి దండమిడుదూరదేశాగతుల వర్తకుల కొందరికే ఇంత దేశమ్మోడె "నంటారు ఎందుకు?"

రాముడు జవాబెవరుచెప్తారా అని ఎదురుచూస్తున్నాడు. కాని ప్రశ్న సినిమాలకు సంబంధించిందికాకపోయె. కాలేజి ప్రేమ కలాపాలను గురించి కాకపోయె. పోని క్రికెట్టు గురించైనా కాదాయె. చర్చ ఏం సాగుతుంది? ఒకడు మాత్రం "ఈప్రశ్న, నేను జవాబులు సిద్ధంచేసుకొని సాధనచేసిన యూనివర్సిటీ ప్రశ్నపత్రాల్లోఎక్కడా తటస్థపడలేదయ్యా. అంతగా వచ్చినా ఛాయిస్‌లో వదిలేసుకోవచ్చు"అన్నాడు. మిగిలిన విద్యార్థులు "ఇక్కడీ వేళప్పుడు పరీక్షల చర్చేమిటి? ఛీ!ఛీ! కానీవయ్యా కథ" అంటూ ఉరిమినారు.

పడవవాడు నిరాశగా నీరుతీసిన కాలువవైపుచూసి కథ చెప్పకొని పోయాడు.

"భైరయ్యకుద్యోగంలోచేరిన ఆనందం ఎన్నోనాళ్ళు నిలువలేదు. తన యజమాని వ్యాపారసరళిలో లోతుపాతులు తెలియవచ్చినట్లల్లా తాను నిర్వహిస్తున్నపాత్రపట్ల తన కసహస్యం వేయసాగింది.

దేవాంగుల పెద్దలనూ, బ్రోకర్లనూ తెలివిగాఉపమోగించుకొని నేత వాళ్ళవద్దనుండి వీలైనంత ఎక్కువగా నాణ్యమైన బట్ట తమ యజమానికి సేకరించడం, తరువాత ఆ సరుకుకు డబ్బివ్వకుండా వీలైనంత కాలయాపనచేయడం, తరువాత డబ్బిచ్చేప్పుడు వీలైనంత తక్కువగా అతనికి ముట్టజెప్పేలా చూడటం-ఇవి

అతని ఉద్యోగ సూత్రాలు ఒక్కొక్కప్పుడితర వర్తకుల బ్రోకర్లతో తగువు పడవలసివచ్చేది. మగ్గాలవాళ్ళను మొహమాటపెట్టవలసివచ్చేది, బెదిరించవలసి వచ్చేది. ఆశలు చూపించవలసివచ్చేది. సమయానుకూలంగా జులుముపయోగించవలసివచ్చేది. దొంగ ముచ్చిలుకలు వ్రాయించుకొని వాటి నాధారంగా ఈజులుంవారు చేసేవారు. సామాన్యంగా వర్తకులందరూ ఎక్కువ జులు ముపయోగించేవారు కారు. ఏదో సామదానభేదోపాయాలవరకే ఉపయోగించి, అక్కడితోవచ్చిన లాభాలతో తృప్తిపడేవారు. కానీ భైరియజమాని కర్కోటకుడు. నిజాంనవాబువద్ద తమ కంపెనీమాట కెదురులేదని టెక్కు. రాజబంధువు నోరు నొక్కించాక ఫ్రెంచి ఆగడాలుమరీ పెచ్చురేగాయి. గ్రామాల్లో పెద్దలెవ్వరూ ప్రశ్నించక పోగా తమకూ అలా నడుచుకొనే స్థితి రావాలని ఉవిళ్లూరేవారు. అంచేత ఫ్రెంచివారితో తగవులాడేవారుకారు.

ఒకరోజున చేనేతవాని నొకనిని భైరయ్య యజమాని గోదాములో బంధించాడు. అతడీ యజమానివద్ద ముందుకొంత డబ్బుపుచ్చుకొన్నాడు. అప్పుడొక ముచ్చిలుకను వ్రాయించుకొన్నారు. అతనికప్పుడు చెప్పినదొకటి ముచ్చిలుకలో ఉన్నదొకటి. నోటితో చెప్పిన షరతు గుడ్డనేసి, తెచ్చిననాటి రేటుప్రకారం గుడ్డకిచ్చి అందులో ముందిచ్చినమొత్తం మినహాయించాలి. ముచ్చిలుకలో అలావ్రాయకుండా తక్కువ ధరకిచ్చేలాగునవ్రాసి నిశానీ వేయించుకొన్నారు. ఇప్పుడు ఫ్రెంచివారి ఓడ లింకా రాలేదు. కాని ముందింగ్లీషువారి ఓడలు వచ్చినందున వారు సరుకులను వీలైనంతెక్కువగా ఓడకు వేయాలన్న తొందరకొద్దీ ధరపెంచినారు. ఆ ధర భైరి యజమానియైన ఫ్రెంచి ఒప్పందందారెలాగా ఇవ్వడని ఆ నేత ఆ సామీకి తెలుసుకాబట్టి రహస్యంగా ఇంగ్లీషు వర్తకులకు వింజరంలోవేసి వచ్చినాడు. అది పసిగట్టి అతన్ని ఫ్రెంచివారి బ్రోకర్లు బంధించినారు. పైగా నిర్బంధంలో అనేక విధాలుగా హింసపెట్టినారు. ఇలాచేయడంచూచి భైరికి కోపంవచ్చింది. ఆ నేత ఆసామీ ఒకప్పుడుబాగాబ్రతికిన కుటుంబం నుంచి వచ్చినవాడని, తండ్రిగారి ద్యూత వ్యసనంవల్ల ఈ స్థితికివచ్చినవాడనీ అతనికీ

వృత్తి లోతుపాతులు తెలియక ఈ బ్రోకర్లచేతుల్లో ఇరుక్కొన్నాడనీ తెలిశాక భైరికోపమింకా పెరిగింది. అయినా అతను చేయగల్గిందేమీ లేదు. పైగా సాటి గుమాస్తాలూ, బ్రోకర్లూ అతన్నిచూచినవ్వినారు. "ఇలాఅయితే నీవీ ఉద్యోగం చేసినట్టే" అన్నారు.

"మన ధర్మశాస్త్రంలోకూడా అతనినేరానికి పుచ్చుకొన్నదానికి రెండు రెట్లు వర్తకునికి, యధాశక్తి రాజుకు తప్పు చెల్లించాలని ఉంది. ఈ నేరంలో ద్రోహచింతకూడా ఋజువైతే చితకబాదుటమొదలైన కఠినశిక్షలూ ఉన్నాయి. వాటిని తీర్పరివరకూ పోకుండా మనమే అమలు జరిపి తన్నితగిలేస్తాం. తప్పేముంది?" ఇది వారి వాదన.

నేతగాడూ తనకు జరుగుతున్న అన్యాయాన్నెదిరించి భైరికితోడ్పడే స్థితిలోలేడు. "అయ్యా! నా కర్మకొద్దీ జరుగుతున్న ఈ అవమానాన్ని మీరడ్డుకొని ఏం బాగుచేస్తారు. ఎలా జరగాలో జరగనీండి"అని నిస్సహాయమైన సానుభూతిచూపి ఊరుకొన్నాడంతే.

కొత్తకోరంగిలో తనకు పూర్వపరిచిత కుటుంబయజమాని ద్వారా ఫాదరీని ఈవిషయమై అడిగినాడు. అతనిది అధర్మమన్నాడు. "ఇతరులను హింసించ కూడదు. డబ్బుకోసం వీరుచేసే పాపాలను చూచే కాబోలు ఆనాడే క్రీస్తు "ఒంటె సూదిబెజ్జంలోదూరి పోవడంకంటే ధనవంతుడు స్వర్గరాజ్యం ప్రవేశించుట కష్టమన్నాడు. అందులో ఈ ఫ్రెంచివారు, ఇంగ్లీషు వారూ చేసే అత్యాచారాలకు మితేలేదు." అన్నాడాయన. "కానీ మీ ధర్మశాస్త్రాలు వారి చర్యలనే సమర్థిస్తున్నాయి" అనికూడా చేర్చాడు. భైరయ్య ఈయనచెప్పిన వాదాన్ని యానాంలో వల్లించినాడు. దానిమీద భైరి కిరస్తానం మాట్లాడుతున్నాడన్న గగ్గోలు మునుపెన్నడూ లేనంత ఎక్కువగా చెలరేగింది. భైరి ఈ గగ్గోలుకు బెదరలేదు, నల్గురూ నడిచిందే నరియైనత్రోవని మామూలుత్రోవను వదనూలేదు. విదేశీ వర్తక ప్రతినిధులుమాత్రమీసారి ఫాదరీని క్షమించలేదు. నిర్బంధంగా ఓడ నెక్కించి

పుదుచ్చేరి పంపేశారు. అక్కడవాళ్ళు స్వదేశానికి తిప్పి మూటకట్టేశారో లేదా మరో నిరపాయకరమైన దూర ప్రదేశాలకు పంపారో తెలీదు.

మొదటొకటి రెండుసార్లు భైరిఇలా నడుచుకొంటే కుర్రతనంక్రింద నిర్లక్ష్యం చేసినవారుకూడా ఇప్పుడు "ఎక్కడా పొందికగా ఉండడేంవీడు ? ఏం పోగాలం ! లక్షణంగా నాల్గుడబ్బులు వెనకేసుకొని చక్కని అవకాశం చెండనాడుకొంటూ !"అని పొటుకులు వడ్డిస్తున్నారు.

నేతగాంఢ్రుమాత్రం చాటుగా మాటుగా భైరిని మెచ్చుకొనేవారు. అంతేగాని అతని వాదాలను బహిరంగంగా సమర్ధించేందుకు గానీ, కంపెనీ వారి చేతలను ప్రశ్నించేందుకు గానీ సాహసించేవారుకారు. దానికి కారణం మరేమీకాదు. అటువంటి చర్యలే దేశీవర్తకుల్లో బలీయులూ అనుసరిస్తారు. కంపెనీవారి చేతలను ప్రశ్నిస్తే దేశీవర్తకుల్లో పెద్దలనూ ప్రశ్నించినట్లే! అప్పుడింకేమైనా ఉందా? రాజోద్యోగులు, నిజాంప్రతినిధులూ వారిచేతిలో మనుష్యులేనాయె. కంపెనీవారుగాని, దేశీవర్తకశ్రేష్ఠులుగానీ సమర్పించుకొన్నట్లుగా విలువైన బహుమానాలివ్వగలినవారా? తామితరవిధాలైనలాభాలు చూపగల్గినవారా? వ్యాపారాల్లో వాటాలివ్వగల్గినవారా? కాబట్టి రాజుకు మొరబెట్టుకొంటే న్యాయం జరుగకపోగా ఆగ్రహం తెప్పించినవారౌతారు. రాజు తల్చుకొంటే దెబ్బలకు కొదువా? అనీ, మనవాడుకదాఅని మొరబెట్టుకొంటే మరిరెండు తగల్నిమ్మన్నాడనీ సామెతలూరకే పుట్టలేదుకదా!

## VI

ఒకరోజున భైరి ఫేక్టరీకి వెళ్ళేప్పటికి కొత్తవారు నల్గురి నందులో బంధించి ఉంచారు. వయసుకు ముసలివారు కాకపోయనా జీవితంలోని రకరకాల ఆటుపోటులువారి నూరేళ్ళ జవసత్వాలను కొద్దికాలంలోనే పిండి వేశాయనిపిస్తూంది. వారిని చూచాక భైరి తనపనిలో ఏమాత్రమూ శ్రద్ధ పట్టలేకపోతున్నాడు. కానీ దుబాసీ ఈవేళ ముందుగానే స్వయంగా భైరిని పిలిచి

ఆబందీల విషయంలో అతనే మాత్రమూ కలుగజేసుకొనదూడదనీ. వారి అజా పజా బయటెక్కడా పొక్కనివ్వగూడదవీ గట్టి హెచ్చరికచేసి వదిలినాడు. భైరి ఆవేళకి మెదలకుండా ఉన్నాడు. వారెవ్వరా అని కుతూహల పడినా తన పనిలోతాను మునిగిపోయినాడు.

మరుసటిరోజు తిరిగి పనిలో ప్రవేశించేప్పుడు గమనించగా వారి ముఖాలు కొద్దిగా వాచిఉన్నాయి. ఒంటిమీద చర్మం కందినచారికలక్కడక్కడా కన్పిస్తున్నాయి. ఏ మందు ప్రభావమోగాని వారు కళ్ళుతెరచుకొన్నా స్మృతిలేని వారివలనే ఉన్నారు. భైరిమనస్సువారినిగురించి ఆందోళన చెందసాగింది. ఏం చెయ్యడానితోచక అతను కొట్టుమిట్టాడిపోయాడు. ఆ ఆరివారాన్ని దుబాసి శంకించి పెందలకడనే అతన్నింటికి పంపివేసినాడు. అందువల్ల భైరికి కొంత అవకాశం కలిసివచ్చింది.

దుబాసీ వారించినప్పుడణచిపెట్టిన అతని కుతూహలం ఈ వేళ ఇను మడించింది. ఈవేళ వారు హింసకు గురైనట్లు తెలుస్తూనేఉంది. బహుశ రేపింకా క్రూరమైన హింసలకు వారు గురౌతారు. ఇంక భైరి తాళలేకపోయాడు, వారినెలాగైనా విడిపించాలని అతనికి కోరిక కలిగింది. వెంటనే ఉరుకులమీద కోరంగి చేరుకొన్నాడు. మిత్రులను సమావేశపరిచాడు. విషయం తెలిపాడు. వారు కూడ సై అంటే సై అన్నారు. అనేకవిధాల సాధక బాధకాలన్నీ చర్చించి ఎలాఅయితే వారిని విడిపించవచ్చునో ఒక పథకం నిర్ణయించుకొన్నారు.

పడవలో సముద్రం మీదుగావెళ్ళి యానాం గట్టుమీద చీకటిపడేదాకా తుప్పల్లో దాగుకొన్నారు. రాత్రి కాగానే వారికి కొంతసేపు ఫాక్టరీనుండి ఆర్తనాదాలు వినిపించి సమసిపోయినాయి. పల్లెమొత్తం గాఢంగా నిద్రపోయాక ఈ గుంపందులో ప్రవేశించి, ఫాక్టరీ ఆవరణలో తెలివితప్పిపడుకున్న వారిని కట్లు విడిపించి మోసుకొని ఇవతలికి వచ్చేశారు. కాపలావాడు నిర్లక్ష్యంగా నిద్రపోతున్నవాడల్లా ఏం అలికిడి విన్నాడో లేచాడు. కొద్ది సేపట్లోనే ఖైదీలు పారిపోయినట్లు

తెలుసుకున్నాడు. కేకలువేశాడు. కానీ అందులో బలగం చాలామంది తప్పతాగి పడుకున్నవాళ్ళు కావడంచేత కొందరే లేచారు. ఇతర గ్రామస్థులకు ఫాక్టరీలో ఇటువంటి గొడవ లప్పుడప్పుడూ మామూలేకాబట్టి, వారు తలుపులే తెరవలేదు. కానీ ఈ గొడవవల్ల భైరీవాళ్ళూ వెంటనే పడవ బయలుదేర దీయడానికి కనుమానించారు. తెడ్లచప్పుడువల్ల పడవనడక తెలుస్తుంది. ఓడల వారెవరైనా గ్రామంలోని అలజడి విని తమ్మనుమానిస్తే వెంబడించి తరిమి పట్టుకొన గలరు. కాబట్టి కొన్ని గంటలెక్కడో దాగుకోవాలి. ఇదిగాక ఖైదీల ముఖాన ఇన్ని మంచి నీళ్ళైనా కొట్టితేగానీ తప్పని పరిస్థితిగా ఉంది. మంచినీళ్ళివ్వగల వారెవ్వరిక్కడీవేళప్పుడు? సందుల్లో ఒకటి రెండిళ్ళు ప్రయత్నించారు గానీ ఎవరూ తలుపులే తీయలేదు.

ఇంతలో తమకోసం గాలింపుకూడా తీవ్రమైన సూచనలు తెలియ వస్తున్నాయి. విడిపించిన బందీల్లో ఒకడు దాహంవల్ల ఆర్చుకొనిపోయి "దాహం"అంటున్నాడు. అతనికిప్పుడు దాహమివ్వకపోతే విడిపించబోయి చంపేసినట్లవుతుంది.

ఊళ్ళోఎక్కడా దీపమైనాలేదు. "ఛీ ఛీ. మరచిపోయాం. పడవలో కుండనింపుకోవాలన్న జ్ఞానమొక్కడికీ లేకపోయింది ?" అని తమ్ముతాము తిట్టుకున్నారు. చివరకొకడు తెగించి కొంచెం దూరంలో గ్రామానికెడంగా ఉన్న మంజరి ఇల్లు చూపించి అక్కడికి పోదామన్నాడు. భైరి అభ్యంతరం చెప్పాడు.

"దాని సంగతి తెలసే అంటున్నావా ఈ మాట ?"

"ఆ:"అన్నాడు మిత్రుడు.

భైరి కోపంగా "ఏంతెలుసు ? మా యజమానెప్పుడూ అక్కడే పడుంటాడు. లేకపోతే ఆడదానికోసం ముఖంవాచిన దుర్మార్గుడింకొక డెవడో ఉంటాడు'. "కాబట్టే ఫరవాలేదంటున్నాను" మిత్రుడంతకంటె తాపీగా జవాబిచ్చాడు.

భైరి క్షణమాలోచించి "సరేపద" అన్నాడు.

అక్రమమైన అతిశయ కామప్రవృత్తికి మురుగులు కల్పించే వ్యాపారంలో ఈ చుట్టుపక్కల రేవుల్లోకెల్లా మంజరిదే అందెవేసినచెయ్యి. ఆమెవద్ద దిక్కుమాలిన దాసీలెందరో ఉన్నారు. విదేశీయులందరూ ఎఱిగిన పోర్చుగీసు భాష నామె బాగాఎరుగును. ఫ్రెంచి, ఇంగ్లీషుముక్కలూవచ్చును. ఆమె దాసీలకూ ఈభాషలు నేర్పుతుంది. ఆమె కొజ్జాలనుకూడా చాలమందిని పోషిస్తుంది. ఆమెభవనంలో కాలక్షేపంచేసినామని చెప్పుకొనగల్గడం ఈ చుట్టుపక్కలవారికొక గొప్పక్రింద ఉంటూంది.

మొదటి రోజుల్లో ఆమేమి పాట్లుపడిందోకానీ ఇప్పుడున్నత స్థితిలోనే ఉండనాలి. ఇక్కడి పెద్దవారంతా ఫాక్టరీ ఉద్యోగులు మొదలు నిజాం ప్రతినిధుల వరకు – తమమీద విశేషాధికారం గల్గిన పెద్దలు వచ్చినప్పుడు వారిలో సరసుల కాతిథ్యం నెరపేందుకే ఈమెను బతిమాలవలసి వస్తూంది.

ఇప్పుడు ఫ్రెంచివారి కతిథిగా వచ్చిన ఒక డచ్చి ముఖ్యోద్యోగి సంపూర్ణంగా ఆమె వశంలో ఉన్నాడు. అతన్ని మరిపించి తన ఆశ్రయానికైవచ్చిన వారిని పరిశీలించేందుకామె పెద్దకష్టంలేకుండానే వచ్చింది. ఫాక్టరీ యజమానికూడా మరొక పరిచారికతో మరొక గదిలో ఎక్కడోపడుకున్నాడు. అతనిలెక్కే లేదు.

మంజరి భైరినిగానీ అతని మిత్రులనుగానీ గమనించకుండా నేరుగా పలాయితులవద్దకువెళ్ళి ఒక్కొక్కరినీ పరకాయించి చూసింది. అందులో ఒకవ్యక్తిని చూడగానే చాలా తొట్రుపాటుచెందింది. కాని వెంటనే నిభాయించుకొని వారిని విడిపించుకువచ్చిన భైరి బృందాన్ని చూచింది.

"వీరి నీరాత్రిపూటెక్కడికి తీసుకొనివెళ్ళగలరు? ఇక్కడక్షేమంగా ఉంచుతాను. మీరు వెళ్ళవచ్చు" అంది.

భైరి మిత్రునివైపు సనుమానంతో చూచాడు. ఎవ్వరూ పలకలేదు.

"మీరు నన్ను నమ్మినా నమ్మకపోయినా చేయగల్గిందేమీలేదు. మీ ప్రాణాలు నా చేతిలో ఉన్నాయి' ఈ మాటలు నవ్వుతూనే రెచ్చగొట్టే ధోరణిలో అంది.

భైరి కరికాలిమంట నెత్తికెక్కింది. కోపంగా "అందరి ప్రాణాలూ భగవంతుని చేతిలోనే ఉన్నాయి !"అన్నాడు.

బృందమంతా నిశ్శబ్దంగా, కొట్టుకుంటున్న గుండెల చప్పుడువింటూ నిల్చున్నారు.

భైరి హటాత్తుగా ఒక బందీని భుజంమీదికెత్తుకొని "చూస్తారేం ? పదండి. ఎవరడ్డుకొంటారో చూద్దాం !" అన్నాడు. క్షణంలో అందరూ ఒక్కొక్కరిని భుజాలమీద కెత్తుకొని ముందు కడుగు వేశారు.

"మీ సాహసం చాలుగానీ అదిగో అటుచూడండి ?" అంటూ గోడపైని ఒకతెర తొలగించింది. గవాక్షంగుండాచూస్తే కొద్దిదూరంలో సిపాయిలు, ఫ్రెంచి సైనికులు కొందరూ ఇక్కడికి వస్తున్నారు. వారి దృష్టిని పడకుండా ఈ ఇంటినుండి బయటపడటం దుర్ఘటం.

"ఇప్పుడైనా చెప్పినట్లు వింటారా ?"

ఎవ్వరూ కదలలేదు. కొంతసేపలాగే నిల్చుకొన్నారు. ఈలోపున బయట కేకలు విన్పించసాగినాయి.

మంజరి తీక్షమైన ధోరణి వహించి "నాకు మిమ్మలను రక్షించాలనే ఉంది. కానీ మీరూ సహకరిస్తేగానీ ఆ ఉద్దేశం నెరవేరదు. నేను చెప్పినట్లు చేయండి."

ఆమె వెంటనే సేవకుణ్ణి పిలిచి ఏవో ఉత్తర్వులిచ్చి క్షణంలో దచ్చి యజమానివద్దకు వెళ్ళింది.

మత్తులోఉన్న అతనికి కొద్దిగా మెలకువ తెప్పించింది. హుషారుగొల్పింది. ఏమీ ఎరుగనిదానిలా అతనివద్ద వయ్యారాలు చూపనారభించింది. ఈ లోపున ఫాక్టరీకిచెందిన సిపాయిలు, టొపాసీలు బయటకాపలాదారులతో ప్రవేశానికై

తగవులాటమీది కతని దృష్టిని మళ్ళించింది. అతనిలో చికాకును కోపాన్ని రెచ్చగొట్టింది.

"అతిథి అన్న గౌరవమే ఉంచరు మీవారు ! మీరు విశ్రాంతిగాను, కులాసాగాను గడుపుతూంటే చూసి ఓర్చరు. కళ్ళల్లో నిప్పులు పోసుకొంటారు. కాకపోతే ఇప్పుడిక్కడి కెందుకూ?"

కొంతసేపాగి "అయినా వారి తప్పేముందీ ? వారెప్పుడేస్వల్ప కారణంమీద వచ్చినా ఒక్కసారైనా వారి నెంత పెద్దవారూ వారించరు. అటువంటి సమయంలో నాకెలా మండిపోతుందో మీకెలా తెలుస్తుంది?"అని కూడా అంటించింది.

ఇలా పీఠిక తయారుచేసి తానవతలికివెళ్ళి వారిని లోనికి రానివ్వవలసిందని కాపలావాళ్ళ నాజ్ఞాపించింది. వారు వచ్చిందే తడవు డచ్చి ఉద్యోగి వారిమీద విరుచుకొని పడినాడు. వారు, బందీలు తప్పించుకొనిపోయిన సంగతి చెప్పినప్పుడు మాత్రం నిర్ఘాంత పోయినాడు. అదిగమనించి మంజరి అతని కాలోచించే వ్యవధి ఇవ్వకుండా–

"వారు తప్పించుకొనిపోతే ఇక్కడ మీ రెవ్వరితో కులుకుదామని వచ్చారు ? వారిని వెంబడించి పట్టుకోక ? బహుశ మీ యజమాని లేకపోతే ఆ మాత్రమూ చేయలేరు కాబోలు !"

వారు కోపంగా "మాకా మాత్రం మీరు చెప్పేవరకూ తెలీదనుకోకండి. వారిని వెంబడిస్తూనే ఇక్కడికి వచ్చాం. వారిలాగే వచ్చారు!"

మంజరి ముద్దుగా ఏడ్పులు మొదలు పెట్టింది. "వీరు నా వృద్ధిచూసి ఓర్వలేక ఈర్ష్యతో నామీద కుట్రలు పన్నుతున్నారు దేవుడో! లేకపోతే మిమ్ముల నీవేళొకక్షణం విడిచిఉన్నానా? చెప్పండి. నాకు బందీల విషయమేం తెలుసు దేవుడో!"

“ మీకు తెలీకుండా మీ యింట్లో ఎక్కడోదాక్కొని ఉండవచ్చు. వారిలాగే వచ్చారు మరి.”

యజమానికి కోపమాగలేదు. కైపులోవారిని నానాబూతులుతిట్టాడు. మంజరేకలుగజేసుకొని వారిని తన యిల్లు సోదాచేసుకొనమని ఆహ్వానించింది. వారామె యిల్లంతా వెతికారు కాని ఎక్కడా అనుమానానికాస్పదం కలుగలేదు.

మంజరి కొన్ని పెద్ద గదుల్లో మధ్యన అలంకరణల మరుగున కొద్ది ఎత్తులో అద్దాలు నిలిపి కల్లనేలను సృష్టించి నిజమైన నేల మీద నేలమాళిగలకు త్రోవల నేర్పాటుచేసింది. అది వీరు కనుగొనలేక పోయినారు.

ఇంటి సోదా ముగిసిన తరువాత వారిని వెక్కిరిస్తూ మంజరి “ఇంకా రెండు ప్రదేశాలు మీరు వదిలివేశారు” అని నవ్వుతూ అపహసించింది.

వారు “ఎక్కడా?” అన్న ప్రశ్నార్థకమైన చూపు పెట్టారు.

“నా ఒడీ. మీ యజమాని పంట్లాముజేబులున్నూ”

అతిధికి కోపమాగనందున వారిని చెడబూతులు తిట్టి తరిమివేశాడు.

“పొద్దునకల్లా వారిని పట్టితేకపోతే ప్రాణాలు తీసేస్తాను జాగ్రత్త!”

వారు వెళ్ళిన కొంతసేపటికే తిరిగి యజమానిని మత్తులో పడ వేసేందుకెంతోసేపు పట్టలేదు.

తరువాతమె ఫ్రెంచి ఫాక్టరీ యజమానిని కూడ భయపెట్టి అవతలికి పంపివేసింది. ఇల్లు ప్రశాంతవాతావరణానికి వచ్చిన తరువాత మంజరి తిరిగి భైరి బృందం వద్దకు వచ్చింది. భైరి ఆమెకు కృతజ్ఞత తెలియబరచి వెళ్ళిపోయేందు కనుమతి కోరినాడు.

“బందీలను తీసుకొని వెళ్ళాలనే మీ పట్టుదలా? ఇంకా?”

“మరొక కారణంకాదుకానీ ఇక్కడికంటే మా గ్రామంలో అయితే వారు క్షేమంగా ఉంటారని మా విశ్వాసం”

ఈ చర్చకొంతసేపు జరిగాక చివరన ఆ పలాయితుల్లో మంజరి కోరిన ఒక్కరిని మాత్రం వదిలి మిగిలినవారిని తీసుకొని పోయేందుకు కంగీ

కారం కుదిరింది.

భైరీవాళ్ళు క్షేమంగా ఊరు చేరినారు.

రాత్రి ఇంత హంగామా జరిగినా తెల్లవారాక ఫాక్టరీవారు దొంగకు తేలుకుట్టినట్లూరుకోడం భైరి కాశ్చర్యకరంగా ఉండేది. కానీ తరువాత, విషయాలవగాహన ఐనట్లల్లా విదేశీ వర్తకులన్నా, వారితో భాగస్వాములైన వారన్నామండిపోయేది.

ఆపలాయితుల్లో కొందరు తెలుగువారు. మిగిలినవారు దక్షిణాదివారు. నీలిమందు వ్యవసాయం వృద్ధిచేసేందుకని వారి నిక్కడనుండి చాల ఏళ్ళ క్రిందట డచ్చి వారు తమకేంద్రాలకు తీసుకొని వెళ్ళినారు. ఇక్కడ చూపిన ఆశలు వేరు. అక్కడ వారిని చూసిన తీరువేరు. బానిసలకంటే అధ్వాన్నంగా చంపుతూంటే భరించలేక వారు తప్పించుకొని స్వదేశానికి వస్తున్నారు. తిరిగి త్రోవలో డచ్చివారికి దొరికి డచ్చిస్థావరాలకు కొనిపోబడుతున్నారు. అవకాశం దొరుకగా యానాంవద్ద తప్పించుకొన జూచి ఫ్రెంచి ఫాక్టరీవారికి పట్టుబడ్డారు. వారిని భైరి విడిపించినాడు.

వారివల్ల. డచ్చి కంపెనీవారు తూర్పుదీవుల్లో చేస్తున్న ఘోరాలు కొంతవరకు తెలియవచ్చాయి.

ఇక్కడ మన రాజమహారాజులకేకాక వారి చోపుదార్లకు, బంట్లకు, బంట్ల బంట్లకు కూడా ఎంతో అణకువచూపుతూ, ఎంత మర్యాదలైనా కనపరిచే ఈ వర్తకులే సమయం దొరికితే ఎంతకైనా తెగబడి రాజ్యాలకు రాజ్యాలే ఆక్రమించే ప్రమాదం ఉందని ఆలోచనా పరులు గ్రహించ గల్గినారు.

రాజులు బలహీనులైతే, ఆ అవకాశాన్నుపమోగించుకొంటారు, సులభంగా నెత్తి మీదినుండి నెత్తిమీదికి టోపిలవలె కిరీటాలు మారుస్తూ పెత్తనమంతా తాము వహిస్తారు. ప్రజల సంరక్షణలో నిమిత్తంలేదుకానీ ప్రజల జీవితసరళియావత్తు మాత్రం కంపెనీ ఉద్యోగుల లాభాలకోసం పరిభ్రమించాలి! ఉదాహరణకు మొలుక్కస్‌లో పూర్తిగా పెత్తనం సంపాదించిన తరువాత వారు చేసిన ఏర్పాటు ప్రకారం వారికి కావలసినచోట్ల మాత్రమే లవంగాలు వేయాలి. వారి ఏజంట్లకే

అమ్మాలి. వారిచ్చినంత డబ్బే, మారుచెప్పకుండా పుచ్చుకోవాలి. వారికక్కర లేకపోతే పంటకు వచ్చిన తోటలనైనా సరె, నాశనంచేయవలసిందేకాని మరొకరికమ్మడానికి వీల్లేదు. ఈపంథా వల్ల ఊళ్ళకూళ్ళే బ్రతుకలేక లేచిపోతున్నారు.

లవంగాలు అడవుల్లో సైతం సహజంగాపండే దీవి అది. ఊరికే వాటినక్కడనుండి ఏరుకొనివచ్చి అమ్ముకున్నా జీవనం జరిగిపోయేది. హాయిగా పూర్వం. అక్కడిప్పుడెంతో మందికి తిండికి జరగడమే కష్టం ఇప్పుడు తూర్పుదీవులన్నిటిలోనూ ఇదే జరుగుతూంది.

ఇవన్నీ పెద్దగా ప్రచారంలోకి రాకపోయినా, కొంతమందిలోనైనా ఈ వర్తకుల విషయమై జాగ్రత్తగా ఉండాలన్న భావంమాత్రం కలిగింది.

ఈ ఘటన తరువాత భైరికి తన ఉద్యోగమంటే అసహ్యంపెరిగింది. ఏదో మరొక వృత్తి చూసుకోవాలన్న పట్టుదలా లోలోపల పెరుగుతూంది. దీనికితోడు పరదేశివివాహానికి ముహూర్తం నిశ్చయించబడినట్లూ గ్రామంలో వెల్లడైంది, ఇందువల్ల గ్రామంతరం పోవాలన్నకోరిక కూడా అతనిలో కలుగసాగింది. గ్రామస్థుల సానుభూతి వాక్యాలకోతనుండి తప్పు కొనేందుకదొక్కటే మార్గం మరి!

ఇలా ఉండగా ఒకరోజున మంజరి భైరికోసం కబురు పెట్టింది.

భైరివెళ్లాలా వద్దా అని ఆలోచించుకొన్నాడు. ఆ రోజునైతే ఆపద్ధర్మంగా వెళ్ళాడు కానీ ఈరోజున అవసరమేముంది? భైరి ఎప్పుడూ సాని కొంపలుచూసి ఎరుగడు. అతని తండ్రిగానీ బాబయ్యగానీ, కడకు మేనమామ మీరయ్యగానీ ఈవ్యసనానికి దాసులుకారు. వారు సానివారి కుతంత్రాల గురించి, సానివారివల్ల పాడైన సంపన్నులనుగురించి కథలుచెప్పగా మాత్రం విన్నాడు. కాబట్టి వెళ్ళకూడదను కొన్నాడు. లోపల మాత్రమనుమానం పీడిస్తూనేఉంది. "ఏదైనా అవసరముండి పిలిచిందేమో! తాను విడిపించినవారు క్షేమంగా దాదాపు స్వస్థలాలకు తరలినట్టేగానీ, మంజరింట్లో దిగవిడిచిన పలాయితుని విషయం తాను తరువాత

తెలుసుకొనలేదు.  ఆ విషయమేదైనా మాట్లాడాలేమో! ఆమాత్రానికారోజున అహంకరించి కాని పని మీద వేసుకోవడమెందుకూ?'' అని కూడా అనుకొన్నాడు.

ఈ దశలో ఇంతకుముందు సిగరెట్టుకోసం బెంగపెట్టుకొన్న గిరజాల జుట్టు విద్యార్థిక్కడ ఉద్వేగాన్నాపు కొనలేక  కలుగజేసుకొన్నాడు.

"స్త్రీ ఏపరిస్థితుల్లో నైనా ఆరాధ్యదేవత. తుచ్ఛశారీరకమైన దృష్టితో స్త్రీని కొలిచి విలువకట్టాం కాబట్టే మనమిలా అధోగతిలో ఉన్నాము!" అని ఒక టపాకాయ వదిలాడు. రెలెటివిటీ సిద్ధాంతం వంటి దానిమీదకూడా గంటలకుగంటలే తెలియకపోయినా గొంతుచించుకొని వాదించగల సమర్థులం మనం. ఇంకిటువంటి విషయాలా? అందరూ తలొకమాటా అందుకొన్నారు.

''సానిది  కబురుపెట్టితే ఇంతనుమానపడి  తట పటాయించే ప్రవరాఖ్యులాకాలంలోనూ ఉన్నారన్నమాటే.''

"పాశ్చాత్యులను సైతం ఆకర్షించగల స్త్రీ తానుగా  పిలిస్తే వెళ్ళనివాడు ఛీ, ఛీ, శుద్ధ బ్రూట్‌రోయ్! మనకింకా ఎప్పుడబ్బుతుందో సివిలి జేషన్ మరి!"

"సత్యం శివం సుందరం అన్నారోయ్.  సౌందర్యోపాసన చాతకాని దేశమైపోయిందోయ్ మనదేశము".

ఈ సారి  స్థూలకాయు డందరినీ నోరు మూయించి, కసితీర్చుకొని కథ కాటంకంలేకుండాచేశాడు.

'మంజరి భైరికోసం మరొకసారి కబురుచేసింది. భైరిఅశ్రద్ధచేశాడు'' పడవవాడు తన కథ కొనసాగించాడు.

విద్యార్థులొకరిద్దరు దారుణాన్ని భరించలేమన్న భావాన్ని  వ్యక్తం చేయకుండా  ఉండలేకపోయారు. మిగిలినవారు వారికంతకు మించిన ఛాన్సివ్వలేదు.

''మంజరీసారి చాలనిష్ఠురంగా కబురుపెట్టింది.  భైరిక నిర్లక్ష్యం చేయలేకపోయాడు. ఎందుకా అని సంకోచిస్తూ మంజరింటికి వెళ్ళినాడు. మంజరి

అతనికెంతో అప్యాయంగా స్వాగతం పల్కింది. ఇప్పుడతను చూస్తున్న మంజరి పూర్వపు మంజరిలా లేదు. దీనంగా ఉంది. ఏ ఆభరణాలు తొడుగుకొన లేదు. కట్టుకొన్న చీర అతి సామాన్యమైనది. కొప్పందంగా సవరించుకో లేదు. తాంబూలంతో నోరు, పెదవులు ఎరుపెక్క లేదు. అత్తర్ల సువాసనలతో ఒళ్ళు గుబాళించిపోవడంలేదు.

"ఇదేం ? ఈ విరాగిణి వేషం అనుకొంటున్నావా !"

భైరి పల్కలేదు.

"నిజమే. ఎవరికైనా విడ్డూరంగానే ఉంటుంది. కానీ ఇందులోనే నాకు పరపమానందం కన్పిస్తూంది. నిజంగా ఇంత సంతోషం నాలో ఎప్పుడూ లేదు."

భైరి గుడ్లప్పగించి వింటున్నాడు.

"ఆ రోజు నేను బ్రతిమాలగా విడిచి వెళ్లావే, అతను మా అన్న. బ్రతికిన వాళ్ళలో అతనొక్కడే ఇప్పుడు నాక్కావలసినవాడు. అతనెప్పుడైనా ఇటురాకపోడు. తూర్పుదీవులకు వెళ్ళినవాళ్ళలో చాలమంది మనవాళ్ళు తప్పించుకొని వచ్చేస్తున్నారు అనుకొనే ఈ విధంగా పలాయితులందరికీ ప్రాణాలకు తెగించి ఆశ్రయమిచ్చి పంపేదాన్ని. మా అన్న ఈ ఇల్లు చేరినప్పుడు నా అదృష్టం పండిందనే అనుకొన్నాను. కానీ అది చీకట్లో మెరుపు మెరిసినంత మాత్రమేనని అప్పట్లో తెలియలేదు."

"ఏమైంది ? తిరిగి ఎక్కడైనా పట్టుబడ్డాడా ? ఎక్కడా అటువంటి వార్త వినలేదే." భైరి ఆత్రంగా ప్రశ్నించాడు.

మంజరి కళ్ళనిండా కమ్మిన నీళ్ళు క్రిందకి జారిపడేలా క్షణంపాటు రెప్పలదిమి పట్టింది.

భైరి, విషయం తెలియక ఆత్రంగా ఆమె ఏంచెప్తుందోనని ఎదురు చూస్తున్నాడు. మొదటి పిలుపుకే తానిక్కడికి రాకుండా కాలయాపనచేసి నందుకు తిట్టుకొన్నాడు.

"అతను నన్నసహ్యించుకొని అనకూడనివన్నీ అని ఛీకొట్టి వెళ్ళి

పోయాడు.”

“ఎందుకు?” అని అంతలోనే సిగ్గుపడి నాలుక కరచుకొన్నాడు.

“మంజరి అంత విచారంలో భైరి అమాయకత్వానికి నవ్వింది. “మాఅన్న నన్ను క్షమించలేకపోయాడు. ఎన్నడో అతడు వస్తాడనీ నన్నీ రొంపిలో నుంచి బయటికిలాగి నా(బ్రతుక్కొక పరిష్కారం చూపుతాడనీ ఆశించినదంతా వమ్మైపోయింది.” ఈమాటల నామె నెమ్మదిగా అంది.

“ఇంక నాకు జీవితంలో ఏమీ మిగలలేదు”

భైరికేం మాట్లాడాలో తోచలేదు. జాలిగా మంజరివైపే చూస్తూ కూర్చున్నాడు.

మంజరికంటే భైరి వయస్సులోనూ అనుభవంలోనూ కూడా చాల చిన్నవాడుమరి. అట్లని మంజరి కూడా చాల పెద్దామెకాదు. భైరితో పోలిస్తేమాత్రం చాలపెద్దది. అంతే.

“నీ సానుభూతి ఆశించీ, నీ సహాయమపేక్షించీ నిన్ను పిలిచాననుకొనవద్దు.”

“ఏం? ఏ సహాయమైనా ఎంత సాహసించియైనాచేస్తాను. చెప్పితే”

“ఆ మాటన్నావు! చాలు! నాకే సహాయమూ అక్కరలేదుకానీ, నిన్ను చూస్తూంటే నీవు మామూలు యువకుల్లాంటి వాడవు కావనీ, మహత్కార్యం సాధించవలసిన వాడివనీ, నాఅంతరాత్మ ఘోషిస్తూంది. ఎందుకు, ఎల్లాగ అంటే చెప్పలేననుకో. నీవు నన్ను కొన్నాళ్ళ క్రితమేచూచావు. కానీ నిన్ను గురించినాకు చాలకాలంగా తెలుసు. పెద్దింట్లో ఎదుగుతున్న కుర్రవాళ్ళను గురించి తెలుసుకొని వారి నాకర్షించడమూ నిన్నటిదాక నా వృత్తి కవసరంగా ఉండె మరి. మొదట్నుంచీ నీ తరహాయేవేరు.”

“అ ం టే”

"నీకు జీవించడంలోనేకాక ఆలోచించడంలో కూడా ధైర్య సాహసాలున్నాయి. ఈ రెండవ సుగుణం మామూలుగా అరుదు. మనదేశంలో మరీను,"

భైరికి తెలిసినంతవరకూ తన ఆలోచనా పద్ధతినీ. నడవడినీ విమర్శించినవారున్నారు. పరిహసించినవారున్నారు. జాలితలచినవారున్నారు. సహించి మాట్లాడనివారున్నారు. కానీ ఈవేళ మొదటిసారి తాను మంజరి నోట మెచ్చికోలు వింటున్నాడు. ఆ మాటే మంజరితో అన్నాడు.

మంజరి దాన్నొక్కనవ్వుతో కొట్టిపారవేసింది.

తరువాత తన భావాన్ని కొంత వివరించింది. "లోకమంటే ఏమిటి తమ్ముడూ? మన ప్రభావం ఎవరిమీద పడుతుందో వారు. మన మీద ఎవరి ప్రభావం పుడుతుందో వారు ఇట్లే పరస్పరప్రభాం ప్రసారమయ్యే ప్రకృతి. ఇప్పుడు నీలోకంలోని పండితులు చూద్దామా – వారివి వల్లెవేసిన చదువులాయె. పామరులు చూద్దామా వారివి పొట్టకోసమైన గానుగెద్దు బ్రతుకులాయె. బాగా జరుగుబాటుకల్గి అంతో ఇంతో వ్యవధికల్గినవారిని చూడగా, వారివి గంగిరెద్దు బ్రతుకులాయె. లేదా భోగలాలసులై ఎప్పూడూ మత్తులో
పడిఉంటారాయిరి. లేదా తెలివితేటలున్న కొందరి విషయం చూడగా వారి శక్తి సామర్థ్యాలన్నీ గద్దెలకొసం, కొల్పుకూటాల్లో పదవులకోసం కుయుక్తులతో ఘర్షణలతో వెళ్ళిపోతూండె. ఇంక వారందరికంట భిన్నంగాఉన్న నీబోటివాణ్ణి చూస్తే విడ్డూరంకాక మరేమిటి?"

"అయితే నావల్ల కావలసిన కార్యం?"

"ఓ! చాలఉంది తమ్ముడూ. అది నేను నిర్వచించిచెప్పగల్గిందికాదు. నీకు నీవే తెలుసుకొనవలసిందే. అయితే నాబోటివాళం నీకు పరిస్థితులు వివరించి చెప్పగలము. సమస్యను చూపగలము. పరిష్కారం నీవుచూపాలి. భగవంతుడు నీకు తోడ్పడాలి. అంతే!"

ఈ రీతిగా మంజరి భైరిలో కొత్త ప్రేరణ కల్గించింది.

ఆమె తెలుగుదేశంలో ప్రశాంతపరిస్థితులు తొలగేందు కారంభమైననాటికే, ఈడువచ్చిన పిల్ల. అప్పటికి వారికుటుంబ మున్నతస్థితిలో ఉండేది. తండ్రిది రాజోద్యోగం. ఒకఅన్న బట్టలునేయించే పని చూస్తూ కాకినాడలో డచ్చివారితో స్నేహంగా ఉండేవాడు. మరొక అన్న సైన్యంలో చక్కని ఉద్యోగం చేసేవాడు. హజీహుస్సేన్ దాడి సందర్భంలో మీతిమీరిన రాజ భక్తులుగా నడుచుకొన్న నేరానికి తండ్రీ సైన్యంలోని అన్నా కుల్లామినారులకు తల లివ్వవలసివచ్చింది."

"అంటే" విద్యార్థుల పృచ్ఛ.

"కుల్లామినారులు బాబు!" ఆ మాత్రం తెలియదా అన్నట్లుగా పడవవాడు మాట్లాడాడు.

" ఆ!?"

"తలకాయల గోపురాలు బాబూ ?"

''అవేమిటి!'' తిరిగి అదేప్రశ్న ఇనుమడించిన ఆశ్చర్యంతో మిగిలినవారురెట్టించారు.

"తలకాయ గోపురాలు బాబూ" పడవవాడా అర్థాన్నే మరొకసారి చెప్పాడు.

అందరూ విద్యార్థి నాయకునివైపు ఉంత్కంఠతోనూ, ఆశ్చర్యంతోనూ చూశారు.

రాముడు కొంత ఊహించుకొనిన్నీ, బృందనాయకుడేం చెప్తాడో విందామని అతనివైపు చూచాడు. అతను చరిత్రజ్ఞాపకం చేసుకొని ఇలా చెప్పాడు.

"దక్కను సుబాదారైన నైజాము, మొగలుసామ్రాజ్యం నుండి స్వాతంత్ర్యం ప్రకటించుకొన్న తరువాత, ఉత్తరసర్కారుల్లో బకాయిపడిన కప్పములకోసం కట్టుదిట్టమైన ఏర్పాట్లు మొదలుపెట్టాడు. అన్వరుద్దీనునీ సర్కారులకు నవాబుగా నియమించారు. అతడుత్తర సర్కారుల్లోనన్ని సంస్థానాలను దారిలో పెట్టేందుకై హజీహుస్సేన్ నాయకత్వాన ఒక సైన్యాన్ని పంపాడు. అది సుమారు 1734 వ సంవత్సరంలో. ఆ సైన్యాన్ని ఏలూరు వద్ద మొగలుతుర్తి, నూజివీడు

సంస్థానాధిపతులు ఎదిరించి ఓడిపోయారు. ఆ తరువాత తిరిగి వారు పెద్దాపురం మొదలైన సంస్థానాధిపతులతో కలిసి ప్రతిఘటన జరుపుసన్నాహంలో ఉండగానే (హజీహుస్సేన్) రుస్తుంఖాను గోదావరిని దాటేశాడు, అతడు రాజమండ్రి వద్దందరినీ కలిపి తిరిగి ఒకసారి ఓడించాడు. బీటలు వేసినా గోల్కొండ సామ్రాజ్య పటిమ ఈ అల్పసంస్థానాల పటిమ నింకా మించేఉంది. పిదప ఈ రుస్తుంఖానుడే పెద్దాపురంవద్ద విడిసి ఆ సంస్థానరాజపుత్రుల మరణానికి కారకుడైనాడు. అతనే ప్రత్యక్షంగా చంపించాడో లేక రాజపుత్రులఆత్మహత్యో నిర్దుష్టంగాతెలియదు. ఆత్మహత్యకూడా పౌరుషానికీ గొప్పకూ చిహ్నంగా ఎంచేరోజు లవి మరి!

ఇలా విజయం సాధించిన రుస్తుంఖానుడేడేండ్లు రాజమండ్రి కేంద్రంగా పరిపాలన చేశాడు. మహచండ శాసనుడుగా పేరుగాంచినాడు. ఈ చండశాసనత్వం ఎవరిమీద చూపాడన్నది వివాదాంశంగా ఉంది."

"నీవు ప్రతి విషయాన్ని వివాదాంశంగా కల్పించడంలో ఘనుడివి కదా ?" స్థూలకాయుడు వెటకారంచేశాడు. "ఔను ప్రతిదాన్నీ ప్రశ్నించు. దేన్నీ తర్కించకుండా అంగీకరించకు,' ఇదే నా నినాదం !"

"ఇంతకూ కుల్లామినారులంటే చెప్పనేలేదు."

"దానికే వస్తున్నా–సామాన్యప్రజలమీద క్రౌర్యం జరిపి ధనార్జనా పరుడయ్యేడో లేక సామాన్యులనూరైతులను, నేతవారిని, ఇతరవృత్తుల వారినీ – పీడించుకుతినే అల్పప్రభువులను, జమీందార్లను నిర్దాక్షిణ్యంగా అణిచివేసేందుకు దమన నీతి ఉపయోగించి జనరంజకుడయ్యేడో పరిశోధిస్తే గానీ చెప్పడం కష్టం. ఆ రుస్తుంఖానుడొకసారి పరారైన శత్రుపక్షం వారందరీని తిరిగివస్తే క్షమిస్తాననీ, మామూలుగా వారి పూర్వపుస్థానాలు వారాక్రమించు కొనవచ్చుననీ ప్రకటించాడు. కానీ నమ్మివచ్చిన వారందరినీ నరికించి వారి తలలతో రెండు గోపురాలు నిర్మించేడంటారు. వాటినే కుల్లామినారులని పిలిచేవారనుకుంటాను."

పడవవాడు దీన్ని సమర్ధించుతూ “అదంతే బాబూ. ఇలా మంజరి తండ్రీ అన్నల్లో ఒకడూ కుల్లామినారులకై బలియైపోయిన తరువాత మిగిలిన అన్న తనకూప్రమాదం వాటిల్లవచ్చునని భయపడి కాకినాడలో డచ్చివారి పంచన చేరాడు. వారతనికి మాయమాటలచెప్పి తూర్పుదీవులకు తీసుకొని పోయారు. ఇతను వ్యవసాయంలో దిట్ట. నీలి పండించడంలో ఈ ప్రాంతానికే పేరువొసినవాడు. అందుచేత ఇతన్నా దీవుల్లో నీలి వ్యవసాయం ప్రారంభించేందుకు తీసుకొని వెళ్ళారు. ఇక్కడినుండి కొందరిని దక్షిణాదినుంచి కొందరిని ఇలా చాలమందిని వారు తీసుకొని వెళ్ళారు.

ఇక్కడెలాంటి ఆశలుచూపిఉండినప్పటకి అక్కడ పరమబాధాకరంగా చూచేవారు. కులాలన్నిటినీ, సర్వం జగన్నాథంచేసి మాలమాదిగలను కూడా తిండిదగ్గర, వాసంలోను ఏకంచేసేవారు. మాల మాదిగలూ సవర్ణులూ అందరూ ఒకేచోట నీళ్ళుత్రాగాలి. ఇంకా మతంపుచ్చుకోమని నిర్బంధం. మనమతాన్నస్తమానమూ పరిహసిస్తూండడం. మీ దేవునికి నీతేలేదు. జలంధరుణ్ణి చంపలేక అతని భార్యను మానభంగం చేసినవాడు. అటువంటతన్ని పూజచేస్తే ఏమొస్తుందయ్యా? మా క్రీస్తు పాపాలన్నిటి నివారణకూ తన రక్తాన్నిచ్చాడు. ఈ రీతి దైవదూషణ అప్పుడప్పుడూ వినాలి.

ఇవొక ఎత్తు – ఇవిగాక తిండికే ఒక్కొక్కసారి ముఖంవాచిపోవలసివచ్చేది. సరిగా కూలీ ఇచ్చేవారే కాదు. డచ్చి వర్తకులకు స్థానికంగా దేశీయ వర్తకులూ, భూఖామందులూ ఏజంట్లుగాఉండేవారు. వారిక్రౌర్యాలు చెప్పతరం కాదు. ఏమాత్రం పనిలో తేడావచ్చినా చావగోట్టేవారు. పని చేసేవారి దేహస్థితితో వారికి నిమిత్తమేలేదు. వారిక్రింద సామాన్యుల పని గొడ్లకంటే అధ్వాన్నంగా ఉండేది. ఇంకింతకంటే ఘోరం ! వారి ధరవరల అననుకూలాలనుబట్టి పంటలను నాశనం చేయమనేవారు. రక్తమంతా ధారాపోసి పెంచిన పైరును నాశనం చేయవలసివస్తే రైతుపడే బాధతో వారికేనిమిత్తమూ లేదు.

అక్కడున్న ఇలా అఘోరించగా మగదిక్కులేని మంజరి కుటుంబం పరిస్థితి దినదినానికీ దిగజారింది. తల్లికి పిచ్చిపట్టిపోయింది. మంజరి మగదిక్కులేని పిల్లై పోయింది. ఈడు వచ్చింది. అందమైనది. ఎంత కొల్లబోయినా ఇంకా సంపదఉంది. ఇక చెప్పేదేముంది? అక్కగార్లకుమంజరి సంపదమీద, బావగార్లకు మంజరిమీద కన్నుపడింది. దాయాదులు సరేసరి. గారాబంగా పెరిగి ప్రపంచం తెలియని పిల్ల మంజరి ! ఏంచేయగలదు పాపం ? కానీ ఆశ్రయాన్నెన్నుకొనే హక్కుమాత్రం ఆమెకుంది. ఆమె ఎన్నికను ఖరారు పరిచే బాధ్యత పంచాయితీకుంది.

తియ్యనిమాటలకు బెల్లింపులకుమోసపోయి మంజరి పరమనీచుడైన ఒక బావగారి ఆశ్రయా న్నెన్నుకుంది. పంచాయితీ పెద్దల్లో యోగ్యులామెను వారించారు కానీ ఆమె పెంకితనంవహించి వారి మాటలువినలేదు. ఈ పెద్దరికం స్థిరపడీపడకుండానే ఈ పిల్లనొక అయోగ్యునికి కట్టబెట్టాడు. అతని చాటున తానేలుకొనవచ్చునని లోపల దురుద్దేశం. మంజరి తిరుగబడింది. అక్కడినుంచి ఆమె అనేకకష్టాలకుగురై చివరకిక్కడికి చేరుకొని "వృద్ధి"లోకి వచ్చింది. ఆమెకిన్నాళ్లూ ఒక్కటే ఆశయం. తన అన్నయ్య తూర్పుదీవుల్లోనుంచి వస్తే అతన్నొక యింటివాణ్ణిచేసి, తన సంపద అతని పిల్లలకప్పజెప్పి తనదోవ తాను చూసుకోవాలి. అతను నిజంగానే వచ్చిన రోజెంతోసంబరపడింది. తానతనికంటబడకుండా అతనికిసకల మర్యాదలు నెరపింది. తనకుపకారంచేసిన వారెవ్వరోతెలియనంతకాలంఅతడు చాలాకృతజ్ఞత వెలిబుచ్చుతూ గౌరవం నెరపుతూవచ్చాడు. (వెనకాలే అనుకొండి) కాని ఈమె తన చెల్లెలే అని తెలుస్తూనే ఈసడించాడు. ఇలా బ్రతికేకంటే ఆనాడే చావలేకపోయావా అన్నాడు. మంజరి బ్రతిమాలింది. ఎటువంటి పరిస్థితులల్లో తానిలా అయిందో వివరించింది. ఏప్రాయశ్చిత్తానికైనా సిద్ధమేనన్నది. ఏడ్చింది. మొత్తుకుంది. వేడుకుంది. కానీ వాడునిర్దయతో ఆమె గుండెలమీదుగా నడిచి వెళ్ళిపోయాడు. ఆమె ఆత్మహత్యకుపాల్పడాలనుకొంది. కానీ ఆ ఆలోచననుండి తన సంస్కారంబలంతో గడిచిగట్టునపడింది. ఇప్పుడామె శూన్యజీవితానికేదో కొత్త ఆశకావాలి. తమ

కిష్టంలేకపోయినా ఈ వృత్తి చేపట్టిన ఆమ్రపాలివంటి నర్తకులెందరో తమ జీవితాన్ని గట్టెక్కించుకొనగా లేనిది తనకు మాత్రమెందుకు సాధ్యపడకూడదు ? అని ఆమె ఆలోచించింది. తన పరిస్థితులనుబట్టి తనవల్ల నెరవేరగల్గిందేమిటనికూడా ఆమె దీర్ఘంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది. ఈ మధ్య పరాసువారి తరహచూస్తూంటే వారేదో పెద్దఎత్తులు వేస్తున్నట్లే తోస్తూంది. పాండిచేరికి గవర్నరుగా డూప్లే వచ్చినప్పటినుండి దక్షిణాదిలో జరుగుతున్నవిషయాలు చాల అనుమానాస్పదంగా ఉన్నాయి. ఈ మధ్య విదేశీయులు బహిరంగంగా సంభాషణల్లో స్థానిక ప్రభువులను, వర్తక శ్రేష్ఠులను ఎంతగౌరవిస్తూంటారో తమలోతాము మాట్లాడేసమయాల్లో అంతచులకనగానూ ఈసడిస్తూమాట్లాడటం తరచు చూస్తున్నది. విదేశీవర్తకులు తామిక్కడ లాభాలార్జించేందుకిన్నాళ్ళూ ఇక్కడి వర్తకులతోనూ పారిశ్రామికులతోనూ లాలూచీపడుతున్నారు. కానీ అయోగ్యులైన రాజుల అండదొరికితే అంతాసొమ్మే ! ఎవరికీ వాటాలేని లాభాలు స్వేచ్ఛగా అనుభవించవచ్చు. దానివల్ల రైతులకు పనివారికీ కలిగేబాధలతోనూ, సమాజంలో దిగజారే అమానుషకరమైన స్థితిగతులతోనూ వారికి నిమిత్తంలేదు, ఇదీవారి ఆలోచన. రాజకుటుంబాల్లోని కలహాల్లో వారెలా కలుగజేసుకొందామాఅని చూస్తూన్నారు. ఇప్పుడిప్పుడే తనకీవిషయం చూచాయగా తెలుస్తూంది కానీ ఇక్కడివారికేమీతెలియడమేలేదు. ఇదిజరుగనివ్వకూడదు తనచేతనైనంతా వీరి ఆటలుసాగకుండా చేయటమే తనకొక లక్ష్యంగా ఏర్పరచుకొన్నది. ఆకృషికి ముఖ్యకర్తగా భైరినెన్నుకొంది, ఈ ప్రేరణకు భైరికూడా మనస్ఫూర్తిగా ఆమోదం చూపినాడు.

అప్పుడప్పుడు భైరి మంజరి ఇంటికి పోయేవాడు, ఆమె చెప్పిన విషయాలు నెమరువేసుకొంటూ ఇంటికివెళ్ళేవాడు. గట్టుమీద పరధ్యానంగా నడుస్తూన్న ఆ సుపుత్రుణ్ణి కోరంగి గర్వంగా చూసుకొని సంతోషించేది. అతనినీడను చెదరకుండాపట్టుకొని అందులోని ముఖకవళికలనుగమనిస్తూ అతన్నే అనుసరించి ప్రవహించేది. అతనుకోపం చూపితే ఆమె మనసు నవ్వుకొనేది. విచారం

చూపితే బాధపడేది. అతని తపనచూచి 'భగవంతుడా, నా తండ్రికి త్వరగా పరిష్కారం చూపవయ్యా,' అని ప్రార్థించేది. దృఢ చిత్తంతో ఒక నిర్ణయానికి వచ్చినట్లు కనిపిస్తే వణికిపోయేది.

భైరి ఒక్కొక్క విషయాన్నే నిశితంగా ఆలోచించేవాడు. మంజరి చెప్పిన కోణంనుంచి, బాబయ్య చెప్పిన కోణంనుంచి, బాబయ్యతో చర్చించిన కోణంనుంచీ, ఫాక్టరీలోవారు మాట్లాడే కోణంనుంచీ ఇలా అనేక విధాలుగా పరిశీలనచేసేవాడు,"

ఇక్కడ పడవవాడు కొంత తడవు ఆగినాడు. ఆ కాలం చరిత్రను గురించి వివరంగా చెప్పేందుకతనికి విన్నవన్నీ విశదంగా జ్ఞాపకం లేవు. జానపదుడు కల్పించి చెప్పగల హృద్యఘట్టమూకాదాయె. అతని చిక్కును విడదీస్తూ ఒక విద్యార్థి తమ నాయకుణ్ణిలా నవ్వుతూ ప్రశ్నించినాడు.

"భైరి ఆ విధంగా నాలుగైదు మైళ్ళ పొడవునా అన్నన్నిసార్లాలో చించేంతటి చరిత్ర ఏమినడిచిందో చెప్పవయ్యా, ఆ రోజుల్లో !"

మరొక విద్యార్థి "చెప్పు! ఈ లోపున పడవవాడొకసారి ఊపిరి పీల్చుకుంటాడు పాపం."

రాముడు చిరునవ్వుతో వారికోర్కెను బలపరిచినాడు. బృందనాయకుడు నవ్వినాడు.

"భైరి ఏ మాలోచించాడో అతనికి సమకాలీన చరిత్రగతి ఎలా కన్పించిందో వెంటనే ఏమని చెప్పను! గాని, అప్పుడు మనదేశంలో నిజంగానే అంతకు మునుపెన్నడూ ఎఱుగని గొప్ప మార్పులు తేగల ఘటనలు మాత్రం జరుగుతూ వచ్చాయి. ఈ జిల్లాల్లోనూ అంతే."

ఇంతవంకు తను చెప్పినది పరిశీలించగా నాటికి దక్షిణాది కోస్తాలో ఇంగ్లీషు, ఫ్రెంచి వర్తక కంపెనీల మొదటి యుద్ధం ముగిసి రెండవదానికి పరిస్థితులు దారితీస్తూ ఉండాలి.

ఒక విద్యార్థి "అదెప్పుడూ?"

"నీ కర్థంకావడానికి దాన్ని మొదటి కర్ణాటక యుద్ధమనాలి కాబోలు!

చరిత్ర పాఠంలో దాన్నలావల్లె వేయిస్తారు మనచేత. ఆ యుద్ధం మొద లయ్యేందుకు మన దేశీయుల ప్రమేయమేమీలేదు. కాబట్టి ఆ పేరు అపా ర్థాన్ని కల్గిస్తుందంటానునేను. పోనీ.

"1740లో పారిస్, లండన్ ప్రభుత్వాలు యూరోపులో యుద్ధానికి దిగాయి. ఆ వార్తలందగానే (యూరోపువార్తలిక్కడికందేందుకాకాలంలో నెలలూ, ఏండ్లూ పట్టేవి.) ఇక్కడ నిరంతరం వ్యాపార వైషమ్యాల్లో మునిగితేలుతున్న ఆంగ్లేయులు, పరాసువారు తామూకలహానికి కడంగినారు. మొదట ఇంగ్లీషువారు ఫ్రాన్సువారి నౌకలను తూర్పుతీరాన పట్టుకొన్నారు. అప్పుడు ఫ్రెంచివారు, ఆర్కాటునవాబు, అన్వరుద్దీన్‌తో రక్షించమని మొరబెట్టుకొన్నారు. ఇంకా నవాబుల బలహీనతలు స్పష్టంగా బయల్పడని రోజులు కావడంవల్ల ఆయన ఇంగ్లీషువారిని మందలించి చూచినాడు. వారతని మాటను పెడచెవినిపెట్టి తమపని తాము సాగించుకొన్నారు. సముద్రంలోవారి ఆటలుకట్టేందుకు మన నవాబులకు నౌకాసైన్యమా, ఏమన్నానా? అంతటితో నవాబు చూసీచూడనట్టుండి పోవలసినవాడైనాడు.

"మరిఫ్రెంచి వారలా ఊరుకోగలరా? వారికి జీవన్మరణసమస్యఅది. కాబట్టి మారిషస్ దీవుల్లో గల తమ నౌకాసైన్యాన్ని రప్పించుకొని మద్రాసును ముట్టడించారు. తమ నౌకాసైన్యం చేస్తున్నదాడికి సహాయంగాపాండిచేరినుండి కాల్బలమూపంపి సెయింట్‌జార్జికోటను(మద్రాసును) దిగ్బంధం చేసినారు.

నిస్సహాయులైన ఇంగ్లీషువారిప్పుడు ఫ్రెంచివారిమీద కొండెములు కల్పించి అన్వరుద్దీన్‌తో మొరబెట్టుకొన్నారు."

ఒక విద్యార్థి "కొన్నాళ్ళక్రితమే తామతని ఆజ్ఞను తుడిచి పారవేసిన విషయ మంతలోనే ఎలామరిచి పోయారో!"

మరొకరు "వ్యాపారాలు, లాభాలు ఉన్నచోట రాజ్యతంత్రానికి సిగ్గూ అభిమానం పనికి రాదోయ్ ! ఎప్పటికెయ్యది ప్రస్తుత మప్పటికా మాటలాడి........"

"రాజతంత్రమేంచేసినా దాన్ని న్యాయసమ్మతంగా సమర్థించగల పండితులెప్పుడూ కూలికి సిద్ధంగానే ఉంటారు."

అందరి నవ్వుల్లోను అతని మాటలు సమసిపోయాయి.

బృందనాయకుడు కొనసాగించాడు. "అన్వరుద్దీనుకీ వైషమ్యాలు చీకాకు కల్గించిఉండాలి. అతడున్నంతలో సమర్థుడైన నవాబు. సర్కారు జిల్లాలో సంస్థానాధిపతుల నడుపునకుతెచ్చి రాజకార్యం సమర్ధవంతంగా నిర్వహించిన వాడని నిజామున కతనిపై అభిమానం. అందుకే అతన్ని కల్లోలిత కర్ణాటకానికి ప్రతినిధిగా పంపిఉండినాడు."

ఒక విద్యార్థి "ఔనౌను. 1739 నాటికే మహారాష్ట్రులు కర్ణాటకం మీదా దాడిచేశారు. వారి నా పడంలో అప్పటి నవాబు దోస్తాలి మరణించాడు. చందాసాహెబు వారి బందీయైనాడు. దోస్తాలీ వారసుడు నవాబయ్యాక పన్నులు వసూలు చేయలేకపోయినాడు. కప్పమూ కట్టలేకపోయినాడు. చిన్న సంస్థానాల వారంతా ఎవరికివారే స్వతంత్రులుగా వ్యవహరించసాగానారు."

బృంద నాయకుడు. "ఈ కల్లోలాల నణచేందుకు అన్వరుద్దీన్ వచ్చాడు. అతనికీ పాశ్చాత్యుల కొత్తసమస్య ఒకటి అనుకోకుండావచ్చిపడింది. బహుశ: అతనికాలపు వర్తకంతోనూ ఎంతో కొంత సంబంధం ఉండివుండవచ్చు. అందులో భాగమే ఉండి ఉండవచ్చు కాబట్టి ఈ వర్తకుల వైషమ్యాలు యుద్ధాల స్వరూపం దాల్చడం సహించలేకపోయిఉండవచ్చు. కాక ఇంగ్లీషువారు ఫ్రెంచివారికంటె మిన్నగా బహుమతులరూపంలో లంచమిచ్చి ఉండవచ్చు. లేదా, ఫ్రెంచివారు మహారాష్ట్రులదాడి సందర్భంలో దోస్తాలీ కుటుంబానికీ, వారసుడు సఫ్దాకిర్ అలీ అల్లుడు చందా సాహేబుకూ రక్షణిచ్చి అందుమూలంగా నిజామువారి మన్ననలేకాదు ఢిల్లీ పాదుషా మహమ్మద్‌షావారి అభిమానానికి పాత్రులైనందుకీర్ష్య కూడా లోపల రగుల్కొంటూ ఉండవచ్చు. ఏమైతేనేం?

ఈసారి భూమిమీద యుద్ధంలోనైనా తాను జోక్యం కలిగించుకొని ఇరు పక్షాలనూ అదుపునపెట్టాలనుకొన్నాడు.

చిన్నపామునైనా పెద్ద కఱ్ఱతోనే కొట్టాలన్న సామెతగా పెద్దసైన్యాల్ని పంపినాడు. వారు మద్రాసును ముట్టడించిన ఫ్రెంచిసైన్యాన్ని వెనుకనుండి దిగ్బంధంచేశారు. అటునుయ్యి ఇటిగొయ్యికాగా ఫ్రెంచివారి సైన్యం సర్వనాశనం చెందబోయే మహాసంకటావస్థలో పడింది.

ఇంతవరకు విశేషంలేదు: కానీ, అతనుపయోగించిన "పెద్దకఱ్ఱ" పూర్వమెన్ని పాములను చంపిఉండి నప్పటికీ, ఆ నాటికిమాత్రం పూర్తిగా పురుగుపట్టి పుచ్చిపోయింది. అందువల్ల ఒక్కదెబ్బకు పాము చావడం మాటల్లాఉంచి కఱ్ఱయావత్తు పొడిరాలి ముక్కలైన చందమైపోయింది."

ఒక విద్యార్థి "నిజమే-230 మంది యూరోపియన్లు 700 మంది మన సిపాయీలు మాత్రమే ఉన్నారు ఫ్రెంచిసైన్యంలో. పదివేలకుపైబడినది నవాబుసైన్యం. అయినా నవాబుసైన్యమేర్పరచిన వలయాన్ని ఛేదించుకొని ఫ్రెంచిసైన్యమీవలపడింది. తిరిగి తమ సైన్యాన్నికూడదీసుకొని నవాబుసేనానులు (వారిలో సాక్షాత్తు అన్వరుద్దీను కొడుకూ ఉన్నాడు) వీరిని వెన్నంటి తరిమే ప్రయత్నంలో రెండవసారికూడ చిన్నసైన్యం చేతిలో ఓడిపోయారు. (అటునాయకత్వం వహించినవాడొక సామాన్యకెప్టన్ మాత్రమే "పరాదిస్")

బృందనాయకుడు. "దానితో ఒక్కసారిగా ఫ్రెంచివారు దేశీయుల దృష్టిలో మహావీరులయ్యారు, వారి ప్రతిష్ఠ ఆకాశాన్నందుకొంది. అగ్నిశుద్ధిచేసి మెఱుగుపెట్టిన బంగారంలా వారిపేరు వెల్గిపోయింది."

ఒక విద్యార్థి "వాస్తవాని కిదికూడ మన చరిత్రలో అంతగా అబ్బురం చెందవలసిన విషయంకాదు. శౌర్యసాహసాలుత్కటంగా కల్గిన అల్పమైన సేన, కీచులాటల్లో సతమతమై ప్రయోజనంతీరిపోయిన మహాసామ్రాజ్యాలను నేలగూల్చిన ఉదంతాలు మన చరిత్రలోనే కాదు, ప్రపంచ చరిత్రలోకూడా అనేకమున్నాయి"

నాయకుడు : "ఇక్కడొక విశేషమేమంటే మన సమాజంలో గొప్ప మౌళికమైన పరివర్తనలు జరిగేందుకు పరిపక్వమౌతున్న పరిస్థితుల నీ ఘటనలు

వమ్ముచేశాయి. స్వయం సమృద్ధములైన గ్రామాలస్థానే మార్కెట్ కోసం ఉ త్పత్తిచేసే గ్రామాలు బయలుదేరుతున్న రోజులవి.

పక్వానికివస్తున్న కురుపుమీద బలంగాగుద్దినప్పుడు కల్గేబాధను మన సమాజ మప్పుడనుభవించింది, నెలలు నిండని గర్భం తీవ్రాఘాతంవల్ల విచ్ఛేదమైనప్పుడు పడవలసిన యాతనలను భరించింది, మన మార్గాన మనం స్వేచ్ఛగా వికాసం చెందకుండా పాశ్చాత్యదేశాల్లోని మార్పులకు మనం మ్రగ్గిపోవలసినవారమైనాము. ఈ ఘోరం మెల్లమెల్లగా మనవారు కానుకోకుండా జరుగుతూ వచ్చింది. ఎవరి తక్షణ ప్రయోజనాలకోసంవారు కన్నుమిన్నుకానని అంధులై అన్నిసూత్రాలూవదిలి కాట్లాడుకోవటంలో అందరం నాశనమౌతున్నామన్న జ్ఞానమందరూ కోల్పోయినారు. ఆ విధంగా సర్వనాశనానికి సర్వులూ తమవంతు నెరవేర్చారు."

రాముడు ! "నిజమే. కానీ రాజరికాలకోసం, నవాబ్‌గిరీలకోసం, తుచ్ఛ సంపదలకోసం, ఆస్థానాల్లో పదవుల కోసం ఏగడ్డినైనా కరిచేందుకు సిద్ధపడే నీచులెప్పుడూ ఎక్కడా ఉంటూనే ఉంటారు. వారిని సమాజమదుపులో పెట్టలేనప్పుడే సమాజమధోగతి పాలౌతుంది. ఆ రోజుల్లో సమాజం వారినెందుకదుపులో పెట్టలేకపోయింది? వారి దుశ్చర్యలు ఎందుకు నెగ్గాయి ? ఆ విషఫలాల నెందుకు మన సమాజం పిందెలుగా ఉన్నప్పుడే తుంచలేకపోయింది ?"

బృందనాయకుడు. "ఏమో ? అదేగొప్పప్రశ్న ! ఆనాడు దూరదృష్టిగానీ, విశాల దృక్పథంకానీ, నిర్దుష్టమైన కార్యక్రమంగానీ లేని అల్పులకు విచ్చలవిడిగా దేశజీవితంలో చెలగాటమాడే అవకాశం లభించింది.

వారి వల్లనే ఫ్రెంచివారికీ ఇంగ్లీషువారికీ మనదేశ పరిపాలన వ్యవస్థలో జోక్యం కల్గించుకొనే అవకాశం లభించింది. విదేశీవర్తకులెన్నాళ్ళుగానో ఇట్టి అవకాశంకోసమే ఎదురుచూస్తున్నారు. వారు దీన్ని సంపూర్ణంగా వినియోగించుకొన్నారు. లాభం పొందినారు."

"ఆర్కాటు నవాబుగిరీ కోసం చెలరేగిన కొట్లాట మొదటి అవకాశాన్ని వారికి కల్పించింది. నిజాం మరుణించగా ఆ పదవికోసం చెలరేగిన కీచులాట రెండవ అవకాశాన్నిచ్చింది. తరువాత బంగాళంలో వారికీ దేశపు ఆయువుపట్టే దొరికిపోయింది. ఇదంతా సుమారు పదమూడేళ్ళ చరిత్ర. సాంధోమ్‌యుద్ధానికీ ప్లాసీయుద్ధానికీ మధ్య జరిగింది. ఆ తరువాత దేశంలో యావద్భారత సార్వభౌమత్వం కోసం జరిగిన ఘర్షణలో వారికి ప్రత్యర్థులు కాగల్గిన వారందరూ ఫ్రెంచివారు కానీ, మహరాష్ట్రులు కానీ, నిజాము కానీ, ఇతరులు కానీ విజయం సాధించగల్గిన స్థితికోల్పోయినారు."

ఒక విద్యార్థి ! "పాశ్యాత్యుల్లోకూడా ఆ రోజున కాట్లాటలున్నాయి కదా ? ఉదాహరణకు నీవు పేర్కొన్న 1746 నాటి మద్రాసు యుద్ధమే చూడు. అందులో విజయం సాధించిన తరువాత ఫ్రెంచిఅధికారుల్లో రాజు కొంటున్న కీచులాట తీవ్రమైందా లేదా? తమకు స్వాధీనమైన మద్రాసును పుష్కలంగా డబ్బు పుచ్చుకొని వదిలివేయాలన్నాడు నౌకాసైన్యాధిపతి. కూడదన్నాడు డూప్లే. వారి తగవు ప్రకృతి తీర్చబట్టి గానీ – "

బృందనాయకుడు – "నిజమే . పెద్దతుఫాను చెలరేగి ఫ్రెంచినౌకాబలం దెబ్బతిన్నది. అప్పుడు సైన్యాధిపతి లౌక్యంగా ఇంగ్లీషువారివద్ద బోలెడు డబ్బు పుచ్చుకొని. తెరచాపలెత్తి భారత సముద్ర తీరాన్ని ఖాళీచేసేశాడు. అలాచేస్తూ వారి మద్రాసు వారి కప్పగించి వేశాడు. డూప్లే ఆ ఒప్పందాన్ని కాదని మద్రాసును కొల్లగొట్టాడు. అంతే కాక ఇంగ్లీషు కేంద్రాల్లో మరొక ముఖ్యమైనదాన్ని–సెయింట్ డేవిడ్‌కోటను ముట్టడించాడు. కానీ స్వసైన్యంలో ఐకమత్యం లేకనే గెలవలేక పోయాడు.

తరువాత ఇంగ్లీషువారి నౌకాబలంవచ్చి పుదుచ్చేరిని ముట్టడించింది. ఈసారింగ్లీషువారిలో అనైక్యత వారిని విజయం సాధించనివ్వ లేదు. ఇంతలో వర్షాకాలంరాగా ఇంగ్లీషువారు తాత్కాలికంగా ముట్టడివిరమించారు. తిరిగివారు ముట్టడించేలోపుగా యూరోపులో పారిస్‌లండన్ ప్రభుత్వాలమధ్య ఒప్పందం కుదిరి

మద్రాసు ఇంగ్లీషువారికీ పుదుచ్చేరి ఫ్రెంచివారికీ దఖలు పడిపోయాయి. మిగిలిన వర్తకకేంద్రాలూ ఎవరివి వారికప్పగించేసుకొన్నారు. ఇంగ్లీషువారి నౌకా సైన్యమూ యూరోపునకు వచ్చిన దారినే వెళ్ళి పోయింది.

"మరి ఆ నాటి ఫలితాల కెక్కడుంది కారణం ?"

"అది తెల్సుకోలేకే భైరి కొట్టుమిట్టాడిఉంటాడు."

స్థూలకాయుడూ "ఇంత విమర్శగా భైరి ఆలోచన చేశాడంటావు! జరిగినవి జరిగినట్లుగా ఈనాటికి మనకు తెలిసే అవకాశంలేదు కదా, ఆ రోజుల్లో భైరికింత ఆలోచనెలావస్తుంది ?"

స్థూలకాయుడు నోరువిప్పితేచాలు నవ్విపోయే విద్యార్థి బృందమంతా ఈ సారతను లేవదీసిన పాయింటుకు "బ్రేవో" అన్నారు.

బృందనాయకుడు క్షణమాలోచించినాడు.

"నీవన్నదికూడా ఆలోచించ వలసిందే. చరిత్రలో పాత్రలు తమకు తెలిసినంతలో ఆలోచించి చేసినపనులకు మన మీనాటవిశేష చారిత్రక అవగాహనతో అర్థంకల్పించుకోకపోతే ప్రయోజన మేమిటి? మనకాలపుటావేశాలూ, Prejudices వాళ్లకు గుడ్డిగా ఆపాదించడం తప్పకానీ శాస్త్రీయంగా వారి ఆలోచనలకు రూపుకల్గించడం ఉత్తమమైన పద్ధతి." ఎవరూ మాట్లాడలేదు. తిరిగిబృందనాయకుడు అందుకొన్నాడు. "వార్తలు ప్రాంతం నుంచి ప్రాంతానికందే సదుపాయాలు లేనేలేవని కాదుకానీ కొంత ఆలస్యమౌతున్నమాటనిజమే, అయితే ప్రముఖ దేశీయవణిక్కుటుంబంనుండి వచ్చిన భైరికిపాశ్చాత్య వర్తకుల ప్రాభవం ఒక్కసారిగా పెరిగిపోవడం తప్పకుండా ఆందోళన కల్గించి ఉంటుంది.

"అతనెరిగిన కంపెనీ ఉద్యోగుల్లో చాలమంది ఏ సూత్రాలకూ కట్టుబడనివారు. దురాశాపరులు, కచ్చిగుణంకలవారు. ఈర్ష్యాళువులు. వారిలో చాలమందికి స్వదేశంలో అడుక్కుతినడమో దొంగలముఠాలోచేరి దోచడమో అంతేగానీ మరే గౌరవవృత్తీలేదు. కొందరు నేరస్థులు. కొందరు పారిపోయి వచ్చినవారు. ఒకజాతి కాదు. ఒక కులంకాదు. ఒక మతశాఖకాదు. వారి

లాలసతకు సాటియేలేదు. సకల దుర్వ్యసనాలకూ పరాకాష్ఠ వారి కేంద్రాల్లో చూడవచ్చు. అట్టివారి ప్రాభవమిలా ఒక్కసారిగా పెరిగిపోవడమొకవింత, వారి ప్రవేశం వర్తక విషయాల్లోనే కాకుండా సైనిక విషయాల్లోనూ, రాజకీయవిషయాల్లోనూ విస్తరించడం వింతగానే ఉంది, అశుభసూచకంగాగానూ కన్పించిఉంటుంది. ఈ విషయమై మిగిలిన వర్తకులూ ఆందోళనపడుతున్నారు. కానీ ఏం చేయాలో తెలియక, జరిగేది జరుగుతుంది లెమ్మని కూర్చున్నారు. కొందరప్పుడే పాశ్చాత్యవర్తకుల నాశ్రయించి వృద్ధికి రావాలనీ ఆశిస్తున్నారు.

"ప్రాచ్యదీవుల్లో ఇదే పరిస్థితుల్లో వలందుల ఆటలుసాగి దేశీయులెలా నాశనం చెందినారో ఆ స్థితియే ఇక్కడకుడా దాపురించగల ప్రమాదం భైరికి స్పష్టంగా కన్పిస్తూంది. పాశ్చాత్యవర్తకుల ఎత్తుగడలను గురించి వారి స్వభావాలను గురించి సంస్థానాధీశులకు, వారిద్వారా నిజాముకు తెలియజెప్పి వారి పలుకుబడిని తగుపరిమితుల్లో ఉండేలాచేయడమెలాగన్నదే భైరి ఆలోచనలకు ప్రధానాంశమై ఉంటుంది,"

"నిజమే బాబు" పడవవాడందుకొన్నాడు. అతను కథ కొనసాగించాడు.

## VIII

ఎన్నో ఆలోచనలుచేసిన పిదప భైరి గోదావరీ మండలంలోని సంస్థానాధీశుల ఆస్థానాలను సందర్శించిరావాలని నిర్ణయించుకొన్నాడు. మంజరి అతని ఆశయాన్ని బలపరచింది. అతనికి తోడుగానమ్మకమైన పరిచారకులను పంపింది. ఆయా ఆస్థానాల్లో ప్రవేశానికి సహాయం చేయగలవారి వివరాలను తెల్పింది. ఆస్థానాల్లో ఎలా మెలగవలసి ఉంటుందో చెప్పింది. మెరిసిపోతున్న కళ్ళతో భైరిని సాగనంపింది, భైరివెంట పూజారిగారబ్బాయి జతవెళ్ళాడు.

ఇంజరం ఇంగ్లీషు ఫాక్టరీలో కొలువున్న రంగన్నా ఉద్యోగం మానివేసి వస్తానన్నాడు కానీ "అందులోనె ఉండవయ్యా సైన్యాధిపతి పదవిదాక వెళ్ళవచ్చు. అవసరమైతే కబురుపెట్తాను వద్దువుగాని. ఉట్టినే, చేతిలో ఉన్నదీ, వృద్ధికవకాశమున్నదీ చెడగొట్టుకోవడమెందుకు?"అనివారించారు.

ఖైరి ఊరువిడిచిన కొన్నాళ్ళకే ఊరు ఊరంతా ఆ వార్త గుప్పుమంది. అయితే ఖైరి ఎక్కడికి వెళ్ళిందీ ఎవరికీ తెలియలేదు. ఎందుకు వెళ్ళిందీ మాత్రం వెంటనేకారణాలు చెప్పేసుకొన్నారు. "పరదేశిపెళ్ళి ఇంతలోనే జరుగనుండగా ఇక్కడుండేందుకు ముఖంచెల్లలేదు. అందుకేకొన్నాళ్ళపాటు దేశాలుపట్టి పోయిఉ ంటాడు." అనుకొన్నారు. ఈకారణాన్నిఖైరి ఇంట్లోవాళ్ళు కూడా నమ్మారు. ఒక్క బాబయ్యమాత్రం దీన్ని నమ్మలేదు. అంతకంటె వేరు పెద్దకారణమేదో ఉంటుందని ఊహించాడు. కానీ ఎంతో అరమరిక లేక నడుచుకొంటున్న తన వద్ద ఒక మాటైనా అనకుండా వెళ్ళాడేమా అనిమాత్రం బాధపడ్డాడు.

మంజరితో ఏర్పడిన పరిచయాన్ని బాబయ్యతో చెప్పేందుకు కూడమొహమాటపడ్డాడు ఖైరి. మంజరి ప్రసక్తి లేకుడా తన ప్రయత్నాన్ని గురించి ఎవరికైనా చెప్పగల్గడ మసంభవము

ఖైరి ఊరు విడిచిపోయిన కొన్ని నెలలకు పరదేశిపెళ్ళి వైభవంగా జరిగిపోయింది.

పెళ్ళి జరిగిన కొన్నాళ్ళకు అనుకోకుండా ఖైరి వాళ్ళ ఓడలు తిరిగివచ్చాయి. కానీ, ఆ కుటుంబంవారి కందువల్ల కలిగిన ఆనందం ఖైరిలేని లోటువల్ల మరుగున పడిపోయింది.

ఆ ఓడ లిన్నాళ్ళూ తూర్పు దీవుల్లోని ఒక రేవులో చిక్కుపడిపోయాయి.

ఆ దీవిలో డచ్చి వర్తకులకూ ఆ రాజుకూ తగాదావచ్చింది. అక్కడ రాజుకు వ్యతిరేకంగా కుట్రపన్నుతున్న వారితో ఈడచ్చి వర్తకులు కలిసినారు. వారి కుట్రలు కార్యరూపంలో పెట్టగల్గేందుకు వీలైన ఆయుధ సామాగ్రి త్రోవలోని ఒక రేవులో ఈ ఓడల కెక్కించారు, ఈ దీవిలో తమవారికందజేయవలసినదని. మామూలు సరుకనుకొని వీరా ఆయుధాలను తమ ఓడలో కెక్కించుకొన్నారు. వీరి కుట్రలు రాజుకు ముందే వెల్లడయ్యాయి. దానితో స్వదేశీయులైన కుట్రదారులను చంపించి, వీరి ఓడలరాకకై ప్రతీక్షిస్తూన్నారు. అవక్కడ చేరుకొనగానే అ రాజుగారి ముఖ్యోద్యోగులు వాటిని తనిఖీచేశారు. వారికున్న అనుమానం

నిజమనుకొనేందుకు కావలసిన ఆధారాలాయుధాలరూపంలో ఓడల్లో దొరకగానే అందరినీ అక్కడికక్కడ బంధించి ఉంచారు. ఓడలుచూసే నాధుడులేక ఒడ్డెక్కి పడినవి. మన ఓడల్లో చెదురువాటుగా వచ్చిపడే దొంగలవంటివారి బారినుండి ఆత్మరక్షణకుపకరించగల యోధగణమేగానీ ఒకరాజు సేనలను ధిక్కరించి గెలవగల స్తోమతలేదు. పైగా ఏ కుట్రాఎరుగనివారు కాబట్టి నిజం చెప్పి తప్పించు కొనవచ్చునని ఆశించారు. కానీ అలా జరుగలేదు. నిజం తెలిసి వీరి అమాయకత ఋజువయ్యేప్పటికి రెండుమూడు సంవత్సరాలుపట్టింది. అప్పుడు మాత్రమారాజు నొచ్చుబాటుప్రకటించి తగు సత్కారంచేసి, కొంత వరకుపోయిన సరుకులకు పరిహారమిప్పించి ప్రయాణసన్నాహాలకు కావలసిన సదుపాయం కొంతచేసి పంపినాడు. ఒక ఓడ బొత్తిగా పనికిరాకుండా పోయింది. కాబట్టి దానిలో పనికొచ్చేభాగాలు మాత్రం తెచ్చుకొని తృప్తిపడవలసివచ్చింది. మిగిలిన ఓడలైనా తాత్కాలికంగా రిపేరి చేసుకొని దైవంమీద భారంవేసి (తుఫాను వచ్చినా తట్టుకొనగల్గినస్థితికి తమ ఓడలను బాగుచేసుకొనడమక్కడ సంభవంకాదు గదా) బయలుదేరివచ్చేశారు. అవి వచ్చి చొల్లంగి చేరినరోజున బైరినాయన తనమామూల ధోరణిలో తాను తీరాన చెట్టుక్రింద కాచుకొని చూస్తూనే ఉన్నాడు. ఈరోజాయన మనస్సు కెందుకో తన ఓడ లిక్కడికి చేరుకొంటాయని తట్టుతూంది. అదాయనకు చాల సంతోషకరంగా ఉంది.

మొదటి జండా చూడగానే ఆయన టక్కునలేచి నిల్చుకొన్నారు. రోజూ ఇలాంటి దర్శనమాయనకౌతూనే ఉన్నా ఎప్పుడూ చలనంలేని మనిషికీవేళ వీటిని చూస్తూంటే ఇవి తనవేనేమో నన్నఅనుమానం కలుగసాగింది. అడుగులు నీటికేసి వేయసాగినాడు. కొంతసేపటికవి తనవేనని గుర్తుపట్టేశాడు. ఆవేశంతో చేతులూపుతూ, ఓడలోనివారికి కేకలరూపంలో స్వాగతం చెప్పుతూ నీళ్ళకేసి పరుగెత్తసాగినాడు,

ఓడలోనివారికి కూడా ఆ క్షణాన ఒకే ఆలోచన లేదా శంక మనసున మెదుల్తూంది. "తమ గురించెవరైనా ఇంకా జ్ఞాపకం పెట్టుకొన్నారా లేక మృతులకింద జమకట్టేసి అందరూ మరిచేపోయారా?" అని.

పరిచితమైన స్వగ్రామతీరం సమీపిస్తున్న ఆనందాన్ని వారి శరీరంలోని ప్రతి అణువూ అనుభవించుతూంది.

వారి యజమాని అని గుర్తించేంత చేరువకాకపోయినా, ఒక మనిషి చేయూపుతూండటం, అరుస్తూండటం వారు గమనించినారు. అది ఎందుకో తెలియకపోయినా ఆది తమకోసమే అయుండవచ్చునని వారికీ తట్టింది. వెంటనే పడవను దింపి. ఇద్దరుమనుష్యులను ఒడ్డుకు పంపినారు. వారు తమ యజమానిని గుర్తించి ఆయన నెక్కించి తీసుకొనిపోయినారు. ఎంతో ఆనందంగా బృందగానాలుచేస్తూ కేరింతాలు కొట్టుతూ, తమతమ కుటుంబాల విషయమాయనకు తెలిసినమట్టుకు చెప్పగా తెలుసుకొంటూ క్షణాల్లో రేవు చేరుకొన్నారు.

ఇన్నాళ్ళూ ఇంతచటవటికనెక్కడ దాచాడోగానీ ఇప్పుడు భైరినాయన చూపుతున్న కార్యదీక్షలో విరామమే ఎరుగడు. మొదట పాతకేవులకు సంబంధించిన వ్యవహారాలను పరిష్కారంచేసినాడు. దైవ దుర్విపాకం వల్ల జరిగిన అనర్ధం కాబట్టి సరుకులువేసిన వారెవ్వరూ నష్టపరిహారం కావాలని పట్టుబట్టలేదు. ఎవరి నష్టంవారు భరించి ఊరుకొన్నారు. డచ్చి వర్తకులు మాత్రం పరిహారం కావాలన్నారు. స్థానికులందరూ ఈ కోర్కెకోరినందుకు ఛీకొట్టినారు కానీ వారిపట్టు వారు వదలలేదు. తృష్ణకు నీతి ఎక్కడిది? దయాదాక్షిణ్యాలెక్కడివి? అనివార్యమైనందున వర్తకశ్రేణికీవివాదం నివేదింపవలసి వచ్చింది. దేశీయులతో వచ్చిన తగవుకాబట్టి వారివర్తక సంప్రదాయాలనూ చూచేందుకూ, ఇతర లగువు బిగువులూ చూసుకొనేందుకు శ్రేణికెలాగూ కొంత వ్యవధికావాలి. ఆ వ్యవధికోసమే ఈ నివేదింపు నిర్ణయంచేసి పరిష్కరించేనాటికి "నందోరాజా భవిష్యతి"

తరువాతాయన తిరిగి వర్తకులవద్ద, నేతవారివద్ద సరుకుల ఎగుమతికి

ఒప్పందాలు చేసుకొనడమేకాకుండా ఓడలమరమ్మత్తులకు వారివద్దనుండి సహాయంకూడా పొందినాడు. ఆయనకొక్క విషయం మాత్రం ప్రగాఢంగా నాటుకొనిపోయింది. ఈవిదేశీవర్తకులతో సంబంధం బహుప్రమాదకరమైనది. వారి అవసరాలేకానీ, మన కష్ట నిష్ఠురాలు వారికి పట్టవు. వారి అవసరాలేవో, వారి దేశాల్లో ఏశక్తులెలా పరిణామం చెందుతాయో మనకు తెలిసే అవకాశం తక్కువ. నిర్ణయాలు తీసుకొనేవారి యజమానులిక్కడుండరు. కాబట్టి వారినిబట్టి నడుచుకొనవలసిన ఇక్కడి విదేశీవర్తకులేక్షణాన ఎలా ప్రవర్తిస్తారో ఊహించడం కష్టం. ఇక వారితో ఏక్షణాన ఎలా పరిణమిస్తుందో ఎవ్వరు చెప్పగలరు? కాబట్టి వారితో ఎట్టి పొత్తూ వద్దనుకొన్నాడు, అందుకే మీరయ్య ఫ్రెంచి వర్తకులతో తగు ఒప్పందంచేసుకొనవలసిందనీ, కావలిస్తే తానందుకు సాయంచేస్తాననీచెప్పి నప్పుడాయనాసలహాను పాటించలేదు. ఆయన తన అభిప్రాయాల్ని స్పష్టంగా చెప్పినా, మీరయ్య మాత్రం పరదేశికి మేనరికం తప్పించినందున తనమాట వారికి పథ్యంకాకుండా ఉందని భావించాడు. లేకపోతే ఫ్రెంచివారి వ్యాపారం పలుకుబడీ, వ్యాపారమూ ఎలా పెరుగుతూందో గమనించిన్నీ తన సలహా త్రోసిపుచ్చుతాడా అని అనుకొన్నాడు.

భైరయ్య తండ్రికప్పుడు తన వ్యవహారాల్లో సహాయపడగల వ్యక్తి అవసరమయ్యాడు. ఎదిగిన కొడుకుండగా ఇంక అన్యులకై ప్రాకులాడాల్సివచ్చినందుకు క్షోభపడుతూ కొడుకును వెతికించి రప్పించుకొనే ప్రయత్నం కూడా ఆ తండ్రి తీవ్రంచేసినాడు.



రంగన్న మంజరితో సలహాచేసినాడు. భైరి కోడలకబురు అందజేద్దామా వద్దా అని "వారిపాట్లు చూస్తూంటే జాలేస్తుంది. మంచి వాళ్ళకే అన్ని కష్టాలూ!"

మంజరి వద్దంది. "వాళ్లక్కావలసిన సాయాలు మనం చేస్తూండాం. భైరి వెళ్ళిన పని పూర్తికానీ"

"అయితే నాయకర్ గారి కొలువుచేరి భైరిలేనిలోటు పూడ్చనా?"

"వద్దు. ఈ ఇంజరం కొలువుమానకు. ఇందులోనే ఉంటూ వారినోకంటకనిపెట్టు. అదే వారికెక్కువ ప్రయోజనకారి. వీలైతే కోరంగి మార్పించుకో."

"కోరంగికి మార్పసాధ్యం."

సిపాయిగాచేరిన రంగన్న త్వరలోనే కప్తానైనాడు. ఇప్పుడతనికొక గుర్రమివ్వబడింది. మన సైన్యాల్లో అయితే అతనికీ హెూదారావడమరుదు. సామాన్యంగా కాల్బలంలోనే జీవితాంతం గడచిపోయేది.

ఒకరోజతనుత్సాహంగా కీలుగుర్రంమీదలా ఎగురుకొంటూ వస్తున్నాడు. కోరంగి గట్టుమీద మీరయ్య ఉద్దారుడూ రాజబంధువు సేవకుడూ ఆదారినే నడుస్తున్నారు. ఇతని వేషభాషల్లో ఠీవి, వారిమనస్సుల్లో నిప్పులు కురిపించింది.

"వారే! ఊళ్లో సల్లాడ మెగజెక్కి వొంగివొంగి నడవవలసినవాడివి గుర్రంస్వారిచేస్తావా? మా ఎదుటే? దిగురా! దిగు!" ఇద్దరూ ఒక్కటై ఆజ్ఞాపించారు.

"నేనిప్పుడు కంపెనీవాణ్ణి, మీనితులు నాపట్ల చెల్లవు." వాళ్ళ మొగాల్నే దుమ్మురేగగొట్టూ గుర్రాన్ని దౌడుతీయించాడు. వారిద్దరూ కులపెద్దలు. ఈ ధిక్కారం వారిలో సహజంగానే క్రోధాన్నీ ద్వేషాన్నీ చెలరేపింది.

"చూశావా ఎలా పేట్రేగిపోయాడో! భైరయ్య దేశాంతరం పట్టిపోయాడు. ఇక వీడొక్కడు మిగిలాడు."

"వీడిపనీ అంతే కదా? ఇటువంటి మిడిసిపాట్లెన్ని చూడలేదు?"

ఇలాంటివే ఇంకోటి, రెండు, జరిగాక ఇలాకాదని ఇద్దరూ పట్టుబట్టి రంగన్న మీద కులపంచాయితీలో తగవుపెట్టారు. రంగన్న భోజనాదికాల్లో పరాయి కూడు తింటున్నది నెపంగా తప్పివ్వాలన్నారు,

సమయానుకూలంగా విదేశస్థుల ఆహార పానీయాలు ముట్టనివాడు కోరంగిలో ఎవడూలేడు. కానీ ఏమీ అంటనట్లుగానే అందరూ పవిత్రత నటిస్తూంటారు. రంగన్న తాను తినలేదంటే అతన్నందరూ బలపరచి ఉందురు. తినలేదని రుజువుకు సాక్ష్యమూ ఇచ్చి ఉందురు. అతనంటే అందరికీ అభిమానం. ప్రత్యర్థులంటే ఎవరికీ పడనూపడదు. కానీ రంగన్న ఆ మార్గం తొక్కలేదు. తన తిండి తన ఇష్టమన్నాడు. శుభ్రమైన తిండి పుష్టికరమైన తిండి ఎక్కడిదైనా పరవాలేదన్నాడు. పడిన పసరాల తిండి కంటే ఏదైనా మేలేనన్నాడు.

ఆభయంకర సత్యం కులం వారందరి మనసుల్లోనూ కెలికి దేవి నట్టైనా దాన్ని బహిరంగంగా ధిక్కరించే దార్ఢ్యంగానీ, ఒకరెదురిస్తే సహించే ఓర్మిగానీ చాలవు. అందుచేత అతన్ని లైనులో పెట్టేందుకు సానుభూతితో ప్రయత్నించినవారున్నారు. కానీ అతన్ని సమర్ధించిన వారొక్కరూలేరు.

"తప్పు వేస్తున్నవాళ్ళ చరిత్రలు పవిత్రమైతే తప్పు చెల్లించేందుకే బాధా లేదు. ఒక్కొక్కరి తెరచాటు చరిత్రలు తొలగించిచూస్తే చాలా ప్రక్షాళన కావాలి. మీరూవద్దు, మీ తప్పులూ వద్దు" అంటూ ఇవతలి కొచ్చేశాడు, తల్లీతండ్రీకరువైన రంగన్న. ఇంజరంలో మకాంపెట్టేశాడు. శని విరగడైందన్నారు పెద్దలు. కోరంగిరేవు కప్పుడప్పుడు పనిమీద వచ్చేవాడు. వచ్చినప్పుడు భైరీ వాళ్ళ స్థితిగతులు తెల్సుకొని కావలసిన చిల్లరపనులు చేసేవాడు. కొత్త కోరంగిలో మాథ్యూస్ఇంటికి వెళ్ళేవాడు. మాథ్యూస్ శ్రీమతి దృష్టిలో అతనిప్పుడైతే గియితే కాబోయే అల్లుడు. ఆమె తనకూతురినింకా ఎవడైనా ఇంగ్లీషువాడికిచ్చి ఇంగ్లాండులో కాపురం తిరంచేయాలనుంది. కానీ ఆమె దాన్ని లోపలే అణుచుకొని ఇతన్నాహ్వానించేది. కూతురును రంగన్నతో మసలనిచ్చినా మితిదాటనిచ్చేదికాదు. మరో సంబంధం దొరికేదాక ఇతన్ని పోనిచ్చుకోనూ కూడదన్నపంథాలోనడిచేది. అతని మతం మార్పునొక దుడుకు చేష్టగా ఎంచి "ఏదో మతం ఉండాలిగా తమ్ముడూ ! ఉన్నదాన్నెందుకు పోనిచ్చుకొన్నావు? పోని మా మతం పుచ్చుకొంటావా ?" అని మందలించింది సౌమ్యంగా. "ఏదో పెద్దలకింత పారేస్తే పోయేది. నీవూ పెద్దల్లో

ఒకడైనప్పుడెలాగైనా ఉండవచ్చు. అంతవరకు కొంత అణిగిఉండడం మంచిదేమో ?”అని సలహా కూడా ఇచ్చింది.

“అవసరమొస్తే చూస్తాం”అని తుంచేశాడు రంగన్న.

ఒకరోజు రంగన్నవచ్చే సమయానికి మాథ్యూస్ పుస్తకం చేతబట్టి తనలో తానే నవ్వుకొంటున్నాడు.

“మాకు చెప్తే మేమూ ఆనందిస్తాము కదా!” ఉత్సాహం చూపాడు రంగన్న.

“ఏ ముందయ్యా మా రాజ్యవిషయా లెత్తిచూపుతూ వ్రాసిన నాటకాలయ్యా అందులో ఘట్టం పసందుగా ఉంటేను, నవ్వుతున్నా. లెక్కలు వ్రాసి విసిగి ఇదెత్తుకొన్నాను. మీ లెక్కలంటే మాటలా ? లక్షతొంభైఆరు రకాల నాణ్యాలు లక్షతొంభై యారు రకాల వస్తువులు రకరకాల తూనికలూ కొలతలూ ! అన్నీ సరిచూసుకొని లాభనష్టాలు తేల్చాలాయెను.

“ఇంతకు మీరు చదువుతున్న దాన్ని గురించి చెప్పండి”

“ఈ నాటకం పేరు పాస్కి వ్వన్. పాస్కి వ్వన్అంటే ఒకలాంటి హాసికాలాడేవాడనుకో. అందులో ఎన్నికల దురాచారాలను దుయ్యబట్టాడు రచయిత.”

రంగన్న వివరమడిగాడు. నాటకం కథ చెప్పమన్నాడు. “నాటకంలో నాటకం. ఒక కాఫీ క్లబ్బులో నాటకానికి ప్రాక్టీస్‌జరుగుతూంటుంది. అందులో పాత్రలిద్దరు, పట్నం పెద్దలు, ఎవరికి వోటెయ్యాలో నిర్ణయం తెమలక చర్చించుకొంటున్నారు. ఎవరివైపు మొగ్గ చూపేందుకూ ఎటూ బరువు పడలేదింకా. వారివద్దకిద్దరు జంటఅభ్యర్థులు వచ్చారు. ఒకడు స్థానం స్వామి. ఒకడు కర్నల్ వాగ్దానం.

“మీకంటే మాకు కావలసిన వారెవ్వరున్నారు ? మీరు రాజుగారి ఆస్థానంలో ఉంటే మాకు చాలా పనులౌతాయని తెలుసు.”

“నమ్మండి చేయగల్గిందంతా చేస్తాము. చేయబోయేవన్ని ఇప్పుడు

చెప్తే బాగుండదు. చేసి చూపుతామొకేసారి ముందుముందు, అంతవరకు ప్రస్తుతానికిది ! ఉంచండి ! ఏదీ చేయివ్వండి !"

నటులీపాత్రల్ని నటిస్తుండగా డైరెక్టర్అంటాడు "ఇదిగో నటులూ ! వ్యవహారం మరీఅంత చాటునైతే ప్రేక్షకులకు కన్పించదు. వారికి జోకర్థం కాదయ్యా ! నల్గురూ అప్పుడు స్టేజిముందుకు రావాలి. ఇచ్చేదేదో స్టేజీముందు భాగంలో ఇవ్వాలి, రెండు చేతులా ఇవ్వాలి..."

"ప్రతి పక్షం తరఫు వారి నాటకమయ్యా. సంఘంలో లోపాలనెత్తి చూపుతూ పరిపాలకులకు బ్రేకులువేస్తారు"అంటూ అక్కడక్కడే స్వారస్యం వివరించేవాడు.

"ఇది ప్రత్యక్షలంచంమీద విసురు. ఇంక పరోక్షంగా ఉంటాయి లంచాలు. ఇది విను.

"ఒకచోట క్లబ్బులో వోటున్న పెద్దలు కొందరు కూర్చొనిఉన్నారు. వారివద్ద కిద్దరభ్యర్థులజంట వచ్చారు.

"స్వాతంత్ర్యం ! ఆస్తి హక్కు ! పన్నులు కూడదు !" ఆంటూ నినాదాలిస్తూ, ఈవిజయానికి ఛీర్స్ చెప్పుకొందామా అందరం కలిసి !" అన్నారు.

వొద్దొద్దొద్దు ! ఏ పార్టీ నినాదాలూ వద్దు," అన్నారు పెద్దలు. అభ్యర్థి:- "పెద్దలై యుండి మీరిలా అనవచ్చా ? మీరంటున్నది నా కర్థమైందనే అనుకొంటాను. మీ నాడి తెలూస్తునే ఉంది. లంచం తీసుకొని దేశాన్నమ్ముతారా ?

మీకు నమ్మకంగా సేవచేసేవాడుకావాలంటే న్యాయంగాఎన్నుకోవాలి. యోగ్యతలుతప్ప మరేవీ పాటించకూడదు, తప్పుడు సాక్ష్యంకంటే తప్పుడు వోటు చెడ్డది....మేయర్గారూ మీకామధ్య మూడు దుప్పులు పంపానే ! అవందాయనీ, రుచిగా ఉన్నాయనీ ఆశిస్తాను. మేయర్:- ఓ అందాయి. కాని తిని చాలాకాలమైందేమో రుచిమాత్రం

జ్ఞాపకం లేదు.

అభ్యర్థి :– "అదా ? దానికేం ? తిరిగి రుచి చూపిస్తా. రేపుదయానికే మరో మూడు పంపుతాను.

మేయర్ :–అమ్మో ! మా పొట్టలు పగిలిపోతాయ్ ! నిఝంగా పగిలిపోతాయ్. ఆ మాంసమసలే ఎండిపోయి పొడిగా ఉంటుంది కూడా

అభ్యర్థి :– దాన్ని తడపడానికి మందుంటుందిగా. ఊళ్ళో దొరకాలిగానీ, దానికేం భాగ్యం ? అయ్యా దర్జీప్రతినిధిగారూ మీరు పంపిన కోట్లు అద్భుతం ! మరీ అంత చవకా ? నష్టానికిస్తూన్నారేమో అనుకొన్నాను సుమా ! మరో డజను పంపండి. మా సేవకులొట్టి వెధవలు ఒబ్బిడి బొత్తిగా లేదు. ఎన్నున్నా చాలవు. అయ్యా, డమాస్కుగారూ ! మీరు మాఆవిడకు పంపిన సిల్కుముక్కలమోఘం. ఇంట్లోఅంతా దాంతోనే నింపాలంటూం దావిడ. కొద్ది గజాలేమూలకు? ఒక వంద. గజాలై నాపంపండి. కొయ్యాగారూ! మీ పుస్తకాలు కొంటాను. కొత్తింట్లో అల్మారాలలంకరించేందుకన్నీ మీ పుస్తకాలే."

మేయర్ :– ఇల్లు కట్టిస్తున్నారా?

అభ్యర్థి :– ఔనౌను దానికికావలసిన ఇటుకలన్నీ మీరే సప్లై చేయాలి.

మేయర్ :– మిత్రులారా ! మన అభ్యర్థి ప్రతిపాదించినట్లుగా"స్వాతంత్ర్యం! ఆస్తిహక్కు ! పన్నులు కూడదు" ఈ నినాదానికి ఛీర్స్ చెప్పుదామా ?

అందరూ ఉత్సాహంగా గ్లాసులు కలిపి తాగుతారు.

అభ్యర్థి :– మేయర్‌గారు ! ఏదీ చేయందివ్వండి. మాకు లంచగొండితనమన్నా తినివేతన్నా బొత్తిగా అసహ్యం సుమండి. మీరు డబ్బు పుచ్చుకోకుండా వోటువేస్తే దేశంలో దరిద్రమనే దుంటుందా ?

ఇదయ్యాక అందులోదే మరొచిట్కాకూడా విన్పించాడు మాథ్యూస్.

ప్రపంచజ్ఞానమనే రాణి మీద అజ్ఞానమనేరాణి దండెత్తిన కథఅది. లౌకిక జ్ఞానమన్న రాణి అనేక "అసంబద్ధ" వాక్యాలుపలికేది. "మతం చట్టం, వైద్యమూ మనిషికి భగవంతుడిచ్చిన అపూర్వ వరాలు . కానీ మఠాధిపతులూ. వకీళ్ళూ, వైద్యులూ వాటిని వ్యాపారాలుగా మార్చి తమ జేబులు నింపుకొంటూ మనపట్ల శాపాలుగా మార్చేశారు". అందువల్ల వైద్యులూ, మఠాధిపతులూ ఆమెను ద్వేషించేవారు.

మఠాలవారు ప్రజల సొమ్ములో సగమే తినాలనేది. కోర్టు ఖర్చులు కొద్దిగా తగ్గాలనీ, న్యాయం తేలిన తరువాతకూడా కక్షిదారులు బతికేందుకు వీలుండాలనీ అనేది. చట్టాలు సూక్ష్మంగా అందరికి తెలిసేలా ఉండాలనీ అనేది. ఈ ఉద్భోధలవల్ల రాజ్యంలో జ్ఞానంపట్ల అసంతృప్తి పెరిగినట్లు తెల్సుకొని రాణి అజ్ఞానం దాడిచేసింది. అమె చాల నెమ్మదైనది. "ఆలోచించే బాధనుండీ" విమోచనం కల్గిస్తుందని ఆమెమీద అందరికీ అభిమానం. ఆమె సైన్యంలో రంగస్థల తారలూ, మనుష్యులని భ్రమింపజేసే కుక్కలూ, కుక్కలనిభ్రమింపజేసే మనుష్యులూ, నరమార్జాలాలూ కుక్కపిల్లలూ ఇలా ఇలా ఉన్నాయి. అజ్ఞానరాణికి కానుకలిచ్చి అజ్ఞాన అకాడమీతో సంధి కుదుర్చుకొనేందుకు రాయల్ సొసైటీవారు ప్రత్యేక రాయబారినికూడా పంపారు.

నాటకాలవీధికిపక్కనే అజ్ఞానంసైన్యాలు మోహరించినాయి. నాటకాల్లో హతమైన పాత్రలభూతాలు పాపం జ్ఞానాన్ని ముందుగా హెచ్చరించాయి.

"అమ్మా నీకు భూమ్మీద నూకలు నిండుకొన్నాయి, నీవున్నంత కాలం కొందరికి కంటకంగా ఉంటుంది. మత మహసభలు నడవవు. న్యాయవాదులు ప్రజల హక్కులు హరించలేరు. వార్తల్లేని వార్తాపత్రికలు బతకలేవు. నాటకాలు వినోదం పేరిట అర్థంపర్థంలేని కార్యకలాపాలకు డబ్బు గుంజలేవు. పనికిమాలిన రచనలతో మహాకవుల రచనలను కప్పిపెట్టలేవు. కనుక నిన్నంతం చేయాలనే అందరూ చూస్తున్నా"రన్నవి.

"యుద్ధం జరిగింది. వైద్యులూ న్యాయవ్యవస్థలోవారూ జ్ఞానానికి ద్రోహం చేశారు, జ్ఞాన మోడిపోయింది. చివర ఒక మతాధికారి ఆమెను వెన్నుపోటుతో చంపాడు.

అంతాగెల్చామని అజ్ఞానశక్తులు సంబరపడుతుండగా జ్ఞానం భూతమై వచ్చింది.

ఆమె రూపానికి జడిసి అందరూ పారిపోతారు". అదయ్యా టూకీగా కథ. కానీ చూశావూ అంటూ ఆయా సందర్భాల్లో విశేషాలు చెప్పేడు. హాస్యం, కవిత్వమూ వివరించవసివస్తే దానికంటే దౌర్భాగ్యంలేదు. అయినా మాథ్యూస్ ఓపిగ్గా వివరించేవాడు. నెమ్మదిగా అర్థంచేసుకొని అనుభవించేవాడు రంగన్న.

ఇరువురికి పరస్పరం తమ సంఘాల గురించిన అవగాహనలు పెరిగేవి,

"వీళ్ళంటే ఎంతో చులకనగా అర్ధంచేసుకొనే వాళ్ళంగానీ అదెంత తప్పో ? మనం నేర్చుకోవసింది చాల ఉంది వీరివద్ద," అనుకొనేవాడు రంగన్న.

మాథ్యూస్ కేనాడో అర్థమైంది, ఇంగ్లాండులో ప్రచారంలో ఉన్న భారతదేశానికీ ఇక్కడివాస్తవానికీ పోలికేలేదని. అక్కడవారికున్న ఊహల్లా ఒకటే. "ఇదొక గొప్పవరహాల వృక్షం. ఇక్కడికొచ్చి ఈ చెట్టునూపి పట్టినన్ని వరాల నొడినిండారాల్చుకొని వెళ్ళిపోవాలి. హాయిగా బతికినన్నాళ్ళూ కూర్చొని తినాలి." కానీ ఇక్కడి పరిస్థితే వేరు.- - - - - - - - - -.

భైరి యానాం నుండి బయలుదేరినాడు మొదట పిఠాపురంలో మజిలీవేసినాడు. పిఠాపురం రాజాస్థానంలో నాటికి పలుకుబడి నెరపుతున్న వారిలో వలందులు ముఖ్యులు. వారు జగన్నాయకపురంద్వారా తమవర్తకం కొనసాగించేవారు. పిఠాపురం, శ్యామల కోటల్లో కోమట్లు వారితో సహకరించేవారు.

భైరిబోటివానికి నాటికాలంలో రాజదర్శనం సులభంగా దొరికే విషయమేమీకాదు. పాన ప్రియులై స్త్రీలోలురైన వారికి, ఇచ్చకాలు తప్ప మరేమీ విననొల్లనివారికి సింహాసనాలున్నంత కాలము వారిచుట్టూ నీచాశ్రయానికి

ప్రాకులాడేవారు కోటలా కూర్చుంటారు. ఇతరులను చొరనివ్వరు. యోగ్యులనయితే అసలేచొరనివ్వరు, వారిహ్రస్వదృష్టి తమ తక్షణ స్వార్థప్రయోజనాల పరిమితిని దాటదు. భైరి మొదట ఇటువంటి వారివద్దకే వెళ్ళవలసివచ్చింది. వారు కొత్తలో భైరిని కుర్రవానిగా జమ వేసి అతని మాటలను లక్ష్యపెట్టలేదు. కాని అతని పట్టుదల, అమితమైన చిత్తశుద్ధి తెలిసిన తరువాత నిర్లక్ష్యంచేయడానికి వీలులేక అతన్నెలావది లించుకోవాలా అని తాపత్రయ పడినారు. వారికదేమంత కష్టమైన పని కాలేదు.

భైరి అభిమానంకొలది తన తండ్రిపేరు కాని ఇతరహోదా బంధువుల పేర్లుగాని ఉపయోగించుకొనకపోయినా వారతని పుట్టు పూర్వోత్తరాలన్నీ లాగినారు. కోరంగిలోని రాజబంధువుతో వీరికుటుంబానికున్న సత్సంబంధాన్ని చక్కగా ఉ పయోగించుకొని అనుమానానికి వీలైన ప్రచారం చేశారు, మిత్రులమధ్య భేదం తెచ్చిపెట్టేందుకు కోరంగి రాజబంధువు చేస్తున్న ప్రయత్నంగా వారు దీన్ని చిత్రించారు. అది క్రమంగా భైరినొక కుట్రదారుల పావుగా (తెలయకనే ఇతను వారితోచేరి ఉండవచ్చు!) జనాని కగుపడజేసింది. దానితో అతని పనికెంతో అటంకం కల్గింది.

దీనికి తోడు మరొక ఆటంకం వచ్చిపడింది. భైరిమీద వచ్చిన గుసగుసలనుపయోగించుకొని స్థానిక వర్తకులు వలందులను బెదిరించి నాల్గు బహుమానాలైనా గుంజాలనుకొన్నారు. దివాణంలో మీకు వ్యతిరేకంగా ప్రచారంచేసేవారు బయలుదేరారు, దాని ప్రభావం మీకు తగలకుండాఉండాలంటే బహుమానాలందరికీ ఇచ్చుకొంటూరావాలి అని. దానికి ప్రతిక్రియచేసే యత్నంలో, వారు భైరి ఫాక్టరీ పనిచేస్తున్నప్పుడు ఫ్రెంచి వారితోకలిసి గొడ్ల మాంసం తిన్నాడని ప్రచారంచేశారు, ఈప్రచారం వెనుకనున్న నాటకాన్నర్థంచేసుకొనలేని ఛాందస మూర్ఖులు ప్రాయశ్చిత్తం చేసుకొనకుండాభైరిని ఊళ్ళోకి రానివ్వకూడదని దుమారంలేవదీశారు, పూజారిగారబ్బాయి దాన్నెదుర్కొనేవాడుగానీ, ఫలితముండేదికాదు.

ఇవన్నీ చూశాక భైరి శ్రేయోభిలాషులైన మంజరిమిత్రులు భైరిని గ్రామంవదిలి వెళ్ళిపోవలసిందిగా సలహాఇచ్చారు. విధిలేక భైరి పితాపురం నుండి పెద్దాపురం చేరుకొన్నాడు.

పెద్దాపురంలోనాటికి జగపతి మహరాజుగారు రాజ్యానికి వచ్చి కొన్ని ఏళ్ళేఅయింది. ఇంకా పసివారనేఅనాలి. పూర్వం మనము చెప్పుకొన్నట్లు కుల్లామినారులను నిర్మించిన హాజీహుస్సేన్ సల్లష్కరుడు పెద్దాపురంపై దండెత్తివచ్చి రాజకుమారులను చంపించిన నాటికీయన శైశవంలోఉన్నాడు. ఈ శిశువును కొంపెర్ల మహాలక్ష్మమ్మ అనే బ్రాహ్మణ వితంతువుద్వారా రాజమాత రాగమ్మగారు విజయనగరానికి రహస్యంగా తరలించ నేర్పాటు చేశారు. కానీ వారు మధ్యలో చేబ్రోలువద్ద పట్టుబడ్డారు. తరువాత కొంతకాలానికే హజీహుస్సేను సాక్షాత్తు తన కుమారుని చేతిలోనే చచ్చాడు. అట్లు తండ్రిని చంపిన నూరుద్దీన్ హుస్సేనును నైజాము మెచ్చుకొని అతన్నే సల్లష్కరునిగా నియమించి, కళింగ సర్కారులను జయించవలసిందని ప్రేరేపించాడు. అందుకని అతడుత్తరాభిముఖుడై దండెత్తి పయనమయ్యాడు. త్రోవలోనే విజయనగరం మహరాజైన విజయరామరాజుగారతన్నెదుర్కొని ఓడించడమేకాదు, ప్రాణాలను సైతం హరించారు. జగపతిని విడిపించి యువరాజైన ఆనందగజపతితోపాటుపెంచి, తగిన అవకాశం లభించగానే తిరిగి పెద్దాపురం గద్దెపైకెక్కించినారు. అప్పటికి నూరుద్దీన్ కాక ఎందరు సల్లష్కరులు మారారోకాని అప్పుడేమో జాఫరాలీఖాను రాజమండ్రిలో సల్లష్కరుడుగా ఉన్నాడు. అతడు శుద్ధ అప్రయోజకుడో ఏమో, అతనికి తెలియకుండానే అతని క్రింది ఉద్యోగి నీమత్ఆలీ అనునతడు పుష్కలంగా తొంభైవేలు లంచం పుచ్చుకొని హాజీహుస్సేన్ కాలం నుండి సర్కారువారి అమానీలోని పెద్దాపురం కోటను జగపతిగారికి తిరిగి అప్పగించివేశాడు. ఇది తెలిసి జాఫరాలీ మండిపడీ జగపతి నోడించేందుకు పెద్దాపురంపై దండెత్తివచ్చి గెలవలేక ఓడిపోయాడు.

భైరి పెద్దాపురం చేరుకొన్నరోజుల్లో జగపతి రాయల మనస్సంతా రెండేరెండు విషయాలతో నిండిఉంది. తమ వంశపు సింహాసనాన్ని పునరాక్రమించుకొన్నదేకాక సల్లప్కరును సైతమోడించామన్న విజయగర్వం మొదటిది.

"తాము విజయనగరంలో గడిపిన బాల్యపురోజుల్లో అక్కడి యువరాజు ఆనందగజపతిపై పుట్టిన ఈర్ష్య నెలాసాధించుకోవాలన్నది రెండవది."

"పాపమని తురుష్కుల బారినుండి విడిపించి పెంచి పెద్దచేసిన విజయనగరం రాజులమీద జగవతులవారికి వగఏమిటోయ్!'' విద్యార్థిఒకడుచొప్పదంటు ప్రశ్నవేశాడు.

"ఔను బాబూ" పడవవాడు సమాధానం చెప్పాడు. "కాకేమి? విజయరామరాజుగారిమీద కోపంలేదు. కానీ యువరాజు ఆనందగజపతిపై మాత్రంవైరమెక్కువ. ఇద్దరూ చిన్నప్పటినుండి ఒకరిని మించవలెనని ఒకరు ప్రయత్నిస్తూఉండిరి – విద్యల్లోనైనా వినోదాల్లోనైనా – కోడి పందెములలో కూడా వారు ప్రతికక్షులే. ఒకసారి ఆనందరాజు కోడి ఓడిపోయింది. తిమ్మజగపతి కోడి గెలిచింది. అప్పుడానందరాజు చిరునవ్వుతో "పెంపుడు కోడియే గెలిచింద"ని జగపతిని గేలిచేశారు.

వీరివైరాన్ని గమనించియే కావచ్చు విజయరామరాజు జగపతిని పెద్దాపురంలో పట్టం కట్టేందుకు తొందరపడ్డారు. అయినా వారివైమనస్యాలు తగ్గలేదు.

ఒకసారి విజయనగరంలో కోళ్ళపందెములకు పెద్దాపురంనుండి జగ పతిని పిలిపించి అతని పూలకోడి నోడించాలని ఆనందరాజుగారు ప్రయత్నించారు. కానీ ఆయన విడి కోడియే ఓడిపోయింది. అందెల సరసను బంగారు గొలుసులుంచి, పట్టెడు జుట్టుకు బంగారుజూలుకట్టి, ముక్కుకు మూడువేలది బులాకు తగిలించి సింహతటాటం కడియం కాలికి తొడిగి మెడలో పదివేలుచేసే వజ్రాలపేరు తొడిగి విడికోడిని పందానికి తెచ్చారు ఆనందరాజుగారు

పాతికవరాల బంగారు గొలుసుకాలికి పెట్టి ఆర్లకైన బంగారురేకుల పొదిగి, జోడురెక్కలకు బంగారపు నీరానించి, ముక్కుకు మూడువేల బులాకుపెట్టి, పట్టెడుజుట్టుకు బంగారుజూలుకట్టి, మేలిమైన పికిలికుచ్చుల బిరుదులుకట్టి, వజ్రాలమొహరీలపేరువేసి జగపతిగారు తమ పూలకోడిని సింగారించి విడిచారు. పోటీలో పూలకోడియేగెలిచింది, తరువాత ఇరువురన్నదమ్ములకు పొట్టేళ్ళపందెములు గుఱ్ఱపు పందెములు, డేగల పందెములు కోళ్ళపందెములు జరిగినాయి. పావురాల పందేల మాటతెలియదు. అన్నిట జగపతికే విజయం. ఆనందరాజుకు కోపంవచ్చి కోటలో మాయలుపన్ని జగపతిరాజును మారణంచేయాలని సంకల్పించాడు. వంటలుచేసే పేరి భొట్లతో జగపతికి విషప్రయోగం చేయించ నుండగా, బ్రాహ్మణరూపంతో సాక్షాత్తు రంగడేవచ్చి పేరిభొట్లను పడగొట్టి రక్షించాడు. అది విఫలంకాగా, రంగసాని దాసితో రసకర్పూరం అరఖులు రాచి ఆకులన్నకిమ్మీ అని పంచాడు. గనేరుసాబును వేటకుపోవు త్రోవ లందుంచి అన్నగారిని తుపాకితో కాల్చిచంపుమనెను. కాని విజయరామరాజు భార్యకీ విషయాలు తెలిసి జగపతిని హుటాహుటిని రాత్రికి రాత్రే పెద్దాపురానికి క్షేమంగా చేర్చే ఏర్పాటుచేశారు. ఇది ఎప్పుడు జరిగిందోగానీ ఇంతటి వైరమన్నమాట వారిద్దరిమధ్య.దీన్నిబట్టి జగపతి అనుచరవర్గము కూడా ఈ రెండు విషయాలు తప్పించి మరిదేన్ని రాజకార్యాల్లో పట్టించు కొనేవారుకారు. సుఖంగా రాజోద్యోగం చేయదల్చు కొన్నవాడెవ్వడూ స్వతంత్రించి ఆలోచించడుకదా! ఇంక భైరి చెప్పేమాటలు వారికి చెవికెక్కక పోవడంలో ఆశ్చర్యమేముంది?

పాశ్చాత్యులను రేవులుదాటి లోతట్టుకు రానివ్వకూడదనీ ఒకవేళ రానిస్తే ప్రమాదమనీ అతను చెప్పగా అతన్ని పరిహసించారు. “ఏం వాళ్ళతో ప్రత్యక్ష సంబంధాలులేకుండా మీరుచెప్పినంతకుకొని మీరడిగినంతకి అమ్మాలనా? అన్నారు. రాజకీయాల్లో వారిని ప్రవేశించనిస్తే ఎంత ప్రమాదమో జరిగిన విషయాలుచెప్పినా

వారికి నమ్మకం కుదరలేదు. వారి సైనికపాటవాన్ని గురించి ప్రస్తావించినప్పుడు, "నిజమే తెగువ వారిలోఎక్కువ ఉండడానికి కవకాశమెక్కువగా ఉంది. దాన్ని మనమూ ఉపయోగించుకొనవచ్చుగా? ఆనందగజపతి మన్ని సాధించేందు కవకాశానికై చూస్తూనే ఉన్నాడు. పెద్దగా వేలాది బలగంతో వచ్చినా అతన్ని మనం వీరి సాయంతో ఎదురించవచ్చునా?" అన్నారు. "క్రమంగా నవాబ్గిరీలే వారికి దత్తమౌతున్నాయికదా" అని భైరిచెప్పగా మొరటువాళ్లైతే "ఏం? దివానీ వారికిస్తేనేం? కప్పమెవరికైనా కట్టవలసిందేకదా? వీరి మీదవాడు తక్కువ కప్పం విధిస్తేచాలు!" అన్నారు.

ఈమాట విన్నప్పుడు భైరి నోటమాటపడిపోయేది. అంతమాట వీరెలా అనగల్గుతున్నారో అతని కర్థమయ్యేదికాదు. అయినా ఓర్చుకొని అది తమ వాణిజ్యానికెలా నష్టదాయకమో వివరించ ప్రయత్నించేవాడు. "అలా చెప్పు! నీకు నష్టమన్నమాట చెప్పక ఏవేవో పెద్ద కబుర్లన్నీ ఎందుకు?" అని లేచిపోయేవారు.

కొంచెం తెలిసినవాళ్ళైతే "వాళ్ళకు కట్టబెట్టిన ఈ నవాబ్గిరీలెన్నాళ్ళు? నిజాం గద్దెకెవడో ఒకడు స్థిరపడేదాకానేకదా! స్థిరపడ్డాక వారినలాగే ఉంచుతారనేముంది? బంధువుల్లో బంధువులకు పడక మూడవవానికిచ్చారు నిజమే. వాళ్ళూ వాళ్ళూ ఏదోతేల్చుకొని ఏకమౌతూనే వీరినెక్కడపెట్టాలో అక్కడ పెట్టనే పెడ్తారు." అన్నారు. ఇంకా "అబ్బె! వారిని కరిపించుకొన్నంత సులభంగా వదిలించుకొనలేమనా మీ భయం? అనకాపల్లి బోయీల ప్రతాపం తెలియదుకాబోలు, వారిప్పుడు మనసైన్యంలో ఉన్నారు. ఇక్కడివారికి కూడా తర్ఫీదిచ్చి తయారుచేశారు." అని ఆసైన్య ముఖ్యుని వంక చూశారు,

అతను మీసాలు మెలేస్తూ "మా ఫౌజు సంగతి తెలియదు కాబోలు! ఈ జగపతి మహరాజుగారి చెర విడిపించేందుకు నూరుద్దీన్ హుస్సేన్ సల్లష్కరునితో విజయ రామరాజుగారు చేబ్రోలు వద్ద జరిపిన యుద్ధంలో విజయానికి కారకులైంది మేము కాదూ? మహెూగ్రంగా పోరు సాగుతూంది. నూరుద్దీన్ హూస్సేన్‌ఖాను నెలాగైనా ఓడించాలని ప్రతిజ్ఞచేశాము. అతనెక్కిన ఏనుగులను చుట్టుముట్టినాము. శత్రుసైనికులు ముమ్మరంగా ఆయుధాలు ప్రయోగిస్తున్నారు. పొడుస్తున్నారు, కత్తులతో నరుకుతున్నారు. కొబ్బరి పుచ్చెల్లా తల లెగిరిపడుతున్నాయి. అయినా ఇవేవీ లెక్కచేయకుండా అతిసాహసంతో సల్లష్కరు డెక్కిన ఏనుగు అంబారీ తాళ్ళను తెగనేసి నవాబును పట్టుకొని తలనరికించి మేముకాదు? మేమున్నంతవరకు ఎవ్వరి సైన్యంగానీ ఇటువైపు కన్నెత్తి చూడగల్దా?" అని తొడలు చరిచినాడు. అతని అనుచరు లందరూ సింహనాదాలు చేసి తొడలు చరచి మీసాలు దువ్వినారు.

రాజ పురోహితులు కూడా రాజ్యాని కభయమిచ్చేశారు. "అసలు సైన్యాలదాకా పోతున్నా రెండుకర్రా?" అన్నారు వారు బొజ్జ నిమురుకొంటూ, శిఖ సవిరిస్తూ. తమ తపశ్శక్తి అజేయమని, తాము జగపతులవారికి పట్టం కట్టేందుకు నిర్ణయించిన ముహూర్తం అమోఘమనీ, దాని బలంవల్ల ఎన్నాళ్ళైనా ఈ రాజ్యానికి చలనం లేదని, ఇదికాక తాము నిత్యం జరుపుతున్నతపశ్చర్య శాంతి కర్మలు వీటివల్ల ఆయా దేవతలంతా కన్నుమూయకుండా యల్లలను కాపాడు తూంటారనీ, నిర్భయంగా అందరూ ఆదమరచి నిద్రపోవచ్చుననీ అభయం చెప్పారు.

"నామంత్ర జలం ఎప్పటికప్పుడు సిద్ధంగా ఉంటుంది, అది సోకితే చాలు భస్మమైపోతారు. భయమెందుకు" అని ఒక తంత్రజ్ఞుడు బీరాలు పల్కినాడు.

మంత్రులు దైవజ్ఞులూ భైరివార్తలు విన్నప్పుడు ఆలోచించడానికి మారుగా కోపగించుకొన్నారు. అడుగకుండా ఒక మర్కాళ్ళ కుర్రవాడు వచ్చితమకు రాజ్యతంత్రంలో సలహా లిస్తానంటాడా? రాజ్యాని కెప్పు డెక్కడి నుంచీ ప్రమాదమో తమకు తెలియదా?రాజ్యాన్నెలా రక్షించుకోవాలో తమకింకొకరు నేర్పాలా

అనుకొన్నారు వారు. తాము చదువుకున్న నీతి శాస్త్రం, అర్ధశాస్త్రం, న్యాయశాస్త్రం అన్నీ ఈ కుర్రవాడి ముందు బలాదూరా అని వారి ఆగ్రహం

నెలల తరబడి ఈ రీతిగా రాజ దర్శనం దొరకక విఫలుడైన భైరిచివర కొక రోజున అనుమతి లేకుండా రాజుగారి దర్శనం చేసే సాహసాని కొడిగట్టినాడు.

మహారాజుగారు వారానికొకరోజు తీరుబడి చేసుకొని కోట సమీపంలోని రామాలయానికి పాదచారులై నిరాయుధులై ఏకాకిగా వెళ్ళేవారు. ఇది ప్రమాదమని హెచ్చరించ బోయిన వారి నాయన లక్ష్యపెట్టలేదు. "దేవునివద్ద నేను భక్తుణ్ణి. రాజునుగాను" అన్నారు. అందుకని ఆ సందర్భంలో ఆయన ఏకాంతాన్ని ఎవరుగాని భంగపరచకుండా తగు కట్టుదిట్టాలు చేసేవారు. ఆ కట్టడుల నెవరైనా భంగపరిస్తే ఎంతటి శిక్షయైనా వేయవచ్చు. మరణశిక్షకూడా కావచ్చు. రాజుగారి ఔదార్యాన్ని దుర్వినియోగపరచుకొని దుర్మార్గు లెవ్వరూ అనాహుతమేదీ తలపెట్టకుండా ఉండాలని ఇంత కఠినశిక్షలు నిర్ణయించారు.

భైరి ఇక రాజ దర్శనానికితర మార్గమేదీ కన్పించక ఆలయసమీపాన మాటు వేశాడు. ఉదయం నుండి రాత్రి పొద్దు పోయేవరకు ఆలయంలోనే గడుపుతూండేవాడు. పూజారులకు పుష్కలంగా దక్షిణలిస్తూ పరదేశీ వర్తకులమని చెప్పుకొని అనుమానాని కాస్పదం లేకుండా చేసుకొన్నాడు. రోజూ అతను కన్నార్పకుండా కోటవైపే చూస్తూండేవాడు. వైభవంగా పదునెనిమిది పరగణాలకు గుర్తుగా కట్టించిన పదునెన్మిది బురుజుల కోట అతనికి కన్పిస్తూండేది. తాళ్ల బురుజు, హనుమంత బురుజు, తోక బురుజుల పైని బావుటాలు రెపరెప లాడుతూ కన్పించేవి. అంతా మట్టికోటే. అయినా అక్కడక్కడా బలంకోసం పెద్దరాళ్లతో తాపడం చేశారు. అంతటా సామాన్యంగా పదహైదిరవై అడుగుల ఎత్తుండేది. ఒక్కొక్క చోటింకా ఎక్కువ. అడుగున కొంత ఎత్తువరకు గచ్చుచేసి ఉంచారు. పైన కోటమీద కాపలా వాళ్లు పహరా కాస్తున్నారు. అప్పుడప్పుడూ గుఱ్ఱపు రౌతు లొకరో ఇద్దరో

స్వారి చేస్తూ కన్పించేవారు. ఎప్పుడైనా ఎడ్లబండ్లూ కన్పించేవి. యామాలను తెల్పుతూ కోటమీది గంట క్రమం తప్పకుండా మ్రోగేది, ఏనుగులు సాయంకాలంపూట లప్పుడు వాహ్యాళికి వెళ్ళేవి.

రాజు కొలిచే దేవళంకదా ఎప్పుడూ సందడిగా ఉండేది. పూర్వం ఎవ్వరి దృష్టినీ ఆకర్షించని ఈ దేవాలయానికిప్పుడు ధనికులంతా పోటీలుపడి డబ్బు వెచ్చించి వృద్ధిలోకి తెస్తున్నారు.

శ్రీరామప్రభువు కైంకర్యం సంపూర్ణమయ్యేందుకు దేవదాసీ నియామకం కూడా ఈ మధ్యనే పూర్తి అయింది. ఆమె సంపన్నుడుగా కన్పిస్తున్న భైరిపట్ల లోపం లేకుండా శ్రద్ధ కనపరుస్తున్నది.

అయినా భైరి కివేవీ పట్టేవికావు. ఉదయమొకసారి,రాత్రి ఒకసారి మాత్రం మనసార దైవదర్శనం చేసుకొని తన ప్రయత్నం సఫలమవ్వాలని ప్రార్థనలు సలిపే వాడంతే.

ఆ రోజు రానేవచ్చింది. కోటనుంచి మహరాజులవారు వస్తున్నట్లుగా ఆలయానికి వర్తమానం చేరింది. నిమిషంలో ఆలయ ప్రాంగణమంతా ఖాళీ చేయించేశారు. భైరి ఇదే అవకాశమనుకొన్నాడు, దీన్ని జారనివ్వకూడదనుకున్నాడు. సమీపంలోని ఒక చెట్టుపైకెక్కి కూర్చొని మహరాజుగారు దేవదర్శనం ముగించుకొని ఇవతలకి వస్తున్నప్పుడు గబగబ దిగి ఆయనకెదురువెళ్లాడు. ఇంతలో అప్రమత్తులైన కాపలావాళ్లనుండి శర పరంపరలుగా బాణాలు భైరిముందు నేలమీది గుచ్చుకొని పిట్టగోడలా ఏర్పడు తున్నాయి. భైరి చుట్టు చూచి తన కదలికలో ఏ మాత్రం అనుమానం కల్గినా ప్రాణానికి ముప్పని గమనించి వెంటనే మోకాళ్ళు ముడిచి చేతులు జోడించి అమ్ములపిట్టగోడ వెనుక వినమ్రుడుగా కూర్చుండి పోయాడు. మహరాజుగారి అడుగులు సమీపిస్తున్నాయి. కాపలా విలుకాండ్రు ఏ మాత్రం ప్రమాదాని కాస్కారం కన్పించినా వెంటనే నివారించేందుకు విల్లు లెక్కుపెట్టి

సిద్ధంగా ఉన్నారు. ఒకరిద్ద రధికారులు విచ్చుకత్తులతో మహారాజుగారు తొలగిపోగానే భైరిని బంధించేందుకు సిద్ధంగా కొంచె మెడమిచ్చి నిల్చుకొన్నారు.

ఇంకా దైవధ్యానంలోనే ఉన్న మహారాజుగారు పూర్తి సమీపానికి వచ్చిన దాక భైరినిగాని అతకికీ తమకు మధ్య నున్న అమ్ములపిట్టగోడను గాని గమనించనేలేదు, ఆయన సమీపిస్తూనే భైరి "మన్నించండి ప్రభూ! ద్రోహినిగాను. తమ ప్రశాంతవేళను భంగపరచిన అపరాధిని. కానీ రాజ్యక్షేమం కోరి మాత్రమే ఇలాచేశాను. నేను తమకు విన్నవించు కొనవలసిన విషయాలు విన్న తరువాత ఇందుకు మీ రేశిక్ష విధించినా సంతోషంగా భరిస్తాను." అన్నాడు. ఆయన తలెత్తి క్షణం ఆశ్చర్యంతో చూసి వెంటనే కాపలాదార్లకు విల్లులు దించవలసిందిగా రెండుచేతుల్తో సంజ్ఞ చేశారు. భైరిని లేవమన్నారు. భైరి ఎందుకు వచ్చింది క్లుప్తంగా తెలుసుకొన్నారు. వ్రేలి ఉంగరం తీసి అతని కిస్తూ దర్బారుకు రావలసిందిగా ఆజ్ఞాపించి వెళ్లిపోయారు.

తరువాత పెద్దాపురం నివాసుల్లో ఈ ఘటన కొంత సంచలనం కలుగ జేసింది. దర్బారులో భైరి చెప్పదల్చుకొన్న విషయాలను గురించి నల్గురూ అడిగి తెల్సుకోనారంభించారు. ఆ రోజే భైరి జరిగిన విషయాలు మంజరికి కబురు పెట్టేశాడు. దర్బారు జరిగే నాటికోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు,

ఎదురు చూసిన దర్బారు రోజు వచ్చింది. భైరి ఎంతో ఉత్సాహంగా దర్బారు జరిగే స్థలానికి చేరుకొన్నాడు. అతన్ని సగౌరవంగా ఆస్థానంలో ప్రవేశపెట్టి ఉచితాసనం మీద కూర్చుండ బెట్టారు. గుండె దడ దడ కొట్టుకొంటూంది. భైరి ఎంతో కుతూహలంతో జరుగబోయే దూహిస్తూ కూర్చున్నాడు.

మహారాజుగారు రావడానికి వ్యవధి ఉంది.

"రాజుగారి రాకను తెలియజేస్తూ వైతాళికులు ఆడంబరంగా జయకారం పల్కుతారు. రాజుగారు మాత్రం నిరాడంబరంగానూ ఠీవిగానూ వచ్చి సింహాసనం మీద కూర్చొంటారు. ఆస్థాన వ్యవహారాలను చూస్తున్న వ్యక్తి సవినయంగా లేచి

ఈ రోజు చూడవలసిన వ్యవహార వివరాలు నివేదించబోతాడు. రాజుగా రతన్ని వారించి, తన్ను పిలిచి సభకు చెప్పదల్చుకొన్న విషయాలన్నీ వివరంగా చెప్పమంటారు. తాను మొదట్లో సంకోచించినా రాజుగారి ప్రోత్సాహంతో విషయాలు చక్కగా చెప్తాడు. దాని మీద సభలో గొప్ప సంచలనం కల్గుతుంది, ఘాటుగా చర్చలు జరుగుతాయి, చివరన రాజుగారే కాగల కార్యాలన్ని నిర్ణయిస్తారు....... ఆ: ? ఆయన నిర్ణయం ఎలా ఉంటుంది ? పిఠాపురం వారికి కబురుపెట్టానంటారా? మంత్రిగారిని రేవుపట్నాలన్నీ చూచి రమ్మంటారా? తామే వస్తామంటారా? ఇకమీద పాశ్చాత్య వర్తకులకు తమ ఆస్థానంలో ప్రవేశాన్ని నిషేధిస్తారా ? విజయనగరంలో విజయరామరాజుగార్కి కాక ఏకంగా నిజాం వారికే విషయాలు తెలియ జెప్పేందుకు తగు తోడిచ్చి తన్ను వెళ్లమంటారా?........"

ఇలా కూర్చొని కలలు గంటున్న భైరయ్యను రాజసేవకులు మొరటుగా తట్టి లేపారు, భైరి సిగ్గుతో వికారంగా మేల్కొని లేచాడు. రాజుగారు వచ్చి ఆసన మలంకరిస్తున్నారు. చుట్టు పక్కలవారు తన్ను నిరసనగా చూస్తున్న చూపుల బాణాల బాధ భరించడం కష్టంగా ఉంది, అందరితో భైరి కూర్చున్నాడుకానీ అతని కావేళల్లా ముళ్లమీద కూర్చొన్నట్లుగానే ఉంది,

ఒకవేళ రాజుగారు గానీ చూడలేదు కదా ? చూసి అపార్థం చేసు కొన్నారేమో అందుకే తన్ను పిలువ లేదేమో.

సభలోఆవేళ ఒకాయన పద్యాలు చదివి మధ్య మధ్య అర్థాలు వివరిస్తున్నారు. రాజుగారు వింటున్నారో లేదో తెలుసుకోవడం కష్టం. ఒకసారి తలూపితే ఆస్థానమంతా మెచ్చుకోలు మాటల్తో నిండిపోతుంది. వీటితోనే ఆరోజంతా గడిచిపోయింది. రాజుగారు లేచేవేళైంది. సభ సెలవు తీసుకొంది.

ఇలాగే ఒక రోజు చదరంగపుటాటలోను, ఒకరో జింకొకటి ఇలాగే దర్బారులు గడుస్తున్నాయి. ఆస్థానంలో అతను వింటున్నవీ, చూస్తున్నవీ ఒకే మాదిరిగా ఉంటూ విసుగువేయ నారంభించాయి. అలవాటు కాకపోతే అంతేగా ! భైరిమాట

పట్టించుకొన్న వారు మాత్రం ఎవ్వరూ లేదు. తానాస్థానాని కెందుకు వెళ్తున్నట్లో భైరి కర్థంకాలేదు.

దినదినాకీ అతని మనస్సెంతో క్రుంగి పోయేది.

జగపతి మహరాజులు భైరికి కారణమైతే చెప్పలేదు కాని, ఆయనా నిస్సహాయ స్థితిలోనే ఉన్నారు. ఆయనా ఇంత వ్యథా పడుతున్నారు. ఆయనింకా కుట్రలకు కుహకాలకు గిడసబారని యౌవనంలోనే ఉన్నారు. అయితేనేం ? తన రాజ్యప్రాప్తికి దోహదంచేసిన పెద్దలను కాదని పోగల్గినస్తోమత గడించుకొనలేదు. రాజవైభవాలకేకాదు, సైన్యానికి జీతాలివ్వవలిసి వచ్చినా నిజాంవారికి సకాలంలో సొమ్ము చెల్లించవలసి వచ్చినా ఎప్పటికైనా కోమట్ల వద్ద పత్రంవ్రాసి తెచ్చుకొనక తప్పదు. సంస్థానానికింకా ఆర్థిక స్తోమత పెరగవలసి ఉంది. సైన్యంయొక్క అవసరం చూద్దామా, ఇప్పట్లో ఎంతైనా ఉంది. ఏక్షణాన ఎక్కడైనా యుద్ధం రావచ్చు ననేటట్లుగా ఉంది. కాబట్టి బలమైన పట్టేదైనా దొరికేవరకు ఉన్నవారితో ఎవరితోనూ నిష్ఠురంకొని తెచ్చుకొనడం రాజనీతి కానేరదనుకొన్నారాయన. అందుకే "అబ్బాయిగారి ఔదార్యం మెచ్చదగిందేగానీ, కులగోత్రాలు తెలియని కొత్తవాడినల్లా సగౌరవంగా ఆస్థానంలోనికి రానిస్తూపోతే బాగుంటుందా" అన్న సూచన ఒకానొక పెద్దవారినుండి తగులగానే ఆయన ధైర్యం చేసి భైరి విషయమై ముందుకు పోలేకపోయాడు.

గుమాస్తా అనుభవమున్న విద్యార్థి ఒకడు పుల్లవిరుపుమాట వేశాడు. "పార్టీల నందరినీ సగౌరవంగా ఆహ్వానించే ఆఫీసరంటే మామూలు బంట్రోతుకే నచ్చదు. ఆ స్థానంలో ప్రధానులా మాత్రం పొడివేస్తే ఆశ్చర్యమేముంది?"

అతని విట్టు కెవ్వరూ నవ్వలేదు.

"కానీ ఇక్కడ ఆస్థానంలో వ్యవహారాలు నాన్చుతున్నారు గదా అని ప్రపంచ గతి నిలవదుగదా. శరవేగంతో దేశ చరిత్ర గతిని మార్చేసే ఘటనలు జరిగి పోతున్నాయి.

ఆలస్యంగా నైతేనేం దేశంల్లోని అల్లకల్లోలాలను గురించిన వార్తలనేకం పెద్దాపురం వరకు వచ్చాయి.”

పడవవాడొక క్షణం నిలిపి అందరి ముఖాలు పరికించి చూచాడు.

“ఈ దేశంలో ఎప్పూడూ కల్లోలాలేనోయ్?” ఒక విద్యార్థి తన రాజకీయ పరిజ్ఞానాన్నొలక బోశాడు.

“ఔనులె! బ్రిటిష్ వాళ్ళు వ్రాసిన హిస్టరీ టెక్స్టు పుస్తకాల్లోనిదే పూర్వ చరిత్రంతాననీ, తరువాత నేటికి న్యూస్‌పేపర్ల హెడ్‌లైన్లలోనిదే ఈ కాలం చరిత్ర అనీ భావించుకొని తృప్తిపడే వారికి దేశంలో ఎప్పుడు చూచిన దండయాత్రలు, కల్లోలాలు, ప్రమాదాలు, హత్యలూ, మానభంగాలు, ఇవికాకింకేమి కన్పిస్తాయి?” సంభాషణ పెంచేందుకు మరొకరు చణుకు విసిరారు.

“నీ వొక్కడివే క్షుణ్ణంగా చదువుకొని అర్థంచేసుకొనే వాడివి. ఒప్పుకొన్నా. కానీ. ఇక్కడొక కల్లోలమిప్పుడు సృష్టించవద్దు” ఇంకొకడుచేతులు జోడించి వెటకారం చేస్తూ మరికొంత ఇంధనం చేర్చాడు.

మరొక విద్యార్థి: “చరిత్రలో పోలికలు సరిగా ఉండటం కష్టంలేరా! ఇప్పటి కష్టసుఖాలిప్పటివి. అప్పటి సమస్యలప్పటివి”

“అయినా గతంలో నుండి పాఠం నేర్చుకోవాలిగా” మొదటి విద్యార్థి తన్నుతాను సమర్థించుకొంటూ కథ కద్దు వచ్చాడు.

విద్యార్థి నాయకుడు కలుగజేసు కొన్నాడు.

“ఈ కాలంలో స్థితిగతులనాకాలపు స్థితిగతులతో పోల్చి గుండె బాదుకొనే వాళ్ళున్నారు కానీ, నేదాన్నొప్పుకోను. ఈ దేశానికి స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవడం చేతనౌనా అని అనుమానం వెలిబుచ్చు తూంటారు నిరాశా వాదులు. కానీ అది పూర్తిగా నిర్హేతుకం. పోతే,అప్పటికే మొగల్ సామ్రాజ్యం విచ్ఛిన్నమౌతూంది. మొగల్‌పాదుషాలు శుద్ధ ఉత్సవ విగ్రహాల స్థితికి దిగిపోయారు. తెరవెనుకమంత్రులు ఇతర నవాబులు పాదుషాలను తమ చెప్పుచేతుల్లో పెట్టుకొనేందుకెంతటి కుట్రలైనా వెనుకాడకుండా పన్నుతున్నారు. వారు

మొగల్‌సామ్రాజ్యానికి గర్భశత్రువులతో కూడా చేతులు కలుపుతున్నారు. మహారాష్ట్రులకు ఇరాన్ ప్రభువులకు కూడా వీరివల్ల మొగలాయి దర్బారు కుట్రలో భాగం లభించింది. తురానీలు, ఇరానీలు, ఆఫ్గనులు, హిందూస్థానీలంటూ నాల్గుపక్షాలుగా పాలకవర్గం చీలిపోయింది. వీటివల్ల మొగల్ సామ్రాజ్యపు వాదులు కదిలిపోయాయి. అందుకే 1737 లో పీష్వా బాజీరావు మహరాష్ట్ర సైన్యాన్ని ఢిల్లీపొలిమేరలకు నడిపించుకొంటూ పోయినా అడ్డగించే దిక్కులేకపోయింది. తరువాత మూడేళ్ళకే నాదిర్‌షా ఇరాన్‌నుండి పెనుపాతునులా వచ్చిపడ్డాడు. తోడేళ్లగుంపు గొఱ్ఱెలమందను పీక్కుతిన్నట్లు జనాన్నతని సైనికులు పీక్కుతిన్నారు. అమానుషమైన క్రౌర్యాన్ని నెరపినారు."

"నెమలి సింహాసనం, జనుల వద్దనున్న యావత్తు వెండిబంగారాలు, ఢిల్లీ చక్రవర్తులవద్ద తరతరాలుగా ప్రోగుపడిన వెలలేనిరత్నాలు, వజ్రాలు, వైడూర్యాలు, గుర్రాలు, ఏన్గులు, పదిహేనుకోట్లో మరెన్నికోట్లో రూపాయలు ఓహ్ ఇంకా ఎన్నెన్నో........." తనకూ చరిత్ర తెలుసునని ఒక విద్యార్థి నిరూపించుకొనే ప్రయత్నం చేశాడు. "ఆలిస్టులో చక్కని ఆడపిల్లల్లేరటోయి ?" ఒకరతన్నుడికించారు.

అందరూ ఫక్కున నవ్వినారు.

విద్యార్థి నాయకుడు ఛీకొట్టి కొనసాగించినాడు.

"పదిహేనుకోట్లంటే మన కెక్కువ మొత్తంగా కన్పించకపోవచ్చుగానీ, ఆనాటి జాతీయ సంపద నిల్వలతో పోల్చిచూస్తే అది దేశంలోని ఆర్థికవ్యవస్థ ప్రాణాలు తోడివేసే మొత్తమన్నమాట. ఈరీతిగా నాదిర్‌షా సైన్య విన్యాసాలు రేపినధూళి దేశంలో ఇంకా అణగనేలేదు. సామాన్యజనుల హాహాకారాలు, ఆక్రందనలు దేశమాత చెవుల్లో ఇంకా గింగురుమంటూనే ఉన్నాయి. అంతలోనే పులిమీద పుట్రలా అహమద్‌షా అబ్దాలీ దండయాత్రలు కొనసాగించాడు. అయ్యా ఎందు కింత బీభత్సం సృష్టిస్తున్నారు. అని ఒక ఫకీ రడిగిన ప్రశ్నకతని సమాధానం చాలు మన పాట్లువర్ణించాడానికి- భగవంతుడి కెవరిమీదైనా బలే పిచ్చికోపంవస్తే వాళ్ళ మీదకు నాబోటివాణ్ణుసిగొల్పుతాడు!"

బహుశ మన కథాకాలం నాటికత నొకటి రెండు ప్రయత్నాలలో జయించి మూడవ దండయాత్రకు సన్నద్ధ మౌతూ ఉండాలి. ఇక మొగల్ సామ్రాజ్యానికున్న నిజమైన అధికారం ఢిల్లీ పొలిమేరలలోవరకే. దూర ప్రాంతల్లోని రాజకీయాల్లో కలుగ జేసుకొని ప్రభావం చూపకల శక్తిదానికేనాడో లోపించింది. ఉత్తరాదినుండి ఆవార్తలే పెద్దాపురానికి వచ్చిఉంటాయి.

ఇక దక్షిణాదిని ఆర్కాటునవాబ్గిరీకోసము కలహాలొకవైపున తీరకుండానే నిజాం చనిపోయాడు. నిజాం గిరీ కోసం మరొక అంత:కలహం తయారయింది,

నాజరుజంగు నిజాంవారి రెండవ కుమారుడు. ముజఫర్జంగు మనుమడు. నిజాం గిరీ కోసం ప్రయత్నించిన వారిలో వీరు మొదటి ప్రతికక్షులు. ముజఫర్ జంగప్పటికాదోనిలో నిజాంప్రతినిధి. అతనికి కర్నూలు కడప నవాబులు కుమ్మక్కు. వీరితో చందాసాహేబు చేతులుకల్పినాడు. వీరికి డూప్లే మద్దత్తు నిచ్చాడు. డూప్లే వీరివైపుండబట్టి సహజంగా ఇంగ్లీషు కంపెనీ నాజరుజంగు పక్షం వహించింది. తన పదవికి చందాసాహేబ్రులు సాచుతున్నవాడు కాబట్టి, అన్వరుద్దీన్ కూడా, నాజరుజంగు పక్షమే. మహరాష్ట్రులూ ఈ కలహంలో ఆసక్తి కనబరుస్తున్నారు.

అయితే ఈకలహంలో కీలకమైన అంశం ఒకటుంది. ఇంతవరకు దేశీయ నవాబుకు లోబడి కంపెనీ లిందులో ప్రధానపాత్ర వహించి జొచ్చినాయి. ఫ్రెంచివారిని మచిలీపట్నం ప్రాంతాలనుండి వెడలగొట్టి సర్కారు జిల్లాల్లో వారికి స్థానంలేకుండా చేయడానికి నాజరుజంగు ప్రయత్నిస్తూ తన దాడి ప్రారంభించాడు. యానాం మచిలీపట్నాలనాక్రమించుకొన్నాడు కూడా.

ఇలా మొదట్లో విజయాలు సాధించాడు. ముజఫర్జంగు దాదాపోడిపోయే స్థితిలో ఉన్నాడు. అతనికే హనీచేయబోనని నాజరుజంగు వద్ద మాటపుచ్చుకొని కర్నూలు కడప నవాబులు ముజఫర్జంగు నతని ఎదుటహాజరు పెట్టారు. కాని మాట తప్పినా జరుజంగతన్ని తన గుడారం ప్రవేశించగానే బంధించాడు. దానితో రెచ్చిపోయిన కర్నూలు నవాబు నాజరుజంగునక్కడి కక్కడే చంపివేశాడు. తాను

ముజఫర్‌జంగు భద్రతకై హామీనిచ్చిన మాట వమ్ముచేస్తున్నందుకు కోపమేగాని రాజకీయంగా జరుగనున్న పరిణామాలతని ఆలోచనలో లేకపోవచ్చు. తిరిగి ఇప్పుడేర్పడిన అస్థిమిత పరిస్థితులను ఫ్రెంచివారు చక్కగా వినియోగించుకొన్నారు. వారెంతైనా సాహిసికులు, ప్రపంచంలో నాల్గుతావులు చూచినవారు అయిరి. మన వారిదేమో చిన్నచూపు. వారు వణిక్ప్రతురులు మనవారు మహరాజులు, నవాబులున్నూ.

కాబట్టి ఫ్రెంచివారు ముజఫర్ జంగును హుటాహుటి పాండుచేరికి తీసుకొనివెళ్లి నైజాముగా ప్రకటించి, పెద్ద ఉత్సవం జరిపించి అతని వద్ద నుండి మచిలీపట్నాన్ని, కృష్ణానదికి దక్షిణానగల మొగల్‌రాజ్యాన్నీ దత్తమనిపించుకొన్నారు.

ముజఫర్ జంగ్ రాజధానికి పయనమయ్యాడు. నాజరుజంగువద్ద కొల్ల గొన్న ధనంలో వాటాకోసం, తమ సాయంవల్ల కలసివచ్చిన దానిలో భాగం కోసం కర్నూలు కడప నవాబులతని వెంటబడ్డారు. బహుశ ఫ్రెంచివారి అండ చూచుకొని ముజఫర్ జంగు వారి ననానదరణ చేశాడేమో ! వారు ముజఫర్‌జంగును కూడా చంపివేశారు. కానీ రాజకీయంగా మాత్రం నాయకత్వం వహించలేకపోయారు. ఫ్రెంచివారే ఇంకా రాజకీయంగా అగ్రశ్రేణిలో ఉన్నారు. మనవాళ్ళో, పాళెగారులు! వీరి కొక ఆశయమూ, నాయకత్వం వహించే సామర్థ్యమా, వల్లకాదా? నదరుగా కన్పించిందల్లా ఆ క్షణమే స్వాహాచేద్దామన్న దుర్బుద్ధేకానీ. తోటపెంచలేరుకానీ పూవులు కన్పిస్తేమాత్రం విడువరు. ఆ పూవులకోసం ప్రయత్నంలో తోట సర్వస్వం నాశనమైనాసరేగానీ, తమ దురాశమాత్రం మానలేరు. సామాజిక ప్రయోజనం కూడా తమ కవి స్వార్థానికి కొంత జోడు కలపాలన్న ప్రాథమిక పరిజ్ఞానం కూడా వారికిలేదు. ఇటువంటివారికి నాయకత్వం మెలావస్తుంది ?

దేశిప్రభువులుగానీ ఇతర ఉన్నతక రాజోద్యోగులుగానీ ప్రదర్శించలేని చొరవను ఫ్రెంచివారు ప్రదర్శించి నైజాం మూడవ కుమారుడైన సాలబిత్ జంగునీసారి నైజాముగా ప్రకటించారు.

సాలబత్‌జంగు ఔరంగాబాదులో రాజ్యమేల నారంభించాడు. అతడు ఫ్రెంచి వారికి వ్యతిరేకంగా తిరిగి పోకుండా ఒక చిన్న ఫ్రెంచిసైన్యం బుస్సీనాయకత్వాన ఔరంగాబాదులో తిష్ఠవేసి కూర్చుంది. అందులో ఉన్నది రెండువందలమంది ఫ్రెంచి సైనికులు అంతకు పదిరెట్లు దేశీయులు. ఈ బుస్సీ పెత్తన మందరికీ కంటకంగానే ఉంది. సాలబత్‌జంగుకూ కంటకంగా ఉంది. దివానులకు సరేసరి. కాబట్టి బుస్సీకెలాగైనా స్వస్తి చెప్పాలని వారు కుట్ర లప్పుడే ఆరంభించారు,"

ఇందుకోసమే ఎదురు చూస్తున్నవానిలా పడవవాడు రకీమని కథ అందుకొన్నాడు.

"నిజాంకొలువులోని ఈ ద్వంద్వం తెలియ వచ్చిన తరువాత సంస్థానంలో ఆలోచించ గల్గిన వారందరూ భైరి మాటలూ పూర్తిగా కొట్టివేయ వలసినవి కావని భావిచారు. కళ్ళెదుట పాశ్చాత్యులెంతకు సమర్థులో కన్పిస్తూండె మరి. నిన్న మొన్నటిదాక ఎవరికీపట్టని చోట్ల కాపురముండి ఏదో వర్తకం చేసుకొంటున్న వర్తకు లేమి, నిజాం రాజ్యంలో ఎవరికీ లేని పలుకుబడి చెలాయించడ మేమి ? మచిలీపట్నం మొదలుగా ఇతర రేవుల్లో కూడా ఫ్రెంచివారు విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్నారనీ వారితో కలువని దేశీ వర్తకులకులను ఇబ్బంది పెట్టున్నారనీ కూడా తెలుస్తూండె. ఇంతలో ఇంతవారైతే, ఇలాగే కొన్నాళ్లు సాగితే ఇంకెంతవారౌతారో అని ముక్కులపై వేలేసుకొన్నారు. అయినా పూనుకొని దీన్నడ్డగించడానికి మాత్రం దూకలేకపోయారు. ఎటుపోయెటువస్తుందో మన మెందుకు ముందుపడాలి. ఇంకా పెద్దసామంతులున్నారుగా ! వేచిచూద్దామనుకున్నారు.

భైరివారికి, వేచిన తరువాత చూచేదేమీలేదని నచ్చజెప్ప జూచాడు కానీ ప్రయోజనం లేకపోయింది.

చివరికి విసుగెత్తి భైరి పెద్దాపురం వదలడానికి నిశ్చయించుకొన్నాడు. అతనికి తిరిగి కోరంగి పోవడానికి మనస్కరించలేదు. (తమ ఓడలు వచ్చిన వార్త అతనికింకా తెలియలేదు) తిరిగి వెళ్ళి అక్కడేం చెయ్యాలి తాను? మంజరి

కేమని ముఖం చూపుతాడు ? మంజరి పిచ్చిదైతన్నుగురించి పెద్దగాభావించింది కానీ గ్రామస్థ లన్నదే నిజవేమెూ. తాను వట్టి ప్రిష్పయెూజకుణ్ణని నిరాశపడిపోయేవాడు. కానీ ఇంతలోనే తిరిగి పట్టుదల తెచ్చుకొని ఇతర చోట్ల ఈ ప్రయత్నం కొనసాగించాలని నిర్ణయించుకొని తిరుగ సాగినాడు. ఇలా అనేక ప్రాంతాలు తిరుగుతూ ఎంతో అనుభవం గడించాడు. ఈ మధ్య నిజాం గద్దెకోసం వచ్చిన కల్లోలాలవల్ల సర్కారుల్లో ఎక్కడ చూచినా స్థానికుల ప్రాబల్యం పెరుగుతూంది. నోరున్నవాళ్లదే రాజ్యం. ఢిల్లీలోగానీ, గోల్కొండలో గాని బలమైన ప్రభువులుంటే వీరి ఆట లింత విచ్చలవిడిగా సాగేవికావు. ఏటా నవాబుల పన్ను వారికి చెల్లిస్తేచాలు, మరి వారిటుచూసేవారే"కాదు. దూరంనుంచేచిన్న రాజులూ నాయకుల నదుపులో ఉంచేవారు. ఒకవేళ చెల్లించలేకపోతే దయాభిక్షకోరినా చాలు. వారి బలము ముందు పిట్టరాజు లెవ్వరూ తోకవిప్పేవారు కారు.

ఈ మండలాధిపతులతో అలాకుదరదు. మామూలుగానే బొట్టు బొట్టు పిండుతారు. ఇంక యుద్ధవాతావరణ మేర్పడిందా, ఆ పిండేందు కొక క్రమమూ లేదు. మితిలేదూ. విలువైనదేదీ వారికంట్లో పడేందుకే వీల్లేదు. వెంటనే స్వాధీనం చేసుకొంటారు. వీరి ఈఅమిత దాహంవల్ల కంసాలులూ, గాజు పనివారు, వడ్రంగులు, రైతులు అంతా చాలా ఇబ్బంది పాలౌతున్నారు. సంపదలమాట దేవుడెరుగు. ఇంట్లో ఆడపిల్లమానాలు కాపాడుకోవడమూ పెద్ద సమస్యై పోతూంది.

భగవంతు డవతార మెత్తితే తప్ప మానవమాత్రుడు దీన్ని బాగుచేయలేడన్న నిస్పృహ జనంలో క్రమంగా వ్యాపించుతూంది. ఎక్కడా భైరికాశ కన్పించ లేదు.

ఇలా దేశాలుపట్టి తృప్తిలేక తిరుగుతున్న భైరి ఎలాగైతేనేం కోరంగిమనుష్యులకు దొరికినాడు. అతన్నతికష్టంమీద వారుకోరంగి తీసుకొని వెళ్ళారు. పూజారిగారబ్బాయి మాత్రం "నేను దేశాలు తిరిగి వస్తాను. ఎక్కడైనా ఆశకన్పిస్తుందేమో వెతుకుతాను. రామేశ్వరం మొదలు కాశిదాక తిరిగి వస్తాను నాజందెమే నాకు రక్ష, భిక్షకూడా" అన్నాడు.

ఇప్పుడు కోరంగికి తిరిగివచ్చిన భైరి పాత భైరి కానేకాదు. ఆ చలాకీతనం లేదు ఆఉత్సాహంలేదు. ఆ నవ్వుముఖం లేదు. మన్ను తిన్న పాముకంటె కూడా ఎక్కువగా మజ్జు పడిపోయినాడు అతనింటికి వచ్చినందుకుండవలసిన సంతోష మింట్లో కొరవడిపోయింది. ఓడలు తిరిగి వచ్చిన సంతోషమూ ఇందులో మరుగున పడిపోయింది.

భైరి ముఖం కళగా ఉన్నప్పుడు చూడాలంటే ఒక్కమంజరి ఇంట్లో మాత్రమే చూడవచ్చు. మంజరీ తానూ చర్చించుకొనే సందర్భంలో అతని ముఖం జేవురించి ఉంటుంది. పాశ్చాత్య వర్తకవర్గ మంతకంతకూ తమ ప్రాబల్యాన్ని పెంచుకొంటున్నారు. క్రమంగా రాజులందరినీ వారు గుప్పెట్లో పెట్టుకొంటున్నారు. దానికి ప్రతిక్రియ కన్పించదు. అయినా భైరి, మంజరి తమ ప్రయత్నం విరమించుకొనలేదు.

వారి అభిప్రాయభేదా లొకప్పుడిద్దరి మధ్య విరసం తెచ్చేవి. అటువంటి సమయాల్లో భైరిని, ఆ మంజరి ఆశ్రయంలోని యువతులలో ఒక పడుచు ఆకర్షించేది. భైరిలోని సాహసాన్నిచూసి ఆమె ఇష్టపడితే ఆమె అమాయికత అతన్నాకర్షించింది, పెద్ద అందం లేకపోయినా.

కానీ ఆ అమ్మాయి అమ్మవారుపోసి చనిపోయిన తరువాత భైరి మనస్సు ఎడారైపోయింది.

మంజరిప్పుడు తన ద్వేషాన్నంతటినీ రేవుల్లోని సంపన్నులమీద కక్కుతూంది. మండలాధి పతులు దివాణాల్లో ఉద్యోగులు జరుపుతున్న అనాహుతాలను ధైర్యంగా ఎదుర్కోనగల్గిఉండిన్నీ ఆ సంపన్నులు లౌక్యం పేరుతో ప్రాశ్చాత్యులచాటున పెచ్చువసూలుచేస్తే ఎదురించక, నిరాకరించక, తమ సరుకును పాశ్చాత్యుల పేరిమీద రవాణాచేస్తూ పన్ను మినహాయింపుకోసం కక్కుర్తి పడుతున్నారు. బహుమతులిచ్చి లంచాలిచ్చి ఉద్యోగుల చవులూరిస్తూ ఆకలి పెంచుతున్నారు. ఉద్యోగులలో తెలివైన వాళ్ళకుభాగమే యిచ్చి వేసి పరిపాలకులతో కార్యభారమంతా వారి కప్పగిస్తున్నారు.

"మీ గొయ్యి మీరే తవ్వుకొంటున్నా"రనేది మంజరి. "మనదేశంలో పాశ్చాత్యులకు మీరు లేనిపోని గొప్పను తెచ్చిపెట్టున్నారు. ఈ రోజున దుండగులనుండి తప్పించుకొనడానికి మీరు వారి నడ్డువేసుకొంటున్నారు. ఒకరోజున వారేదుండగులతో కలసినప్పుడేం చేస్తారు? దేశీయదుండగులూ, పాశ్చాత్యులూ కలిసినప్పుడు మనపాట్లెవరికెరుక ?" అని ఆమె ప్రశ్నించేది. "రైటే వారుఅదుపుతప్పుతున్నారు. అయితే వాళ్ళ నెవ్వరదుపులో పెట్టాలి? మేమా ? అసంభవం, వాళ్ళకు ఢిల్లీ ఫర్మానాఉంది. దాన్నుపయోగించుకొనే చలమూ అనుకూలమూఉంది. మన ఒత్తిడి తీవ్రమైతేఇక్కడ కాళీచేసి ఇంకోచోటికి పోతారు అప్పుడేంచేస్తాం?" అని సమాధానం చెప్పేవారు.

ఎంతోదూర మక్కరలేదు ? కోరంగిలోని రాజబంధువుకు భైరి తండ్రే భాగమిచ్చిఉండె. ఆ రాజబంధువిప్పుడు పెద్దవారిజోలికి పోకపోయినా చిన్నవారి పట్ల మహరాజులాగే ఉంటున్నాడు. సుంకాలు, బహుమానాలు గుంజుతున్నాడు.

మీరయ్యా అంతే! వియ్యంకులర్వారా బలపడిన ఫ్రెంచివారి పొత్తు వల్ల కావలసినంత డబ్బు సంపాదిస్తున్నాడు. ఆ కాలంలో ఫ్రెంచివారి పొత్తంటే సామాన్యమా ? యావత్తు దక్షిణదేశంలో వారి కత్తికడ్డుందా?

ఇలాగే ఎవరి వీలుకొలదివారు పాశ్చాత్యుల పొత్తు. రాజులపొత్తు, రాజోద్యోగుల పొత్తుచూసు కొంటున్నారు.

వర్తకులే కాదు. పెద్దవడ్డీవ్యాపారులుకూడా పాశ్చాత్యులతో లావాదేవీల నెక్కువ చేస్తున్నారు. ఏం చేస్తారుపాపం? ఇంతవరకు వారి వద్దవడ్డికి తీసుకొంటున్న మహరాజుల పరపతి అయోమయ స్థితిలోపడింది. ఈ రోజు రాజుగా ఉన్నవాడు రేపేమౌతాడో ! అసలుకే మోసంగా ఉంది. మామూలుగా ఉద్యోగుల జీతాలకు, సైన్యాలకు కరువుకాలంలో నీటి వసతులకు లేదా చక్రవర్తుల కప్పంచెల్లించేందుకు ఈ అప్పులు మహరాజులకు కావలసి వచ్చేవి. ఇప్పుడీ విషయాలన్నీ క్రమంతప్పిఉ ంటున్నాయి. కాబట్టి అప్పులిచ్చేందుకు వడ్డీవ్యాపారస్థులు కొత్తఖాతాదార్లను చూసుకొనవలసి వస్తుంది.

ఇందులో పాశ్చాత్యవర్తకులు చక్కగా వారికంది వస్తున్నారు. ఈ మధ్య రాజకీయల్లో పాశ్చాత్యులకు వచ్చిన పెత్తనం మూలంగా వారి సైన్యాలు పెరిగాయి. ఆ ఖర్చులకు వారు పెద్దమొత్తా లప్పుచేస్తున్నారు. ఎంత వడ్డీకైనావారు వెనుదీయరు. పూర్తిగా తెగబడినవారితో సమంగా మరెవ్వరు వడ్డీ ఇవ్వగ్రలు !

మంజరి వర్తకులనూ, వడ్డి వ్యాపారులనూ సూటిగా అడిగేది వారు పాటకోసమో నాట్యానికో వచ్చినప్పుడు.

"నేతపనివారిదాకా పాశ్చాత్యుల నెందుకయ్యా పోనిస్తారు? వాళ్ళకు విదేశీవారితో పంచకార మెందుకిప్పిస్తారు ? ఈ సంచకారాలమూలంగా కదా వాళ్ల ఇష్టాపెత్తనం సాగుతున్నది? ఆ సొమ్మేదో మీరు పెట్టుబడి పెట్టరాదా ? సరుకు నిల్వ చేయరాదా ? వచ్చి ఎవరైనా సరె నిల్వచూసి నచ్చితే బంగారో వెండో అప్పటికప్పుడిచ్చికొనే ఏర్పాటు చూడారాదా?"అని

"మనసముద్రాల్లో శాంతి బాధ్యత మనది. దానికయ్యే ఖర్చులో వారి వాటా వారు మనకు చెల్లించాలి. అంత మాత్రం చేతగాని దద్దమ్మలమా" అని అడిగేది.

రంగన్న సైయనేవాడు క్రిష్ణా నదినుండి కళింగతీరంవరకు మరి మాట్లాడితే బంగాళం వరకూ, పూచీ పడమంటే నేనొక్కణ్ణి పడ్తాను. ఆ మారాజు భైరయ్య ఉ ంటేనా ఇంక తిరుగేలేదు." అని భరోసా పల్కే
వాడు.

ఒకరిద్దరామాటా చూడాల్సిందేఅనేవారు. మిగిలినవారు విదేశీవాళ్ళు లేకపోతే భూమి తిరగడమాగిపోదా అన్నట్లుగా చూసేవారు. ఆమె కళాపుష్పానికి క్రింద పుట్టిన ముళ్ళీ మాటలనుకొని చెవులకివతలే పరిహరించేవారు

భైరయ్యకీ పరిస్థితి అర్థమైనట్లల్లా తన నిస్సహాయత తెలిసివచ్చేది. తన భావాలతో ఏకీభవించనివారిపట్ల ఒకప్పుడు సానుభూతి ఒకప్పుడు దు:ఖం ఒకప్పుడు కోపం కలిగేవి, అతని తీరు ఇతరులకర్థం కానిదిగా ఉండేది. దీన్ని చూసి పాపం కోరంగి ఎంతో బాధపడేది.

తప్పిపోయి తిరిగివచ్చిన కొడుకు పిచ్చిచూపులు చూస్తు ఇంటిపట్టున కూర్చొనినప్పుడు తల్లడిల్లే తల్లిలా కోరంగి అతనిపిచ్చిచూపులకు కన్నీళ్లై ప్రవహించేది.

పరాజయంతో స్థిమితం తప్పిన కొడుకునోదార్చలేక తపించే తల్లిలా కోరంగి సుడులు తిరుగుతూ ప్రవహించేది.

భైరయ్యలో ఏర్పడిన మజ్జుతనాన్ని పోగొట్టడానికతని కుటుంబ సభ్యులందరూ శాయశక్తులా కృషిచేసినారు. వారి కృషి ఫలించలేదు. చివరకు బాబయ్యకూడ అతనిలో ఉత్సాహాన్ని రేకెత్తించలేకపోయినాడు. ఒకసారి పట్టలేని బాధతో కోపగించుకొనగా భైరయ్య నాల్గురోజులింటికి రాకుండా పోయాడు. దానితో అతనింటి పట్టునుంటే అదేచాలని అందరూఊరుకొన్నారు.

మాథ్యూస్ భార్యకూడా భైరికోసమెప్పుడైనా కబురుపెట్టేది. భైరి వెళ్ళేవాడు కాదు. ఉల్లాసంగా ఎప్పుడూ నవ్వుతూ తిరిగే భైరిఇలా మారిపోయినందు కామె బాధపడేది. కాని పోనివిషయాలతో ఆ మంజరి ఇతని తల చెడిపేసిందనేది.

మాథ్యూస్‌కు భైరి విషయం పూర్తిగా తెలిసేందుకు చాలరోజులు పట్టింది. అతనిది రోమియోవ్యథకాదనీ ఇంకాచాలఉన్నతమైనదనీ తెలిశాక అబ్బుర పడ్డాడు. ఇప్పటికిది తెగింది కానీ, ఇక్కడా ఒక ఆంగ్రియా బయలుదేరే బీజమున్నదన్నమాట అనుకొన్నాడు. ఎందుకైనా మంచిది జాగ్రత్తగా ఉండాలని తీర్మానించు కొన్నాడు. కంపెనీ నౌకా సైన్యానికి నావికుల నెంపిక చేసుకోవసివస్తే కోరంగివారిని పరిహరించాలని నిర్ణయించుకొన్నాడు. అందుకే మొదట్లో ఎగదోసినా తరువాత తన భార్య భైరి నీలోకంలో కీడ్చేప్రయత్నాలమీద చన్నీళ్ళు చల్లేవాడు. నరసింహ

నాయకర్‌తో కొంతవర కొప్పందాలున్నా మొత్తంమీద ఆ కుటుంబాన్ని ప్రమాదకరమైన వ్యక్తులుగా లెక్కవేసుకొన్నాడు. వీరికి మారుగా మీరయ్యనే ఫ్రెంచివారినుండి విడదీసి తన పక్షం చేసుకొంటే మంచిదని ఊహించినాడు.

## IX

పరదేశి పురిటికై పుట్టింటికి వచ్చింది. పెళ్ళికొన్నేళ్ళైనా ఆమె చూలాలు కానందు కిప్పటికే అమ్మలక్కలు గుసగుసలు పోతున్నారేమో, మీరయ్యా, భైరయ్య కుటుంబంలోని పెద్దలూ లోలోపల పోతున్నారేమో, ఉన్నారు. ఇంతలో ఈ శు భవార్తవిని అత్తవారు సీమంతోత్సవం జరవడమే తడవు పరదేశిని తీసుకొని వచ్చేశారు.

పరదేశిని భైరయ్యింటికి వెళ్ళకుండా ఆపూజేయాలని సవతితల్లి గట్టి ప్రయత్నమే చేసింది. మీరయ్యకూడా ఆపజూచినాడు కానీ వారి వశం కాలేదు. పైగా గర్భిణి. ఆమె కోరికను కాదనడం పుట్టబోయే వంశాకురానికి నష్టంకల్గిస్తుందని భయం

పరదేశికి రాకవల్ల భైరయ్యలో మురిగిన మాంద్యం క్రమంగావదిలి పోయింది.

పరదేశికి ఆత్తవారింటికి పోయివచ్చినందువల్ల కన్నెరికమైతే తప్పిందికానీ మిగిలిన విషయాలకైతే పాత పరదేశే. అత్తవారింట్లో పెద్దగా పోరువంటిదేమీ లేదుకానీ అక్కడి పెద్దతరహా నడవడికలేవీ తనకలవాటులేకపోబట్టి అక్కడున్నన్ని రోజులూ ఏదో కొత్త చోటున్నట్లే ఉండేది. భర్తపట్ల మనస్సులో కలిగే భావనలు బహువిధాలుగా ఉండేవి. ఎన్నో సందర్భాలలో భైరితో అతన్ని పోల్చిచూసుకొని అతని అల్పత్వానికి నవ్వుకొనేది. ఒక్కొక్కప్పుడు తల్లితండ్రులయెడల అతనుచూపుతున్న అధీనత చూసినపుడు నవ్వువచ్చేది. తనకు సంబంధించిన విషయాల్లో ఆ పరాధీనత చూసినప్పుడు కోపమో, అసహ్యమో కలిగేవి. ఎప్పుడైనా

ప్రకృతిసిద్ధమైన అనురాగమూ కలిగేది. ఇటువంటి మన స్థితిలో పరదేశి పురిటికి పుట్టిల్లు చేరుకొంది. వివాహంతో పెనవేసుకొని పోయిన సాంఘిక సంబంధాల ప్రభావమింకా ఆమెమీదగాఢమైన ముద్రవేయలేదనే చెప్పాలి. కాబట్టి ఆమె మేనత్తఇంటికి వెళ్ళాలని ఉత్సాహం చూపింది. అది ఇంట్లో తనకు ససిలేని లోటును తీర్చుకొనేందుకు. తనమీదా కుటుంబంవారికి కోపంగా ఉంటుందని తెలుసు. తన్ను చూస్తునే అది దూదిపింజలా క్రమంగా ఎగిరి పోతుందని ఆమె నమ్మింది. అందుకే ఆమె తన స్వంత తల్లికి బ్రతికున్న రోజుల్లో విశ్వాపాత్రురాలైన పనిమనిషి చేత తాను వారింటికి వస్తునట్లు కబురు పంపుతూ వస్తున్నట్లు కబురుపంపుతూ ఆ విషయమై ఆ కుటుంబంలో ఒక్కొక్కరూ ఏమంటారో తెలుసుకొనివచ్చి చెప్పాలనికూడ చెప్పిపంపింది.

అమె తమయింటికి రాగోరుతున్న వార్త భైరిఇంట్లో నిజంగానే పెద్ద కల్లోలాన్ని రేపింది.

అరుగుమీద కూర్చొన్న భైరితండ్రి మొదటా వార్తవిని ఇంట్లో వెళ్ళి చెప్పమని తాను వీధిలోకి నడిచాడు. భైరి అమ్మమ్మ నిష్కరగా పరదేశి యింటికి రానవసరంలేదని చెప్పింది. భైరి తల్లి కళ్ళనిండా నీళ్ళు నించుకొని, నోటినిండా చెరుగు కుక్కుకొని లోనికి వెళ్ళిపోయింది. భైరి ఆసమంయలో ఇంట్లోనేఉన్నాడు కానీ ఈ వార్త అతనిచెవికెక్కనే లేదు. మిగిలింది భైరి పినతాత, ఆయన తన వియ్యపురాలు చెప్పినదివిని పొడిగా నవ్వి అంత నిష్కర్షగానూ "తప్పకుండా రమ్మని చెప్పు" అని కూర్చొన్నాడు. దానిమీదామె అతనితో ఘర్షణకు దిగింది.

"నీకు మతిపోయిందేమి ముసలాయనా?"

"ఔనౌను. వయస్సు మళ్ళుతోందికదూ."

ఆయన"ఇన్నేండ్లలోనూ నీ మాటెప్పుడూ తీసివేయలేదు. ఈ ఒక్క మారు మన్నించమ్మా" అని ప్రాధేయపడుతున్నట్లుగా మాట్లాడినాడు.

ఈ ఘర్షణ చాలా సేపు జరిగి ముసలామె కోపంగా లోపలికి పోయినందు వల్లనిర్ణయమసంపూర్ణంగా మిగిలిపోయింది. వచ్చిన సేవకురాలింకా అలాగే నిలబడిఉంది. ముసలాయన భైరి వద్దకు వెళ్ళి శ్రీమతి పరదేశి సందేశాన్ని ప్రయత్నం మీదతని తలకెక్కించినాడు. అప్పుడు భైరి తప్పకుండా పరదేశిని రమ్మని చెప్పడమేకాక "తీని కింత రభసెందుకు?" అన్న చూపు పెట్టినాడు. "ఆడవాళ్ళ కేంతెలుస్తుందిలే. తప్పకుండా మంచిరోజు చూసుకొనిరమ్మను" అని ఆయన చివరకుతేల్చి చెప్పిపంపినాడు. పరదేశి ఇవన్నీ చూసుకొని చాల నిరాడంబరంగా మేనత్త ఇంటికి వచ్చింది. ఆ రోజు ముసలామెపరదేశిని పల్కరించలేదు. పరదేశి తానై మాట్లాడించి నప్పుడు సమాధానమైనా చెప్పకుండా ఈసడించి పెడమెగం పెట్టింది. ఈఇంటికి కోడలు కావలసిన పిల్ల పరాయివాడికి సంతానం కంటూంటే ఎలా చూడాలో అందరూ అలాగే చూశారు. భైరిని పినతాతగారు మాత్రం ఆమెనాదరంతోనే మాట్లాడించి అత్తవారింట్లో కాలమెలాగడుస్తున్నదీ తెలుసుకొంటూ మాట్లాడాడు. భైరికి పరదేశిని చూశాకముఖం విప్పారింది కానీ, మామూలు పలకరింపు లయ్యాక ఏం మాట్లాడాలో తెలియక పినతాత పక్కన మెదలకుండా కూర్చున్నాడు. భైరిని గురించి వినడమైతే వినిందికాని అతనెంతగా మనుష్యులకు దూరమయ్యాడో అతనిని చూశాకగానీ అర్థం పరదేశికికాలేదు. అతనింతగా దిగజారిపోడానికి తానే కారణమని ఆమె అంతరాత్మ చెప్పింది. తాను కాదని సమర్థించుకోవాలని జూసినా అంతరాత్మ ఘోషముందామె వాదనలు చప్పబడి వీగిపోయాయి. అతన్నెలాగైనా ఈ లోకంలో పడవేయటం తన ధర్మమని నిర్ణయించుకొంది. అందుచేత అత్త కానీ నాయనమ్మ కానీ తిరస్కార భావంతో చూసినా సరె, తాను రావడం మానలేదు. భైరితో కలుపుగోలుగా ప్రవర్తించడం మాననూలేదు. భైరితో చమత్కరించి మాట్లాడేది. పులి కట్టలేకగవ్వలాట, సోపాన పటం ఏదో ఒక ఆటలో అతణ్ణి దింపేది. ఎలాగైతేనేం తనున్నంతసేపు భైరిని హుషారుగొల్పి

పోయేది. క్రమంగా భైరిలోవస్తున్న మార్పింట్లో అందరికీ ఆనందదాయకంగా ఉ ంది, ఒక రోజున పరదేశి భైరి ఇంట్లో పాత వస్తువుల కుప్ప మధ్యగా ఒక వింత వస్తువునుచూచింది. అది భైరి ఈత పోటీనాడు తెచ్చి ఉంచిన చెక్కముక్క. గొలుసు తోనూ మేకులతోను పడి ఉంది. ఆమెకు దాని విషయ మత్తవారింట్లో ఉండగా తెలిసింది. ఒక సారా ఇంట్లో నడుస్తూ పొరపాటున ఆడవాళ్ళు తిరగకూడని గదుల్లోకి వెళ్ళింది. అక్కడీ పాములను చూచింది. ఆ పద్ధతి పరిదేశి ఎంత అసహ్యించుకొన్నదో చెప్పటం కష్టం. కాని దాని విషయమై నోరు మెదపకూడదని ఆంక్ష ఉన్నందున ఆ అసహ్యాన్నిక్కడ స్వేచ్ఛగా వెలిగ్రక్కింది. వెంటనే భైరి కది అర్ధంకాలేదు, కానీ ఆమె చెప్పిన తరువాత తనకింత కాలమూ తెలియని సమస్య ఒకటి విడిపోయినట్లనిపించింది. అతనూ పరదేశికి జరిగింది చెప్పినాడు. అటువంటి నీచాచారాలు తమలో లేనందుకిద్దరూ తమ్ముతామభినందించు కొన్నారు,

భైరి నన్యాయంగా పోటిలో ఓడించిన అత్తవారింటి వారి నీసారి మరొక విధంగా ఓడించి ప్రతిక్రియ చేయాలని, కోరంగిపేరు నిలపాలనీ పరదేశకి పట్టుదల వచ్చింది. అప్పుడప్పుడు పోటీవిషయం ప్రస్తావిస్తూ అటువారు తన పుట్టినింటివారినీసడించి ఎద్దేవా చేయకుండా వాళ్ళనోళ్ళు కట్టాలనుకుంది.

ఇంతలో దీపావళి పండుగకు మీరయ్యగారు అట్టహాసంగా అల్లుణ్ణి పిలిపించారు. ఈ మధ్య వారివర్తకం పెద్దగా పెరిగినందున కాబోలు వారు పెళ్ళినాటికంటె ఎక్కువ ఛాయ కన్పింపజేస్తూ వచ్చినారు. గ్రామస్థులు వారిని చూసి బాగా ఈర్ష్య పడేలా ఉంది వారి ప్రవర్తన. ఈసారివారు తారాజువ్వల పోటికై కోరంగి యువకులను రెచ్చగొట్టినారు. దీపావళి రోజుల్లో రాత్రిళ్ళు తారాజువ్వలతో జట్లు జట్లు అటూ ఇటూ తగుదూరంలో నిలబడి యుద్ధరంగంలో లాగా పోరాడే ఆటకు మచిలీపట్నం ప్రసిద్ధి ఎంతటి రోషాలకు పోయినా చిన్నగా చర్మం కాలడం తప్పిస్తే మరేం ప్రమాదముండని ఆట ఇది.

దీనితో గ్రామంలో ఎక్కడికక్కడ మందులు నూరడాలు, దట్టించి జువ్వలు చుట్టడాలు మొదలయ్యాయి.

మొదట్లో మీరయ్య అల్లుని పరివారంలో వారు, కోరంగి యువకుల్లో చిన్నవారు కొందరూ ఈఆట మేము గెలిచామంటే మేము గెలిచామని కేరింతాలు కొట్టూ ఈ పోటీ వాతావరణాన్ని క్రమంగా తీవ్రం చేశారు. క్రమంగా పోటీలో పెద్దవారు దిగ నారంభించారు. రాత్రిళ్ళు గ్రామమంతా ఏ వీధిని చూచినా జువ్వలు విసురు కొవడాలే. చీకటి రాత్రులు యావత్తు జువ్వల వెలుగులో వెలిగి పోతూండేవి. క్రమంగా ఈ స్పర్థలు పెరిగి త్రయోదశి నాటికి పెద్దపోటీ ఏర్పాటు కావడం వరకు పోయాయి.

పెద్దపోటీ ఏర్పాటైన తరువాత యువకులు భైరి నందులోకి లాగినారు. అతన్ని తమజట్టుకు పెద్దగా కూడా ఎన్నుకున్నారు. భైరి. మొదట్లో పెద్ద ఉత్సాహం కనపరచక పోయనా, అటు వారు భైరి పేరు ప్రత్యేకంగా ఉచ్చరిస్తూండబట్టిన్నీ, పూర్వపు ఈత పోటీని పలుమార్లుదహరిస్తూండబట్టీ అతనిలో క్రమంగా అభిమానం పెరుగుతూ వచ్చింది. త్రయోదశినాడు పోటీలో భైరి ఎదుటివారి జువ్వలకు జంకకుండా సాహసించి చాలముందు వరకూ వెళ్ళి జువ్వలు విసిరి వేయడంవల్ల ఆదెబ్బకాగలేక మచిలీపట్నం జట్టువారు వెనుకకు తగ్గి ఓడిపోయారు. మరుసటిరోజు తిరిగి ఆడాలన్నారు. ముచ్చటగా మూడాటలన్నారు. రెండవరోజు పోటికి బయలుదేరు తుండగా భైరికి పరదేశి నుండి రహస్యంగా ఒక హెచ్చరిక అందింది. ఈనాటి జువ్వలు మామూలు జువ్వలు కాదని, కొంచెం తగ్గి ఉండకపోతే ప్రమాదమనీను. జువ్వలు పేలేట్టైతే నేలమీదపడి పోవలసిందనికూడా అందులోఉంది.

భైరి ఒకసారి దెబ్బతిన్నవాడు కాబట్టి వెంటనే తికమకచెందినాడు. ఆ రోజు భైరి తెగించి తానై ముందుకు దూకలేదు. ముందుకుపడిన వాళ్ళను వెనుకకు లాగినాడు. ఉత్సాహం పట్టలేక అతణ్ణి కాదని ముందుకుపోయిన

ముగ్గురు యువకులూ విచిత్రంగా గాయపడి క్రింద పడిపోయినారు. మామూలు జువ్వలైతే అటువంటి గాయాలుకావు. జువ్వల్లో ఏదో రజను కలిపి దట్టించినందున జువ్వలు కాలడమేకాక సన్నగా పేలడమూ, పేలినప్పుడు ఎదుటి మనిషికే గాక సమీపంలోని వారందరి ముఖాలమీదా చిట్లడమూ జరుగుతోంది. చిట్లినచోట చాలామంటగా ఉంటూంది. ఒకతనికి కంట్లోపడి కన్నుకు గాయమై పోయింది. కొంతసేపటికికిటువైపు వారందరూ భయభ్రాంతులు కాగానే అటువారు మూకుమ్మడిగా ముందుకువచ్చి వీరిని వెనకకు నెట్టివేసినారు. ఈ రోజు కోరంగి పక్షం ఓడిపోయింది. బిక్కముఖాలతో అందరూ ఇల్లు చేరుకున్నారు. మూడవ రోజుకు తిరిగి పోటీకి రావలసిందని సవాలు చేస్తూ అవతలివారిళ్ళకు వెళ్ళారు. ఇది గ్రామంలో విపరీత వాతావరణాన్ని సృష్టించింది. గాయపడిన వారికి చికిత్స చేసిన వైద్యులు, పుళ్ళల్లో సన్నటి అపాయకరమైన రజనుందని చెప్పారు. కంటికి గాయమైన యువకుడికి శాశ్వతంగా ఏకాక్షిగా ఉండాలని వారు చెప్పారు. దానితో ఇందులో ఏదో మోసమున్న విషయ మందరికీ తెలిసింది. కానీ ఏమిటో ఋజువు తెలియనిదే, ఏమని పోట్లాడుతారు? అందులో వారు పరస్థలంవారు, మీరయ్యగారికి బంధువులు. అందువల్ల పోటీ ఇక చాలించాలని కొందరు వాదించ నారంభించారు. ఇలా ఓటమి నంగీకరించి గ్రామానికి తలవుంపులు తేవడానికి చాలమంది అంగీకరించలేదు.

భైరి కేంచేయడానికీ తోచకుండా ఉంది. అవతలి జట్టువారి కుయుక్తు లను చూచి ఎంతైనా అసహ్యం వేస్తూంది. కోపమూ వస్తూంది. అయితే ఏం చేయాలి? వారి కుయుక్తుల ఆంతర్యం తెలిస్తే తప్ప చేయగల్గిందిలేదు ఈ వేళటిపోటీ ఏదోవిధంగా వారించాలనే నిర్ణయించాడు.

ఆ వేళ సాయంకాలం చినుకులారంభమయ్యాయి. ఈ రాత్రంతా ఆగ కుండా కురిస్తే బాగుండునని అందరు అనుకున్నారు. అయితే ప్రకృతిని మనిషి చేతులూ మెదడు ఉపమోగించి సాధిస్తే లొంగుతుందిగానీ, ఊరికేనే సహజంగా

మనం కోరినట్లు నడుచు కొంటుందా ? కొంతసేపు కురవగానే వాన వెలిసింది. ఏంచేయాలి. పరదేశేమైనా చెప్పి పంపుతుందేమోనని ఎదురు చూస్తున్నాడు. కానీ ఆ జాడ అగుపించలేదు. పోటీ సమయం సమీపిస్తూంది. యువకులంతా భైరి ఇంటికి చేరుకున్నారు ఈ వేళ పోటీ ఉంటుందా లేదా అని నిర్ణయించుకొనేందుకు. ఈ వేళెలాగైనా గెలవాలని వారికి పట్టుదలగా ఉంది. వారందరూ ఇక్కడ చేరడము భైరికిబ్బందిగా కనిపిస్తూంది, పరదేశి ఏదైనా కబురు పంపాలనుకొన్నా వీరంతా అడ్డమని. చివరకతనికొక ఉపాయం తోచింది. అందరూ 'ఆలయానికి పోదాం. అక్కడ శకునం చూసి ఏ నిర్ణయమూ చేద్దాం' అన్నాడు. అందరినీ ఆలయానికి పంపివేసి తానింటి వద్ద చిన్న పని ఉన్నట్లు చెప్పి మరలివచ్చాడు. అనుక్షణం పరదేశి సందేశాని కెదురు చూస్తున్నాడు, చిట్టచివర అతను నిరాశపడుతున్నంతలోనే ఆమెవద్ద నుండి పరిచారిక వచ్చింది. రజను కలిగి పేలే స్వభావం కల జువ్వలు వేరే ఉన్నట్లు అవి గంపలో పెట్టుకొని వెనుక నున్న కొందరికి అంద జేస్తున్నట్లు వారు ప్రత్యేకంగా ప్రత్యర్థుల్లో బలీయులను వాటితో క్రింద పడగొట్టు తున్నట్లు ఆమె చెప్పింది. వాటిని తగులబెట్టితే తప్ప మీరు గెలువలేరని ఆ కబురులో ఉంది.

భైరికి కొండంత బలం చేకూరింది. వెంటనే తమ మిత్రులను కలుసుకొని అందరినీ ఆటకు సమాయత్తపరిచినాడు. తను చెప్పినట్లు వింటే ఈవేళ తాను వస్తాననీ, తనమాట ఎప్పుడు ఎవ్వరు జవదాటినా తక్షణం ఆటనుంచి తప్పుకొంటాననీ ముందే ఖరారు చేసుకొని ఆటలో దిగినాడు.

ఆట మొదలయ్యాక కొంతసేపిరు పక్షాలు జువ్వలు విసురుకొంటు న్నారు. కానీ ఎవరూ ముందు పడనందున ఆట చప్పగా ఉంది. భైరి దృష్టంతా రజను కలిసిన జువ్వల నెలాగైన కనుక్కొని తగుల బెట్టాలనే ఉంది, కానీ ఎలాగ? తెలియటం లేదు. చివరకొక ఉపాయం తోచింది. ఒకనిని చీకట్లో తెలియకుండా ముఖాన్ని పట్టు వస్త్రాలతో కప్పి తగు హెచ్చరికలు చెప్పి బాగా ముందుకు

పంపినాడు. అప్పుడు వారితనిని ప్రత్యేకంగా ఒక గంపలోని జువ్వతో కొట్టడం ఖైరి గమనించాడు. మరొక యువకునికా గంపగుర్తు చూపి వెనుకవైపు నుండి వెళ్ళి వారిలో కలబడి ఆ గంప లాగుకొని ఎవ్వరికీ ప్రమాదం రాకుండా దూరంగా తగులపెట్టాలని చెప్పి పంపినాడు,

ఆ యువకుడలాగే చేశాడు, కానీ, ఆ జువ్వలతను దూరంగా తీసుకొని పోకుండానే పెనగు లాటలో గుంపులోనే అంటుకుపోయాయి. చాలమందికి గాయాలయ్యాయి. మీరయ్య అల్లుడా సమయాన దానికి సమీపంలోనే ఉండటంవల్ల ముఖం మీద చాల చోట్ల గాయాలైనాయి. ఆ జువ్వలన్నీ అంటుకొన్నది చూడగానే ఏమైందో చూసుకొనే తాలిమి లేకుండా ఇటువైపు యువకులంతా తమ జువ్వలతో విజృంభించడంతో ఒక దొమ్మీ ఆరంభమైంది. కొన్ని నిమిషాలకే అటువైపు వారెవ్వరూ నిలువలేకుండా పారిపోయారు. కోరంగి యువకులు విజయోత్సవం జరుపుకొని ఎవరిళ్ళకు వారు వెళ్లిపోయారు.

మీరయ్యగారల్లుడు మాత్రం మామగారింట్లో గాయాలను గురించి చాలా హైతకం చేశాడు. ఇంటివారు చాలా ఖంగారుపడినారు.

ఈ ఫలితాలింతటితో ముగిసిఉంటే ఎంతో బాగుండేది. కానీ అంత టితో ఆగక గ్రామంలో అంతకుముందు పెరుగుతూ వస్తూన్న వివిధ శక్తుల విభిన్న ధోరణులమీద చెరగరాని ముద్రవేసింది.

పోటీలో కన్నుపోయిన యువకుని తండ్రి ఆచుట్టు ప్రక్కల ఉన్నటువంటి నేత పని వారి శ్రేణిలో అగ్రస్థానంవహించిన వాడు. నేతవారి శ్రేణికీ, పరాసు వర్తకులకూ ఈమధ్య లావాదేవీలలో వచ్చిన విభేదాలలో మీరయ్యగారు పరాసువారి పక్షం వహించి మాట్లాడు తున్నందున ఆయన పట్ల కొంత వైమనస్యం కలిగి ఉంటున్నారు. ఇప్పుడాయన కుమారునికి కన్ను, మీరయ్య అల్లుని పక్షం వారు చేసిన కుతంత్రం వల్లనే పోయిందని బయటపడిన తర్వాత వారివైమనస్యం

కసిగా మారింది. మీరయ్య కూడా తమ అల్లునికి గ్రామస్థులు ఓర్వలేనితనం వల్ల ఈపరాభవం కల్పించారని అక్కసు పడినాడు గానీ జరిగిన విషయాలు తెలుసు కొనే ప్రయత్నమూ చెయ్యలేదు. సౌహార్ద సంబంధాలు గ్రామంలో చెడకుండా చేయాలన్న ప్రయత్నమూ చేయలేదు. పై పెచ్చు భైరీ మరి కొందరూ పోటీలో అల్లుడు గాయపడ్డందుకు విచారం వెలిబుచ్చడాని కాయన యింటికిపోగా నానా చివాట్లూ పెట్టి పంపాడు. పరదేశికైనా జరిగిన విషయం చెప్పాలని భైరి ఉబలాట పడ్డాడు గానీ, వీలుదొరకలేదు. తానిచ్చిన సలహానే ఉపయోగించి తన భర్తకే అపాయం తెచ్చినాడని పరదేశికి భైరి పట్ల అమితమైన ఆగ్రహం వచ్చింది అందుచేత భైరి తనతో మాట్లాడాలని చేస్తున్న ప్రయత్నాలను బుద్ధి పూర్వకంగానే వమ్ము చేసింది. తరువాత బారసాలనాడు భైరి తల్లినీ. అమ్మమ్మనూ లాంఛన ప్రాయంగా పలుకరించి వదిలివేసింది. చివర పురుడు పోసుకొని తిరిగి అత్తవారింటికి వెళ్లేరోజు ఇంటికివెళ్ళినా పరదేశి భైరితో మాట్లాడలేదు. మీరయ్య కుటుంబం వారికది నెత్తిన పాలుపిండినట్లైంది.

భైరితో నిమిత్తం లేకుండా జరిగిన చిన్న సంఘటన నాధారంగా చేసుకొని పరదేశింతంగా అలిగిపోయినందుకు కుటుంబం వారెంత నొచ్చుకొన్నారో పరదేశి గమనించలేదు. దీని వల్ల రెండు కుటుంబాలమధ్య విరసం దాదాపు శాశ్వతమైంది.

ఇదెలాపోయినా ఈ ఘటనలు భైరిని క్రమంగా మామూలు లోకంలోనికి పడవేసినాయి. క్రమంగా కుటుంబ వ్యవహారాల్లోనూ, వర్తక విషయాల్లోనూ శ్రద్ధతీసుకో నారంభించాడు. ఇప్పుడతడు రోజూ కోరంగి రేవులోనికి వెడుతున్నాడు. మామూలుగా వ్యవహారాలు చూసుకొంటున్నాడు. వర్తకంలో నిండా మునిగిన భైరికిప్పుడు కోరంగి తల్లి మాటే స్ఫురణకు రాదు. తేలుతున్న తుక్కుడూగరలక్రింద మరుగుపడిన కోరంగి అతని దృష్టి నాకర్షించదు. ఓడలనుండి కారినకీలు, నూనె

పొరలు కమ్మివేయగా కోరంగి వేగమిప్పుడు తెలియరాదు. పొరలుకప్పిన నాగులా స్తబ్ధుగా నడుస్తూంది కోరంగి. ఖైరి తుపుక్కున కోరంగిలో ఉమ్మివేసి నుడుస్తూంటాడు.

రోజులు గడిచిపోతున్నాయి. రోషంతో కమ్మిన మబ్బులా చరిత్ర కడగండ్లను కుండపోతగా కురిపిస్తోంది. గట్టు తెంచుకొన్న ప్రవాహంలో దేశాల్ని ముంచేస్తూంది. పరిస్థితి కొండమీదనుంచి దొర్లుతున్న బండరాతిలా ఉరుముతూ దిగజారుతూంది. అడ్డుకొన్నవాళ్ళు నీల్చిపోవడమేతప్ప కార్యం కన్పించదు.

అరాచకం ప్రబలిపోయింది. ఎక్కడికక్కడ సాహసపరులు, ఛోటా రాజులూ బయలుదేరి సిరిసంపదలకోసం, రాజ్యాధికారంకోసం అర్రులు చాస్తు అంకిన మట్టుకు అమరుకొనే సూత్రంమీద దేశాల్నికొల్లగొట్టడమెక్కువైంది. నిష్కంటక భూమి మార్గాలన్నవే లేకుండా పోయాయి. సంస్థానాధీశులు, వారి దివాణాలు పన్నుల రూపేణ ఏదోమిషమీదరాబట్టే బహుమానాల రూపేణ సామాన్యులను బాధించడమెక్కువౌతున్నట్లల్లా (ఏలుబడికల్గిన వ్యవస్థతో అసంతృప్తులైన) సాహస పరుల దళాలు సంపన్నులను కొల్లగొట్టడం ఎక్కువైంది.

సముద్రంమీదకూడ కొల్లగొట్టేవారి సంఖ్య ఎక్కువైపోయింది. తూర్పు కోస్తాలో దక్షిణం దిక్కుగా ఎలా ఉండేదో వార్త తెలియదు కానీ వంగప్రాంతంలోను, పశ్చిమ తీరంలోనూ ఈ భయం చాలాఎక్కువైంది. ఈ ఓడలను కొల్లగొట్టేవారితో పాశ్చాత్య కంపెనీ ఉద్యోగులకు, వారి తాబేదార్లకు అక్రమ సంబంధాలుండేవి. రహస్యంగా వారందులో వాటాలు తీసుకొనేవారు. వారు కొల్లగొన్న సరుకు లెక్కువభాగం వీరి ద్వారానే అమ్ముడు పోయేది. ఈ పరిస్థితివల్ల ఓడవ్యాపారం బహుప్రయాసకరమేగాక, ప్రమాదకరమూ కాజొచ్చింది. దీనినుండి తట్టుకొనేందుకు మన వారిని కాపాడేనౌకాబలమేది ? మొక్క తనకంచెను తానే వేసుకొనలేనట్లుగా వర్తకులూ, పారిశ్రామికులూ తమ రక్షణ యావత్తూ తామే కల్పించుకోలేరు. వారి దృష్టి యావత్తూ డిల్లీ, గోల్కొండ, మూర్షిదాబాదు(వంగ) వంటి చోట్లబలమైన రాజరికాలుండాలనే పోయింది.

అందుకే నాటి జానపద వీరులంతా అల్పకులాలనుండి, కుగ్రామాల్లో ఉద్భవించి గోల్కొండ ఢిల్లీ సింహాసనాలకై చేయిసాచి అందుకొనలేకనో, తృటి కాలమందుకొనినా నిల్పుకొనలేకనో రాలిపోయినవారు.

మీరయ్యకు పరాసువారి పొత్తుండెకాబట్టి కాలం బాగానే గడుస్తూంది. అయితే ఈమధ్యవారు దేశీవర్తకులను నిర్లక్ష్యంగా చూసే తీరుమాత్రం అతనికి నొప్పి కలిగిస్తూంది. దీనికితోడు వియ్యంకుల పోటుకులు భరించడమూ దుర్భరంగా ఉంది. వారు చేసిన ప్రతిచిన్న సహాయమూ పదిరెట్లుగా వందసార్లు చెప్తూండటంవల్ల బంధువుల్లోకొంత తలవంపుగాఉంది. అయినా తాను ఆపై అంతస్థులో కాలూనేవరకూ సహించక తప్పదనుకొని ఓర్చుకొంటున్నాడు.

"నాకూ ఆ స్థితిరావాలి కానీ ఇంతకింత వడ్డితోసహా ప్రతీకారంచేసి వారినోరు మూయించనూ ? " అని మరీ మండిపడినప్పుడు పళ్ళు పటపట లాడించేవాడు.

భైరి కుటుంబానికా అస్కారం లేదు. ఇక్కడ ఇంగ్లీషువారికంత ప్రాబల్యంలేదు. వారిదింకా క్రింది చేయిగానేఉంది. అయినా గుడ్డిలో మెల్లగా వారితోనే పొత్తు కలిపేవారు. దానివల్ల ఫ్రెంచివారు వీరిని ద్వేషభావంతోచూస్తూ వీరిప్రాభవాన్నెలా మట్టుబెట్టాలా అని సమయంకోసం ఎదురు చూస్తున్నారు.

కత్తిమీద సాములా ఓడల నతిచాకచక్యంగా నడుపుకొని రావలసివస్తూంది. భైరి రేవులో ఓడల మీదనే ఎక్కువకాలం గడుపుతున్నాడు. తూర్పుతీరాన ఇరుగుపొరుగు దేశాల్లోకూడాజరుగుతున్న కబురులువింటూంటే అతనికి ఒళ్ళు మండిపోతూంది. ఇప్పుడు ఫ్రెంచి వర్తకుల కిక్కడివస్తువులను చవకగా కొనాలన్నాకూడా కష్టంగానే ఉంటూంది. అసలు కొనడమేమిటి? ఒక గవ్వకూడా లేకుండా సరుకంతా మ్రింగివేయడమే వారి ఆశయం. వారి ఆశయం ఎంచక్కా నెరవేరుతూందో! ఇప్పుడు వారు వర్తకులుకారు. మనిషి రక్తం చవిచూచిన పెద్దపులులు !

పరస్పర కలహాల్లోగానీ, దేశీరాజుల కలహాల్లోగానీ ఒకప్పుడోడినా పాశ్చాత్య వర్తకులకెక్కువ నష్టము కలుగదు. అట్టి నష్టాలవల్ల తాత్కాలికంగా మాత్రమే వారిపురోగతి కుంటుపడుతుంది. ఇక్కడేదైనా చిన్న అవాంతరం జరిగితే దానిప్రతిధ్వని ఫ్రాన్సు, ఇంగ్లాండుల్లో గగ్గోలుగా చెలరేగి తగురీతి సర్దుబాటు కే ఒప్పందాలో కుదిరి అప్పటికప్పుడది శాంతిస్తుంది. లేదా ఒక్కొక్కప్పు డింగ్లాండు ఫ్రెంచి దేశాలమధ్య యుద్ధాలు బయలుదేరితే దాని ఫలితంగా ఇక్కడ కంపెనీలు కొట్లాట ప్రారభించి అశాంతిని రెచ్చగొట్టి లాభాలు పొందుతున్నాయి. ఎటుచూసినా వారిపని చక్కగానే ఉంటూంది. ఎటొచ్చీ మన దేశమే నష్టపోతూంది.

కాక ఈమార్పులకనుగుణ్యంగా తామూ త్వరత్వరగా మారలేక, అన్ని నీతి సూత్రాలూ వదులుకోలేక కొందరుత్తమ కంపెనీ ఉద్యోగులు మాత్రం నష్టపోతున్నారు.

ఇలాఉండగా నిజాం ప్రభువు యావత్తు ఉత్తర సర్కారులను ఫ్రెంచి కంపెనీకి ధారపోసినట్లుగా వార్తలు వచ్చాయి.

“ఒరే ఒరే ! మనమంతా ఫ్రెంచి పాలనక్రిందకూడా ఉన్నామేమిట్రా ?” అమాయకంగా ఒక విద్యార్థిప్రశ్నించాడు. దానిమీద తలా ఒకమాట అందుకొన్నారు.

“ఏం ఆశ్చర్యమెందుకు ?”

“సాలబత్‌జంగ్ నవాబై ఔరంగాబాదుచేరిన తరువాత బుస్సీ పెత్తనాన్ని సహించలేక పోయాడు. దివానుల విషయం సరేసరి. రాజుమీద పెత్తనంచేస్తే తాము చెలాయించాలిగాని మధ్యన వీడెవ్వడు ? అందుకని సమయంకనిపెట్టి ఒకసారి బుస్సీ రాజధానివిడిచి మచిలీపట్నంవెళ్ళిన అదనుచూసి అతనిమీద తిరుగుబాటు చేయించారు. ఫ్రెంచివారి నన్ని ఉద్యోగాలనుండీ పీకించేశారు. అంత సులభంగా మరి బుస్సీ వదిలిపెట్టాడా ? తన స్థానాన్ని తను సంపాదించు కొనడానికి హైదరాబాదువెళ్ళి సవాలుచేశాడు.

దివానులు చాపక్రింద పురుగుల్లా కుట్రలు పన్నగలవారేకానీ వారికి ధైర్యంగా రంగంమీద ఎదుర్కోనే శక్తేదీ ? బుస్సీ ఎదురులేకుండా నిజాం వద్ద తనపూర్వ ప్రాజాపత్యాన్ని నెలకొల్పుకున్నాడు,"

ప్రాగ్దేశీయవైభవముతో బుస్సీకి నైజాము ప్రవేశమిచ్చి ఆదరించాడు అప్పుడే కృతజ్ఞతా చిహ్నంగా –

"ఏ ఉపకారానికో?"

"– కృతజ్ఞతా చిహ్నంగా ఏలూరు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము పరగణాలు ఫ్రెంచివారి అధీనాని కప్పగించాడు"

"– తెలుగుజాతి ఒక ఛత్రంక్రింద మనకుండా ముక్కలైవిడిపోయేదుకు నాందివాచకం పలికాడు."

ఒక విద్యార్థి "హంపీవిజయనగర సామ్రాజ్య పతనానంతరం ఉచ్ఛస్థితిని కోల్పోయిన తెలుగుతనపు గొలుసులో ఒకలంకె తెగిపోయింది."

నాయకుడు :– "నిజాం శాహివంశీయులు తాము స్వతంత్రం ప్రకటించుకొన్ననాటినుండి కొరకరానికొయ్యగా ఉంటున్న సర్కారులను వదలించుకొని కర్కోటకుల్లాంటి ఫ్రెంచివారి కిచ్చామనుకొన్నాడెమో అటు ఫ్రెంచి వారికీ, ఇటు సర్కారు జమీందారులకూ ఇరు పక్షాలకూ రోగం కుదురుతుందని అనుకొని ఉండవచ్చు. ఈ ఆలోచనలో తెల్గుజాతి విచ్ఛిన్నమౌతుందన్న విషయం వారు గమనించే అవకాశమే లేదు."

"ఆకాలానికీ పరగణాల శిస్తు ఏటా 30 లక్షల రూపాయలు."

"బుస్సి ఇబ్రహీంఖాను అనువాణ్ణి సర్కారుల కధికారిగా నియమించాడు."

"ఇది సర్కారుల్లో గొప్ప సంచలనాన్ని లేవదీసింది. ముఖ్యంగా జాఫిర్ ఆలీఖానుడు పాపం నీళ్ళనుండి వెలికిపడిన చేప పిల్లలా గిలగిల లాడినాడు. అసలే పెద్దాపురం సంస్థానంమీద ఇంతకు ముందొకసారి దాడిచేసి చిత్తుగా ఓడిపోయి ఉ

న్నాడు. అప్పుడు నిజాంవారు ప్రతీకారానికి తగుచర్యతీసుకోనందుకు గుర్రుగాఉంది. ఆ గోరుచుట్టుమీది. రోకటిపోటు వచ్చి పడింది.

"ఈ జాఫరాలీ సర్కారులను ఫ్రెంచివారికి స్వాధీనపడకుండా చూడవలెనన్న ప్రయత్నం మొదలుపెట్టాడు. "విజయనగర ప్రభువులైన విజయ రామరాజుతో సంధిచేసుకొన్నాడు. బొబ్బిలి రంగారావు మొదలుగా ఇతర జమీందారులందరూ తమ పాతపగలు మరిచి జాఫరాలీతో కలిసి ఫ్రెంచివారి నెదుర్కొనేందుకు సిద్దపడుతున్నారు.

"ఇంతలో బుస్సీపంపిన సైన్యాధికారి మొరాసిన్ ఈ కూటమిని పెద్ద కష్టంలేకుండానే విచ్ఛిన్నం చేశాడు."

"ఏముంది ? జాఫర్ అలీఖాను కివ్వవలసిన శిస్తుకంటే తక్కువకే శ్రీకాకుళం, రాజమహేంద్రవరం సర్కారులను నేను మీకిస్తానని ముఖ్యుల కాశపెట్టి ఉంటాడు."

"రైటే. అంతటితో హతాశుడైన జాఫరాలీ దేశాన్ని వదలిపెట్టి పడమరగా వెళ్ళాడు. ఏం చేయగలడు ? తనకు తానుగా సైన్యాన్ని సమకూర్చుకోలేడు. సంస్థానాధిపతులతో సత్సంబంధాలు లేవు. ఎటూ ఆశలేని నిస్సహాయ దుర్బలదుర్జనుడేం చేయగలడో అదే చేశాడు."

"అదేమిట్రోయ్ ? ఆకలిగొన్న మాంత్రికుడులా ఉపవాసంచేశాడా? ఒకూళ్ళో ఒకసారేం జరిగిందో తెలుసా ? అమ్మవారి పూజారొకడు "మూడు రోజులుగా ఉంటున్నా నాకన్నం పెట్టాలనైనా తెలియలేదు. ఇలా చేసిన పొరుగూరిలో ఏంచేశానోతెలుసా ?"అని కేకలేస్తే ఎవరో భయపడి అన్నంపెట్టి పొరుగూరిలో ఏంచేశారని అడిగితే ఉపవాసం చేశానన్నాట్ట,"

"అలా ఏంకాదు. మహరాష్ట్రుల సైన్య విభాగమొకటి మన ప్రాంతాలకు దరిదాపుల్లో తిరుగుతూంటే దాని నాహ్వానించి శుభ్రంగాదేశాన్ని కొల్లగొట్టించాడు. "నా ఏలుబడిలోఉంటే అది దేశం. లేనినాడది సముద్రంలో కలిస్తేనేం,

స్మశానమైతేనేం?'' అని భావించాడు. పరిపాలకులకుఅందున నిజాం శాహివంశీయుల తొత్తులకంతకంటే ఉన్నతమైన ఆలోచన కల్గుతుందని మనమెప్పుడూ అనుకొనవలసిన పనిలేదు.

"క్రమశిక్షణలేని తిరుగుబాటు యోధుల దళాలు, స్థానిక దుర్మార్గుల సహాయంతో కొల్లగొట్ట నారంభిస్తే ఎలా ఉంటుందో వేరేచెప్పాలా ? శ్రీకాకుళంవద్ద వారు తూర్పు కనుమలు దాటింది మొదలు ఏలూరువద్ద వెనుదిరిగేవరకు తెలుగు ప్రజలు హహకారం చేశారు. ప్రాణాలకూ మానానికీ(ఆస్తులమాట దేవుడెరుగు) భద్రతలేకుండా గడిపిన ఆతరము వారి సామాన్య జన జీవితంపై అది ఎదురుచూడని పిడుగుపాటు.

"విలువైన వస్తువులు యోధులపాలు. అందమైన స్త్రీలు యోధులపాలు. ఎదురునిల్చినవీరులు చిత్రవధలపాలు. జాగరూకులైన మానవతులు ఆత్మహత్యలపాలు. మోసుకొని పోలేని అనర్ఘస్థిరాస్తులగ్నిపాలు. మహారాష్ట్ర దళనాయకులకు వారిస్థానిక బంటులకు లంచములిచ్చి తప్పించుకొన్నవారుతప్ప మిగిలిన సామాన్య కుటుంబాలూ, సంపన్నులూకూడా పడిన యాతనలు భయంకరమైనవి.

ఈ కాలంలో ఫ్రెంచివారు బుస్సీ నాయకత్వాన నిజాం నవాబువద్ద తమ ప్రబలస్థానాన్ని పదిలపరుచుకొనే ప్రయత్నాలలో నిరంతరం యుద్ధాలు చేస్తూ పడిలేస్తున్నారు, 1756వ సంవత్సరం చివర రాజధానిలో తమ స్థానానికికఢోకాలేదని భావించారుకాబోలు. తిరిగి బుస్సీతన సైన్యంతో ఉత్తర సర్కారుల్లో తమ అధికారాన్ని దిటవుచేసుకొనేందుకు హైదరాబాదునుండి బెజవాడ, ఏలూరుమీదుగా రాజమండ్రి చేరినాడు. ఇతను మరొక హత్యాకాండనటునుండి ప్రారంభించుకొంటూ వచ్చినాడు.

ఈ మధ్యకాలంలో ఫ్రెంచివారికి వ్యతిరేకంగా నడుచుకొన్నవారిమీద ఘోరమైన హింసాకాండ నమలు జరుప బూనినాడు.''

పడవవాడు వారిమాటల కడ్డువచ్చి కథ కొనసాగించాడు.

''ఈ అవకాశాన్నుపయోగించుకొని మీరయ్య వియ్యంకులు మచిలీపట్నంలోను, సమీప ప్రాంతాల్లోని వర్తక కేంద్రాల్లోనూ తమకు కాని వారందరినీ లొంగదీసుకొనేందుకు, అలా లొంగిరానివారిని తుదముట్టించేందుకూ చక్కని పథకాలువేసి అమలు జరిపారు.

కోరంగిలో మీరయ్యకూ తన బావమరిది కుటుంబం వారెక్కివస్తున్నది చూస్తుంటే కన్నెర్రగా ఉంది. ఫ్రెంచివారి భాగస్వాములుగా ఉంటూ వీలైనంత సొమ్ము చేసుకొనే విచ్చలవిడి ప్రయత్నానికీ కుటుంబ మడుగడుగునా అడ్డువస్తూంది. ఇటువంటి. విషయాల్లో మంజరి ఎప్పుడూ వారి వైపే ఉంటుంది. మహారాష్ట్ర దండయాత్ర సందర్భంగా కోరంగిలోను చుట్టుప్రక్కలా జనంలో భీతిని రెచ్చగొట్టి, వారి దాడినుండి తప్పించు కొనేందుకు లంచమిచ్చే పేరిట బాగా నిధి వసూలు చేయాలని ఆయన ప్రయత్నించాడు, దాన్ని వ్యతిరేకించి ప్రజలలో శౌర్యాన్ని పెంపొందించి అందరిని ఆత్మరక్షణకు సిద్ధంచేయడంలో భైరి కుటుంబం ప్రముఖ పాత్ర వహించింది. దీనిని చూసి ఓర్వలేని వారిలో బొత్తిగా ఎడ్డెమతస్థులైన కొందరీర్ష్య మీద మహారాష్ట్రుల దళాన్ని నిజంగానే కోరంగికాహ్వానించే ప్రయత్నం రహస్యంగా చేశారు కానీ, అదృష్టవశాత్తు వారు రేవుపట్టణాలు తాకేందుకు జడిసో లేక మరెందుకో వారిటు రాలేదు.

ఓడరేవుల విషయంలోనూ, స్థానికంగా తయారయే వస్తువులకు తగు ధర నిచ్చే విషయంలోనూ భైరి కుటంబంవారుదారంగా ప్రవర్తిస్తూ సామాన్య జనుల ఆదరాభిమానాల నెక్కువగా చూరగొంటున్నారు. మన్య ప్రాంతాల నుండి దిగుమతయ్యే సరుకుల విషయంలో కూడా వీరిఉదార వైఖరి వీరికా ప్రాంతంలోనూ చాల పలుకుబడిని చేకూరుస్తోంది. సూటియైన మార్గాల్లో వీరిని జయించలేక, మీరయ్య వీరి నెలా పడగొట్టడమా అని కుతంత్రాలు పన్ను తున్నాడు. ఆ కుటుంబంవారికీ, మంజరికీ సమయంవచ్చినప్పుడల్లా ముందు హెచ్చరికలు చేస్తూనే ఉన్నాడు. వారు వాటిని సౌమ్యంగానే నిరాకరిస్తున్నారు. ఇది మీరయ్యకు మరింత క్రోధ కారణంగా ఉంది.

ఈ స్థితిలో బుస్సీ జరుపుకొని వస్తున్న జైత్ర యాత్ర విషయంవిని మీరయ్య పరమానందం చెందినాడు. ఫ్రెంచివారి అండమీద బ్రతికే వారందరూ సర్కారులంతటా అలాగే గంతులు వేశారు. యానాంలో ఒక తాగినమూక ఫ్రెంచివారు రెచ్చగొట్టగా మంజరి ఇంటిమీద దాడిచేసి ఇల్లంతా ధ్వంసం ఛేశారు. మంజరి మాత్రం కష్టంమీద విశ్వాస పాత్రులైన సేవకులద్వారా ప్రాణాలు రక్షించుకొంది. త్వరలో ఆమె నంతమొందిస్తామనీ, ఇంక తరువాతి వంతు భైరి కుటుంబం వారిదని కూడా సవాళ్ళు పలుకసాగారు.

ముందునుంచీ మంజరికి రంగన్న హెచ్చరికలు పంపుతూనే ఉన్నాడు. ఆమెపట్ల ఫ్రెంచివారు చాల ద్వేషంగా ఉన్నారనీ, ఆమెవల్ల కల్గుతున్న నష్టానికి పగతీర్చుకొనే యత్నంలో ఉన్నారనీ. కానీ ఆమె నిర్లక్ష్యం చేసింది. అందువల్ల వారు హటాత్తుగా దాడి చేసినప్పుడు సిద్ధంగా లేక మించిన నష్టం పోయింది. ఆ రోజు రంగన్నకు తెలిసి ఇంజరం నుంచి తగు సహాయంపంపే లోపుననే జరగవలసిన అనాహతం జరిగిపోయింది.

ఇది జరిగిన కొన్నాళ్ళకే యానం వారన్ని ఫాక్టరీలకూ లొంగిపోవలసిందని అధికార పూర్వకంగా తాఖీదు పంపారు వాళ్ళ నెదురించాలని రంగన్న ప్రతిపాదించాడు, జగన్నాథపురం లోనూ, చుట్టు పక్కల ఫ్రెంచివారి ప్రతి కక్షులతోనూ చేతులి కలిపి వారి నెదురించవచ్చన్నాడు. వారి బలమిక్కడల్పమనీ, తాము గెలవగల్గిందేననీ, యానాంను మనమే ముందెదురు దాడిచేసి ఆక్రమించుకో వచ్చని, భరోసా ఇచ్చాడు. కాకినాడ మొదలు మాధవాయపాలెం వరకు సముద్రంలో కూడా ఒక ఓడా కొన్ని పడవలూ సిద్ధం చేసుకొంటే అటునుంచి కూడా సరఫరాలుగానీ అదనపు బలంకానీ రాకుండా ఆపవచ్చుననీ అన్నాడు. డబ్బు లేకపోతే అరువు సంపాదించ వచ్చని కూడా చెప్పాడు.

"మీ ధర్మశాస్త్రంలో. ఓడలకు సబంధించిన అప్పుకు విధించబడిన వడ్డీ చాల ఎక్కువయ్యా, అంత మొత్తమప్పు తీసుకొనే అధికారం కూడాలేదు. ఒకవేళ చేసి నష్టపోతే మమ్ముల్ని తవ్వి పాతరేస్తారు!"

"ఇటువంటి పరిస్థితుల్లో నష్టపోతే ప్రభుత్వమే పరిహారం చెల్లించాలనీ ఉంది మా ధర్మశాస్త్రంలో. ఇప్పుడేది ప్రభుత్వం మంటారా? అంతవరకు వచ్చినప్పుడు చూసుకోవచ్చు."

"ఇక్కడ సంపాదించిందాంట్లో కొంతేకదా ఖర్చు పెట్టమంటున్నా మా పత్తుకు? అదీ కష్టమైతే ఎలా."

ఈ వాదోపవాదాలు ఇంజరం మాధవాయపాలెం ఫాక్టరీ అధికారులతో న్యాయ దృష్టి కల్గించలేదు సరికదా, వారిని హడలగొట్టేశాయి. హడలి పోయి వారు తాళాలను యానాం వారి కప్పగించేశారు.

రంగన్న నీళ్ళ నుండి వెలిపడిన చేపైనాడు. అతన్ని కూడా ఫ్రెంచివారికి లొంగిపోవలసిందనీ, వారి సైన్యంలో చేర్చుకొనేందుకు తగు సాయంచేస్తామనీ, అందులోకూడా పై కెక్కి రావచ్చునీ ఇంజరం ఫాక్టరీవారు సలహ ఇచ్చారు, లేదా బంగాళానికి గానీ, మద్రాసుకుగానీ పంపుతాం, కొన్నాళ్ళు అక్కడ సేవచేసి కాలం కలసివచ్చినప్పుడిక్కడికి తిరిగి రావచ్చన్నారు.

రంగన్న కెటూపాల్పోవడంలేదు. తప్పుచెల్లించి తిరిగి కోరంగిలో కాపురం పెట్టలేడు. ఫ్రెంచివారికి లొంగిపోయి కొత్తకొలువు తిరిగి ప్రారంభించలేడు. సంద్రంలో దాగి ఉండాలి. దానికేనా చేపలుపట్టేవాళ్ళతో కలవాలి. లేదా లోతట్టున దూరంగా మరో గ్రామం వెళ్ళాలి. భైరీవాళ్ళ ఓడలో పనికి కుదరవచ్చు. దానికి మిగిలిన వారభ్యంతరంచెప్తారు. ఇప్పుడే కోలుకుంటున్నవారికి లేని సమస్యలు సృష్టించిన ట్లౌతుంది. మంజరితో సలహా చేసినాడు.

భైరి వీరి ఆలోచనలను చూచాయగా కనిపెట్టి ఎక్కడికీ వెళ్లవద్దనీ అంతా కట్టకట్టుకొనే ఉందామనీ నిష్కర్షగా చెప్పినాడు. కాని మంజరీ, రంగడూ ఓ రాత్రి గ్రామాంతరం వెళ్ళిపోయారు. కురంగీశ్వరని అనుగ్రహముంటే తిరిగి కోరంగిలోనే ఆనందంగా అందరం కలిసుందామని అంతవరకు కొంతకాలం వేచి ఉండక తప్పదనీ భైరికి కబురుచేసి మరీవెళ్ళారు,

రంగన్నను సాగనంపుతూ, మాథ్యూస్ "తప్పకుండా తిరిగిరా" అన్నాడు.

"నీవు వచ్చేప్పటికి మా అమ్మాయి ఉంటుందో ఎవరినైనా కట్టుకొని వెళ్ళిపోతుందో" అని గునుస్తూ సాగదీసింది. అతని భార్య

తల్లీ, తండ్రీ ఎదురుగా ఏమీ మాట్లాడకపోయినా రంగన్నతో వారి కుమార్తె చాటుగా ఇలా అన్నది. "నా కిక్కడేం బాగుండ్లేదు. నీ వెక్కడో స్థిరపడి వచ్చి నన్ను తీసుకొని వెళ్లు. స్వచ్ఛంగా గాజుపూసలాంటి మనసులు కల్గిన మనుష్యులున్న చోటికి పోదాం! పరస్పరం మోసం చేసుకోవడమే పరమావధి కాకుండా నల్గురూ కలసి మెలసి సుఖంగా ఉండే చోటికి పోదాం ! ఎంతదవ్వైనాసరె ఎన్ని అడ్డంకులున్నాసరె వస్తాను !"

కొన్నాళ్లకే పిలుపురాగా మాథ్యూస్ కోరంగిలో మకాం ఎత్తివేసి బందరు వెళ్లిపోయాడు !

ఈపరిస్థితుల్లో భైరి కుటుంబం వారు తామెలా జాగ్రత వహించాలా

అన్న మీ మాంసలో పడినారు!

ఓడిపోతున్నా బ్రిటిషువారైతే బీరాలు పలుకుతూనే ఉన్నారు కానీ తక్షణం వారివ్వగల సహాయం అల్పమాత్రంగానే ఉంది. వారు కూడా రహస్యంగా మీరయ్యతో మంతనాలు జరుపుతున్నట్లు కూడా పుకారుగా ఉంది. చివరకెటుపోయెటు వస్తుందో నని ఆలోచించి గ్రామంలో ఉండడం కంటే ఓడలు వేసుకొని వెళ్లడమే క్షేమమని ఆలోచించి అయిన మట్టుకు సరుకులు నింపుకొని వంగదేశం వైపు రహస్యంగా ఓడలన్నింటినీ బయలుదేరదీశారు. ఇంట్లో భైరి పినతాతగారు, ఆడంగులూ మాత్రం మిగిలినారు, ఈ సారి భైరి, భైరి తండ్రీ కూడా ఓడలపై బయలుదేరినారు.

తమ కందుబాటులో ఉన్న ఇంగ్లీషు డచ్చి కంపెనీ ఉద్యోగుల పరిచయ పత్రాలు సంపాదించి భద్రపరుచుకొనినారు. వీరు వదిలిందే చాలని సంతోషంగా పాసులిచ్చారు ఫాక్టరీలవాళ్ళూ

జగన్నాయకపురంలోని డచ్చివారు ఫ్రెంచివారి వైపూ కాదు, ఇంగ్లీషు వారి వైపనీకాదు ఎవరు పైకి వచ్చినట్లు కన్పిస్తూంటే వారివ్యతిరిక్తపక్షాన ఉండి విదేశవర్తకు లందరినీ సమాన స్థితిలో ఉంచేందు కవసరమైన విధాన

మవలంబించేవారు. కాబట్టి ఇప్పుడువారు పరాసువారికి వ్యతిరేక పక్షం. కాబట్టి పాతపగలు మరిచి భైరి కుటుంబంవారికి తోడ్పడుతున్నారు. తెల్లవాళ్లతో ఏ వ్యవహారం చెయ్యవలసి వచ్చినా భైరి తండ్రి స్వయంగా చూసుకొనేవాడు. వారి ప్రశంస వస్తేచాలు భైరిపళ్లు పటపటలాడేవి. బోనులోపడిన సింహంవలె అతని మనస్సుటు ఇటు పెనుగులాడేది. పిరికితనం వహించి పలాయనం చిత్తగిస్తున్నామా నాన్నా ? అని గద్గదకంఠంతో అడిగేవాడు తండ్రిని.

“ ఛీ ! ఛీ ! కాని కాలంలో ఆత్మరక్షణ చేసుకొకపోతే పాపంరా ! మొండిగా తలపగులగొట్టుకుంటే జరిగేదేముంది ? పచ్చికలు ప్రవాహనికి తలవంచడం, తరువాత మరింత పచ్చగా వ్యాపించడానికేగా ? ” అని ఓదార్చేవాడు తండ్రి. ఓడలు నడుస్తున్నాయన్నమాటే గాని, తమ సర్కారుల్లో ఏం జరుగుతుందోనని ఎప్పటికప్పుడు వారు తెలుసుకొంటూనే ఉండేవారు. అందుకు తగు ఏర్పాట్లు చేసుకొనే ఉన్నారు.

బుస్సీ రాజమండ్రిలో జరిపిన పేరోలగం వార్తలందిన తరువాత వారు ప్రయాణవేగం తగ్గించారు. ఏం జరుగుతుందో చూసి తరువాత కార్యం నిర్ణయించుకోవాలని అనుకొన్నారు.

రాజమండ్రి చేరిన బుస్సీ కోరంగిలో గానీ, ఇతర రేవుల్లోగానీ తమ కంపెనీజరుపుతున్న వర్తక వ్యవహారాల మాటే తలపెట్టలేదు. ఈచిన్నవిషయాలకతనికి తీరుబడేది ? బుస్సీ ఆస్థాయి నేనాడో మించి పెద్దగా ఎదిగి పోయాడు. అతనిని రాజమండ్రివద్ద విజయనగర సంస్థాన ప్రభువైన పూసపాటి విజయరామరాజుగారు తన బలగంతోనూ, మిత్రపరివారంతోను కలుసుకొన్నాడు. ఈయనే కాక పాయకరాయడు, నారాయణదేవుడు, నరసరాజు, గొలుగొండ మన్నెపురాయుడు, మన్నెదొరలు మొదలుగా అందరు బుస్సీని గౌరవపూర్వకంగా కలుసుకొన్నారు.

ఒక్క బొబ్బిలి రంగారాయడు మాత్రం రాలేదు”

పడవవాడు బొబ్బిలి పేరుచ్చరించగానే చుట్టూ కూర్చున్నవారిలో సంచలనం కల్గింది, బొబ్బిలి “వీరబొబ్బిలి” గా వారి చెవుల్లో మార్మోగింది అందరి

మనస్సుల్లోనూ బొబ్బిలి యుద్ధానికి సంబంధించిన స్మృతులు మెదిలేయి. బొబ్బిలి వీరగాధ భిక్షుకులు గానం చేయగా తెలుగు దేశంలో విననివాడు లేడుగా.

"ముంజేతికి మీసమున్నదీ రంగారాయునికి"

బొబ్బిలి యుద్ధం గురించి ఈ మధ్య జరిపిన కాలేజి ప్రదర్శనలో పాల్గొన్నవారు కూడా ఉన్నారేమో, ఎవరికి హృద్యమైన గేయపంక్తులువారు స్మరించుకొన్నారు.

"వీపునందు వింజామరలే రంగారాయునికి
బొడ్డునందు చింతామణి రంగారాయునికి"

రామునికి కూడా కథ పరిచితమే. రాముని తండ్రి కాంగ్రెసు సభలకు సారధ్యం వహించిన తమ బాల్యపురోజుల్లో సాంస్కృతిక ప్రదర్శనలకొకసారి బొబ్బిలి బుర్రకథ నేర్పాటుచేశారు. కథకులు తమ యింట్లోనే బసచేశారు. రక్త ముప్పొంగేలా వారు విన్పిస్తూండిన యుద్ధనాదాలతనికి జ్ఞాపకం వచ్చినాయి.

"శలగో ! శలగో" "హెూళ్యా ! హెూళ్యా!"
రామా రామా అనంత కాలము రాజ్యము లేలామా
యుగము జగములున్నంతవరకూ ఉండగబోతామా!"
"రామ రామ అనంతకాలము రాజ్యమేలలేము
జగము ఉండువరకు మనముండ బోతమా"
రామ రామ యనంతకాలము రాజ్యమేలలేము."
జగము ఉండు కాలము వరకూ మనము ఉండబోము."
ఇచ్చట చచ్చిన వారికి చాల వీరస్వర్గము"

మరొకడు

"గుఱ్ఱపు సందడి విన్నారయ్యా తెల్గా బిడ్డాలూ
పడకయందె దట్టి కట్టిరి తెల్గా బిడ్డాలూ"

అంటూ వెలమవీరుల చాకచక్యము చురుకుదనము శౌర్యము ముడి కట్టి చూపిన చరణాలనుకొన్నారు,

ఇట్లే ఎవరికి వారు!

"నల్లగాజులు నల్లపూసలు నాకు నిల్పండి

బొట్టుకాటుకా నిల్పుమయ్యా ఓ విజయరామరాజా

పసుపు కుంకుమ నిలువుమయ్యా వోవిజయరామరాజా"

"బొట్టు కాటుకా నిల్పను నాకు తరము కాదు తల్లి

ముండమోసితే మూడు పల్లెలే ఇనాము లిస్తాను.

మండకోక ముందగ నిత్తు మల్లమ్మదేవీ దా

ముందుకూర ముందు యన్నము నీదే నన్నాడు.

"జాజి పువ్వుల జల్లడములు జగ్గున తొడిగీరీ

తాలా తట్టా కత్తులపారీ సంకన వేసీరీ"

ఉడముతోక పట్టుకొని లగ్గల కెక్కీరి!

"ఉడుముతోక పట్టుకొని అలంగ మెక్కీరీ"

ఎద్దుల కప్పుడు కాగుతున్నది అంబడి బానాలు

గిరగిరమని త్రిప్పినారు వాసిన మానులు"

"తక్కెడ గుండులు పలాల గుండులు వీపున గట్టిరీ

అలాంకారము లెక్కినారుగా భేరీ స్త్రీలంతా

వడిసెలో రాళ్లు చెక్కిరి భేరీ స్త్రీలంతా

వడిగా అప్పుడు రువ్వినారుగా రాళ్ళు అయితేను:

వడిసెల క్రింద మూడువేలు మరణం అయినారు

చావిడి బండలు దొర్లించారూ భేరి స్త్రీలంతా

ఎద్దుల కప్పుడు కాగుచున్నవి అంబటి బానలు

పల్పులువేసి పట్టినారు అంబటి బానాలు

బానలంతయు దొర్లించారు రాణువ పైగాను

బానల క్రింద రెండువేలకు మరణము చెందిరిగా

సాగిలమాను తీసినారుగా భేరి స్త్రీలంతా

గిరగిరమని త్రిప్పినారుగా సాగిలమానులను.

దండుమీదికే సాగిలమానూ రాయిగా విడిచారు

మానుల క్రిందా మూడువేలు మరణము చెందిరిగా

బురుజుల క్రిందికి చేరనివ్వరు భేరి స్త్రీలంతా

చక్రములాగు తిరిగినారుగా భేరి స్త్రీలంతా

వేటువేటుకే నరికినారు ఏనుగు గుంపుల్నీ

వీరియుద్ధాని చూసి హైజరుజంగోజి గడబిడలాడేడు

మూడు నిమిషములలో తీసితినే ఆరణి బళ్లారి

ఇట్టి జగడము నేను ఎక్కడ చూడలేదయ్యా"

పండ్ల ఫలాదులు తాకలేదు వెంకట్రాయుడు

"దుడ్డు దుగ్గాని తాకలేదయ్య వెంకట్రాయుడు

చంద్రాయుధము చేత బట్టెను వెంకట్రాయుడు"

"తగురా నాయన తగురా నాయన బొబ్బిలివారికి"

బొబ్బిలి బెబ్బులి తాండ్రపాపారాయుడు రంకెవేసి విజయరామరాజును డేరాలో చంపుతున్న దృశ్యమొకక్షణం పొడగట్టిందందరికీ

అయినా విద్యార్థులెవ్వరూ మాట్లాడలేదు. ఎవరిలోకల్గినఉద్వేగాన్ని వారు లోపలే అణచి ఉంచుకొన్నారు.

పడవవాడు కొనసాగిస్తున్నాడు.

"బొబ్బిలి యుద్ధంలో జరిగినఘోరంతెలిసేనాటికి భైరీవాళ్ళు గోపాలపట్నంలో ఉన్నారు. బుస్సీకిలభించిన ఈ విజయంగురించి విన్నాక వారికి కోరంగికి త్వరలో చేరుకొనే ఆశ లేమాత్రమూ లేకపోయింది.

"ఇంత ఘోరహత్యా !" అని విస్తుపోయినారు బొబ్బిలి యుద్ధవార్త విన్నప్పుడు "ఇంతనీచులా" అని చీ కొట్టినారు, హైదరుజంగు, విజయరామరాజులను. "ఇంతటి శౌర్యం కన్పడిన యుద్ధభూమి ఇంకెక్కడా లేదు బాబూ ?" అంటూవేగులు బొబ్బిలివారిశౌర్యానుగ్గడించి వర్ణిస్తూంటే అందరూ ముక్కుమీద వేలుంచుకొన్నారు.

"బాబూ అందరుసచ్చినారుగానీ ఒక్కడువెన్నిచ్చినవాడులేడుబాబూ! భీరువు పురుగేలేదా గడ్డను ?"

భీరువంటే భైరితంౘ్రడికి పల్నాటియుద్ధంలో వర్ణన జ్ఞాపకంవచ్చింది.

"పారిపోవగలేక బ్రతుకుపై నాశ బ్రతిమాలుచుండెడు బలనిచయంబు, లిటువంటి జగడములెన్నడెరుంగ మేలాగుపోదుమన్చేడ్చెడివారు, పణతులు తిట్టిన పడలేక వచ్చి చచ్చుచునుంటిమీ సమరరంగమున, పారిపోనిచ్చిన బ్రతుకుదుమయ్యా అని మ్రొక్కుచుండెడు అతి దీనభటులు, బోయవారముమేము పూర్వంబునందు భుజముకాయలు పూనికన్గొనుడీ, పగవారుమముగని పారిపోవుదురు మీకేమి భయమనీ మెలత నాగమ్మ. బాగుగ నమ్మించి పంపవచ్చితిమి అనియంజలి యొనర్చి అవమానమొంది మగసిరి విడిచిన మానహీనులును, చనలేక భయమున చచ్చినవారి మీద తోసుకయుండి మెదలనివారు, చచ్చిన గజముల చాటునదాగగా, పందతనమున పడియుండువారు, పెండ్లాల తలచుక బిట్టేడ్చువారు, వల్మీక ములమీద వసియించువారు, గడ్డిలో జారబడి కదలనివారు, వ్రేళు చీకెడువారు, వెన్నిచ్చువారు."

వెలమదొరలు తమ రాణీవాసాన్ని కడతేర్చింది గర్భిణులు తామే పొడుచుకొని చచ్చింది చెప్తూంటే వినలేక "హరిహరీ"అని చెవులు మూసుకొన్నారు.

"అంతా ఎంతసేపు బాబూ ఒక పూట ? ఎన్ని మొహర్జాలెత్తినా అంతలోనే !"

యుద్ధభూమిలోను రాణివాసంలోనుజరిగిన ఈ మారణంచాలదన్నట్లు స్వాధీనమైన బొబ్బిలిలో మిగిలిన వారందరినీ కూడా చంపఆజ్ఞచేశాడు బుస్సీ, ఆ ఊరివాళ్ళమీద ఆ వేణుగోపాలస్వామికేల దయతప్పిందో కానీ.

ఇంత భీభత్సానికీ కారణము వారి నీటి తగాదాలు.

బొబ్బిలి సంస్థానంవారికీ విజయనగరం సంస్థానంవారికీ నీటిపారుదల విషయమై తగాదాలు చాలకాలంగా ఉన్నాయి. నీటి కెగువనున్నవారు బొబ్బిలివారు. వారి త్రాగేనీటి అవసరాలు, వ్యవసాయ సదుపాయాలు మొదట తీరవలసింది

ధర్మం. క్రిందివారుకూడ వీలైనంత ఎక్కువగా ఆ వంకలవల్ల లాభం పొందేట్లుగా తమఅవసారాలను సాధ్యమున్నంత కుదించుకోవడమూ వీరి ధర్మమే. ఈరెండుధర్మాలను ఒడుపుగా నడుపుకొనిపోయే సువ్యవస్థ లేనప్పుడు బలాబలాలను తేల్చుకొని నీటిననుభవించవలసిన దుర్గతి ఏర్పడేది. బొబ్బిలివారు సహజంగానే కష్టతరమైన జీవితానికలవాటు పడిన దృఢకాయులు కాబట్టి, తమకోసం తాము యుద్ధంచేసేవారు కాబట్టి, వారితెగువ, పోరాటపటిమ విజయనగర సైన్యాలకంటే ఎక్కువే. వారిని క్రమయుద్ధంలో ఓడించలేని విజయరామరాజుగారు బుస్సీని, యుద్ధాలలోపేరొందిన అతనియోధదళాలనూ ఉపయోగించుకొని తనపని కానిచ్చుకొన దలచినారు. ఆకాలంలో అది మామూలు రాజనీతికి విరుద్ధమేమీకాదు. బుస్సీ అయిష్టంగానే ఈ యుద్ధంలో పాల్గొన్నాడు. దీనితో వారికి కలసివచ్చేది తక్కువ. కానీ విజయరామరాజు తన రాజనీతిజ్ఞతనంతా ఉపయోగించి హైదరుజంగును లోబరుచుకొని బొబ్బిలియుద్ధానికి బయలుదేరదీసినాడు. బొబ్బిలివారు యుద్ధాన్ని నివారించేందుకు కృషిచేశారు.

కానీ దురదృష్టవశాత్తు వారొకప్పుడేసందర్భంగానో పరాసువారిని కొందరిని చంపారు. పొరపాటున అని ప్రసిద్ధిగా అనుకొంటారు. ఋజువుచూపగల్గినకారణాలు తెలియవు, ఏమైతేనేం వారు బొబ్బిలి వదలి వేరొక చోట వలసపోవాలనీ అందుకువీలుకల్గిస్తామనీ బుస్సీ రాయబారంపంపినాడు. తరువాత రాయబారాలు కొన్ని సార్లు జరిగి విఫలమై యుద్ధమే నిశ్చయమైంది గోదావరీ మండలంలోని రాజులందరూ బుస్సీ పక్షాన వెళ్ళినారు. అతను హైదరాబాదు నవాబుకు ప్రీతిపాత్రుడైన ప్రతినిధీ–సన్నదు పొందినవాడూ అయినందున తమసంస్థానాలశిస్తు విషయంలో అతని సద్భావం అవసరం కనుక వారలా పోటీలుపడి వెళ్ళి ఉండవచ్చు.

కాకర్లపూడి జగన్నాధరాజుగారు, సత్యవరపురస్వామియైన రామభద్రరాజుగారు, కాశీపతి, చింతలపాటి నీలాద్రిరాజుగారు. పెద్దాపురపు సంస్థానాధిపతులు వత్సవాయి జగపతిరాజుగారూవిజయరామరాజుగారు సరే సరి,

ఇందరూ బొబ్బిలివారి వెన్నువంచాలని బయలుదేరినారు. వీరందరూ ఫ్రెంచివారికి నిజాంప్రభువు సర్కారులను దత్తంచేసినప్పుడీసడించి వారికి వ్యతిరేకంగా మంతనాలు జరిపినవారే కానీ యుద్ధాలు నిజంగా చేయగల స్తోమతలేనివారు కాబట్టివెంటనే గొడుగుమార్చినారు. కొండప్రాంతోని అమాయకపు మనసుకల బొబ్బిలివారు పుట్టినగడ్డను విడువమంటే ఎవ్వడు విడుస్తాడు ? తుదివరకు పౌరుషానికినిలిచి తమ శౌర్యాన్నే నమ్ముకొన్నారు. ప్రాణాలిచ్చారు. "యుద్ధంలో దీర్ఘకాలం నిలువగల విజయానికి పోరాటం యొక్క ఆశయమూ, అందులో పాల్గొన్న యోధులపటిమా, సామాన్యుల అండదండలుఎంత ప్రధాన కారణాలో , తక్షణ విజయాన్ని సాధించడంలో అయుధాలబలమూ సైనికుల సంఖ్యాబలమూ సైనిక నాయకత్వమూ అంతే ప్రాధాన్యత వహిస్తాయి." భైరి తండ్రి తనకు తోచిన గుణపాఠం అందరికీ వివరించినాడు, ఫ్రెంచివారు, విజయరామరాజు తుపాకులు మందుగుండు సామాను మున్నగు మారణాయుధాలను వాడారు. బొబ్బిలి వీరులకిట్టి సాధనములులేవు. బొబ్బిలిమీదికి పోవునప్పుడు బూసీ పక్షంవారు "రాచూరి పొగబాణము బండ్లమీద వేసిరీ" దండెత్తిపోయినవారు గుడారములు నిలిపి "ఫ్రెంచివారి దండికోడదా యెత్తించినారూ, రాజుగారి తెల్ల జండా ఎత్తించినారు."

తుది క్షణాన ధర్మారాయుడు రాయబారానికి ప్రయత్నించాడు. రాయబారంవెళ్తూ త్రోవలో ఒక వెలమమవీరుని నిల్పి సంధికుదరనినాడు,

"చేతనుండు దేగను మీరు కోటకు విడిచిదా
క్రిందు మీదు చేయండయ్యా ఫ్రాంచిదేరాలు"

సంధి కుదరలేదు. మొత్తం ప్రాంతమంతా పాదాక్రాంతంకావాలి, దానికందరినీ భయభ్రాంతుల్నిచేయాలి అన్న అధమాధమసూత్రాన్ని బూసీ పాటించాడు. విజయరామరాజు దానికి దోహదం చేశాడు. హైదరుజంగూ అందుకు కుమ్మక్కై యుద్ధానికి దారితీసారు. ఫ్రెంచివారిబలం తారాజువ్వలా లేచిందీ విజయంతో.

# X

ఖైరీవాళ్ళింక లాభంలేదనుకొని వంగదేశం మీదుగా తూర్పుదీవుల కేసి వెళ్లవారై చాపలెత్తించారు. ఖైరి ఇప్పట్లో స్వదేశనివాసపుటాశలేదని నిరాశచేసుకొన్నాడు.

బొబ్బిలియుద్ధం తరువాత ఫ్రెంచి ఉద్యోగులు ప్రవర్తించిన నిరంకుశ దోరణి వారిసహాయ మర్ధించిన విజయనగర సంస్థానం వారికీ ఇతర రాజులకుకూడా చాల ఆశాభంగం కల్గించింది. వారిప్పుడు ఫ్రెంచివారిని వదలించుకొనడమెలాగా అన్న ఆలోచనలో పడ్డారు. అయితే ఈ పరిణామాలు కలగటానికి కొంతకాలం పట్టింది.

బొబ్బిలిలో బుస్సీ దిగ్విజయవార్త కార్చిచ్చులా వ్యాపించగానే యానాంలోని ఫ్రెంచి ఉద్యోగులు మహా వైభవంగా విజయోత్సవం జరుపుకొన్నారు. చుట్టుపట్ల ఇతర పాశ్చాత్య వర్తక కేంద్రాలన్నీ ఆక్రమించుకొన్నారు. తామే సర్వాధికారులై వ్యవహరించ సాగినారు. దీన్ని చూడగా. సహచరులుగా మెలగుతున్న మీరయ్య మొదలైన వారికే దిగ్భ్రాంతి కల్గింది. వారి సరసన వీరిస్థాయి బాగా దిగజారినా వారు కొల్ల గొంటున్న వ్యాపారంలో అంతో ఇంతో భాగమున్నందున వారంతలోనే తృప్తిపడవలసివస్తూంది, సిరి పెరుగుతూంది కానీ మనస్సుకుమాత్ర మేమాత్రమూ శాంతిలేకుండా పోతూంది. వారు నేతవారినీ. ఇతరపనివారినీ చూస్తూన్న తీరు భయంకరంగాఉంది. సరుకు వేసుకొనే ధర వారి దయా భిక్షం (అసలుధరంటూ ఇస్తేను). వ్యక్తిగతంగా బహుమానాలు (వాటిని లంచాలన కూడదు!) పుచ్చుకోవడం అమితమై పోయింది, ఎదురు తిరిగిన నేతవారిని శిక్షించడంలోనూ మునుపు వినని క్రూర శిక్షలు ప్రారంభమయ్యాయి. నేతవారూ, అద్దకాలవారు, పూసలు చేసేవారూ ఇలా వృత్తుల వారందరూ వృత్తులు చేయలేని స్థితి దాపురిస్తూంది. ఓడలకు కేవుల విషయాల్లో కూడ ఫ్రెంచి ఉద్యోగులు నిరంకుశంగానే ప్రవర్తించ నారంభించారు. వారి అనుకూలం మేరకు ఓడలు ప్రయాణం చేయవలసి వస్తూంది,

వారిచ్చిందే కేవు. ఒక్కొక్కప్పుడు ఉన్న సరుకును దించయినా వారి సైనికులనూ, వారి సరఫరరాలనూ తెలుగు ఓడలు మోయ వలసి వస్తూంది. ఓడలమీద కూడ దేశీయ నావికులనూ కప్తానులనూ చీటిమాటికి తృణీకరిస్తూ వ్యవహరిస్తూన్నారు. మీరయ్యకూ ఈ తాకిడి తగులుతున్నా దీనికంటే మిన్నగా ఉద్యోగులతో కలిసి జరుపుకొంటున్న స్వంత వర్తకంలో కలిసి వస్తూందని తృప్తిపడుతూ తరణోపాయం అన్వేషిస్తూన్నాడు. ఒక వైపిలా లోపల మధనపడుతూనే తనకు కంటకంగా ఉన్న వ్యాపార పారిశ్రామిక కుటుంబాలనునుసి చేసే ప్రయత్నం సాగించి, వారి గిడ్డంగులు, సంపదా ఆక్రమించుకొన్నాడు. భైరి కుటుంబం మీద ప్రత్యక్షంగా మీరయ్య కలిగించుకొనలేదు, ఆయన కక్షంతా భైరి మీద ఉన్నట్లుగా మిగిలిన వారిమీద లేదుకదా! అతనికిది ఎటు పోతున్నారో తెలియని ప్రవాహ గమనం. ప్రవాహంలో పడి కొట్టుకొని పోవడం మినహ మరేమి చేయలేని స్థితి. పళ్ళు పీక్కు తినడం కాదు. పూలు మొగ్గలు గుత్తులు తెంపడంకాదు. కొమ్మవిరవడంకాదు. చెట్టును వేరంటా తవ్వి కూలకొట్టున్న పరిస్థితి, ఎలా ఆపాలో ఏం చేయాలో దిక్కు తోచని దుస్థితి

మంజరి, భైరి పినతాత మాత్రం మెదలకుండా కూర్చొనలేక పోయినారు. వారు బహిరంగంగా ఫ్రెంచివారి చర్యలను విమర్శిస్తూ తగుసలహాలను పనివారికిస్తూ వస్తూన్నారు. వారి చర్య లను ఫ్రెంచి ఉద్యోగులు సహించలేకపోతున్నారు. రాజబంధువుకూడ ఫ్రెంచివారి ఆగడాలను సహించలేకుండా ఉన్నాడు. తన్ను లెక్కచేయకుండా ఫ్రెంచి వారు ప్రవర్తిస్తున్న తీరాయనకూ బాధగా ఉంది. ఆయన పెద్దాపురం. పిఠాపురం వారితో ఇక్కడి విషయాలు చెప్పి వీరి ఆగడాలు కట్టించ జూచాడు కానీ అక్కడివారూ ఇందుకు చాలినవారు కాదని తెలిసి నిస్సహాయుడై చేతులు ముడుచుకొన్నాడు. రాజబంధువు భైరి చినతాతగారితో కలిసి అతన్ని బలపరుస్తున్నందున ఫ్రెంచి వారతన్నెలాసాధించాలా అని తటపటాయిస్తున్నారు. ఎట్టి పరిస్థితుల్లోనూ మీరయ్య వారిమీద చేయి చేసుకోవడానికి సుముఖత చూపటం లేదు.

రేవుల్లోనూ ఆ చుట్టు ప్రక్కలా ఇది మామూలేలే అనుకొంటే ఇప్పుడీ ఘోరాలు సకల గ్రామాలకూ వ్యాపించాయి. ఫాక్టరీ వాళ్ళ ఒత్తిడికి లొంగి పంటలతో నిమిత్తం లేకుండా ఎక్కువ పేష్కష్ కొప్పుకొనిరావడం దాన్నిక్కడ ఒకటికి మూడు నాల్గు రెట్లు నిర్భంధంగా వసూలు చేయడం అడిగిన వాళ్ళను హింసించడం మామూలై పోయాయి. ఈ ప్రక్రియల్లో మూమూలుగా పెత్తనం వహించేవారు చాలక పోతే వారి తరువాతివారు ఈ అవకాశం వినియోగించు కొనేందుకు తెగబడుతున్నారు. "పై" కొస్తున్నారు. వారికి విదేశీ వర్తక ప్రభువులు కావలసిన సైనికబలం చేకూరుస్తున్నారు. ఇలా బూసీ పేరు ప్రాంతమంతటా భయానకానికి ప్రతిరూపం, పర్యాయ పదం అయింది. అసలేమైనా పాత కక్షలుంటే వాటిని తీర్చుకోవడానికి దొక అవకాశ మానాటి గ్రామాల్లో

కళింగ తీరాలు దాటి బంగాళం ప్రవేశించిన ఓడలు కొంత క్షేమంగా ఉంటాయని భైరీ అతని తండ్రీ ఆశించినారు. కాని అక్కడ కూడ వారికి చుక్కెదురే అయింది. సిరాజుద్దౌలాకూ ఇంగ్లీషు వారికీ ఒకరి అంతొకరు తేల్చుకొనేందుకు జరుగుతున్న పోరాటపు రోజులవి. మనదేశంలో ఒక కొత్త యుగాన్ని సృష్టించనున్న ప్లాసీ యుద్ధం వైపుకు వంగదేశం చక చకా నడుస్తున్న రోజులవి. ఇంగ్లీషువారింకా తమ అస్తిత్వానికి పెనుగులాడుతున్నారు, బంగాళా తీరంలో కూడ తమకు క్షేమంగా ఉండదేమోనన్న అనుమానం తోచగా వీలైనంత త్వరగా తమ వ్యవహారాలు ముగించుకొని ఇంక తూర్పు దీవులవైపు తరలివెళ్ళినారు.

జీవి ప్రకృతిలో భాగమే అయినా ప్రకృతికీ జీవికీ నిరంతరం ఘర్షణ మాత్రం తప్పదు. ప్రకృతి యొక్క భీషణమైన శక్తుల కొక్కొక్కప్పుడు జీవి తలయొగ్గక తప్పదు. అయితే ప్రకృతి క్రౌర్యం క్షణికం. ఆక్షణం గడిస్తే మనిషికి తిరిగిలేచి ఏదోరూపంలో విజృంభించి పురోగమించే అవకాశం సామాన్యంగా ఉంటుంది. కోల్కొనడానికి వీలులేకుండా వచ్చే గండాలరుదు, వచ్చినప్పుడు మాత్రం చాల విషాదకరంగా ఉంటాయి. సరిగా అలాంటి విషాదమే భైరి, అతని తండ్రీ ఇప్పు డెదుర్కొన్నారు,

భీషణమైన తుపాను వారి ఓడలను సముద్రం పాలుజేసింది. అసలే ఒకసారి దెబ్బతిన్న ఓడలు ముక్క చెక్కలై ఎందుకూ పనికి రాకుండా పోయాయి. ఓడలమీద మనుష్యలు మునిగినవారు పోను మిగిలినవారుదిక్కుల రొక్కరయ్యారు. భైరయ్యా అతని తండ్రీ ఉన్న ఓడ మాత్రం ఎలాగో నిలిచి కళింగ తీరం పట్టింది. తుఫాను తగ్గినా ఈపయనాని కర్థం లేదనిపించింది. ఇది వారిపట్ల దైవము చూపుతున్న చిన్నచూపుకు తార్కాణమనిపించింది. ఇంటివద్ద ముసలాయన్ను ఆడంగులను మాత్రం వదిలివచ్చిన విషయం గుర్తుకు వచ్చి ఈకల్లోల దివసాల్లో వారేఇబ్బందికి గురైనారోనన్న బెంగకూడ ముసలాయనకు పట్టుకొంది. తన వంశాంకురమైన భైరి నెలాగైనా ఊరు చేరిస్తే అదే చాలనిపించిందాయనకు. ఈ విషయాలన్నీ కొడుకుతో చర్చిస్తే అతనూ భయగ్రస్తు డౌతాడేమోనని భయపడి ఇంక ప్రయాణ మాపి వెనుకకు మరలుదామని సూచించినాడు, కానీ భైరికి ప్రయాణం మధ్యలో ఆపడం ఇష్టంలేదు. అదృష్టమెలా ఉంటుందో ఎలా చెప్పగలరు ? సిరి రావడానికీ పోవడానికీ భేదం ఎంతలో ఉంటుంది గనక ? బయలుదేరదీసిన ప్రయాణం ఏదో తుదకంటా చూడాలనే అతని కుంది ఓడలో మనుష్యుల ఆలోచనలు మాత్రం ఇంటికి పోవాలనే ఉన్నవి. కానీ ముందు నుయ్యి వెనుక గొయ్యి వత్తుగా ఉండటం యజమానులకేగానీ తమకేముందని వారి అభిప్రాయము.

చివరకు కొంత చర్చ జరిపి పురెక్కించి పౌరుష వాక్యాలు నూరి పోసిన తరువాత దైవంమీద భారంవేసి ఓడను ముందుకే నడపడానికి వారొప్పుకొన్నారు. కొన్ని నెలల తర్వాత వారి లక్ష్యంచేరకుండానే మధ్యలో కొన్ని ఓడలు దాటవచ్చినవి. మన బలహీనత నండగా చూసుకొని మనలను కొల్లగొట్టరుకదా అని భైరి ఓడలో అందరూ భయపడినారు. కానీ ఆ ఓడలు దక్షిణాదిని తీరమునకు చెందిన ద్రవిడ ముస్లిము యజమానులవి. వారి యజమాని ఓడలో లేదు కానీ, యజమాని కుమారుడున్నాడు. అతను వీరి పాట్లు తెలుసుకొని సాదరంగాను, గౌరవపూర్వకంగానూ తమ ఓడలోనికాహ్వానించి ఆతిధ్యమిచ్చినాడు. ఏవో పూర్వసంబంధాలను కలిపి పరిచయంచేసుకొన్నాడు.

"మే ముత్తరతీరాల కెక్కువగా రాము, జాఫ్నా వైపునకే మా తెరచాపలను విప్పుతూంటాము. సాహసించేవారు జాఫ్నానుంచి పశ్చిమతీరాలవైపు వెళ్ళి సూరత్‌వరకు పోతూంటారు, పూర్వ మొకప్పుడుత్తర యాత్ర సందర్భంగా మీతీరాల్లో తుఫానుకుగురై మేము సర్వనాశనమయ్యే స్థితిలో కోరంగిలో ఒకాయన మమ్ముల నాదుకొని ఓడలు బాగుచేసి పంపాడని మా తండ్రిగారు అంటూంటూరు."

"మీ తండ్రిగారి పేరు ?"

యువకుడు చెప్పినాడు.

"కోరంగిలో మీకు సహాయం చేసిన వ్యక్తి పేరు ?"

యువకుడు చెప్పినాడు.

"అయన మా పినతండ్రిగారే !" అంటూ తమ తండ్రి తరువాత ఆయనెలా తమ తండ్రిలా పెంచిందీ ఇప్పటి ఆయన పరిస్థితి వివరించారు. ఆమాట వినగానే ఆయువకుడు, ఓడలోని పెద్దలూ చాల సంబరపడినారు.

"మాకు కోరంగి వారంటేనే చాలు ఎంతో అభిమానం కల్గుతుంది. సాక్షాత్తూ మా వర్తకం నిల్పినవారి వారసులే అయితిరి. మీకాతిథ్య మివ్వగల్గటం మా అదృష్టం" అన్నారు. ఎంతో మనస్సు విప్పి అరమరికలేక మాటలాడ నారంభించారు. ఇప్పటి వీరి ప్రయాణపు విషయాలన్నీ విని ఎంతో నొచ్చుకున్నారు. తరువాత వీరు ప్రయాణమైన కేంద్రాలన్నింటిలోనూ స్వదేశంలోవలె కల్లోల పరిస్థితులే ఉన్నాయనీ, ఆప్రదేశాలన్నీ తాముజాగ్రత్తగా పరిహరించామనీ తమకు తెలిసిన వేగులకబురు తెలియ జేశారు. అది భైరీవాళ్లను దిక్కుతోచని స్థితిలో పడవేసింది. ఆకేంద్రాలను దాటి అవతలింకా తూర్పుకూ, దక్షిణానికీ వెళ్లగల స్తోమత తమకు మిగిలిన ఒక్క ఓడకూ లేదు, కాబట్టి ధ్వంసం కాగా మిగిలిన తరుగు సరుకులతో వెనక్కు వెళ్లాలి, అంతకంటే ఈ సముద్రంలోనే గంగపాలు కావడం మెఱుగు. ఈ పరిస్థితిలో వారికి సాయం చేయడానికా యువకుడు ముందుకు వచ్చాడు. వీరి సరుకంతా అతను కొంటానన్నాడు. వారు తిరుగు ప్రయాణం కావచ్చునన్నాడు.

"దేశంలో పెరిగిపోయిన అరాచక పరిస్థితి గురించి మాటలు వచ్చిన తరుణంలో ఆయువకు దుత్సాహంగా తాము ఢిల్లీ వెళ్లనున్నట్లూ, ఒక రాయబారం చక్రవర్తి వద్దకు తీసుకొని పోతున్నట్లు వెల్లడి చేసినాడు.

"ఈ విదేశీ వర్తకుల ఆగడాలు భరించ వీలులేకుండా ఉన్నాయి. మన వర్తకాలు, పరిశ్రమలు ఏక్షణంలో ఏ ప్రమాదానికి గురౌతయో చెప్పలేక పోతున్నాము. ఇలా కొనసాగితే మనకు మనుగడే లేదు. మాతాతగారి కాలంలోను, వారి పూర్వీకుల కాలంలోను వర్తకాలిలా ఉండేవా ? స్త్రీ బాల వృద్ధులు కూడా క్షేమంగా రామేశ్వరం మొదలు హృషీకేశం వరకూ, సూరత్ మొదలు జగన్నాధక్షేత్రం వరకూ వెళ్లగలిగేవారు. మాకు మక్కా యాత్రలు అంత క్షేమంగానే సాగేవి, ఇప్పుడో, పొరుగూరికి వెళ్ళినవాడు తిరిగి వచ్చేవరకూ నమ్మకంలేని పరిస్థితులు వచ్చినాయి. సహజంగానే రాజ కుటుంబాల్లో ఏవో కలత లెప్పుడూ ఉంటూనే ఉంటాయి. వాటి నీనాడదుపులో పెట్టగలవాడు లేడు సరికదా ఈ ఇంగ్లీషువాళ్ళు ఫ్రెంచివాళ్ళూ మాటి మాటికీ వాటినెగద్రోసి లాభం పొందుతున్నారు. వారీ రోజుల్లో చేస్తున్నది వర్తకమా ? చెప్పుకొంటే మనకే తలవంపులు. వారిని వెళ్ళగొట్టితే తప్ప మనకు శాంతి లభించదు."

"వారిని వెళ్లగొట్టితే మన వర్తకాలో ? పూర్వంలాగా ఇప్పుడు తూర్పుతీరాల వర్తకాలుకావుగా ? అంతా పడమటి ఖండాల్తో వర్తకాలమయమైపోయింది."

"అక్కడేఉంది మన బలహీనత. వాళ్ళనిక్కడికి రానివ్వకుండా మనమే ఆదేశాలకు వెళ్ళి సరుకెందుకు వేయకూడదు?"

ఈ మాటకు కొంతసేపు భైరితండ్రి నోరు తెరుచుకొని అలా కూర్చుండి పోయాడు. తరువాత పరమ అసాధ్యమైన ఊహక్రింద దాన్నికొట్టిపారవేశాడు.

భైరికిమాత్ర మిదొక అద్భుతసాహసంగా వినిపిస్తూంది. తనకింతకుముందీ మాటెందుకు తోచలేదాఅనీ అనిపించిది.

"మీకిది విడ్డూరంగా కనిపిస్తూందికదూ? అలవాటులేక ఈవిషయం విడ్డూరం కల్గిస్తూందికానీ, ఆలోచిస్తే అసాధ్యమేమీ లేదు."

ముసలాయనేమీ మాట్లాడలేదు. ఆ యువకుని కళ్ళలో జ్యోతులు చూస్తూంటే ఆయన కతనిమాటలు వ్యతిరేకించ బుద్ధికావడంలేదు.

"మన ఓడలు వారిఓడలకంటే హీనమైనవా ? వారి ఓకు చెక్కలకంటే మన టేకుచెక్కలు చాలా కాలం నీటిఒత్తిడిని తట్టుకొనగలవు. వారి ఓడలకంటే మన ఓడలెక్కువ బరువులనూ మోయగలవు."

"ఊరికే ఎక్కువంటా వేమిటి ? వాటికంటే మూడు నాలుగురెట్లు సునాయాసంగా సరుకును మోస్తాయి !" అని భైరి ఉత్సాహంగా అన్నాడు.

"వాళ్ళిక్కడికివచ్చి దూబాసీల నేర్పాటు చేసుకొన్నట్లుగా మనమక్కడికి వెళ్ళి దుబాసీల నేర్పాటు చేసుకొనలేమా ?"

"వారికైతే పొట్టబట్టుకొని దేశదేశాలూ తిరుగవలసిన అవసరంకానీ, సుభిక్షమైన దేశంలో మనకాగతేమి పట్టింది?"

"బాగుంది ! మనమిప్పుడు తూర్పుతీరాల్లో తిరుగుతున్నాము కదా అది గతిలేకనా ? పాశ్చాత్యదేశాల్లో తిరిగితే తప్పేముంది ?"

"ఎన్నో తరాలుగా పరిచయమున్న మార్గాల్లోనే ఇప్పుడు సురక్షితంగా ప్రయాణం చేయలేకుండా ఉన్నామే, ఇప్పుడింక కొత్తమార్గాల్లో ఓడలు నడపడమంటే కోరి వినాశాన్ని తెచ్చుకోవడమే....పైగా ఇక్కడి ప్రభువులు విదేశీయ వర్తకులకిచ్చిన సదుపాయాలు మనకా ప్రభువు లిస్తారా ?...

"అక్కడేఉంది మన యావత్తు బలహీనత ! వారినౌకలను రక్షించడానికి వారి నావికాదళాలు వేలమైళ్ళు ప్రయాణించేసి వస్తున్నాయి. వాటి బలంతోవారు తీరప్రాంతంలో పాతుకొనిపోయి కావలసినంత అల్లరిచేస్తున్నారు. ప్రమాదం కల్గినప్పుడు ఓడలెక్కి తలదాచుకొంటున్నారు. మీ మతగ్రంథాలలో ఒక విధమైన రాక్షసులు సముద్రంలో తలదాచుకొని భూమిమీద, స్వర్గంలోనూ వాసమున్న దేవతలకెంతో చికాకు కల్పించే వారట ! ఔనా? అప్పుడు వారిపట్టు వద్దనే నిర్జించి నాశనం చేయవలసి వచ్చిందట. ఇప్పుడు మనమలాగే చేయాలంటాను, మన

ప్రభువులు నౌకాదళాలను సైన్యాల్లాగే పోషిస్తే వాటి నీడలో మనమన్ని తీరాల్లోనూ వాణిజ్యాన్ని పెంపొందించవచ్చు."

"వారి సైనికులు భూమియుద్ధాల్లోకూడ మనల్ని గెలిచారు! దీనికేమంటారు ?"

ఇక్కడ భైరిఅందుకొన్నాడు. అతనికున్న సైన్యజ్ఞానాన్నిక్కడవాదాని కుపయోగించాడు. "వారు తుపాకులు వాడుతున్నారు నాన్నా ! మన సైన్యాలు సైన్యాలా ? యుద్ధానికి వెడుతున్నట్లుగా ఉంటాయా మన సైన్యాలు ? ఆ అంగళ్ళేమిటి ? ఆ భోగంవారేమిటి ? ఆ రాణివాసం జనమేమిటి ? సైనికుల సంఖ్యకెన్నోరెట్లితర జనమేఉంటారు. పల్లకీమోసేవారనీ, జంతువులను శు భ్రంచేసేవారనీ, కూలివాళ్ళనీ, వడ్రంగులు, కమ్మరులు ఇత్యాదులనీ, ఇలాగా, సైన్యాలను నడిపేప్పుడైనా తెంపరితనంకల్గినవాణ్ణి నాయకుడుగా పెట్టారా ? క్షత్రియులే కావాలి ! ఈ కాలం క్షత్రియులశౌర్యమూ, వారి నాశ్రయించిన బ్రాహ్మణుల బుద్ధిశక్తి ఎవ్వరెరుగనిది ?
వాళ్ళలోవాళ్ళు పొగడుకోవటానికే తగుదురు కానీ కార్యం వచ్చినప్పుడు ఎందుకూ కొరగారు. తుపాకులుపట్టి యుద్ధంచేయడానికి ఛాందస క్షత్రియులంగీకరించరు. వారెంతసేపు పల్లకీల్లోనో ఏనుగుల మీదో, గుఱ్ఱాలమీదా ఊరేగుతామంటారు. మన వాళ్ళవెంత "పిడుగు తాపిన" కత్తులైతేమాత్రం తుపాకులముందు శతఘ్నులముందు ఆగుతాయా ? మన సైన్యాలు శౌర్యం కొరవడి ఓడిపోతున్నాయంటే నేనొప్పుకోను. జీవితానికిచ్చే విలువనుమించి మనవారు పిడిసూత్రాలు కెక్కువ విలువనిస్తున్నారు. చెల్లని నాణేలు కుప్ప పోసుకొన్నవానికి సంపన్న గౌరవంలభించనట్లే, మనవారికి విజయంలభించదు. బొబ్బిలివారికంటే శూరులున్నారా ఆ విదేశ యోధుల్లో ?"

"మనకూ ఒక నౌకాదళమూ, మన సైన్యానికి తుపాకులూ ఉండాలంటారా !"

"అంతేలాఉంది. ఏనుగులు పిల్లల్నీ మహరాజుల్నీ ఊరేగించడానికేగానీ, కోటగోడలు పగుల గొట్టేందుకీ కాలంలో శకట శతఘ్నులుండవలసిందే"

"దీనికెంత ఖర్చౌతుందో ఆలోచించారా ?

"మనం భరించలేని ఖర్చేం కాదంటాను."

"అదికాదు నేనంటున్నది. మన ప్రభువులు, మన శ్రేణులూ అంతంత దూరమాలోచించవు. ఇప్పటికిప్పుడు లాభంవచ్చేఎత్తులే చూస్తూంటారు, మనలోలాగే విదేశవర్తకులమధ్యకూడా ఎలాగూ ఎపుడూ స్పర్ధలుంటూనే ఉంటాయి. వాటినుపయోగించి మనకనవసరమైనప్పుడు విదేశీయులనే సైనికులుగా కూలికిపెట్టుకొంటే ఇరుపక్షాలపోరూ వారేపోరాడుతారు. దానికయ్యే ఖర్చూఎంతో ఉండదు. రాజ్యానికి మారుమూలల్లో మాటవినని పరగణాలు నాలుగిచ్చి ప్రతినిధులుగా నియమించి ఆ పన్నుల్లో కూలి మినహాయించుకోమంటే వారితిండికి వారే తిప్పలుపడతారు. అవసరమైనప్పుడుపోరాడనూ పోరాడుతారు. ఇంతచవకగా వ్యవహారం పోతూండగా సైన్యాన్ని నౌకాదళాన్ని ప్రభువులు భరిస్తారా?.....పైగాదీనికి సామంతులంగీకరిస్తారా ? అందులో చిన్నసామంతులసలొప్పుకోరు. వారికి మీరు చెప్పిన పద్ధతుల్లో సైన్యాలనుపోషించే స్తోమతతుండదు. కానీ నిజాంప్రభువుకానీ డిల్లీపాదుషాకానీ ఇట్టి సైన్యాలను పోషించనారంభిస్తే వారితోకలు కత్తిరించినట్లౌతుంది. కాబట్టి ఈ ప్రతిపాదనలనెన్ని విధాలుగా ఎదురించాలో ఎన్నివిధాలుగా నీరుకార్చాలో అంతా చేస్తారు. వారుమంచిపనికంటే అంతా ఎప్పుడూకలిసిరారు. కానీ కేంద్రాధిపత్యాన్ని ధిక్కరించడానికిమాత్రం ఎప్పుడూ తయారే. వారి నమైక్యశక్తిని మాత్రం ఏ కేంద్ర ప్రభుత్వమూ ఎదుర్కొనలేదు."

భైరిప్పుడు హుషారుగా చర్చలో పాల్గొంటున్నాడు. ''మన పంచాయితీలులేవా ?"

భైరితండ్రికి తనకొడుకు హుషారునుచూసి ఆశ్చర్యంవేసింది, ఇన్ని ఆలోచనలీ కుర్రకుంక కెక్కడివా అని

"పంచాయితీ లీవిషయాలు పట్టించుకొంటాయా? రాజులు రానీపోనీ, సామ్రాజ్యాలులేవనీ కూలనీ వారికి కాబట్టవు, దాదాపు శ్రేణులూ అంతే పంచాయితీలో కులపెద్దలూ, శ్రేణిపెద్దలూ మనమెంత పురెక్కించినా మహారాజులయెదుట పల్లెత్తు మాట్లాడలేరు. పైగా వారిలోనే ఎవడైనా సాహసికుడు బయలుదేరి సైయనిలేస్తే వాణ్ణిచూసిఓర్వలేరు. వాడు సమసేదాక వారికి నిద్రేపట్టదు!"

దక్షిణప్రాంతపు యువకుడందుకొన్నాడు. "ఇప్పుడు ప్రభుత్వ కేంద్రాలకు దూరంగా మారుమూలల్లో ఉన్న పరగణాలంటూ వేటినయితే దత్తం చేస్తున్నారో సరిగాఅవే విదేశవర్తకుల కాయువుపట్టులన్న విషయమెవ్వరూ పట్టించుకోవడమేలేదు. మచిలీపట్నం, కొండపల్లి, రాజమండ్రి, శ్రీకాకుళం సర్కారుల విషయమేచూడండి, లేదా కావేరీడెల్టాచూడండి. దానివల్లఫ్రెంచివారి వర్తకంలో మనమీద పెత్తనం చేయడానికెంతటి అవకాశమేర్పడింది? వాటి దుష్పలితాలింకా పూర్తి అనుభవానికి రాకమునుపే మన పారిశ్రామికులెంతటి యాతనలకు గురౌతున్నారు ! ముంది ముందింకా ఎంతఘోరపరిణామాలు వస్తాయో యెవరుచూశారు ?"

"హైదరాబాదులో బలవంతుడైన ప్రభువు లేకా, మొగలాయిపాదుషాహి నిస్తేజమయ్యి కొన్నాళ్ళిలావీరెట్లాడినా అక్కడబలమైన రాజ్యవ్యవస్థలేర్పడగానే వీరి నదుపులో పెట్టడమనగా ఎంత ?" ముసలాయనధైర్యం చెప్పినాడు.

ఇక్కడే నాటిభారతీయుల ఆలోచనలోని ప్రధాన లోపమంతా ఇమిడి ఉందనేవారు నాకు కథ చెప్పినాయన. వారు దేశంలో. జరుగతున్న మార్పులను తమదేశ నరిహద్దుల పరిధిలోనే ఆలోచించారు. అంతర్జాతీయ ప్రభావాలనాలోచించలేదు. దానికి వారిని నిందించలేమేమోకూడా. ఆ రోజుల్లో పాశ్చాత్యదేశాలేకనుక మనవారు తిరుగుతూ, వారిఆలోచనలే కనుకతెలుసుకొనగల్గి ఉంటే మనవారిలాఆలోచించేవారుకారు.

ప్రాచ్య సంపదలనారోజుల్లో పాశ్చాత్య వర్తకులులేళ్ళమందలను తోడేళ్ళమందచూచినట్లుగా చూస్తున్నారని వారికిట్టే అర్థమయ్యేది.తోడేళ్ళుతమలో తామెంతకలహించుకొన్నాఅమాయకపులేళ్ళనుమందలనుండి తప్పించడంలోగానీ,

దాన్ని వేటాడటంలోగానీకలిసి కదిలినట్లుగా వారికదలికలు ప్రకృతిసిద్ధంగానే మనకు ప్రమాదకరంగా పరిణమిస్తాయని వారికర్థమయ్యేది. కానీ అలా జరుగలేదు. ఉన్నచోట లాభసాటిగా సరుకుల నెగురవేసుకొని పోతున్నదే చూసుకొన్నారుగానీ, అదెంత కాలముంటుందని గానీ, దానికుద్భవించగల ప్రమాదాలను గురించి గానీ ఊహించలేకపోయారు. అ మాటకొస్తే మన సామ్రాజ్యాల వ్యవస్థ ఎంత బలహీనంగా ఉన్నదీ ఆ రోజుల్లో మనకంటే విదేశీవర్తకులకే బాగాఅర్థమైందన్నా అబ్బురంలేదేమో ! ముందునుంచీ యూరోపులో రష్యా ఒక బలమైన మహాసామ్రాజ్యం అయితేనేం వెనుకబడిఉండేది. ఒకసారి 17 వ శతాబ్దారంభంలో చిన్నదేశం టర్కీతో ఓడిపోయింది. తమ అధోగతికి సిగ్గుపడి జార్ చక్రవర్తి తామూ వికాసంచెందే మార్గాలన్వేషిస్తూ యూరోప్‌దేశాలు తిరిగాడు. చక్రవర్తిగా వెళ్తే విందులూవినోదాలు రాజకీయ కుత్సితాలుతప్ప వేరేమీ ఉండదనీ, వృథాకాలయాపనఅనీ భావించి సామాన్యుడి వేషంలో ఒక సౌహార్ద్రప్రతినిధివర్గ సేవకుడుగా నావికుడుగా వెళ్లాడు. హాలెండ్. లండన్ నగరాలలో నౌకానిర్మాణ కేంద్రాల్లో నెలలతరబడి పనిచేశాడు. తీరుబడి కాల్లాలో అక్కడి పరిశ్రమలను, యంత్రాగారాలను, వస్తుప్రదర్శనశాలలను చూసేవాడు. శాస్త్రవేత్తలతో మాట్లాడేవాడు. ప్రభుత్వ కార్యకాలపాలను పరిశీలించేవాడు. తరువాత స్వదేశానికితిరిగివచ్చి తనసమాజాన్ని పటిష్టం చేశాడు. జాతికృతజ్ఞతకు పాత్రుడైనాడు. అలామనమెందుకు నేర్చుకోలేదు? అదలాఉంచుదాం. గతంలో తప్పులనుగురించి చర్చ ఇప్పుడు పాఠంనేర్చుకొనేందుకే గానీ ఏడుస్తూ కూర్చోడానికి కాదు. అర్థంలేని ద్వేషకావేషాలను పెంచుకొనేందు కసలే కాదు. ఈ ఆలోచనాలోపం అత్యంతాలోచనపరులైన వారిలోకూడా నాడు కనపడేది. అందుకే భైరి తండ్రి విదేశీ వర్తకుల సమస్యను గోటితోపోయే అల్పసమస్యగా కొట్టివేసి మాట్లాడినప్పుడు దక్షిణాదియువకుడు పేలవమైన సమాధానం ఇచ్చాడు.

"ఈ లోపల ఎంతమంది ఎన్ని కష్టనష్టాలకు గురికావలసి ఉంటుంది?"

ఇక్కడినుండి విదేశీయులను వెళ్ళగొట్టి తామే విదేశాల్లో వాణిజ్య

కేంద్రాల స్థాపించే సమస్యను కల్లోల పరిస్థితిలో కొందరమాయకులు పడే బాధల సమస్యగా అతను మాట్లాడాడు.

చారిత్రిక పరిణామాలు మారలేనివారి ఆక్రోశాలయెడ జాలివహించి ఆగవు. పైగా వారిని చీదరించుకొని అవతలికి నెట్టివేస్తాయి. నొప్పులకు వెరచేకుటుంబినిని యజమానిచూసినట్లే కాలపురుషుడూ పరిణామానికి వెరిచే సమాజాన్ని చూస్తాడు. ఈసత్యం అనుభవంపండిన పెద్దల కు సహజంగానే రక్తగతమైపోతుంది. ఆ సత్యాన్నే ఆయన మామూలు మాటల్లో చెప్పాడు. "దానికేంచేస్తాంమరి ?" తరువాతెవ్వరూ కొంతసేపు మాట్లాడలేదు. ఈలోపున భోజనాలకందరూ లేచారు.

ఆరోజు మొదలు భైరయ్య మరి ఈ తమిళయువకుని వదలలేదు. అతనివెంటుంటే భైరయ్యకేదో ఉల్లాసంగాఉంది. ఏదో మహత్కార్యం సాధించ బూనుకున్న సాహసికులయెడల యువకులెలా ఆకర్షింప బడుతారో భైరయ్యకూడా ఆయువకునిపట్ల అలాగేఆకర్షింపబడినాడు. వంగదేశంలో తనతండ్రి కాప్తులైన వణిక్ప్రముఖులను కలుసుకొనిఅక్కడినుండి ఢిల్లీవెళ్ళి మొగలాయి దర్బారులో వాణిజ్యాభివృద్ధిపట్ల ఆసక్తిచూపే ప్రముఖులను కల్సుకొని చక్రవర్తితో నౌకాసేన స్థాపనవిషయం, విదేశ వర్తకులయెడలచూపుతున్న ఆదరాభిమానాలను తగ్గించే విషయం మాట్లాడ్డం – ఓహ్ ! ఎంత గొప్పసంగతి ! బంగాళంలోని వణిక్ప్రముఖులభవనాలను వారిఆటోపాలనూ ఊహించుకొన్నాడు. ఢిల్లీమొగలాయి దర్బారు, ఆ దర్బారులో ప్రముఖులను, వారి ఎదుట దక్షిణాదియువకుడు తన అభిప్రాయాలు వెల్లడించడమూ ఊహించుకొన్నాడు.

ఆ క్షణాన్నే పెద్దాపురం సంస్థానంలో తానుపొందిన అనుభవమూ జ్ఞాపకం వచ్చింది. ఢిల్లీలోనూ అలాగే అయితే ? పెద్ద అనుమానంతోచింది. కాని ఢిల్లీ ఆస్థానానికీ పెద్దాపురాస్థానానికీ పోలికేమిటి ? పండిత రాయలకథ జ్ఞాపకానికి వచ్చింది. సర్వేశ్వరుడి చేతలు మనకు తెలియవు గానీ, తల్చుకొంటే ఢిల్లీశ్వరుడేమైనా చేయగలడు. ఈ చిల్లర రాజులచేతనేమౌతుంది?" అని తనకు తాను

నచ్చజెప్పుకొన్నాడు. ఈ సందర్భంలో పండితరాయల సాహసమూ గుర్తుచేసుకొన్నాడు. "పైగా అప్పుడు తనకుతోచిన సలహాలకంటే ఈ యువకుని కెక్కువ తెలుసు. ఇతను నాకంటే సమర్థుడు."అని కూడ తర్కించుకొన్నాడు.

ఇంతైనా నెగ్గకపోతే పోనీలే ! ప్రయత్నం చేయకుండా విడువవచ్చునా ? "ధైర్యేసాహసే లక్ష్మీః" అని చివర దిటవు చేసుకొన్నాడు.

ఇలామనసు దిటవుపడిన తరువాత అతనిమనసు చాలాతేలికపడింది. ఈ మధ్యెప్పుడూ లేనంత ఉల్లాసం పొందినాడు.

ఆ రోజంతా ఎంతో పరవశుడై గడిపి రాత్రితండ్రివద్దకుచేరి తన ప్రగాఢమైన అభీప్సనంతా "నాన్నా"అన్న రెండక్షరాల పిలుపులో మూటగట్టినట్లుగా పిలిచినాడు. ఆయనకుమారుని ప్రక్కనకూర్చుండ బెట్టుకొని ప్రేమమీర "ఏంనాన్నా ? ఏంకావాలి?" అని అడిగినాడు.

"నాకు......మరీ........ఒకచిన్న కోరిక......."భైరయ్యకు మాటలు తడ బడుతున్నాయి.

"ఏం కావాలి నాయనా ? చెప్పు !"

"నీవేమంటావోననీ...."

"నేనేమంటాను నాన్నా ! నీవేదడిగితే నేను కాదన్నాను!"

"ఏమీలేదూ !......"ఆ తరువాత భైరికి మాటలు పెగల్లేదు.

"ఏం కావాలి చెప్పు ?"

"నేనుకూడా ఆయువకునితో వెళ్ళివస్తాను నాన్నా!"

ఈ కోర్కె ఆముసలాయనమీద శతఘ్నిలా పేలింది. ఆయనకేం చెప్పాలో తెలియలేదు. కుమారుని కోర్కెగొప్పది. ఆ ప్రయత్నంచూతామా కొండకు వెంట్రుకచుట్టి లాగటంలాఉంది. తమ ప్రస్తుత స్థితిచూస్తే గొప్ప ప్రయత్నాలకు పూనుకొనగల్గిన స్తోమతే మాత్రమూలేదు. ఇవన్నీ ఆ కుర్రవానికేం తెలుస్తాయి ? తెలిస్తే ఇటువంటి కోర్కేకోరడు. అతని కన్నీతెలిసేలా చెప్పగల చనువాయనకు లేదు. అయినా శక్తికొలదీ కుమారుణ్ణి వారించే ప్రయత్నం చేశాడు.

భైరి పట్టుదల విడువలేదు.  ఆయన నిరాకరించాడు.  భైరి అలిగి కూర్చున్నాడు. అన్నమూ నీళ్ళూ ముట్టడం మానివేసినాడు. ఒక్కగానొక్క కొడుకు. ఎదిగి వచ్చినవాడు, నచ్చిన పిల్లను తెచ్చి తాను పెళ్ళైనా చేయలేక పోయాడు. అతని తల్లీ పినతాతా అతన్నెలా పోషించు కొచ్చారో ఏమోగాని, తన్నెప్పుడూ ఏమీ అడిగెరుగడు. ఇదే మొదటిసారి తనవద్దకు వచ్చి అడగడం. తాను దాన్నిప్పుడనుమతించ లేకుండా ఉన్నాడు. అనుమతిస్తే తానే ముఖం పెట్టుకొని భార్య ఎదుట పడాలి ? పినతండ్రేమంటాడు? ముక్కు ముఖం ఎఱుగనివారి వెంట కాని పోని పనిమీద పంపినానని ఎలా చెప్తాడు?

తానూ అబ్బాయివెంట వెళ్ళితే? ఇంటివద్దేమైందో. పినతండ్రి అత్తగారు ఇద్దరూ తగ్గి ఉండవలసి నపుపడు కూడ అభిమానం విడువనివారు. బాగులేనిరోజుల్లో ఏమి ప్రమాదం తెచ్చుకుంటారో ! ఇలా ఆయన లోలోపల చాల తర్జన భర్జనలుపడి చివర కింటియెడల మనసు రాయి చేసుకొని తానూ కొడుకువెంట వెళ్ళడానికే నిశ్చయించుకొన్నాడు.

"మంచిది నాయనా ! శుభం. నీవింతపట్టు పట్టితే నేను మాత్రమేమంటాను? అవశ్యం వెళ్లు"

భైరి ఎగిరి గంతు వేశాడు.

"మరి నా కోరిక ఒకటి తీరుస్తావా ?"

"ఓ !"

"నన్ను కూడా అలాగే కాశీ తీసుకొనివెళ్ళి గంగాస్నానం చేయించు. మీ కృషి కేమీ భంగంరాని పద్ధతినే అనుకో" అన్నాడు.

భైరి తండ్రి పాదాలంటి నమస్కారం చేసి "అంతకంటేనా ?" అన్నాడు.

భైరీ, భైరి తండ్రీ యువకుని వెంట వెళ్ళనున్నారని తెలిసి ఆ ఓడ లోని వారందరూ ఒక విధంగా ఆనందం చెందినారు. వారిలో ఒక వృద్ధుడు

భైరి తండ్రి నేకాంతంలో కల్సుకొని "మీ వంటి పెద్దలు మా పిల్లకాయ వెంట వెళ్ళడం మా అదృష్టంగానే భావిస్తాము. మా దొరకుట్టి మీఅబ్బాయినే వేళావిశేషంలో చూసిననాడో గానీ ఇద్దరూ చాల ఆప్తులుగా మెలుగుతున్నారు. మా దొరబిడ్డ చిన్నవాడైనా చాలా మేధాశాలి, ధీరుడూ: అయితేనేం చెడ్డ పట్టుదల మనిషి. ఇదతని మనసున కెలా పట్టుబడిందో కానీ అప్పటినుండి దాన్ని సాధించాలని ఎంత ప్రయత్నమో సాగిస్తున్నాడు. అతన్నీ ప్రయత్నంనుండి వారించడానికి మా యజమానీ, అతని తల్లీ ఎంత ప్రయత్నిం చిన్నీ ఫలితం లేకపోయింది. మేమూ సమయం చూసి అతని మనసు మార్చ ప్రయత్నిస్తున్నాము గానీ, అతని పట్టుదల అంతకంతకూ బిగుస్తూందే తప్ప సడలలేదు. మీరూ వాదించిచూశారు కదా, అతనితో ఎంతటివారున్నూ వాదించలేక పోతున్నారు. యజమా నతని పట్టుదల చూసి చివర కొడంబడినారు. మీతోడు దొరకడం మా బిడ్డడి అదృష్టం. మీ ఓడలను మేము సురక్షితంగా మీ గ్రామం చేరుస్తాము, లేదా వెలగట్టి తీసుకొంటాము. మీ గ్రామంలో మీ వారికి సొమ్ము చేరుస్తాము. మా దొరబిడ్డను మాత్ర మెలా కాపాడుతారో !"

ఆయన మౌనంగా అంతా విన్నాడు, కాని ఏమీ మాట్లాడలేదు.

"మీ రెంత గుండె దిటవు చేసుకొని వీరిని వెంబడించేందుకు నిర్ణయించు కొన్నారో నా కర్థమౌతూంది. దైవం మీకు మేలుచేస్తాడు."

ఆయన చిన్నగా నవ్వినాడు. "దైవం మా కెప్పుడూ మేలు చేస్తూనే ఉంది!"

తరువాత సంభాషణ కాలమాన పరిస్థితుల మీదికి వెళ్ళింది.

చాలా వారాలిలా పయనమైన తర్వాత భైరిలోని ఉత్కంఠ తృప్తి పడే సుముహూర్త మాసన్నమైంది. గంగానది డెల్టా తీరంలో సుందర వన ప్రాంతంలోని ఒక ప్రాముఖ్యతలేని రేవులో ఓడలు నిల్పినారు. అక్కడికి వారు ముందుగా ఏర్పాటు చేసుకొన్న ప్రకారం వీరి మనుష్యులు వార్తలు తెచ్చినారు. ఆవార్తలన్నీ వీరి ఆశలను వమ్ముచేసేవిగానే ఉన్నాయి.

బంగాళాదేశపు సుబేదారైన అల్లివర్దీఖాను మరణించిన తరువాత సిరాజుద్దౌలా అధికారంలోనికి వచ్చిన దాదిగా జరిగిన అనేక విషయాలు వార్తాహరులు చెప్పినారు.

అల్లివర్దీఖాను మరణిస్తూ తనవారసునికి విదేశీ వర్తకుల కోరలు పీక వలసిందనీ లేనియెడల నీ రాజ్యం నీదికాదనీ చివరి సలహా ఇచ్చినాడు. వారినందరినీ ఒకసారిగా నిర్జించలేనంతగా వారు పాతుక పోయారనీ ఒక్కొక్కరిని నిర్జించ వలసిందే ననికూడ ఆయన తుది హెచ్చరిక చేశారు, సిరాజుద్దౌలా ఆప్రయత్నంలో ఉండగా ఇంగ్లీషువారు, కలకత్తాలోని ప్రముఖ వర్తకులు (ఒమీచంద్‌జగత్‌సేఠ్‌వంటివారు.)మీర్జాఫరు, ఇంకా ఇతరులూ కలిసి కుట్రచేసి అతనిన హత్యచేసినారు. మీర్జాఫరిప్పుడు నవాబు కానీ ఆ మీర్జాఫరు పేరుకే ప్రభువు కానీ అతని మాటను ఖాతరు చేసే సామంతులు గానీ వణిక్రప్రముఖులుగానీ, ఇతర పెద్దలు గానీ ఎవ్వరూ లేరు, ఇంక కంపెనీవారు సరేసరి. తామే నవాబులైనట్లుగా వారు ప్రవర్తిస్తున్నారు.

మీర్జాఫరాడినాటే ఇప్పుడతని క్రిందివారూ ప్రారంభించారు. అతనూ కొద్ది నెలల్లోనే రాజ్య భ్రష్టుడు కావడం తథ్యమంటున్నారు. ఇప్పుడెక్కడా క్షేమంగా ప్రయాణాలు చేయగల మార్గమంటూ ఒకటైనా లేదు. ఇంగ్లీషువారు తమ కుట్రలో భాగస్వాముల యడల కూడ ఎట్టి దాక్షిణ్యమూ చూపరనీ, వారికి తోచితే పని తీరిన తరువాత భాగస్వాములను కూడా సర్వనాశనం చేస్తారనీ, ఒమిచందు విషయంలో ఋజువైంది. అతనికీ వారికీ ఏ విషయమై పొరపొచ్చాలొచ్చాయో తెలియదనీ, కానీ అతను పిచ్చిపట్టి వీధుల్లో తిరుగుతూ అయిపులేకుండా పోయాడనీ వార్తా హరులు చెప్పారు.

వెంటనే దక్షిణాది యువకుడందు కొన్నాడు. "చూచారా కూలికి యుద్ధరంగంలో నిలిచే సైనికులని మీరు భావిస్తున్నవారెలా నేడు మారిపోయారో !"

ముసలాయనేమీ సమాధాన మివ్వలేక పోయినాడు. యువకుడు తిరిగి అందుకొన్నాడు. "ఇప్పుడు చెప్పండి: ఎవరి నెవ్వరుపయోగించు కొంటున్నారో!"

వార్తాహరు లింకా విషయాలు చెప్పినారు. "ఇంగ్లీషువారిప్పుడు విజయోన్మత్తులై ఏ అంతరాలూ పాటించకుండా ప్రవర్తిస్తున్నారు. క్రింది ఉద్యోగుల్లోనూ మామూలు ఇంగ్లీషు సైనికుల్లోనూ ఈ ప్రవర్తన మరీ పెచ్చు పెరిగింది.

"పరిస్థితులిలా ఉండగా ఇప్పుడు పర ప్రాంతంనుంచి మన బోంట్లం చేయగల్గిందేముంది? గండిపడిన ప్రవాహాని కడ్డువేయ ప్రయత్నించినట్లుంటుంది" చివరిసారిగా భైరయ్య తండ్రీ ఆ దక్షిణ దేశ యువకుని శ్రేయోభిలాషులూ వారి ప్రయత్నాన్ని విరమింప జేయజూచినారు "మీరన్నది నిజమే, కానీ గట్టుకిప్పుడు చిన్న కన్నం మాత్రమే పడింది. చెరువులకు కన్నం పడింది చూచిన కుర్రావాడు దాన్ని సాయశక్తులా చెయ్యిపెట్టి ఆపి కన్నం పెద్దది కాకుండా చూస్తాడు. ఈ లోపున గ్రామస్థులు తెలుసుకొని వచ్చి దాన్ని పూడుస్తారు. అలా చేయక పారిపోతున్న కుర్రవాణ్ణి మీ రొప్పుకుంటారా?"

భగవంతుని మీద భారం వేసి యువకుణ్ణనుసరించడమే కర్తవ్యమని నిర్ణయించు కొన్నాడు భైరి తండ్రి. యాత్రికుల వేషంలో తిరగడమే అన్నిటికంటే తక్కువ ప్రమాదకరమైన మార్గమని వారెన్ను కొన్నారు.

ఈ ప్రాంతం బాగా ఎరిగున్న మనుష్యులిద్దరు, సాహసిక యోధులిద్దరు, సులభంగా మోయగల్గిన డబ్బు, కొన్ని మణులు, ఆత్మరక్షణ కుప
యోగపడే ఆయుధాలు, కొన్నాళ్ళకు సరిపడిన ఆహార పదార్థాలు, ముఖ్యుల కుద్దేశించిన పరిచయ పత్రాలు ఇంతే వారి సరంజామా.

ఓడలు తెరచాప లెత్తి దక్షిణ దిశకు ప్రయాణమై వెళ్ళిపోయాయి,

వీరు కలకత్తాకు ప్రయాణమైనారు. కలకత్తాలో పరిస్థితులు చూసు కొని తరువాత మూర్షిదాబాదుకు పోవాలనీ అక్కడి నుండి పాట్నా వెళ్ళి, కాశీ ప్రయాగలు చూసుకొని ఢీల్లీ వెళ్ళాలనీ వారి పథకం. వారు పెద్ద కష్టం లేకుండానే

కలకత్తా చేరుకొన్నారు. కలకత్తా పెరుగుదల చూడగా వారికబ్బురం వేసింది. అది చిన్న కుగ్రామం కొన్నాళ్ళ క్రిందటి వరకు. ఇప్పుడో, లక్ష జనులకు పైగా వాసముండే పట్నంగా వృద్ధి పొందింది. ఎంతెంత పెద్ద భవనాలు, కట్టడాలు, ఫ్యాక్టరీలు లేచాయో !

ఒక యాత్రికుల సత్రంలో మనవారు దిగినారు.

## XI

రంగన్నా మంజరి చందుర్తి గ్రామం దగ్గిర కొత్తపాడు శివారులో ప్రవాస మేర్పరుచుకొన్నారు. మంజరి దూరపు చుట్టము విధవరా లొకామె ఉంటే ఆమె ఇంట్లో దిగినారు. ఆమె మొదట మంజరిని గుర్తించలేదు. గుర్తించిన తరువాత సంకోచించింది. కాని మంజరి డబ్బూ దస్కం చూశాక మరినోరెత్తలేదు.

కొత్తపాడు కొత్తగా ఇటీవల ఏర్పడిన గ్రామం. కలపకోసం అడవులు కొట్టివేయగా ఏర్పడిన చదును భూమిని వ్యవసాయానికి సిద్ధం చేసి కొన్ని వందల కుటుంబాలిక్కడ నివాస మేర్పరుచు కొన్నారు. ముందు కొన్ని రైతుల పాలికాపుల కుటుంబాలతో ఏర్పడిన మకామిప్పుడన్ని వృత్తులవారితోనూ స్వయం సమృద్ధంగా ఉంది.

మునసబు కరణాలను పెద్దాపురం దివాణం వారు నియమించారు. గ్రామాధికారులకు సాయం చేయడానికీ, గ్రామంలో కాపలాకూ ఇద్దరు బారికలున్నారు. వీరే చెరువు కట్ట కాపలా తూము దగ్గర నీళ్ళ పంపిణీకూడా చూస్తారు, గ్రామాధి కారులు గ్రామ వ్యవహారాలను కులపెద్దల, పంచాయితీదార్ల మనస్సులను బట్టీ తీరుస్తారు. గ్రామంమీద ఉమ్మడిగా ఇంత మొత్తమని పేష్కష్ సామంతుడు నిర్ణయిస్తాడు. గ్రామంలో ఏఏ కుటుంబాల వారెంతెంత ఇవ్వాల్సిందీ వారిలో వారు నిర్ణయించుకొంటారు. ఒక్క వర్షమొస్తేచాలు చెరువు క్రింద భూమి పండుతుంది. వర్షాధారంపంట నూటికి నూరుపాళ్ళు ఏ నాలుగేళ్ళకో, ఐదేళ్ళకో, అంతే, పంతులుగారు పెద్దింటి పిల్లల చదువూ గుడి పూజా ఖాళీ ఋతువుల్లో రాత్రిపూట పురాణం ఇవేకాక శుభకార్యాలకు తంతూ కూడ నడిపిస్తారు. అభానికి

తంతు జరిపించవలసివస్తే ఆమడ నుండి బ్రాహ్మడు రావలసిందే. కార్తెలూ, దినశుద్ధీ, ఇళ్ళ కట్టుబడి వాస్తూ నిర్ణయించే సిద్ధాంతిగారు కూడా దూరంలోనే ఉన్నారు. పంతులుగారు రోజూ సంకల్పంలో తిథివార నక్షత్రాలు వివరంగా లెక్కపెట్టుకొంటూ గ్రామస్థులడిగినప్పుడు చెప్తూంటారు. తిథులూ నక్షత్రాలు ఒకరోజున కలిసి పోతుంది, అధిక మాసాలూ సిద్ధాంతిగారి నడిగి లెక్క సవరించుకొంటూంటారు నూలిస్తే బట్టలు నేసే దేవాంగ కుటుంబ మొకటిక్కడ స్థిరపడింది. పత్తి గ్రామంలోనూ, పొరుగూర్లలోనూ, పండుతుంది కాబట్టి తెచ్చుకొని నూలు వడుక్కొనేందుకు కెవ్వరికీ బాధలేదు. చిట్కావైద్యమైతే పంతులే చేస్తాడు, అతనివల్ల నయంకాని వైతే ఘనవైద్యులామడ దూరం నుంచి రావలసిందే. పశు వైద్యానికీ చిట్కాలు పంతులే చూస్తాడు. కానీ బుడ్డ కొట్టడానికి బారికల్లో ఒకడు సాయం చేస్తాడు. అలాగే వైద్యుల మందులకు లోబడి మంగలి వ్రణ చికిత్సలు చేస్తాడు.

మిరియం, చెక్కా, మొగ్గ, జాజికాయ, జాపత్రి, కర్పూరం, నల్లపూసలు వంటి ద్రవ్యాలు బుక్కావాళ్ళో ఎవరో ఐదారునెలల కోసారివచ్చి అమ్ముతారు. పెద్దింటివారు కొని అవసరాలకు నిల్వ ఉంచుకొంటారు. కోమటైతే కొని గింజలకు,పత్తికి చిల్లరగా మార్పిడిస్తాడు. ఉప్పు అతనేతెస్తాడు. నవధాన్యాల్లో ఇక్కడ పండనవీ, బెల్లం, పటికబెల్లం, పచ్చికర్పూరం మొదలైనవి కూడా కోమటి ఇవ్వవసిందే. పశువులకు పిఠాపురం, ద్వారపూడి, ద్రాక్షారామవంటి సంతలకు పోవాలి. ఇంకా విలాస వస్తువులైతే, అద్దాలు, మంచాలు, అద్దాలకరైకులు, పూసలపేర్లు, రసంగుండ్లు, మంచిగంధంచెక్క, గంధంరాయి, రుబ్బురోళ్ళు, పొత్రాలు, రాగి, ఇత్తడి, కంచుపాత్రలు, రాచ్చిప్పలు వంటివి తీర్థాల్లో. పరషల్లో, పెద్దాపురంనుంచో కాండ్రేగుల నుంచో సంవత్సరానికోసారి తెచ్చుకోవాలి. గోదావరిపుష్కరాలకైతే, కొట్లు చాలావచ్చి, పాత్రలు మొదలైనవి చవకగా దొరుకుతాయి. వెంకన్నబాబుకు మొక్కుబడి చెల్లించడానికెళ్ళినప్పుడూ పాత్రలు,

ఇతర అపురూప వస్తువులూ కొనవచ్చు. ఇక్కడీ తీర్థాల్లో కంటే చవకే. పంతులపురూప మూలికలను కూడా తీర్థాల్లో కొంటాడు.

వరి, గంట్లూ, పెసలు, కందులు, సజ్జలు, చోళ్ళు, జొన్నలు, పత్తి, చెరుకు, నువ్వులు మొదలైన విక్కడ పండుతాయి, మినుములు, సెనగలు, అపరాలు చుట్టుపక్కలవాళ్ళు వేస్తారు. గోదుమలు కోమటి తేవలసిందే వరిఅన్నమో, సద్ద లేక చోళ్ళో ప్రధానహారం, ఆధర్వుకు అందరికి పప్పు ప్రధానం. తినేవారికి మేక, గొర్రె, కోడి, పంది, వేటపంది, బాతుమాసం, గుడ్లూ అప్పుడప్పుడూ, చేప లెప్పుడో ఒకప్పుడు. వర్షాకాలంలో కూరగాయలు సమృద్ధి. ఎండాకాలంలో పచ్చికూరలరుదు. ఒరుగులు, పచ్చళ్ళు ఇవే ఆధారం. నువ్వులాటకు పొరుగూరు గాండ్లవాడివద్దకు పోవాలి. కుండలకు, పిడతలకుకూడ పొరుగూరె. ఇటుకులూ, పెంకూలు మనుష్యులను పిలిపించుకొని ఊళ్ళోనే కాల్పించుకోవచ్చు, కమ్మరానికుళ్ళో కార్ఖానా ఉంది. బంగారప్పనికి పిఠాపురం, పెద్దాపురం, కోరంగి అయితేగియతే అబ్బో రాజమండ్రీ ఎన్ని కోసులో! ఇంకావలి ప్రపంచ మిక్కడివారికి లేనట్లే. పురాణ శ్రవణంలో వినేవే దేశాలు! ఛప్పనారుదేశాలు కాశీ, రామేశ్వరం, తిరుపతి, హిమాలయం, గంగ, సింధు, యమున, కావేరి, గయా, ప్రయాగ ఇవి ఏ కొద్దిమంది పుణ్య పురుషులో యాత్రలుచేసే తీర్థ క్షేత్రాలు, యాత్రచేసిన వారిదర్శనమైతే చాలు తరించినట్లే

పాడి ఉన్నవాళ్ళు దగ్గిరవాళ్ళతో పాలు పంచుకొంటారు. జున్నుపాలు ఆప్త లందరికీ ఇస్తారు. తిరిపెంమజ్జిగ అందరికి పోస్తారు. ఒక్కొక్కప్పుడు పాడి అందరికి వట్టిపోతే ఎవరికీఈపాలూ పెరుగు లుండవు. నెయ్యి కొన్ని కులాలవారు వాడుతారు. మిగిలింది పెద్దాపురానికో ఇంకో ఊరికో ఎరుగున్న పెద్దలకు పంపుతారు. లేదా అగ్రహారాలకు పంపుతారు. వారు నేతులతోయాగాలూ, హోమాలు చేస్తారు. అదీ అదనపు ఉత్పత్తికి పరమావధి(వినిమయాన్ని విస్తరింప జేయటం ఈ నాటికి మన మనుకోం. చవకగా పరాయిదేశాని కమ్ముతాం లేదా సంద్రంలో కల్పుతాం లేదా యుద్ధాల్లో తగలెట్టాం).

క్రమం తప్పక ఊరుదాటి వెళ్ళేవాడు  కోమటి. పనిపడితే వెళ్లొచ్చేవాడు పంతులు.  పురమాయిస్తే  వెళ్ళొచ్చేవాడు  బారిక. మిగిలినవాళ్ళు వీలునుబట్టి, సంవత్సరానికో, రెండేండ్లకో తీర్థాలకువెళ్తారు. వివాహది  సంబంధాలు దాదాపు ఉన్నఉళ్ళోనే, రక్తసంబందీకుల్తోనే. పదిమైళ్ళదాక వెళ్తే, అబ్బో దూరసంబంధమె ! బంధుమిత్రులు కలవడమూ, పరస్పర విషయాలుమాట్లాడుకోవడం పెళ్ళిళ్ళలోనే. మూణ్ణాళ్లైనా  ఎనిమిదినాళ్లైనా పదహరు  నాళ్లైనా. ఉన్నవాళ్లొక రిద్దరివి  ఇటుకలతో కట్టిన  పెంకుటిళ్ళు.  మిగిలిన  అందరివీ తాటాకు కప్పిన మట్టి ఇళ్ళే.

కాపుదనం ఉన్న మఠంవాళ్ళు సంచారం చేస్తూ ఏటేటా  తలకింతని తమ కాపులవద్ద  పన్నులు వసూలు చేస్తారు. మామూలుగా  అది  నగదు రూపంలో ఉంటుంది.  రాజుగారికి పోవలసిన భాగం మునసబు మాసూలప్పుడే వసూలు చేస్తాడు.  ఈ మహసూల్లోనే  కమ్మరి, కుమ్మరి, కంసలి, చాకలి, మంగలి, నౌకరు, మొదలైన సేవా వృత్తుల  వారికి ఏటికేడు  జరగవలసిన మేరగింజలు చెల్లిస్తారు.

పనుల కాలంలో  ఉదయం మూడు నాల్గు గంటల  మొదలు రాత్రి పొద్దు పొయిందాక ఒకటే రెక్కల కష్టం. ఆడామగా, పిల్లా పీచూ, ముసలీ ముతకా అందరిదీ ఒకటే బండబతుకు.

గ్రామ మేర్పడుతున్న  ముందురోజుల్లో బాగా  కలిసి  మెలిసి పని చేయవలసిన అవసర ముంటుంది. చెట్లు కొట్టడం, మొదళ్ళు తవ్వడం, బండ రాళ్ళెత్తి అవతల పారెయ్యడం, చెరువు కట్ట నిర్మాణం, కాలువలు, బోదెలు తవ్వడం ఇలాంటి వాటికి పరస్పర సహాయ  సహకారాలతో  అందరూ  ఒకే జట్టుగా  పని చేయడం కావాలి,  ఇవన్నీ ముగిసి తెరిపిచ్చాక  కలిసి కట్టుదనపు  అవసరం తగ్గుతుంది. కట్ట తెగటం, తుఫాను, మహమ్మారి ఇటువంటి తరుణాల్లో  తప్ప ఎవరి లోకం వాళ్ళది. ఎవరి  కడుపుతీపి వాళ్ళది. దాన్ని  పెంపొందించుకోవాలి. విస్తరింప జేసుకోవాలి. అక్కడే పరస్పరం పోటీకి బీజం.

“ఎలెక్షన్లు లేవుగా. పోటీకి”  ఒక విద్యార్థి పుల్ల వేశాడు.

"మన గ్రామాలు చాల ఐక్యంగా ఉండేవని, గ్రామ జీవితం పవిత్రంగా సుందరంగా ఉండేదని, దాన్ని పునరుద్ధరించాలనీ అంటారు కదా! ఇతను చెప్పేదెలా నిజం?" మరొక విద్యార్థి పృచ్ఛ.

"Back to Village" అన్నాడు, గాంధీమహాత్ముడు." పలికాడింకొకడు, సందర్భ శుద్ధిలేని కొటేషన్.

"సామ్రాజ్యాల కాలంలో పోటీ ఏం కర్మ ! వన్య న్యాయమే ఏల్తూంటేను!" బృంద నాయకుడు కల్గించు కొన్నాడు.

"లెక్చర్ వద్దు ! లెక్చర్"

పడవవాడు తన సందేహ నివృత్తి కోసమో అన్నట్లుగా ఆగాడు. కొంతసేపు నిశ్శబ్దం.

రాముడు బృంద నాయకుణ్ణి సమాధానం కోరుతున్నట్లుగా చూశాడు. పడవవాడు నేను చెప్ప లేనివి నీవైనా చెప్పకపోతే వెలితిపూడేదెలా అన్నట్లుగా కథ ఆపాడు. బృంద నాయకునికి తప్పలేదు.

"గ్రామజీవితం ప్రశాంత మంటారు గానీ అందులో పోటీల కెప్పుడూ తీవ్రమైన అవకాశాలుండనే ఉన్నాయి. పోటీ లేనిదే వృద్ధి లేదు. నిజమె. కానీ పోటీలయోగ్య విషయాల్లో అయితే చాల అనాహుతం జరుగుతుంది. వన్య న్యాయంలో ఎవడేమాత్రం పచ్చగా కన్పడినా వెంటనే బలవంతు డెవడో స్వాహాచేస్తాడు. పైనుండి క్రింది దాకా అదే సూత్రం. పంట బాగా పండినట్లు తెలిసిందా కులపెద్దలు గ్రామణీ కలిసి రాజ్య భాగం పెంచి ఎక్కువ వసూలు చేస్తారు. ఇవ్వకపోతే మరుసటేడే ఏదో మిషమీద భూమిని మరొకరికి మారుస్తారు. భూమంతా గ్రామాని కుమ్మడికదా!. పంచాయితీవారు, కుల పెద్దలు పచ్చగా కన్పించారా సామంతుడు గ్రామం ఉమ్మడి పేష్కష్ పెంచుతాడు. ఇవ్వ నిరాకరించారా కొల్ల గొట్టించి పకీరులను చేస్తాడు. సామంతు పచ్చగా కన్పించాడా దివాణం వారు కప్పం పెంచుతారు. బహుమతులడగడమూ పెంచుతారు. కాదంటే మరో సామంతుణ్ణి నియమిస్తారు. రాజు పచ్చగా కన్పించాడా షల్లస్కరు డాపనే

చేస్తాడు. షల్లస్కరునిపై మండలాధిపతి, అతనిపై గోల్కొండ లేక నైజాం నవాబు అతానిపై ఢిల్లీవారు ఇలాగే ప్రవర్తించేవారు. అంతేకాదు పై నుండి క్రిందికే గాక ఇరుగు పొరుగు సంబంధాలు అలాగే నడిచేవి, కుటుంబాలైనా రాజ్యాలైనా. ఎవడూ బలవంతుడు కాకూడదు. ఎవడూ సంపన్నుడు కాకూడదు, అయితే వాణ్ణి తగ్గించే వరకు దించే వరకు మిగిలిన వారందరు ఐకమత్యం చూపుతారు. అంతే వాడు దిగుతూనే తిరిగి ఎవరికి వారె.

"ఔనయ్యా మనవల్ల ఎదిగేందుకు చేత కానప్పుడు మరొకణ్ణి ఎదగనివ్వక పోవడమైనా చేతకాకపోతే ఇంక బతికేదెలా?"

"ఇది నీ నీతి, జయప్రదంగా ఎన్ని శతాబ్దాలు అమలు జరిగిందో కాని ఈ సూత్రం మన కథాకాలంలో గొప్ప ట్రాజెడీకి దారి తీసింది."

"నిజమె! బలవంతు లొకరితో ఒకరు పోరుతూ అందరూ నిర్వీర్యులైనప్పుడు ఒకొక్కరిని మందనుంచి విడిపోయిన జంతువులను పట్టేసినట్లు మెడ పట్టేశారు."

"మహరాష్ట్రులు, నైజాం, బంగాళం, మైసూరు అన్నీ ఒకటొక్కటీ పడిపోయాయి రాను రాను."

"వీళ్ళందరిలోనూ చిట్ట చివర ఈశతాబ్ధం చివరి వరకూ ఇంగ్లీషు వాళ్ళను బాగా చికాకు పెట్టి స్వాతంత్ర్యం నిల్పుకో జూచినవాడు మైసూరు టిప్పూసుల్తాను."

"సిటిజన్ టిప్పూ!" సవరించాడు ఫ్రెంచి విప్లవాభిమాని. "నెపోలియనే గన్క సమయానికి సాయంచేసి ఉంటేనా?"

"నీవు ఫ్రెంచి వాళ్ళ బానిసగా ఉందువు" ఒక విద్యార్థి రిపార్టీ బృందనాయకుడందు కొన్నాడు " పండిందాంట్లో మూడింట రెండు వంతుల్లో సగమో, మూడవ వంతో లేక ఖర్చైంది పోను మిగులులో ఆ నిష్పత్తో ఖచ్చితంగా తెలీదు కానీ, ఎంతైనా , మొత్తంమీద, గ్రామాల్లో కనీసపు అవసరాలకు మించి స్వర్ణ యుగాల కాలాల్లోకూడా గింజైనా మిగిల్చేవారు కారు. దుష్టపుటుక్కు

పాదాలకింది కాలాలైతే తిండికే కరువు. ఇలా ఏమీ మిగల్చకుండా అంతా పైకి తీసుక వెళ్ళిన మిగులుతో యావత్తు సమాజపు కల్యాణాని కెంతో కొంతైనా ప్రయోజకత్వం వహించారా అంటే అదీ కన్పడదు. గొప్ప కట్టడాల మీద ఖర్చే కన్పడుతుంది, అదీ  అవసరమే నాటికి. యుద్ధాల్లో వినియోగించిందానికంటే Surplus artisans ను ఇలా వినిమోగించడం  కొంత నయమే కావచ్చు.  కానీ, అప్పటి అవసరాలకు చాలదు."

ఒక విద్యార్థి వాదంతో అడ్డు వచ్చాడు:  "జయపురం మహరాజు లేడా? ఆయన గణిత శాస్త్రంలో, జ్యోతి శ్యాస్త్రంలో చేసింది తక్కువా ? పోర్చుగల్‌కు ఆ శాస్త్ర నిష్ణాతుల నానాడే పంపాడే!"

"వాళ్ళు తిరిగి వచ్చి ఉండరు! అక్కడే settle అయిపోయుంటారు." అందరూ నవ్వారు.

"నా రాజా!  అదొక exception అంటాను not a phenomenon

"మరి ఆ మిగులు మొత్తమేమైందంటావు??"

"నాదిర్షా, అబ్దాలీలు పట్టుక పోయారు.  అదికాపాడుకోలేక చచ్చు వాళ్ళమై పోయాము" మరొక విద్యార్థి క్విజ్‌కు సమాధానం చెప్పినంత ఉత్సాహంగా చెప్పాడు,

"ఇలా  బతుకంతా కనీస అవసరాల డెడ్‌లైన్‌కు దిగువనే  ఉండేదా కాలం జీవనం, దాదాపు పశువుల స్థాయిలో, దుర్భరం, కఠోరం, వీటికితోడు Virgin lands, forest , కు  తప్పించుక  పారీపోయే  అవకాశముండేదేమో అలా  జరక్కుండా కర్కశమైన  కట్టడులతో మనుష్యులను  గ్రామానికి బంధించి ఉంచేవారు. సాంఘిక కట్టుబాట్లే కాక  మానసికంగా కూడా అజ్ఞానంలో ఉంచి బంధించేవారు,  నిజానికి  మనోవ్యాపారమూ  మానసిక  శ్రమా చేయవలసిన వర్గాలు  మేధావి వర్గాలు జ్ఞానాభి వృద్ధికి,  వ్యాప్తికి,  దోహదం చేయడం పోయి అజ్ఞానానికి పట్టం  గట్టారు,  గ్రామాలెంత  అజ్ఞానంలో ఉంటే  అంత లాభమనుకొన్నారేమో తెలియదు, గ్రామాల్లో పెద్దలూ దీనికే దోహదం చేశారు,

కట్టడి పేరున, అడుగున అసంఖ్యాకులనూ, పైన శిఖరం బొమ్మల్నీ కూడా అస్పృశ్యులుగా ఉంచి, మధ్యన వ్యవసాయం మీద పెత్తనమున్నవారు రంజుగా పరిపాలననుభవించారు.

దీనివల్ల ఏం జరిగిందంటే వాళ్ళ ఆలోచనా పరిధి చాలా చిన్నదైపోయింది."

"అదినే నొప్పుకొన్నానోయి. చాల చాల చిన్నది!"

"నేల బాగుచేయడం మొదలు తిండి తినేవరకు life processమొత్తం కంటి కగుపడూతూందన్న మూర్ఖ సర్వజ్ఞత్వపు illusion లో పడ్డారు. క్వచిత్తుగా వచ్చే ప్రళయాలకు సరియైన కారణం వెతికేందుకు కారంభించడం కూడా వారి స్థాయికి చాలదూరముండె, కన్పడుతున్న విషయాల్లో నైనా కార్యకారణ భావం పెంపొందించుకో లేదు."

"పెద్ద విషయాలు చాలా చాలా దూరం"

"భక్తా! మీగురువును చెప్పనీ!నీ తాళం పనిలేదు"

"అందుచేత తెలియరానిశక్తి ఏదో యావత్తు బ్రతుకు నడకను శాసిస్తూందని నమ్మి కూర్చొనడాని కనువుగా మాత్రమే వారి తెలివి తేటలుండె. ఏ విత్తనం వేయాలో ఎన్నుకోవడం మొదలు, పంట చీడకు గురి కాకుండా పుష్కలంగా పండించి సుష్టుగా అనుభవించే వరకూ అన్నీ దేవకార్యాలే. అడుగడుగునా దైవసహాయానికై అర్రులు సాచడమె. బ్రతుకెంత కఠోరమో వారి ఆ పూజా పునస్కారాల్లో ప్రతిఫలించేది."

"అదాసంగతి! మిగిలిన వెలా ఉన్నా దీనికి నే నొప్పుకున్నానోయి. అబ్బ! చిన్నప్పుడు ఒకసారి గరగల వ్యవహారం చూశాను. బలిహరణం, సిదీబలులూ ఇవన్నీ క్రూరమైన ఆచారాలు, పోవాలనే వాడు మానాన్న. ఒక పళ్ళెంలో బలి రక్తంతో నిండా తడిపి నవధాన్యాల గింజలుంచేవారు పళ్ళె మూరేగించి అమ్మోరి గర్భ గుడిలో పెట్టి తలుపులు బిడాయించేవారు. తరువాత ఆ పళ్ళెంలో ఏ గింజ

బాగా మొలకెత్తి ఉంటే అదే నాటే వారట. ఇంక Sports లో కోళ్ళ పందెమూ ఆకాటగరీ కిందికే వస్తుందనేవారు, మానాన్న."

"ఇక శాక్తేయుల్లో వామాచారాల్లో వాటి కఠోరాన్నీ బీభత్సాన్నీ ప్రత్యేకంగా పేర్కొన పనేలేదు" – మరొక విద్యార్థి.

బృందనాయకు డెత్తుకున్నాడు. "నిజానికి leisured classes దూర దృష్టి కలవారైతే మరో సమాజాన్ని సృష్టించి దీన్ని పరిష్కరించలేకపోయినా కనీసం దీని వాడిని పోగొట్టి ఉందురు. ఆ ప్రయత్నమూ మన సీమలో నాటికి కన్పించదు. ఇది చివరికెలా పరిణమించిందో చరిత్ర మనకు చూపింది. "గుర్రం ధర ఎక్కువ, దాణాకు ఖరీ దెక్కువౌతుంది. పైగా అది ఒక్కొక్కప్పుడు చెప్పినట్లు వినక పోవచ్చు. దానంతే నడుచుకొని ఉపయోగించు కోవాలి" అని లెక్కలువేసి గుర్రానికి మారుగా గాడిద నెన్నుకొనేవాడు తన శక్తి సామర్థ్యాలను కూడా కుంచింప చేసుకొంటాడు. సామాన్య జీవనంలో ఇలా జరిగితే నవ్వుతాం. కానీ పరిపాలకులు చరిత్రలో ఈ సూత్రాన్నవలంబించి నశించిన ఘట్టాలెన్నో ఉన్నాయి."

"జీవితంలో కట్టడులు పెట్టినందుకు నీ విలా అంటున్నావు. ఎన్నో వేల ఏండ్లు మన దేశ సంస్కృతి వీటివల్లనే అవిచ్ఛినంగా నిలబడింది"

"జీవితానికి కట్టడి, క్రమశిక్షణ, చాల అవసరమె. కాని వాటి మంచి చెడులు వాటి ధ్యేయంపై ఆధారపడి ఉంటుంది. ధ్యేయం మంచి దైతే కట్టడి క్రమశిక్షణ యివి జీవనాని కొక సక్రమ నిరాటంక మార్గం చూపి ప్రయోజన కరంగా ప్రవహింపజేసే గట్లౌతాయి.ధ్యేయం సరియైనది కాక పోతే దీపకాంతిని నల్ల కాగితంతో చుట్టినట్లౌతుంది. ఏ కట్టడి క్రమశిక్షణా లేకపోతే అది అవ్యవస్థ. ధ్యేయం మంచిదికాని కట్టడులు తీవ్రంగా అమలు జరిగితే అది దుర్వ్యవస్థ. ధ్యేయం మంచిదైన కట్టడులు, క్రమశిక్షణ, చండశాసనం లేకుండా జనుల ఇష్టా పూర్తిగా అమలు జరిగితే, అదిసువ్యవస్థ.

"అన్ని శక్తుల్లోనూ బలీయమైన మానుషశక్తి మన గ్రామాల్లో, నాటికి పూర్తిగా తుప్పు పట్టించి ఉంచారంటావు. వ్యవసాయం మీద పెత్తనమున్న వారూ ఆపై Lierarchy వారూ?"

"రంగన్నా మంజరీ ఇద్దరూ కొత్తపాడులో ప్రవాస మేర్పరుచుకొన్న కొన్నాళ్లకే వారికి మొహంమొత్తింది. మొదట్లో గ్రామమెంతో ప్రశాంతంగా కన్పించింది, కానీ, క్రమంగా అందులో లొసుగులు తెలుస్తూ వచ్చాయి. సముద్రం చేపలు మంచినీళ్ళలో పడినట్టైంది వారికి కొన్నాళ్లకే

ఇద్దరూ కొంతకాలం లోనే తమ ఉదాత్తప్రవర్తనవల్ల గ్రామంలో గౌరవమూ, అభిమానమూ సంపాదించారు.

అక్కడొక పెద్ద కుటుంబంలో చాలకాలంగా ఆడంగుల వల్ల కలతలు బయలుదేరి అన్నదమ్ములమధ్య కీచులాట మొదలైంది. ఆ కీచులాట క్రమంగా కాట్లాటై,కాట్లాట కొట్లాటై ,కొట్లాట పోరాటమై, పోరాటం యుద్ధంగా పరిణమించనున్న తరుణంలో ఎవరి మాటలు వారికి చెప్పి మాన్పించారు. మంజరి ఆడంగులవైపు నుండి నరుక్కొని వస్తే, రంగన్న ఇటువైపునుంచి నరుక్కొని వచ్చాడు.

మరొకచోట నీటికడ తగవు వచ్చింది. ఎగువ పొలాల వారికీ దిగువ పొలాల వారికి. కర్రలు కతారులు వేసుకొని ఒక చిన్న రణరంగం సృష్టించడానికి తయారయ్యారు. దాన్ని మనవారాపారు.

మరొకసారి ఇద్దరు తోబుట్టువులు జానెడు (జానెడంటే జానెడే సుమీ!) భూమి పీలిక కోసం పొడుచుకోవడానికి సిద్ధపడగా రంగన్న వారిని శాంతింప జేశాడు.

ఇంకో ఇంట్లో అత్తమామలపోరు మొగుడి పోరు భరించలేక ఒక అబల ఆత్మహత్యా ప్రయత్నంలో ఉండగా మంజరి ఆ కాపురాన్ని తీర్చిదిద్దింది. పశువులు పొలాల్లో మేస్తే వచ్చే తగవులు రోజూ ఉండేవి

ఎవరైనా వైద్యం మాని పూజ పునస్కారాలతోటీ మొక్కులతోటిసరి చేస్తూంటే డబ్బు సాయంచేసి వైద్యులవద్దకు పంపడమో, వైద్యులను రప్పించడమో చేసేవారు.

ధిక్కరించలేని చండశాసనాని కలవాటు పడ్డారేమో గ్రామల్లో కృత్రిమ ప్రవర్తన మెండు. లోపల అసూయ బయట ప్రీతి. బయట జాలీలోపల క్రౌర్యం లోపల పిరికి బయట హీరో, బయట ఉదారం లోపల స్వార్థం. నిత్య కృత్యాలతో సంబంధంలేని విజ్ఞానం. కర్మలో కౌశలం లేని బండతనం. ఇలా ఎంతైనా వివరించవచ్చును. వీటి కలవాటు పడినవారు కానందున మన వారక్కడ జీవితంలో ఒంటరితన మనుభవించే వారు.

గ్రామీణ ప్రశాంతత మురుగునీటి నిశ్చలత్వం లాంటిదనీ, ఏ మాత్రం కదిలించినా ఛీఛీ! కంపు అని వారికర్థమైంది. ఎప్పుడు పరిస్థితులనుకూలిస్తాయా ఎప్పుడు స్వస్థలం చేరుకొందామా అని వారెదురు చూస్తున్నారు. కట్టడులంత తీవ్రంగా అమలుజరుగని రేవుల వాసంతో పోలిస్తే వారికిది ఇరుకు మురికి సందులో పారాడినట్లుంది.

కానీ వస్తున్నవార్త లేమాత్రమూ ఆశాజనకంగాలేవు. వారాలు, నెలలు, నిరీక్షణలో గడుస్తున్నాయి.

## XII

మంజరి ఇంటి యజమాని విధవరాలికొక ప్రియుడుండేవాడు. అతనికి మంజరి సొమ్ముమీద కన్నుపడింది. ముందు మంజరిని వలలో వేసుకొనే ప్రయత్నం చేసినాడు కానీ మంజరి అతనికి లొంగలేదు. అతడామెనెలా సాధించాలా అన్న ప్రయత్నం మొదలెట్టాడు. మొత్త మాస్తి కాజేయాలంటే ఆమెనే రాజద్రోహ వ్యవహారంలోనైనా ఇరికించాలి. లేదా విదేశీయులచేత చంపించాలి. విదేశీయులైతే వారేంచేసినా మన న్యాయం చట్టం క్రిందకి రాదుగనక, మనవాళ్ళేం చేయలేరు. చచ్చిందీ దేశంవాళ్ళు కనక, వాళ్లవాళ్లూ పట్టించుకోరు. లేదా గుట్టు చప్పుడుకాకుండా సహజ మరణమని జనమనుకొనేలా మాయోపాయంతో ఆమెను చంపాలి. ఈ అభిప్రాయానికొచ్చి అతను మంజరీ రంగన్నలను గూర్చి ఆరాతీశాడు. ఫ్రెంచివారికి

వీరు వ్యతిరేకులన్న విషయం కష్టంలేకుండానే తెలిసింది. యానాంలో వీరి గతచరిత్రా తెలిసింది. పిఠాపురంలోగాని, పెద్దాపురంలోగాని, దివాణం వారి నెవరినైనా పట్టుకొని వీళ్ళిద్దరినీ కారాగారంలో పడవేయిస్తే మిగిలిన విషయాలకు నెమ్మదిగా చూసుకోవచ్చని కుట్ర ఆలోచించాడు. తిరుగులేని ఫ్రెంచి వాళ్ళకత్తి కెదురు నిల్చిన వాళ్లను హతమార్చడ మెంతలోపని అనుకొన్నాడు. గ్రామంలో వీరికి గల పలుకుబడివల్ల కల్గిన జడుపే అతన్ని వెనుకకు లాగుతూంది. సమయంకోసం అతను పొంచున్నాడు.

ఇలా ఉండగా ఒకరోజున మాథ్యూస్ విశాఖపట్నంనుంచి రాజమండ్రి పోతూ కొత్తపాడులో ఆగాడు. అతని వెంట ఆండ్రూస్ ఇంజరాన్ని ఫ్రెంచివారాక్రమించు కొన్నాక మాథ్యూస్ కొన్నాళ్ళు వారికి బందీగా ఉన్నాడు. తరువాతతన్ని పుదుచ్చేరిలో ఖైదీగా ఉంచారు. సమయం చూసి అవకాశం దొరకగానే ఖైదునుంచి తప్పించుకొని మద్రాసు మచిలీపట్నాల మీదుగా విశాఖపట్నం చేరుకొన్నాడు. విశాఖపట్నం ఫాక్టరీవారాతన్నొక ముఖ్యమైన పని మీద పంపారు.

కొనేళ్ళక్రితమే ఫ్రెంచివారి ఆసరాపొంది వాళ్లకు నమ్మినబంటులా ఉన్న విజయనగర సంస్థానాధిపతి. కొన్నాళ్లైతూనే, వారి చండశాసనానికి ఫ్రెంచివారిని గోదావరి, నాగావళి మధ్యనున్న మండలంలో లేకుండా చేయాలని ప్రయత్నిస్తున్నాడు. అతను సంస్థానాధిపతులను ఫ్రెంచివారి పన్నులు కప్పాలు ఎగవేయమని ప్రోత్సహిస్తున్నాడు. పన్నులు వారికి చెల్లించవద్దనీ, ఫ్రెంచివారికి చెల్లించింది చెల్లదనీ, తిరిగి తమకు చెల్లించవలసి ఉంటుందని. ఇంగ్లీషువారి దిప్పుడు చాల పైచేయిగా ఉందనీ, వారు తనకండ అనీ అందరికి సందేశం పంపుతున్నారు. ఆసందేశం మోసుకొస్తున్న క్షత్రియ వీరుని మాథ్యూసూ, ఆండ్రూసూ అనుసరిస్తున్నారు. వారు క్షత్రియ వీరునికి రక్షణ కల్పించే నెపంమీద అనుసరిస్తున్నా,

అసలుకారణం అతని మీద ఒక కన్నుంచేందుకు. ఇంగ్లీషువారి సాయం మాటకు రుజు విచ్చేందుకు,

వీరిరాకను పురస్కరించుకొని ఆరోజుకొత్తపాడుగ్రామపెద్దల బహిరంగ సమావేశం ఏర్పాటైంది. ముఖ్యంగా చర్చించవలసినవి రెండంశాలు. మెదటిది గ్రామపన్ను ఇరసాలుకు సంబంధించినది. రెండవది గ్రామంనుంచి పారిపోతూ పట్టుబడ్డ నేతపనివారి కుటుంబంగురించి.

మొదటిది తీవ్రమైన చర్చనీయాంశమై ఎటూ తేల్చుకోలేని సమస్యగా ఉంది. రెండవది తీవ్రంగా శిక్షించ వలసిన సమస్యగా ఉంది. చిన్నపామునైనా పెద్దకర్రతో కొట్టాలన్న నీతి నీ విషయంలో అనుసరించాలని పెద్దలు భావిస్తున్నారు. చేతివృత్తులవాళ్ళు, పనివాళ్ళు పారిపోయి రేవులు చేరుకోవడ మన్నది చాల గ్రామాల్లో జరుగుతున్నదే. ఈ జాడ్యం తమ గ్రామంలో ప్రవేశించింది. దీన్ని మొక్కలోనే తుంచివేయాలి, అందుచేత ఇతరులు దీనికి పాల్పడకుండా భీతిగొల్పే భయానకరమైన శిక్ష విధించకపోతే వీల్లేదు. ధర్మశాస్త్రంలో ఏంచెప్పి ఉన్నాసరె. అందుచేత అందరితోనూ ఒకసారి ఔననిపించుకొని తమ నిర్ణయ మమలు జరపాలని పెద్దల ఆశయం.

ఈ విషయాలందరికీ ఆసక్తి గొల్పేవిగా ఉన్నందున ఆయా కుల పెద్దలేకాక గ్రామస్థు లందరూ గుమికూడినారు. మంజరీ రంగన్నలు కులపెద్దలు కాకపోయినా ఆయాపెద్దల వద్ద కూర్చొన్నారు. గ్రామాధికారులు, పంతులు కోమటి, రైతుపెద్దలు, కాలవ పెద్దలు, బలిజ పెద్దలు అన్ని కులాల పెద్దలు అందరూ యథాస్థానాల్లో కూర్చున్నారు.

అందరిలోను పెద్ద, గ్రామపెద్ద, చర్చ మొదలెట్టాడు. “ఇరసాలు చెల్లించమని దివాణంనుంచి హుకుం అయినది. మనకా రెండేండ్లుగా సరియైన పంటలులేవు. ఈసారిపంట బాగానే ఉంది. కానీ కోతలవకుండానే పన్నులు

డబ్బురూపంలో ముందే లెక్కగట్టి చెల్లించాలని హుకుం, మాసూలులో రాజభాగం మాత్రం కాక యుద్ధానికి ఖర్చుల క్రింద ఉమ్మడిగా కొంత సొమ్మదనంగా ఇవ్వాలని కూడ కబురు. ఇదంతా తడిపి మోపెడౌతుంది. ఇచ్చుకోలేం. ఇలాఅయితే, ఏదైనా అడవులదారి పట్టిపోవలసిందే, అన్నాము. అయినా వారు వినక, చాల ఒత్తిడి చేస్తున్నారు. ఇదిలా ఉండగా ఇప్పుడసలు మీ దివాణాలకు కాదు తిన్నగా విజయనగరమే పంపాలని మరియొక కబురు. ఏం చెయ్యాలో దిక్కు తోచడంలేదు. అందరూ ఎల్లాగంటే అల్లాగ."

సభలో కొంతసేపు మౌనం. ఇవి కొద్దిరోజులుగా అందరూ మథనపడుతున్నవే. అందరి జీవితాలకు సంబంధించినదే. ఏ చర్య తీసుకొంటే ఏ ప్రభావం తమ బ్రతుకుపై ఉంటుందో అందరికీ ఎరుకే. జరిగేది పెద్దల ఇష్టప్రకారమేననీ, దాన్ని, వ్యతిరేకించినవారు క్రూరమైన నిష్ఠురాన్నెదుర్కోవడం తప్పించి వేరే ప్రయోజనం లేదనీ అందరికీ తెలుసు. అయినా ఇదొక తంతు.

పన్నులుమొత్తం విజయనగరం సంస్థానాధిపతుల కిద్దామని పెద్దల్లో మైనార్టీ అభిప్రాయం. మెజార్టీవారికి పెద్దాపురంవారిద్వారా ఫ్రెంచివారికిద్దామని ఉంది, వీళ్ళు పూర్వపుకాలపువాళ్లు. పిఠాపురం పెద్దాపురం వారి మధ్య చేతులుమారుతూ వారిఉప్పు తింటున్నాంకదా అంటారు. పైగా ఈ సంస్థానాలవారు నెత్తిమీద ప్రత్యక్షంగాఉన్నవారు, వారితో సౌమ్యంగా ఉండాలంటారు మెజార్టీపెద్దలు. మైనార్టీవారు ఇంగ్లీషువారు భూమిపైరైతుల ఆస్తి హక్కును వెనుకేసుకొస్తున్నారు. ఇప్పుడు రైతులు వ్యవసాయ విషయాలన్నిటిలోనూ గ్రామపుటుమ్మడి నిర్ణయాలకు కట్టుబడి ఉండవలసివస్తూంది, ఒక్కొక్కసారది వారి స్వేచ్ఛను తీవ్రంగాభంగపరుస్తూంది. విత్తనాలువేయడంలోకానీ, పొలాల సాగులోకానీ, విస్తీర్ణాల నిర్ణయాల్లోగానీ, ఈ ఉమ్మడిపెత్తనంవల్ల ప్రతిబంధకం కల్గుతూంది. ఇంగ్లీషువాళ్ళ దేశంలో రైతులు పెద్దఎత్తున బహువిశాలమైన విస్తీర్ణాల్లో

వ్యవసాయం, గొర్రెల పెంపకం చేస్తున్నారట. ఆంగ్రూస్ వర్ణిస్తూంటే వినలేదూ ?బెంగాల్‌లో తాముదివానీ పుచ్చుకొన్నచోట్ల ఇంగ్లాండులోలాగే పెద్దవిస్తీర్ణాల్లో తాలూకాలు తాలూకాలే – దీర్ఘకాలం సేద్యాని కాస్కారమిస్తూ స్వేచ్ఛ కల్పిస్తున్నారనీ ఆంగ్రూస్ చెప్పాడు. మొగల్ చక్రవర్తిలా, పంచాయితీల్లా, కాకుండా దీర్ఘకాలపరిమితుల కొప్పందమిస్తున్నారని (ముప్పై ఏళ్ళవరకు) ఇవ్వనున్నారనికూడా ఆంగ్రూస్‌చెప్పినాడు. అతనివాదనలే గ్రామ పెద్దల్లో చీలికలు తెచ్చింది. అతను కావాలనికూడా కొంత గండినిపెంచాడు. అందుచేత ఇంగ్లీషువాళ్ళకిక్కడా దివానీవస్తే తమపరిస్థితి మెరుగౌతుందని ఆశకల్గుతూంది. వ్యవసాయంలో తమ స్వేచ్ఛ ఎక్కువవ్వాలి. అందువల్లవాళ్లు ఇంగ్లీషు దివానీ అయితే బాగుండు ననుకొంటున్నారు. అందుకని విజయనగరం వారికి పన్నులు చెల్లిద్దామను కొంటున్నారు.

కోమటి ఆలోచనలూ ఇంగ్లీషువారివైపే ఉన్నాయి. దేశీయులతో కన్న ఇతరవిదేశీయలతోకన్న వారితో వర్తకమెక్కువలాభసాటిఅని అతని ఊహ వర్తకానికేకాక వారి రాజ్యంలో వడ్డీవ్యాపారానికి మరీ ఎక్కువఆస్కారముంటుందని విన్నాడు. ఇప్పుడెక్కువగా వడ్డీకి తీసుకొనేవారు వర్తకులూ రాజులూ మాత్రం. వారికి నష్టంవచ్చినా, వారికి తిరిగి చెల్లింపిష్టంకాకపోయినా తమ సొమ్ముయావత్తు గంగపాలే. సామాన్యుడికి తామిచ్చే అప్పుతక్కువ. కరువులువచ్చినా కట్టలుతెగినా వాటిగతిఅంతే. ఇంగ్లీషువారి దివానీలో వడ్డీ వ్యాపారపు హెూదాయే ఎటువంటి నికృష్ట స్థితిలోనైనా పన్నులు వసూలు చేయకుండా ఇంగ్లీషువా రూరుకోరు. మాఫీచేసుకోరు. బాకీదార్లకప్పిప్పించి ఆ అప్పుపన్ను క్రింద తీసుకొంటారు. తరువాత తాను ఆ అప్పుమంచికాలంలో వసూలుచేసుకోవాలి. లేదా అతనిఆస్తి తమకుదఖలు. ఇప్పుడు వడ్డీవ్యాపారి అప్పిచ్చి అందరికీలోకువ. ఇంగ్లీషువాళ్ళక్రిందైతే అప్పిచ్చి రాజా. వాళ్లువస్తే పెద్దనిర్మాణాలకు. యుద్ధాలకు, వ్యాపారానికీ, కష్టపురోజుల్లో వ్యవసాయానికీమాత్రంకాక పన్నుకుకూడ అప్పుఅవసరమౌతుంది. బాకీ తీర్చని రైతు విషయంలో ఆంగ్రూస్ చెప్పింది నిజమైతే దాన్నొప్పుకొనే మరొక రైతుకు

ఆభూమినమర్చవచ్చు. వారుచెల్లించకపోతే మరొక్కడికి ఇలా అనంతం ఆ అమర్చేహక్కు తనకుదఖలుపడుతుంది. ఇదేదో చాలా వింతగాఉన్నా, బహులాభసాటిగా కన్పడుతూంది. ఎదుటివాడు అప్పు కట్టలేకుండా ఎంత హీనస్థితిలోఉన్నా తనఅప్పు చెక్కుచెదరకుండా ఉంటుంది. అది వడ్డిరూపంలో చేటపెయ్యను చూసిచేపే గోవులా పాలిస్తూంటూంది. ఆంఁద్రూస్ ఈ విషయంలో ఇంగ్లండులోజరిగే చాలా విడ్డూరాలుచెప్పాడు. ఇంగ్లీషువాళ్లైతే బాగుంటుంది. ఈ వాదనలు పైకి చెప్పకుండానే ఇంగ్లీషు వారివైపుమొగ్గుసూచించారు కొందరుపెద్దలు. అలావారు నెమ్మదిగా సూచించడం మినహా వారు చేయ గల్గిందిలేదు.

రంగన్న మంజరీ వీరిద్దరివాదనవేరు. పేష్కష్నిల్వలతోగ్రామంలో చిన్నసైనికబృందాన్ని పోషించుకొని రక్షణకేర్పాటు చేసుకోవాలని, క్రమంగా ఇక్కడాఒకకోట ఏర్పాటుచేసుకోవచ్చునీ, అన్నారు కోరంగితో చక్కని వాణిజ్యంచేయిస్తూ, బలంపుంజుకొని కోట సంపన్నంగాఉండొచ్చనికూడ అన్నారు.

ఈ వాదనకు పెద్దలు "శివశివా"అని చెవులుమూసుకొన్నారు. ఇది దివాణం వారికెంతకోపం తెప్పించేమాటో! ఈ మాటపుట్టినట్టు చూచాయగా తెలిస్తేచాలు, గ్రామానికెంత ప్రమాదం ! వచ్చి నేలమట్టం చేయరూ ?

ఇక ఇతరకులాలవారిపెద్దల మొగ్గూ ఇంగ్లీషువారివైపేఉన్నది వారు కొత్తకనక. పాతవారురోతకనక. కానీపై కిమాత్రం "మీరెలానిర్ణయించినా మంచిదే. ఇంగ్లీషువారైనా, విజయనగరంవారైనా. ఫ్రెంచివారైనా పిఠాపురంవారైనా డచ్చివారైనా ఎవరైనా మాకొకటేకదా ! మాచోళ్లుమేం విసురుకోవాలి. మావడ్లుమేం దంపుకోవాలి. మా అంబలిమేం కాచుకొని తాగాలి. మాకు రాముడై నాఒకటే ! రావణుడైనాఒకటే ! మాపాట్లు మాకుతప్పవు మామూలే !"అన్నారు.

రంగన్న తమవారికి చెప్పిచూచాడు. ఈ నిర్లిప్తత పనికిరాదనీ మరీ నిర్లిప్తంగాఉంటే పైవారిఆలోచనల్లో మనమొకరకమున్నామన్న విషయమే మరుస్తారనీ చెప్పాడు. ఆంఁద్రూస్ వారితోకూడ చెప్పవలసిన కబుర్లుచెప్పి వారి మనసు విరిచాడు.

వారి హీనస్థితివారికి గుర్తుచేసి తమ దేశాల్లో ఇది మెరుగుపడుతూందని ఇక్కడా తమదివానీలో మెరుగుపరుస్తామనీ చెప్పేడు. దీనివల్ల రంగన్నమాట వీరికి పథ్యం కాలేదు.

పంతులూ ఇంగ్లీషువారివైపే మొగ్గుచూపేడు. ముస్లింలు దేవాలయాలను గుడిసొత్తునూకొల్లగొనడంలో అప్పటికేమహాఅపకీర్తిపాలైనారు. ఫ్రెంచి వారుకాని, స్థానికరాచవారుగానీ దేవాలయాలను బలపడనివ్వరు మొగ్గలోనే తుంచేస్తారు. మద్రాసులో కంపెనీపాలనలో ప్రశాంతతవల్ల దేవాలయాలు వృద్ధికొస్తున్నాయని విన్నాడు ఆండ్రూస్ద్వార. తమదేవాలయమూచక్కని వైభవంతో తులతూగూతూ కల్యాణోత్సవాలు రధోత్సవాలు సంతరించుకొనే రోజులు ముస్లిమ్‌ల సహాయంతో రానేరావు. వారినాశ్రయించిన రాజుల కాలంలోనూరాదు. ఇంగ్లీషువారొస్తే మెరుగౌతుందేమో చూద్దాం. ఎవడొచ్చినా ఇంతకంటే చెడదుకదా అని ఆలోచించినాడు.

తుదకు డబ్బు ఎక్కడికీ కట్టకుండా గ్రామంలోనే పెద్దవద్దఉంచి జరిగేదిచూచి, కొన్నాళ్ళకుతిరిగినిర్ణయం చేయవచ్చుననుకొనిలేచారు. ఇది ఆండ్రూస్‌కు నిజంగా దౌత్యంలో విజయమే. ఇక నేతవారినీ చర్చ తరువాత వదిలేశారు. ఇది రంగన్న మంజరులకు విజయం. ఆండ్రూస్ పాత్రకూడ ఇందులో లేకపోలేదు. ఈ విషయాల్లో రంగన్న, మంజరీ, వీరు మాత్రంవాదిస్తూ కొంత ఆవేశంపెంచుకొవడంలో మాటలు జారారు. సాటివాళ్ళను తృణీకరించారు. కొందరిలో కష్టంకల్గించింది. కొందరితో నిష్ఠురం తెచ్చింది. మంజరిసంపదమీద కన్నుగలవారికి, రంగన్న తృటిలో సంపాదించుకొన్న గౌరవ మర్యాదలుచూసి ఈర్ష్య పడుతున్నవారికి ఈ ధోరణి మంచి అవకాశం కల్గించింది.

పన్ను విషయంలో తుదినిర్ణయం వీరిఇష్టానుసారం కాకపోయినా పెద్దల నిర్ణయానికి వీరుకట్టుబడిఉన్నా వారికివ్యతిరేకంగా పెద్దదుమారాన్ని వ్యతిరేకులు లేపగల్గినారు. సంస్థాన ద్రోహులక్రింద పరిగణింపబడే ప్రమాదంలోపడ్డారు. దాదాపూరు వదిలిపెట్టవలసిన స్థితివచ్చింది.

వాళ్ళ ఈనిస్సహాయ స్థితినికూడ ఆంద్రూస్‌చక్కగా వినియోగించుకొన్నాడు. రంగన్నకింగ్లీషు సైన్యంలోచక్కని ఉ ద్యోగంవేయిస్తానన్నాడు. మంజరిని ఉంచుకొంటానన్నాడు. అలా అయితే సూసాన్‌కు ద్రోహం చేసినట్లవదు. మరొక కన్యను పెళ్ళాడకూడదు కానీ,

మంజరికి విదేశ వర్తకులపట్ల అసహ్యమున్నా ఆంద్రూసంటే ముచ్చటే. అతను సాహసి. పోషణ కొరవడి ఎండకూవానకూ రూపుతరిగిపోయినా ఒకప్పుడు చక్కటి రూపసి. అతని గాన సౌందర్యానికామె భక్తురాలు. రంగన్నకిది తప్పనిసరై తిరిగి స్వీకరించిన కొలువు. అయిన వాళ్ళే తనకు విరోధులైతే, విరోధులతో నేస్తం తప్పనిదైంది.

విజయనగరం ప్రతినిధికీ పయనం త్వరగా తెమలడమిష్టంలేదు చేయగల్గినంత ఆలస్యంచేసి ఎలాగైతేనేం తరువాతి మజిలీకి బయలుదేరాడు. అతనివెంటనే మాథ్యూసూ, ఆంద్రూసూ బయలుదేరారు. వెళ్తూ. మంజరినీ రంగన్ననూ కంపెనీ వారుంచుకొన్నట్లు ప్రకటించి వారిమీద ఈగవాలడానికి వీల్లేదన్నారు. తాము బందరు ముందుగా చేరుకొంటామనీ రంగన్నా మంజరీ వెనకవచ్చేఇంగ్లీషువారి విజయనగరంవారి సైన్యాలతోవచ్చి అక్కడతమ్ము కల్సుకోవాలనీకూడా చెప్పిపోయారు.

మాథ్యూస్‌కు ఈ కొద్దికాలంగా జరుగుతున్న కల్లోలాలన్నీ కలల్లోలా విచిత్రంగాఉన్నాయి. తనభార్య, అమ్మాయి ఎలాఉన్నారో ! పాండిచేరిలోనే ఉ న్నారో లేక ఏమైనారో ! తానిక్కడకివచ్చిన కొత్తలో అంతా ఎంతో ప్రశాంతంగా ఉండేది. ఎప్పుడో ఓడవచ్చినప్పుడుతప్పితే మిగిలినపుడు పొద్దే గడిచేదికాదు. ఒక్కొక్కప్పు డింటిమీద ధ్యాసపడి జీవితమెంతో విషాదపూరితంగా తయారయ్యేది. తిరిగిఎలాగో నిబ్బరంతెచ్చుకొని మామూలుగాగడిపేసేవాడు. ఇక్కడిక కుటుంబం ఏర్పడినతరువాత సంతోషంగానే గడిచిపోతూంది. కానీ ఇప్పుడీ పరుగులేమిటి ? ఆంద్రూస్‌నూ అతనిఉత్సాహన్నీ చూస్తూంటే చాల అబ్బురం గొల్పుతూంది. ముచ్చటా వేస్తూంది.

"నేను నాదేశసేవకుల్లో ముఖ్యాతిముఖ్యుణ్ణి" అనడ మతనికిష్టం. "నా కార్యకలాపాల్లో ప్రతిలేశమూ నా దేశభవిష్యత్తును నా రాజ్యభవిష్యత్తును నిర్ణయించే అతిముఖ్యమైన చర్య. పార్లమెంటులో ఏచర్యలే జరుగనీ, చక్రవర్తీ అతని ప్రధానీ, అతని మంత్రివర్గం ఏ చర్యలే తీసుకోనీ, అవి కాదు చరిత్ర సృష్టించేది. చరిత్రను సృష్టిస్తున్నది నేను, నాబోటి సామాన్యులు ప్రపంచమంతటా వ్యాపించినవారు. మేం సృష్టిస్తున్నాం. మన అర్థ శాస్త్రవేత్తలు చెప్తారు బంగారంచేరవేయకుండా ఇక్కడివస్తువులు తీసుకొని వచ్చేమార్గం చూడమని, మేమిక్కడొక మెట్టుముందుకువెళ్ళి మనదేఒక్కవస్తూవూ చేరవేయకుండా ఇక్కడివస్తువులు సమస్తం తీసుకొనివెళ్ళే గారడీ తయారుచేశాం. బెంగాల్లో ప్రయోగం సఫలమైతే చూస్కో దేశమంతా ఒకటే భేరిమ్రోగుతుంది.

"రంగన్న, భైరీలాంటి వాళ్ళంతా చచ్చారనుకొంటున్నావా ?"

"ఏ:హె ! వాళ్ళ అపశ్రుతి బలివాద్యాల్లో బలిపశువుదీనారావం ! సహగమన వాద్యాల్లో సతి ఆక్రోశం?"

మాథ్యూస్ నోరువెళ్ళబెట్టుకొని వింటూంటాడు. ఔననేందుకూ, కాదనేందుకు ధైర్యం చాల్దు నోరు పెగల్దు

"ఇంతదేశం ! ఇంతజనం ! వేళ్ళలెక్కలో మనం ! మనమేమిటి, ఈ దేశంలో రాజ్యం చేయడ మేమిటి !"

"అక్కడేఉంది గారడి ! చారిత్రిక ప్రక్రియ !

"ఏమో బాబూ !"

"పూర్వమనుకొనేవారు. ఇదిచాలా సంపన్నదేశమని, చాలా నాగ రకదేశమని ! కానీ తీరావచ్చి చూతుము కదా ప్రకృతి ఎంతసంపన్న మో జనులంత వెనుకబడినవారు !"

"నాగరికతను మన దేశమిక్కడినుండి దిగుమతి చేసుకొంటే లాభి స్తుంది! అది మరువద్దు ! వాళ్ళ వ్యవసాయం, వాళ్ళ సాటిలేని చేతి వృత్తులు, పాఠశాలలు, స్త్రీకిచ్చే సుకుమారమైన గౌరవప్రదమైనస్థానం,

అతిథి సత్కారం, దానశీలత ఇవన్నీ మనవాళ్ళ కబ్బేందుకింకా ఎన్నాళ్ళు పట్టుంది ? ఎన్ని దశాబ్దాలు ? కాదు, శతాబ్దాలు ?"

"ఏనాడో నిర్ణయమైన నీతులు బుద్ధిగా ఆచరించడంకాదు మంచితనమంటే. ఒకప్పుడది బహూనిరర్థక జీవితానికి లక్షణంకావచ్చు. నీతిగా బతికాడు నీతిగా చచ్చాడు. అంతే మధ్య సాధించిందేమీలేదు. ఆదృష్టిలో కాదు నేనంటున్నది. వారి ఆలోచనల్లో సాహసం, పటిమ. కార్యసాధనలో చాకచక్యం. సంఘీభావంతో పనిచేయగల కౌశలం వీటిమాటనేనంటున్నాను. ప్రకృతిని జయించేశక్తి ప్రకృతి సంపదను బయటికి తీసేశక్తి వెలిదీసిన సంపద పంచుకొని అనుభవించే న్యాయం, ప్రకృతి వినియోగంలో దూరదృష్టి వీటిమాట నేనంటున్నాను."

"శాస్త్రాల ఉన్నత శాఖల్లో, ప్రభుత్వ నిర్వహణల్లో రాజ్యాంగ సిద్ధాంతాల్లో మూఢవిశ్వాసాలను పారద్రోలే చదువుల్లో విశాలదృష్టిలోవారు మనకంటే చాల వెనుకబడిఉన్నారు."

"మొత్తం మానవజాతి అవసరాలు తీరాలికదా ? నీవల్ల కాకపోతే నీ ప్రకృతి సంపద నిర్జీవంగాపడి ఉండకుండా వినియోగపడేలా చేయగల్గిన మరొక మొనగాడికి, మొనగాళ్ళ జాతికి, మనకు ఆహక్కు సంక్రమిస్తుంది. ఔనా ?

"నీతో నేను వాదించి గెలవలేను"

"ఈ దేశంలోవాళ్ళు అసమర్థులను పరాజితులను కొండల్లోకి నెట్టిన న్యాయం, ఆసంఖ్యాకులను అస్పృశ్యులుగా ఉంచిన న్యాయం నేనున్నూవారిపట్ల అవలంభిస్తాను. వాళ్ళ నీతి వాళ్ళకే అప్పజేప్తాను."

"అంటే..... ఈ ప్రాంతమంతా.......మన రాజ్యం తెస్తావా ?"

"ఇంకానీకు సందేహమా? బందరు మొదలు విశాఖపట్నంవరకుఉన్న ప్రాంతమేదైనా కోరకొ. నీకు దత్తం ! కంపెనీ పన్ను చెల్లిస్తూండు దివానీ నీది ! నీ తరాల్దీ !"

"అందుకా ఇన్ని పోకడలు పోతున్నాడు ?"

"భూగోళం explore చేయడ మయిపోయిందా! ఇప్పుడు మనుస్యుల్లో exporation, explorer లాగా నేనూ దారులు మార్చాలి. గతులు మార్చాలి. రకరకాల అంతరాల మనుష్యులకు వారివారి దురాశలనుబట్టి వాగ్దానాలు చేస్తాను, అందరినీ ఉపయోగించుకొంటాం. చెల్లిస్తాం, భయపెట్టాం, ప్రలోభపెట్టాం. అవసరమైతేకలుస్తాం అవపరమైతేనెత్తికెక్కించుకొంటాము. లేకపోతే తన్నితగలేస్తాం. వీలుంటే జాలిచూపుతాం లేకపోతేనిర్దాక్షిణ్యం వహిస్తాం,"

"నీకు జయంకలగానే నా ఆంక్షాంక్ష! కానీ...."

"కానీ. గీనీ, ఏమీలేదు. ఇక్కడ రక్షణ వ్యవస్థబహుదుర్బలం. లేనే లేదన్నా తప్పులేదేమో. సుఖాలనుభవిస్తున్న సంపన్నుడు శుద్ధఅప్రయోజకుడు, దుర్భలుడు అసమర్థుడు, తన సౌఖ్యాలను తాను రక్షించుకోలేడు. ఇకమిగిలిన వారిమాటా ? వారున్న దౌర్భాగ్యస్థితిలో పోరాడేందుకు ప్రోత్సాహమిచ్చే ఆశేదీవారికి లేనేలేదు. కనుకవారు పోరాడరు. ఇంకనీకడ్డెమిటి?"

"అదిగో గోదావరి !"

"ఇంక కావేరీదాకా ఒకటే జైత్రయాత్ర ! ఛలో !"

## XIII

ఖైరి, తమిళయువకుడూ అతని బృందమూ కలకత్తాలోని యింగ్లీషు వారికి వ్యతిరేకులైన వర్తక ప్రముఖులగానీ. రాజబంధువులుగానీ ఎవరెవరున్నారో అన్వేషణ ప్రారంభించినారు. కానీ పట్టుబట్టి వీరి అభిప్రాయాలకు విలువ నివ్వగలవా రెవ్వరూ కన్పించలేదు. ప్రముఖులందరూ ఇంగ్లీషువారితో కుట్రలో పాల్గొంటున్నవారుగానే కన్పిస్తునారు. బహిరంగంగా ఇంగ్లీషువారితో స్పర్థ ఉన్న ప్రముఖు లందరూ ఏనాడో తమ ప్రాణరక్షణకై పట్టణం విడిచి దిక్కులకు పరుగెత్తినారు. కానీ క్రమంగా విచారించగా చాలమంది కీ కుట్రలపట్ల చాల అనుమానాలు, భయాలూ ఉన్నాయని తేలింది. కానీ ఇంగ్లీషువారి కుట్రలో భాగస్వామియైన జగత్‌సేట్‌తో నిష్ఠూరం కట్టుకోవడాని కెవ్వరికీ ధైర్యంచాలదు.

మీర్జాఫరు బంగాళానికి నవాబైన తర్వాత ఇంగ్లీషువారి విచ్చలవిడి ప్రవర్తనపట్ల చాలమంది అసంతృప్తులుగా ఉన్నారు. కానీ వారికీ పీడెలా విరగడ చేయించుకోవాలో మాత్రం తెలియడంలేదు. ఇట్టివారి సానుభూతిని సంపాదించడం వీరికేమంత కష్టంకాలేదు. కానీ వారెవ్వరికీ ఇతని అభిప్రాయాల కెంత విలువివ్వాలో తెలియడం లేదు.

ఇప్పుడు వారున్న పరిస్థితుల్లో ఇతని అభిప్రాయాలు స్వర్గానికి నిచ్చెనవేసే ప్రయత్నంగా కన్పిస్తున్నాయి తప్ప ఆచరణలో వాస్తవమయ్యేవిగా నమ్మకం కుదరలేదు. అయినా ఆయువకుని చిత్తశుద్ధిని వారు శంకించలేక పోయారు. వారు తమ శ్రేణుల్లోను, తమకు కావలసిన వారితోను ఈ విషయాలు చర్చించేందుకు మాత్రం అంగీకరించినారు.

“మీరు మూర్షిదాబాదు చేరుకొనే నాటికి మేమూ ఒక నిశ్చితమైన అభిప్రాయానికి రావడానికి ప్రయత్నిస్తాము. మిమ్ముల నక్కడే కలుసుకొంటాము. ” అన్నారందరూ.

మరికొందరింకా ముందుకూ వచ్చారు.“మనం పాశ్చాత్యదేశాలకువెళ్ళివర్తక కేంద్రాలు స్థాపించే మాటెలాఉన్నా మన సైన్యాలను ఆధునిక పద్ధతుల్లో ఆధునిక ఆయుధాలతో సుశిక్షితులను చేసే విషయంలోనూ, నౌకాసైన్యాన్ని స్థాపించే విషయంలోనూమీ అభిప్రాయంతో విభేదించడం కష్టం నౌకాయానంలో మీ గొప్పను నేను చాలమార్లు రామేశ్వరయాత్రల సందర్భంగా చూసినాను. మీవద్దనుండి నౌకాసైన్య నిర్మాణానికి ప్రతిపాదన రావడం ప్రత్యేకంగా అభినందనీయం” అన్నాడు వారిలో ఒక పండు వృద్ధుడు.

“మూర్షిదాబద్‌లో మీరేమి సాధిస్తారు? నవాబును మీరు చూడడం ప్రమాదకరం. ఇంగ్లీషు వారి అనుమతి లేనిదే అతను మంచి నీళ్ళైనా త్రాగలేదు. ఇంతటి అప్రయోజకుడని మాకుముందు తెలియక పోయె. ఇప్పుడు చేతులు కాలిపోయిన తరువాత ఏంచేస్తాము? కానీ అతని అవసానమూనెలల్లోనే ఉంది. కాబట్టి మీరక్కడ ఎవరితో మాట్లాడినా ప్రమాదమే. మీ అభిప్రాయాలే

కనుక ఏ విదేశ వర్తకుల చెవిలోనైనా పడిందా ఇంకమీ ప్రాణాలు మీవి కావు. కాబట్టి మూర్షిదాబాదు కంటె మీరు కాశికే వెళ్ళండి. అక్కడికే వచ్చి మేమూ కలుసు కొంటాము" అన్నారు మరికొందరు.

కాని దక్షిణాది యువకుడు భైరయ్య తోను ఇతరుల తోను ఆలోచించి తుదకు మూర్షిదాబాదు వెళ్ళాలనే పట్టుబట్టినాడు.

"ఇప్పు డెవరి మనస్సులో ఏముందో చెప్పలేము. స్వేచ్ఛగా ఎవరి అభిప్రాయాలు వారు చెప్పలేనంత గడ్డు రోజుల వచ్చి పడినాయి. ఇక్కడ దిగినందువల్ల ఏమీ ప్రయోజనం లేదని మొదట్లో అనుకున్నాము. కాని కొన్ని వారాలుగా చేసిన కృషి నిష్ప్రయోజకం కాదని ఇప్పుడు తేలింది, మూర్షిదాబాదులోనూ మేము మాప్రయత్నాలు చేస్తాము, మీవల్ల ఎన్నో విషయాలు నేర్చుకొన్నట్లుగా అక్కడా విషయాలు తెలుసుకొంటాము మిమ్ములను తిరిగి మూర్షిదాబాదులో కలుసు కొనలేకపోతే కాశిలో మాత్రం మీ కోసం తప్పకుండా ఎదురు చూస్తాము" అని తేల్చినాడు.

ఇది మనవారు తొలివిజయంగా భావించి గొప్ప ఉత్తేజాన్ని పొందినారు. అక్కడినుండి మజిలీ ఎత్తివేసి ముర్షిదాబాదుకు పయన మైనారు

వారి ప్రయాణం మామూలు రోజుల్లో అయితే కాలినడకను నెల రోజులకు మించదు. కానీ ఈ అనిశ్చిత పరిస్థితులవల్ల అంతకు మూడురెట్లు పట్టింది. మనవారికి ప్రయాణం చేస్తున్న రోజుల్లో అంతా "ఎటు చూస్తే అటు చీకటి" అన్నట్లుంది. విజయోన్నత్తులైన ఇంగ్లీషువారూ వారి బంట్లూ జరుపుతున్న అత్యాచారాలతో వంగదేశం హా హాకారం చేస్తూంది.

అవకాశమే గనుక దొరికితే విదేశ వర్తకులు వ్యాపారాల్లో చేసే మోసాలు దురుసుతనాలు మనవారికి కొత్తేంకావు. ఆ విషయానికి డచ్చివారైనా ఫ్రెంచి వారైనా ఇంగ్లీషు వారైనా, పోర్చుగీసు వారైనా ఎవరైనా ఒకటే. కానీ ఇంతటి దౌర్జన్యం వారి ఊహలకూ అతీతమైనది.

ఒకచోట గ్రామంలో మూటా ముల్లే అన్నీ వదలివేసి కొన్ని చేనేత వారి కుటుంబాలు, సిల్కునూలు  లడీలు తయారుచేసే కుటుంబాలు తరలివెళ్ళి పోతున్నాయి. వారిని వెన్నంటి తరిమి పట్టుకొని  పెడరెక్కలు విరిచి కట్టి బ్రోకర్లు సాయుధుల సహాయంతో వెనక్కీడ్చుకొని పోతున్నారు.

"పదండి కచేరీకి.  మా గుమాస్తా పుస్తకాల్లో దాఖలా పడిన  తరువా తింకెక్కిడికిరా పోతారు....." వాక్యాల మధ్యలో వారు విరవిగా  ఉపయోగిస్తున్న వంగదేశపు తిట్లు నాకు రావు.  తెలుగులో చెప్తే  మీ రసహ్యించుకొంటారు.

మరొకచోట నిర్బంధంగా ఒక ఒప్పందం మీద చేనేత వారితో ఒప్పితాలు వేయించుకొని పంపినారు.  ఆ అమాయకులు వారిలో  వారు తగవు పడుతున్నారు, "నీ వల్లయిందంటే  కాదు.  నీవల్లనే ఇదంతా" అంటూ ఒకరి నొకరు నిందించు కొంటున్నారు.  "అవేం ఒప్పందాలో  ఏమో ! రేపూ వచ్చి వారికి  తోచిందిచ్చి మగ్గంమీదనే  బట్లను  కత్తిరించికొని  పోతారు. అప్పుడింకేం తిని బతకాలిరా మనం"  అంటునాడు మరొకుడు.  ఇంకొకడు కాలాన్ని నిందిస్తున్నాడు.

"ప్రాణాలు పోయినా ఒప్పందం  మీద  ఒప్పితం వేయనని  నేను తిరుగుబాటు చేసినాను కదా? అందువల్ల వారు నన్ను కొట్టి నిర్బంధం చేస్తున్నప్పుడు మీ పౌరుషాలేమయ్యాయి?  అప్పుడు బెల్లం కొట్టిన రాయిలామూతులు బిగించుకొని కూర్చుని  ఇక్కడ  మాటలు  పల్కుతున్నారు."

వారిలో ఒక పెద్ద వారిని శాంతపరుస్తున్నాడు. "కాని రోజు లొచ్చిపడినాయి. ఏం చేయగలం?  గుమాస్తా ఒక్కడినే అయితే తుడిచి పారవేయడ మెంతసేతపు?  ఆతనికి బనియా అండ ఉంటుంది.  బనియా వద్ద గవర్నరుఫర్మానా ఉంది, ఆ ఫర్మానా ఉన్నప్పుడు జమీందారు కూడ ఏమీ చేయలేడు, వారికి సహాయం చేయవలసిందే తప్ప"

"ఎగుమతయ్యే కంపెనీ సరుకుకు  గవర్నరు ఫర్మానా!  మన బజారుల్లో అమ్మే సరుక్కేమిటి ఫర్మానా ! వాడెవడు బోడిముండ" అరుస్తున్నాడు మరొకడు.

“అన్నీ కలగా పులగం చేసి కంపెనీ దస్తక్‌తో వెడుతున్నాయి. ఏం చేస్తాం ? ”

“ఔను. నా కర్థంకాలేదు, వారి పుస్తకాల్లో ఎక్కించుకొంటే మాత్రం మనమేం బానిసలమా! సరుకు మనది. మన ఇష్టం వచ్చిన వానికి వేస్తాము. మధ్య ఈ నిర్బంధమేమిటి!”

“ఎవరు ధరెక్కువిస్తే వారికివ్వకుండా ఇదేమి నిర్బంధం. పోనీ రూపాయి అర్థకాదు. నూటికి పదిహేను, ఇరవై కూడా తగ్గించిస్తున్నారు.”

“మొన్న నాకిచ్చిన వెల బజారు ధరకు నలభై శాతం తక్కువ” దెబ్బల చారికల యువకు డక్కస్సు వెళ్ళబోసుకొన్నాడు.

“సరి మీరా మాత్రమైనా సొమ్ము ముఖం చూచినారు. నా సరుకుకింకా వెలే కట్టలేదు, రేపు మాపని తిప్పుతున్నారు. వారి గోదా ఈ మధ్యెప్పుడూ కట్టివేసి ఉంటూంది. అది గంగపాలైనట్లేనో ఏమో!”

“ఇప్పుడు వారు మన గుడ్డలు తక్కువ ధరకు కొనడమేకాదు. మనకు కావలసిన సరుకులూ తామే అమ్ముతా మంటున్నారు. వారివద్ద కాక ఇతరులవద్ద కొంటే కూలి సొమ్మివ్వకుండా ఎగగొట్టున్నారు. వారమ్మే సరుకు చూద్దామా నాసిదీ, నిల్వదీ, కల్తీదీ, ఖరీదు చాలా ఎక్కువా, రూపాయ సరుక్కు అయిదు రూపాయలు”

“దేవుడే మనకొకదిక్కు చూపించాలి”

వారితో మాట్లాడాలని మన యువకుడుత్సాహ పడినాడు. కానీ మిగిలిన వారు వారించారు.

మరొక గ్రామంలో అగ్రకులజు లొకచోట కూర్చొని తీరికగా తీవ్రచర్చ జరుపుతున్నారు. ఒకముసలాయ నంటున్నాడు. “నేనాటి నుండే అంటున్నాను. ఈ పట్నాలు మన వినాశనానికే అని. ఏమిటో వేలం వెర్రిగా ఒకటే దూకుడు! ప్రతి వాడూ పట్నాలకు చేరుకొనడం, టకటకా నేతపని రాత్రిలేదు పగలులేదు. కులవృత్తులన్నీ మూలబడి పోయినాయి. ఇంకా పట్నాల్లో వాసమా? నే నొక్క

క్షణంమక్కడుండలేక పోయినానంటే నమ్మండి. మన సనాతన ధర్మ మంతా ఈ పట్నాలవల్ల వమ్మై పోతూందంటే నమ్మండి. ఎన్నాళ్ళని భగవంతుడు మాత్రమీ మిడిసిపాటు చూసిఓర్చుకొనగలడు. అసలీ దేశం మీద ముసల్మానుల అధిపత్యం వచ్చినప్పటి నుండే మనధర్మాలు గంగలో కలిశాయని మా ముత్తాతగారు నా చిన్న తనంలో వాపోతూండేవారు. ఆయనీ కాలంలో పెరిగిన పట్నాలను, వాటిమీద పెరుగుతున్న జనాల మోజునూ చూస్తే ఇంకెంత బాధపడేవాడో! పుణ్య పురుషుడు కాబట్టి అప్పుడే జారుకున్నాడు."

మరొక ముసలాయన శిఖ తడుముకొంటూ రుమాలు సవరించుకొని ఆవాగ్ధాటినందు కొన్నాడు. "ముసల్మానుల వర్ణ సంకరం చేశారంటే ఎంత మందిని చేశారు? రాజరికంలో పట్టుదలలు వచ్చినప్పుడు ఇదొక వంకపెట్టి లొంగదీసుకొనే వారనుకొండి. అయితే మాత్రం ఎందరి సిగలు బోడి చేశారు ? ఎందరికి నిర్బంధంగా గోవు మాంసం నోట్లో కుక్కినారు ? ఎంతమంది కులభ్రష్టులైనారు. కానీ ఈపట్నాలో? ప్రతివారిలోనూ మోజును పెంచుతున్నాయి. పంచాయితీలు కులకట్లు అన్నీ తెంచుకొని పట్నాలు చేరుతున్నారు, ఇది తెచ్చినంత భ్రష్టత్వం మరేదీ తేలేదంటాను" ఆయన మాటల కందరూ ఆమోదం తెల్పుతున్నారు.

"ప్రతివాడు మగ్గం మీద పని చేసే వాడౌతున్నాడు. ప్రతివాడూ వ్యాపారి కావాలని చూస్తున్నాడు. బ్రాహ్మలూ వ్యాపారమే, శూద్రుడూ వ్యాపారమే, ఇంకెట్లా సాగుతుంది ప్రపంచం ! అందుకే కులభ్రష్టత్వాన్నరికట్టి సనాతన ధర్మం నిలుపగల అవతార పురుషుడు పుట్టాడు. చూశారా, పట్నాల్లో అప్పుడే ఎలా ముసలాలు మొదలయాయో ! ఇంకెన్నాళ్ళు ! అవన్నీ ఇట్టే సమసి పోతాయి." తన వాగ్ధాటి నడ్డేవాడు లేడని తెలిసాక అతనికి మరింత జోరు వచ్చింది." ఈమ్లేచ్ఛ రాజ్యాన్నంతం చేసే కల్కి పురుషుడు అవతరించే కాలం వచ్చిందిరా! ఆయన అవతారానికి ముందే వీరంతా ఇక్కడ పుట్టుకొచ్చారు. శ్వేతులు పూర్వం వానరులుగా పుట్టినవాళ్ళే ఇప్పుడిలా ఎక్కడో పుట్టి ఇక్కడికి చేరుకున్నారు. వీరి ద్వారానే మ్లేచ్ఛ రాజ్యం అంతమౌతుంది."

ఇంతవరకు వింటున్న ఒకాయన మాత్ర మిక్కదుగ్రంగాలేచాడు. "ఇది కలియుగం ప్రధమ పాదం కదా. అప్పుడే కల్కి అవతారమంటావేమిటి? శుద్ధ అ పండితులు వాక్యార్థాలు చెప్పబట్టే మన గతిలా ఏడ్చింది."

"ఎవడ్రా ఆ పండితుడు? గణితం తెలియనివారు వేసే పంచాంగాలను నమ్ముకొనే మీరా ? కృత యుగం నుండి స్వయంగా కాలాన్ని లెక్కగట్టి చెప్పే నేనా?"

ఇలాగ జ్యోతి శ్శాస్త్రంపై వాగ్యుద్ధ మారంభమైంది. ముసలాయన భైరినీ, దక్షిణాది యువకునీ త్రోవలో ఇలా హెచ్చరించాడు.

"మీరు గ్రామాల్లో పంచాయితీలు తోడ్పడుతా యనుకొంటున్నారు కదా, విన్నారా గ్రామాల్లో అగ్రకులస్థుల ధోరణి ?

మరొక చోట వెర్రితలలు వేసిన తాంత్రికులు బీభత్సం కొలిపే ఉపస్థి పూజలు చేసుకొంటున్నారు.

కొంతదూరం ప్రయాణం చేసిన తరువాత వీరు గ్రామాలు వదిలిపెట్టి పోతున్న నేతవారేమోనని వెన్నంటి అక్కడక్కడ నిలిపి ప్రశ్నలు వేస్తూ వేధించేవారు.

దానితో వీరు రాజమార్గాలు విడిచి కుగ్రామాల మీద మారుత్రోవలు పట్టవలసి వచ్చింది. దీనివల్ల మురిషిదాబాదు చేరడానికి మరికొంతాలస్యం మైంది.

మురిషిదాబాదు లోనూ కలకత్తాలో వలె ఎవ్వరితోగానీ రాజకీయ వ్యవహారాలు మాట్లాడ డానికే జనం జంకి పోతున్నారు. ఎవడు గూఢచారైనదీ, ఎవడు చిత్త శుద్ధితో మాట్లాడుతునదీ తెలుసు కొనడమే కష్టంగాఉంది.

అయినా కొన్నాళ్ళు ఓపికగా పరిశీలించి మనవారు తమ ప్రయత్నాని కుపయోగ పడగల వ్యక్తులను కొందరిని సంపాదించ కలిగారు. ఆ పట్టుతో గబగబ పై అంతస్థుల మనుషుల వద్దకూడా తమ అభిప్రాయాలను వినిపించే అవకాశం సంపాదించారు. మీర్జాఫరుకు వ్యతిరేకంగా కుట్రలు పన్నుతూన్న సిరాజుద్దౌలా బంధువొకడు వీరిసాహస పూరితములైన అభిప్రాయాలపట్ల మక్కువే

చూపినాడు. తాను రాజ్యానికి రావడం ఖాయమనీ అంతవరకూ కొన్నినెలలు ముర్షిదాబాదులో గడపవలసిందనీ ఈ లోపల ఢిల్లీలో వారు చేయగల్గింది లేదనీ వారికి చెప్పినాడు.

మొదట్లో అతని మాటలవల్ల మనవారు చాల పొంగి పోయారు. కానీ అతని మాటల పదునుకు రెండవ వైపు మొదట్లో చూడలేక పోయినారు. అతని ఆలోచన లోతుగా తెలిసేప్పటికి వీరతనికి దాదాపు బందీలైపోయారు.

సిరాజుద్దౌలా బంధువు ఉద్దేశం మరేమి కాదు. తను బెంగాలు సుభా నవాబు గిరీకీ చేస్తున్న ప్రయత్నాలు ఫలించే వరకు వీరిని నిర్బంధంగానైనా సరే ఆపి, బెంగాలు సింహాసనం తన చేతికి చిక్కిన తరువాత ఢిల్లీవారి ఆమోద ముద్ర సంపాదించేందుకు వీరిని కూడా పావులక్రింద ఉపమోగించుకోవాలని ఆయన తాపత్రయం. తానిక్కడ స్థిరం కాకుండా ఢిల్లీ చక్రవర్తి స్థానం స్థిరపడే ప్రయత్నాన్ని దేన్నైనా అతడూ జరుగ నివ్వడు. ఇతనితో కయ్యానికి దిగైనా తమ ప్రయత్నం సాగించే శక్తి మనవారికి లేదు. కాబట్టి ఈ వలయం నుండిఆ మా యో పా యా ల తో తప్పించుకోవడానికి ప్రయత్నా లారంభించ వలసి వచ్చింది. అతికష్టం మీదతన్ని నమ్మించి కాశీవరకు వెళ్ళడాని కనుమతి సంపాదించకల్గినారు. వారికి తెలియకుండా ఆ రాజకుటుంబీకుని అనుచరులు కొందరు మన వారి ననుసరించ మొదలిడినారు.

ఇలా నవాబ్గిరీకి ప్రాకులాడుతున్న సిరాజద్దౌలా బంధువుతో సంబంధాలు కల్గి ఉన్న వారుగా వీరి నధికారంలో ఉన్న సైనికోద్యోగులు కొందరు పసిగట్టినారు. అప్పటినుండి వీరి వివరాలు కనుక్కోనడానికి వారూ ప్రయత్నాలారంభించారు. ఇది వారి ప్రయాణాలకు మరింత కష్టతరం చేసింది.

వీరు పాట్నాలో ఉండగానే మీర్జాఫర్ ప్రభుత్వమూ పడిపోయే స్థితిలో ఉ ందని వార్త లందినాయి, ఇప్పుడు మీర్ కాశిం అను మరొక సాహసికుడు రాజ్యానికి రావడం ఖాయమైనట్లు రూఢిగా వార్తలు తెలియవచ్చాయి. దానితో వీరిని వెన్నంటు తున్నవారి పునాదులే కదిలిపోగా వీరిని వదిలివేసి వారు మూర్షిదా బాదుకు

హుటాహుటిని వెళ్ళి పోయారు. వీరు కొంత స్వేచ్ఛగా గాలి పీల్చుకొనే అవకాశం కలిగింది. కాని మీర్ ఖాసిం రాజ్యానికి వస్తున్నట్లు వినవస్తున్న వార్తలు శ్రేణుల్లోనూ, వ్యాపారాల్లోనూ, పారిశ్రామికుల్లోనూ కొత్త ఆశలు చిగురింప జేసినాయి. అతనందరికీ పరిచితుడే, ఉదారస్వభావం కలవాడని కూడ అందరికీ విశ్వాసం. అందువల్ల వేరెవరితో మాట్లాడినా "మీర్ కాశింతో మీరు మాట్లాడండి అతను మీకు తగు ప్రోద్భల మివ్వవచ్చు" నంటున్నారు. కాని తమంతట తాముగా ఏ ప్రోత్సా హకర సహాయమూ ఇవ్వలేక పోతున్నారు.

అయినా దక్షిణాది యువకుని దృష్టి యావత్తు ఢిల్లీకి వెళ్ళడం మీదే ఉంది. మనవారు పాట్నాచేరే నాటికింగ్లీషుద్యోగులు ఆగడాలు పతాక స్థాయిలో ఉన్నాయి

ఇక్కడున్న ఇంగ్లీషు ప్రధానోద్యోగి తన గుమాస్తాలు, తాబేదార్లు వీరిని పురెక్కించి జిల్లా నవాబుల కంటే కూడా ఎక్కువ దర్జా చలాయిస్తున్నాడు. తుదకు వారు కంపెనీపై అధికారులను కూడా లెక్క పెట్టనిస్థితికి వచ్చినారు. వారు జిల్లా సర్వాధికారులుగా వ్యవహరిస్తున్నారు. జిల్లా యావత్తు తమ ఎస్టేట్ అయినట్లుగా ప్రవర్తిసున్నారు. వారే కాదు కంపెనీ దస్తక్ కల్గిన ప్రతివాడు తానే కంపెనీగా వ్యవహరిస్తున్నాడు. కంపెనీ జండాలను తమ కార్యాలయం మీద నెలకొల్పి ఇప్పుడు బట్టల్లోనే కాక నూనె, చేపలు, గడ్డి, వెదుళ్ళు, ధాన్యం, బియ్యం, పోకలు మొదలైన వాటిన్నిటిలోనూ వ్యాపారం కొనసాగిస్తున్నారు. కొందరు వర్తకులు కంపెనీలో కొంత ప్రాపు సంపాదిస్తారు. దానితో తమ పడవలమీద కంపెనీ జండాల నెగరవేసుకొని ఇవన్నీ ఇంగ్లీషువారికి చెందిన సరుకని బొంకుతూ నవాబుకు చెల్లించ వలసిన సుంకాల నెగగొట్టేస్తారు.

ఇంగ్లీషు వారికిచ్చిన వర్తకసౌకర్యాలిలా పెద్ద యెత్తున దుర్వినియోగ మౌతున్నాయి.

ఇంగ్లీషుద్యోగుల్లో భారతీయుల పట్లద్వేషభావము కూడ ఈ రోజుల్లోనే బాగా రగుల్కొంటూంది. ఆద్వేషాన్ని రగుల్కొల్పేందుకు "బ్లాక్ హోల్ ఆఫ్ కల్‌కటా" ఉదంతం చాలా తోడ్పడింది.

అందువల్ల ఇప్పుడు వారు భారతీయులకు పూర్వంలా బరాబరులు చేయడంలేదు. పైగా బహునీచంగా చూస్తున్నారు. ఉమ్మినా తుడుచుకొని పోగల్గిన సిగ్గుమాలిన వారే ఇప్పుడు వారి చుట్టూచేరి నాలుగెంగిలిడబ్బులు గడించుకొంటారు. మిగిలినవారు మీర్ఖాసిం నవాబెప్పుడౌతాడా అని చూస్తునారు. అతనేదో వారికొరగ బెట్తాడని ఆశ. వారిలో ఒకతను ఇంగ్లీషు వారికి వ్యతిరేకంగా కుట్రపన్నుతున్నవారిని పట్టియిచ్చినట్లైతే తన పరపతి పెరుగుతుందన్న ఆశతో వీరి ఆచూకీని పట్టిచ్చినాడు. పాట్నాలో వీరందరినీ పట్టుకోవడానికి జరిగిన కుట్ర విఫలమైంది. ఏదో విధంగా వారు కాశీ చేరుకొన్నారు. ఈ త్రోవలో కంపెనీ వారికి దొరకకుండా చాల ప్రయాసపడి ప్రయాణం చేశారు.

కాశిలో భైరయ్య తండ్రికీ తీర్థయాత్రాప్రసంగం మాత్రం బాగానే జరిగింది. అన్నపూర్ణా విశ్వేశ్వరుల కొలువూ తృప్తిగా జరిగింది. అంతే.

రాజకీయ వ్యవహారం విషయంలో మాత్రం కథంతా అడ్డంతిరిగింది.

కాశీలో ఢిల్లీనిగురించిన వివరాలుచాలా తెలిశాయి. అంతకుమునుపు ఢిల్లీనిగురించిన వార్తల్లో అక్కడి పరిస్థితులూ అస్తవ్యస్థంగా ఉన్నాయనీ దేశంలో గొప్పమార్పులు తేగల ఆలోచనలకు విలువనిచ్చేవారక్కడా లేరని పెద్దలంటూనే ఉన్నారు. అవన్నీ నిరాశతోవచ్చే మాటలనీ, పోయిప్రయిత్నిస్తే తప్పకుండా ఫలితముంటుందనీ ఆశిస్తూవస్తూన్న దక్షిణాది యువకుడు కొంత తత్తరపాటు చెందేలాఉన్నాయి వార్తలు. కానీ అతని తత్తరపాటు తాత్కాలికమే. తిరిగి సాహసించి ప్రయత్నాన్ని కొనసాగించేందుకే నిశ్చయించేసుకొన్నాడు.

ఢిల్లీలో నాదిర్షా దాడులవల్ల జరిగినహాని దూరంలో ఉన్న వారుతక్కువంచనావేసే అవకాశమున్నది. కానీ నాదిర్షా అతని తదుపరి అహమద్షా

అబ్దాలీ ఇద్దరుచేసిన దాడుల్లో ఢిల్లీ సామ్రాజ్యపు అస్థిపంజరమే మసియైపోయింది. ఇప్పుడు ఢిల్లీపాదుషాల అధికారంవాస్తవానికి ఢిల్లీ చుట్టుపట్ల కొన్నిమైళ్ళు మినహాగా మరెక్కడాలేదు. కానీ సామాన్యప్రజల్లోమాత్రం ఢిల్లీ చక్రవర్తులయెడ భక్తి చాలచోట్లఉంది. వివిధ ప్రదేశాలల్లోని సంస్థానాధీశులూ సర్దారులూ ఇతర స్వార్ధపరులూ తాము సాహసంతో దౌర్జన్యంతో సాధించుకొన్న విషయాలకొకచట్టబద్ధమైన స్థిరత్వమేర్పడేందుకూ, సామాన్య ప్రజల్లో ఒక విధమైనఆమోదం పొందేందుకు తమచర్యలకు ఢిల్లీపాదుషా ముద్ర వేయించుకొనివచ్చి మోసపుచ్చుతున్నారంతే. వీరులలంకరించిన సింహాసనం మీదొక హీనమానవుడు రాజ్యమేలుతున్నాడు. అతడు రాణుల చేతుల్లోబందీ. వారిలో ఒక వేశ్య స్త్రీ ఇప్పుడు మహరాణిగా అధికారం చెలాయిస్తున్నది. ఆమె మహరాణయి నప్పటికీ ఇంకా పూర్వాశ్రమపు నీచ నైజాన్నధిగమించినట్లు కన్పించదు. నీచులనుచుట్టూ చేర్చుకొని తనకు చేతనైన అధికారం తాను చెలాయిస్తూంది. ఢిల్లీలో ఇప్పటి కుంటుంబాల్లో నాదిర్షా అబ్దాలీల సైన్యాలవల్ల ధన ప్రాణ మానహాని చెందనికుటుంబ మొక్కటీ లేదన్నా ఆశ్చర్యం లేదేమో. ఈ వార్తలన్నీ విన్న తరువాత దక్షిణాది యువకుడూ భైరీ ఒకసారి పునరాలోచించుకొనవలసిన స్థితిలో పడినారు.

ఈ స్థితిలో మూర్షిదాబాదునుండి కలకత్తానుండి వీరికి వాగ్దానంచేసిన ప్రముఖులు ప్రతి నిధులను పంపినారు.

వారు ఢిల్లీలోని పరిస్థితిని వివరంగా వివరించారు. త్వరలో మీర్‌ఖాసిం చేతిలోని కధికారం మారుతుందనీ, అతను సమర్ధుడనీ, అతని ద్వారా తమ ప్రయత్నాలు మరింతశక్తివంతంగా కొనసాగుతాయనీ ఆ ప్రతినిధివర్గం మనయువనాయకునికి నచ్చజెప్పడానికి చాలా ఓపిగ్గా కృషిచేశారు. కాని యువకుడు వింటేగా.

ఇక్కడ భైరయ్యకూడా మన యువకుడు పట్టుతున్న మొండిపట్టు మాన్పించేందుకు ప్రయత్నించాడు. కానీ లాభంలేకపోయింది. ఇకలాభంలేదని నిర్ధరించుకొన్నాక ఆ వంగదేశవ్యాపారులకు శ్రేణులకు ఇతర ప్రముఖులకు

ప్రాతినిధ్యం వహించే పెద్దలు ఒక కుతంత్రం చేశారు. స్వేచ్ఛగా వదిలివేస్తే యువకుడు తనకుతానై ఢిల్లీలో పరిస్థితులుచూసి తిరిగి వంగ దేశానికే వచ్చేవాడు, వాస్తవానికానాడు వంగదేశమెక్కటే యావద్భారతంలోను బాగా సంపన్నంగాఉంది. మొన్న మొన్నటివరకు అంతర్యుద్ధ రాక్షసి వంగదేశపరిధిలో తీవ్రమైనపరిణామాలేవీ కలిగించలేదు. ఆవిషయం మనయువకునికి ఢిల్లీచూస్తే స్పష్టంగా తెలిసివచ్చేది. కానీ వారితను ఢిల్లీ విషయంలో ఇంతటి పట్టుదల వహించడం సహించలేకపోయారు. ఆయా సందర్భాల్లో అతడు వారిని నిందించిన పౌరుషపు నిందావాక్యాలను సహించలేకపోయినారు. పైపెచ్చిత నొకవేళ ఢిల్లీకివెళ్ళి తనప్రయత్నంలో విజయమే సాధిస్తే దానివల్ల కూలిపోతున్న ఢిల్లీ సామ్రాజ్య సౌధానికి ఒక కొత్తపట్టు లభించవచ్చు. అన్నీ ఊహలేకాని భయము, భావిగతినిగురించిన అజ్ఞానం ఇవన్నీ వారికిగల ఓర్మిని తొలగించివేశాయి. దూరదృష్టితో వారాలోచించ లేక పోయినారు.

వీరు సిరాజుద్దౌలా బంధువుతోకల్సుకొన్న ఉదంతాన్నిపురస్కరించుకొని ప్రస్తుత రాజ్యానికి వ్యతిరేకంగా కుట్రపన్నుతున్నవారినిగా చిత్రించి ఇంగ్లీషువారిలో అనుమానంకల్గించి వెళ్ళిపోయారు. వారి అనుమానం పెనుభూతం. వారువీరిని వెంటనేబంధించారు. భైరివాళ్ళ ఇంగ్లీషుఫాక్టరీవాళ్ళిచ్చిన పరిచయపత్రాలున్నప్పటికి వాటినిక్కడవాళ్ళు నమ్మలేదు. ఇక్కడి ఫాక్టరీ వాళ్ళనింతవరకూ ఎవరినీ ఎందుకు కల్సుకోలేదు. సిరాజుద్దౌలా బంధువులనే ఎందుక్కల్సుకొన్నారు ? అని తిండితిప్పలు లేకుండా క్రిందివారుపెట్టే న్యూనతలన్నింటినీ సహించిన కొన్నాళ్ళకు పెద్దఇంగీషుద్యోగి సమక్షానికి వీరినితీసుకొని పోయినారు.

మొదటిరోజతను వీరివద్దనుండి నిందా వాక్యాలను మినహాగా మరే సమాధానమూ రాబట్టలేక పోయినాడు. ఆయన వీరిని తిరగి కారాగానికి పంపుతూ వీరిని మర్యాదగా చూడవలసిందని ఆజ్ఞాపించాడు.

ఇన్నితిట్లు తినిన్నీ వెంటనే వీరిని వధించమని ఆజ్ఞాపించకుండా మర్యాదగాచూడవలసిందిగా ఉత్తర్వునిచ్చినందుకు సోల్జర్లు చాలనిరుత్సాహ పడినారు.

కొద్దిరోజులైన తరువాత తిరిగి ముప్వురూ ఆయింగ్లీషుద్యోగి సమక్షానికి కొనిపోబడినారు.

అతనుచక్కని పానీయంతో పెదవులనుతడుపుతూ వీరికిన్నీ పానీయ మందివ్వబోయాడు. వీరు నిరాకరించారు.

"ఏమిటి మావారు మిమ్మల్ని మర్యాదగా చూచారనుకొంటాను"

మౌనం.

"ఇప్పుడు మీరున్న పరిస్థితినిగురించి చక్కగా ఆలోచించు కొన్నారనుకొంటాను !"

మౌనం.

అతనికి చెలగాటం, వీరికి ప్రాణసంకటం. అతనికి తీరుబడిగా ఉంది. పైగా చేతులుపిసుక్కొంటూ నాన్చిమాట్లాడేదేశీయులతోనూ, చిత్తమంటూ ఎటువంటి సేవలైనా నెరవేర్చేవారితోనూ వ్యవహరించడాని కలవాటుపడిన అతనికి వీరి సాహసాన్ని గురించి వినగా ముచ్చటవేసింది. కుట్రదారులుకారనీ, ఒకవిధమైన ఆదర్శవాదులనీ అతనికర్థమైంది. వీరిని చంపడంకంటే బందీలుగా ఉంచుకొంటే వీరిబంధువులవద్దనుండి సొమ్ము లాగవచ్చుననీ అనిపించింది.

అతనిప్పుడు వీరిని సాధుపరిచేందుకూ వీలుందేమో చూస్తున్నాడు.

"మీ ప్రాణాలు మాచేతులలో ఉండగా మీరు బింకాలుపోవడం ఆత్మహత్యకు పూనుకొనడంవంటిది."

మౌనం

"మీరెవరైనదీ తెల్పి మీ ప్రయాణాలు, మీఉద్దేశ్యాలు అన్నీ స్పష్టంగా వివరిస్తే బ్రతికి బయటపడే అవకాశం ఉంది. లేదా వృధాగా మట్టి కలుస్తారంతే"

ఇంకా మౌనమే. తరువాతాఉద్యోగి ముసలాయనను వారిద్దరి ఎదురుగానూ చిత్రహింసకు గురిచేయ నారంభించాడు.

అది భరించడం మిగిలిన ఇద్దరికీ కష్టంగాఉంది.

ముసలాయన అమోఘమైన ఓర్మిని, ధైర్యాన్ని ఈ సందర్భంలో ప్రదర్శిస్తున్నాడు. "సన్నీహింసనుండి కాపాడేందుకు మీరు మీ ధ్యేయం నుండి చలించవద్దు. ఏనాడైనా చావుతప్పదు. మీ ధ్యేయం సాధించే మార్గమే ఆలోచించి దాని ప్రకారం నడుచుకొనండంతే" అని అరుస్తున్నాడు. ఎంతహింసించినా ఆయననోటినుండి ఒకటేవాక్యంవారు సమాధానంగాపొందుతున్నారు.

"మేమెవ్వరైతేనేమి నా కంఠంలో ప్రాణముండగా తెల్సుకోలేరు,"

స్పృహతప్పేవరకు ఆయన్నలా హింసించారు. కొరడాతో బాదినారు. కత్రలతో డొక్కల్లో పోట్లుపొడిచారు. కడ్డీలతో కాల్చినారు. సూదులతో గుచ్చినారు. మరెన్ని హింసలకో గురిచేసినారు.

భైరీ అతని మిత్రుడూ తమ్ముబిగించి పట్టుకొన్నసిపాయిల ఉక్కు కౌగిళ్ళలో గింజుకోవడంమినహా ఏమీ చేయలేకుండా ఉన్నారు.

ఇలా రెండురోజులు గతించినతరువాత ముసలాయనింక ఏమాత్రం హింసకు గురిచేసినా గుటుక్కుమనే స్థితిలో ఉన్నాడని ఇంగ్లీషుద్యోగి కర్థమైంది. వారి మొండిపట్టుదల అతని కాశ్చర్యాన్ని కలిగించింది.

ఇక చిత్రహింసకు గురికావడం భైరివంతుకు వచ్చింది.

కాని ఇక్కడ భైరయ్య మిత్రునివెంటవస్తున్న పరిచారకులు పట్టు విడిచినారు. భైరయ్య వారినివారిస్తున్నప్పటికీ వినకుండా తామెవ్వరైనదీ తమ యజమానే కార్యానికి పూనుకొన్నదీ వివరించినారు. తరువాత తాము యజమాని కుమారుని ప్రాణాలను రక్షించేందుకే ఈఅకార్యంచేసినామని వాపోయి బొడ్డులో దాచుకొన్న విషాలు మ్రింగి మరణించినారు.

బంగాళంన వాబ్గిరీకి సంబంధించి కుట్రతో వారికేమీ సంబంధంలేదని ధృవపడగానే వారిని హింసించడం మానినారు.

శారీరకహింసచాలించి మానసికంగాహింసించేదుకు ప్రారంభించినారు. దక్షిణాది యువకునికీ భైరయ్యకూ నెత్తిన టోపీలు తగిలించేవారు. "భావిభారత నౌకా సైన్యాధిపతి" "భావిభారత నౌకాసైన్య ఉపాధ్యక్షుడు" అని ఆటోపీలమీద వ్రాసేవారు. వారిని మిగిలిన బందీలలోనూ, కచేరీ ఉద్యోగుల్లోనూ ఈడ్చితిప్పేవారు. మరొకసారి కంత్రీఆడదాన్నొకదాన్ని వారి ముందర్ధనగ్నంగానిల్పి ఈమె మీరు వర్తకకేంద్రం స్థాపించబోయే దేశానికి ప్రభ్విణి చెలికత్తె. ఈమెకోరిందిచ్చి (ముద్దు) సంతోషపెట్టితే మీకు వర్తకాని కనుమతి లభిస్తుంది. అంటూ ఆమెమీద వారిని తోసేవారు.

ఢిల్లీనుండివచ్చిన వార్తాలేఖల్లో వీరికికష్టం కల్గించే అంశాలను తెచ్చి వీరిముందు చదివేవారు. " ఇదిగో వినండయ్యా మీరు ప్రత్యేకించి తెలుసు కొనవలసిన వార్త.

"శ్రీశ్రీశ్రీ....నవాబుగారిల్లు ఈసారిదాడిలో ఆఫ్ఘన్లు దోచుకొన్నారు. వారమ్మాయిని ఆఫ్ఘన్ స్థానుకు తీసుకొని పోయారు. ఆయన భార్యతో సహాఅందరిఒంటిమీది నగలు ఒలిచితీసుకొన్నారు. తరువాత..."జనానాలో జరిగిన అత్యాచారాలను వినలేక వీరు చెవులుమూసుకొంటే చేతులమీదకొట్టేవారు. విచ్చలడిగా సైనికులు చేనుమేసే కంచెవలె వ్యవహరిచినప్పుడు జరిగే ఘోరకృత్యాలేఅభిమాని నిస్సహాయుడై వినగలడు ! అయినా మనవారు వినవలసి వచ్చేది. మనసురాయిచేసుకొని వింటున్నారు. అవి అబ్దాలీ దాడిచేసిన రోజులు. ఇమద్. పూర్వం అహమ్మద్షాఅబ్దాలీ స్వాధీనం చేసుకొన్న లాహోరునుఢిల్లీవజీరు తిరిగిఆక్రమించాడు. దానికిప్రతిక్రియగా అబ్దాలీ ముందు సేనాపతినిపంపి వెనుకతానేవచ్చాడు. లాహోరును గెల్చుకొని ఢిల్లీనాక్రమించుకొని ఏడురోజులక్కడివారిని యమయాతనల పాలుచేశాడు. ఢిల్లీఎట్టిప్రతిఘటనా లేకుండా అతనివశమైంది. దరిద్రులు, ధనికులు, స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు,

రాజపురుషులు సన్యాసుల, హిందువులు ముస్లిములు – అందరూ ఘోర బాధలను, నీచాదమానాలను అనుభవించారు. తరువాత మధుర, బృందావనం, గోకులం–మొదలైనవీ ఈ దాడులకు గురయ్యాయి, యమునానది రక్తపుటేరులతో ఎర్రబడిపోయింది, వందలాది – కాదు – వేలాది గ్రామాలు, పట్టణాలు భస్మమయ్యాయి. అయినా శత్రువునెదుర్కొనేందుకు ప్రయత్నించేనాథుడెవ్వడూ లేడూ ముస్లిములలోనూలేడు, హిందువులలోనూలేడు. ఆ భీకర వార్తలన్నీ గుదిగుచ్చి వీరికింగ్లీషుద్యోగులు విన్పించేవారు.

"ఇదితెలీదూ ? తైమూరువంశీకుడని గొప్పలుపోయే మహమద్‌షా తన పదహారేళ్ళ కూతురునిచ్చేశాడయ్యా అబ్దాలీకి ! ఆ సుకుమారికీ, ఈ ముసలి పీనుగుకూ జోడుచూస్కో ! మామూలు ముసలివాడుకాదు ఆబ్దాలీ! అతని చెవులు రెండూ కొడితపడిపోయాయి. ముక్కును కుష్ఠుకురుపు తినివేసింది. కూతురునురక్షించుకోలేని చక్రవర్తి వద్దకేనా మీరురాయబారం ! ..." ఇంక ధారాళంగా బూతులకు లంకించుకొనేవారు.

దక్షిణాది యువకుడిలావిన్న వార్తల్లోఒక్కదానికే చలించాడు. అది మహారాష్ట్రుల నౌకా సైన్యపతనం. అప్పటికే కొన్నిసంవత్సరాలు కావస్తూన్నా అతనికావిషయంతెలియదు. మహరాష్ట్రనౌకాసైన్యంపై అతనికెంతో గౌరవముండేది, ఆ నమూనాలోనే దేశంలో అన్ని తీరాలమీదకూడా నౌకా సైన్యమేర్పడాలని అతనుభావించేవాడు. వారుజరిపిన ఎన్నోవీరకార్యాలను గురించి అతను విన్నాడు. శ్రావణదుర్గమూ, ఘెరియా రెండుపడిపోయాయని విన్నప్పుడతని ఆదర్శ సౌధము కూలిపోయింది. దాని వివరాలు ఆత్రంగా వారినడిగాడు. వారుత్సాహంతో ఆ పతనగాథ చెప్పనారు. మహరాష్ట్రంలో అనైక్యత నుపయోగించుకొని ఇంగ్లీషువారు మనదేశపు పశ్చిమతీరాల్లో సుమారు యాభై ఏళ్ళకుపైగా వీరవిహారంచేసిన నౌకాసైన్యాన్నిసంపూర్ణంగా ధ్వంసంచేసినారని విన్నప్పుడు అతను పడినబాధ చెప్పనలవి కాదు.

భైరయ్యను చలింపజేసినవార్తలు సర్కారులకు సంబంధించినవి ఏ విజయనగర సంస్థానంవారైతే ఫ్రెంచివారిచేత తెలగురక్తాన్ని కాలువలై ప్రవహింపజేశారో ఆ సంస్థానాధిపతియే ఇప్పుడింగ్లీషువారిచేత తెలుగు రక్తాన్ని ప్రవహింపజేస్తూన్నాడు. మనిషిమారినాడు. బొబ్బిలియుద్ధంనాడు తాండ్రపాపయ్య చేతిలో మరణించిన విజయరామరాజుగారి కుమారుడితడు. కోస్తాలోని వర్తకకేంద్రా లన్నింటినీ ఇంగ్లీషువారికి దత్తంచేసి మిగిలిన కోస్తాలో యావత్తు తనరాజ్యం నిల్వాలని ఆయనయత్నం. పెద్దాపురం సంస్థానాధీశుడైన జగపతిరాజుతో తనకు చిన్ననాటినుండికోడిపందెములు మొదలుకొని అన్నివిషయాల్లోను–పెరిగిన స్పర్థలకు నేడామహరాజు పగ తీర్చుకోవాలి.

క్లైవు ఆదేశంమీద విశాఖపట్నంవద్ద దిగిన కర్నల్‌ఫోర్డిప్పుడు తెలుగు దేశంమీద వీరణాలు తొక్కుతున్నాడు. తెలుగు ప్రజతిరిగి హాహాకారం చేస్తున్నది. ఇందులో ఫ్రెంచివారూ డచ్చివారు జగపతిరాజుపరంగా కలుగజేసుకొని ఓడిపోయినారు. మచిలీపట్నం మొదలు కోస్తాలోవర్తక కేంద్రాలనాక్రమించుకొన్న ఇంగ్లీషువారుఫ్రెంచి అబిమానులను దుమ్మునాకించినారు. ప్రాణాలు దక్కించుకొనిన ఫ్రెంచిఅభిమానులైన వర్తకులెందరోఅరచేత ప్రాణాలుపట్టుకొని దేశాలపాలైనారు. ఇప్పుడింగ్లీషువారు నిజాంవద్దకూడా ఫ్రెంచివారిని పారద్రోలి అక్కడ తమ ప్రాబల్యం నిల్పుకొనేందు కన్నిప్రయత్నాలూ చేస్తున్నారు.

ఇది జరిగి అప్పుడే చాలా నెలలు గడిచిపోయినాయి.

ఇది విన్నప్పుడు భైరికి తమ గ్రామంలో మీరయ్య కుటుంబం ఎట్టి దుర్గతిపాలైందో అనిపించింది. మచిలీపట్నంలో పరదేశి కుటుంబంఏమైందోననిపించింది. పరదేశి ప్రాణాలతో ఉందోలేదోఅని అనుమానం వచ్చింది. ఈ ఆలోచన కల్గిన తర్వాత అతనికి స్వగ్రామం వెళ్ళాలన్న కోరిక ఆరంభమైంది.

భైరయ్య మిత్రుడైన యువకుణ్ణిమాత్రం బంధించి మిగిలినవారి సొమ్ములు ఒంటిమీద నగలూఅన్నీ లాగుకొని కట్టుబట్టలతో వదిలివేయడానికికుత్తరువైంది.

దక్షిణాది యువకుణ్ణిమాత్రం దక్షిణాదివెళ్ళే ఓడల్లో ఒకదానిలో బందీగా తీసుకొని అతని తండ్రివద్ద పెద్దమొత్తంగుంజి విడుదలచేయడానికి సన్నాహంచేసి కలకత్తాకు పంపేశారు.

విశ్వేశ్వరునిపై భారంవేసి ఇంటికితిరుగు ప్రయాణం చేయాలనీ హైదరాబాదు చేరుకొని తరవాత త్రోవలో సంస్థానాధీశులతో తాముచూచినవి చెప్పివారిని మెత్తం విదేశీవర్తకులనుండి విముఖులను చేయాలనీ వారు సంకల్పించారు. అంతకంటేవారికిచేయగల్గింది కనపడలేదు. బంగాళంలోనూ, ఢిల్లీలోనూ తాముచేయగల్గిందానికంటే తమ మాటలు వినేదేశంలో స్వేచ్ఛగా దుబాసీ అవసరంలేకుండా తమ అభిప్రాయాలను వ్యక్తంచేయగల్గిన మనుష్యులమధ్య తాము పడాలని వాంఛించారు.

ఉదారుడైన వైద్యుడొకడు వీధుల్లో తిరుగుతున్న వారిమీద జాలి తలచి తనఇంట్లోనే రహస్యంగా ఉంచుకొని పోషించి స్వాస్థ్యం చేకూర్చి పంపినాడు.

తరువాత వారు కొన్నాళ్ళు కాశీలోని ధర్మసత్రాల్లో గడుపవలసిన వారైనారు.

ఈ రోజుల్లోనే వారికి కాశీలో పూజారిగా రబ్బాయి తటస్థపడ్డాడు. అతనూ భైరీ అప్యాయంగా కౌగిలించుకొన్నారు. భైరి తన అనుభవాలు చెప్పగా శర్మ తన యాత్రా విశేషాలు తెల్పినాడు. అతనెన్నో పుణ్యక్షేత్రాలు చూసుకొంటూ చివరకు కాశి చేరుకొన్నాడు. కాశి చేరుకొని చాల ఏళ్లు కావస్తూంది. పాండిత్యం కానీ కవిత్వంకానీ అబ్బలేదు. చివరకు పండాగా జీవితం కొనసాగిస్తున్నాడు.

"పుణ్యాత్ముడు. పిన్నవయస్సులోనే ఇన్ని పుణ్యక్షేత్రాలు చూడడం గొప్ప అదృష్టం" అన్నారు నరసింహనాయకర్.

"ఏమో ! నాకు మాత్ర మెక్కడా మనశ్శాంతి దొరకలేదని వ్యథ పడుతుంటాను. ఎక్కడున్నాడు దేవుడు ? ఎలా ఉంటాడు. ఏది జన్మకు సాక్ష్యం? ఇవి తీరని ప్రశ్నలుగానే ఉండిపోయాయి. ఎక్కడ చూసినా వ్యాపారసరళి. ధన దాహ మివేకన్పించాయి. వీటి పర్యవసాన మేమో తెలియదు."

"అనుభవంతో, ఆపరమేశ్వరుని అనుగ్రహంతో అన్నీ తేటతెల్ల మౌతాయి. ఆకాలం రావాలంతే."

"ప్రపంచ మిలా ఉండకూడదని తెలుస్తూంది. ఏలా ఉండాలోమాత్రం తెలీదు. ఉన్నంతలో కిరస్తానం మేలేమోననిపించింది. కొన్నాళ్ళు. అందులోనూ రాజకీయమే వ్యాపారమేనని తెలిశాక ఆజోలి మానుకొని స్వధర్మేనిధనం శ్రేయ: అని ఉంటున్నాం"

రామేశ్వరం మొదలు కాశీవరకు చూసిన విశేషాలు వివరంగా చెప్పేవాడు. అతని అనుభవాలు భైరి అనుభవాలకు భిన్నంగాలేవు. పోతే ఎక్కువగా దేవుడిపేర జరిగే వ్యాపారం చూసి అతని మనసు బండబారింది. తాంత్రికులు అఘోరీలు వల్లభమతం మొదలైన శాఖల్లో ఆచారాలనుగురించి చెప్తూంటే భైరికి మనసు కెలికినట్లయ్యేది.

శర్మ రంగన్న గురించి అడిగాడు. మంజరి గురించి అడిగాడు. ఇతరులను గురించి అడిగాడు. భైరి తెలిసినంత వరకు చెప్పాడు.

"అందరం తిరగి కలుస్తాం. రంగన్న. నేనూ. నీవూ తిరిగి తెల్గు ఓడల ప్రాభవాన్ని ఉచ్చదశకు తెస్తాం" అన్నాడు ఆకాశంవైపు చూస్తూ శర్మ

"తథాస్తు. శీఘ్రమేవాంధ్ర మహోదయ ప్రాప్తిరస్తు" అన్నారు నాయకర్.

"భైరి శర్మకూ తండ్రికీ దండం పెట్టాడు.

భైరి ఒకసారి గుసగుసల్లో అడిగాడు శర్మను.

"పెళ్ళీ పెడాకులు?"

పూజారిగా రబ్బాయి చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

"కోరంగి వచ్చెయ్యి. వెళ్ళిపోదాం."

"రావాలనే ఉంది. వెంటనే మాత్రంకాదు. కొంచం పరిస్థితులు కుదుటపడనీ. ఈ కాలంలో ఎక్కడి వారక్కడే ఉండడం మంచిది. ఏదారీ క్షేమంకాదు. మీరూ ఎక్కడికీ కదలవద్దు. బతికుంటే తరువాత ఏపనైనా చేయవచ్చు. ఎన్నాళ్ళైనా తిరగవచ్చు."

"లేదు మేం వెళ్ళి తీరాలి ?"

"అయ్యో ! ఈరోజుల్లో ప్రయాణా లాత్మహత్యా సదృశమేనే !"

అతనెంతో బతిమాలినాడు. కాశిలో మీకేలోటూ లేకుండా చూస్తానన్నాడు. అయినా భైరీవాళ్ళు పట్టుదల విడువలేదు.

"సరె ముహూర్తం నిర్ణయిస్తానూ. దారి మీరెన్నుకోండి. కాశిలో ఈ లోపల చూడవలసినవన్నీ ముగించండి. నాకున్నంతలో ఆతిథ్యం నెరుపుతా. ప్రయాణానిక్కూడా అన్నీ సమకూరుస్తా"

వారికి స్వగ్రామంచేరేందుకు రెండుమూడు మార్గాలున్నాయి. కలకత్తా చేరుకొని సముద్రం మీదుగా కోరంగి చేరుకోవడ మొకమార్గం. లేదా కలకత్తా నుండి నేలమీదుగానే ఒరిస్సాగుండా బరంపురం, ఇచ్ఛాపురం, విశాఖపట్నం, తుని, పెద్దాపురం మొదలైన గ్రామాలగుండా కోరంగి చేరుకొనవచ్చు. లేదా కాశీనుంచి పశ్చిమంగావెళ్ళి ప్రయాగచేరుకొని, అక్కడినుండి జబ్బల్‌పురం, నాగపురం, నిర్మల్ మొదలైన శహర్లగుండా హైదరాబాదు చేరుకొని అక్కడినుండి ఖమ్మంమెట్టు, భద్రాచలముల మీదుగా రాజమండ్రి చేరుకొని గానీ, మచిలీపట్నం ఏలూరుల మీదుగా రాజమండ్రి చేరుకొనిగాని కోరంగి చేరుకొనవచ్చు. మనవారు చివరి దారి నెన్నుకొన్నారు.

డబ్బు తక్కువకల్గి చేయవలసినవచ్చిన ప్రయాణమైనందున ప్రయాస ఎక్కువైంది. ఆయాపుణ్యక్షేత్రాల్లో గల ధర్మ సత్రాల్లో కొంతవరకు భుక్తిగడిచిపోయేది. గ్రామాల్లోకూడ వీరిని చూసి సంకటావస్థల్లోని సంపన్నులుగా గుర్తించి ఎవరైనా ఆతిథ్యమిచ్చేవారు. మధ్య మధ్య యాత్రికుల గుంపులో, లేక వర్తకుల గుంపులలో తగిలేవి. ఒక్కొక్కప్పుడు డిద్దరే వెళ్ళవలసివచ్చేది. అడవుల్లో జంతువులను వేటాడి తినేవారు. నదుల్లో, మడుగులో, చెరువులో తటస్థపడితే చేపలు పట్టితినేవారు.

అంతేగాని ఎవ్వరినీ దేహీ అని ఒక్కమారైనా అడిగినవారు కారు. తండ్రి కొడుకుల మధ్య చనువంతంత మాత్రమే కాబట్టి ఎక్కువ మాటలుండేవికావు. ఎప్పుడైనా ఏదైనా కొత్తవార్త తెలిసనప్పుడు దానిపై ఒకరి వ్యాఖ్యాన మొకరు తెలుసుకొనేవారు. వీలున్నంతలో భైరి తండ్రి సౌఖ్యం విడువకుండా చూచేవాడు,

ఒక్కొక్కప్పుడు మరొక వీలేదీ లేకపోతే కొన్నాళ్ళపాటేదైనా కొలువు చూసుకొనేవాడు భైరి ఆసంపాదనతో కొన్నాళ్ళపాటు ప్రయాణ భత్యం జరిగి పోయేది.

ఇంటికి త్వరగా చేరుకోవాలన్న కోర్కె బలంగా ఒకవైపు తోస్తూండేది. మరొక వైపాయాప్రాంతాల్లో వింతలు, విశేషాలు చూడాలన్న కోర్కె అంతకంటే బలంగా ప్రేరేపిస్తూండేది, ముఖ్యమైన యాత్రాస్థలాలు, వర్తక కేంద్రాలు చూసుకొంటూ ముందుకు సాగేవారు.

కాశి తరువాత వారు చూచింది ప్రయాగవద్ద త్రివేణీ సంగమం, అక్కడినుండి వింధ్యవాసినీక్షేత్రం చూసి అక్కడినుండి రామటెంకీమీదుగా జబ్బల్‌పూరు చేరుకొన్నారు. జబ్బలపూరు తరువాత నర్మద దాటి అనేక ప్రయాసలుపడి నాగపూరు చేరుకొన్నారు. ఆ తరువాత వారు చేరుకొన్న పెద్ద పట్నం నిర్మల.పంచ పాత్రల వంటి లోహపు సామానులకు, చెక్క బొమ్మలకు నిర్మల ప్రసిద్ధి. బొమ్మలకు నిర్మల ప్రసిద్ధి. కానీ ఈ మధ్య అనేక సంవత్సరాలుగా ఏర్పడిన ఒడుదుడువుల వల్ల కార్ఖానాలెత్తి పోయాయి. క్షేమంగా వెళ్ళి లాభంగా అమ్ముకొని రాగల్గిన పరిస్థితెక్కడా పట్నాల్లోను, తీర్థాల్లోనులేదు. రాజులు, నవాబులు సైన్యాధికారులు పరిశ్రమలవాళ్ళ నిష్టం వచ్చినట్లు కొల్లగొట్టుతూండిరాయె. పాతయజమానులందరూ దివాళాతీశారు. రాజధానిలో పలుకుబడి గల వడ్డీవ్యాపారులవద్ద పెద్దవడ్డీలకు మొత్తాలు తీసుకొని వృత్తి నడుపుకొంటూన్న కొందరు జీవచ్ఛవాలై మిగిలారు. వారి దరిద్ర మెంతకు దిగిందంటే, తాము తయారు చేసేలోహపు గిన్నెల్లో ఒక్కగా నొక్కటైనా

తమ ఇంట్లో వాడుకొనే పాటివారుకూడాకారు. నిర్మలలో తమకు పరిచితులెవ్వరైనా కన్పించవచ్చునన్న ఆశ మన వారిలో మినుకు మినుకుమంటూండేది, అది వమ్మైపోయింది.

నిర్మలలో వారికందిన వార్తలను బట్టి బంగాళంలో మీర్ ఖాసిమిప్పుడు నవాబ్గిరి వహించాడు. వర్తక వాణిజ్యాల్లో నష్టపోతున్న వారందరూ మీర్ఖాసిం మీదనే ఆశలు పెట్టుకొన్నారు. కంపెనీవారిప్పుడు బంగాళంలో ఆడుతున్న ఆటలు వర్ణించాడానికి మాటలు చాలవు. కారడవిలో క్రూరమైన బెబ్బులుల మధ్యనైనా తిరుగవచ్చునేమో గానీ, కుంపిణీ రాజ్యంలో బ్రతకడం కష్టంగా ఉంది. గుమస్తాలు, బంట్రోతులు, సిపాయిలు, సోల్జర్లు, కంపెనీ అధికారులు, ప్రతినిధులు అందరూ వర్తకులనూ, నేతవాళ్లనూ ఇతర పరిశ్రమల వాళ్లనూ పీక్కొని తినేవారే అయినా రింకేమి గతి !

వింటేనే మండిపోతూంది. సాక్షాత్తు నవాబు కోసమై వర్తకుడొకడింత సాల్టుపీటరును కొన్నాడని అందువల్ల తమ గుత్తహక్కు భగ్నమైందని అతన్ని కంపెనీవారు పాట్నాలో కటకటాల వెనుక బంధించారు. ఇంకితరుల గతేంచెప్పాలి ?

మొన్న మొన్నటి దాక అల్లివర్ధిఖాను బ్రతికి ఉన్నంత వరకూ బంగాళమే దేశంలో కల్లా ప్రశాంతంగా ఉన్నదీ, సుభిక్షంగా ఉన్నదీ. అక్కడే ఇలా తగలబడింది. ఇక మిగిలినచోట్ల చెప్ప నేల ?

అవధ్ నవాబు షుజా ఉద్దౌలావంటి నికృష్టుడు ఢిల్లీ సుల్తాన్వద్ద వజీరయ్యాడు. వాడొక్తి దుర్గుణాల పుట్ట.

పానిపట్టువద్ద అబ్దాలీ మహరాష్ట్రులను చిత్తుగా ఓండించాడు. ముత్యాలు రెండు భస్మయ్యాయి. మొహరీ లిరవై ఏడు నష్టపోయాము. పైసాలు, పావులాలు, రూపాయలు లెక్కకు శక్యంకానిదని వ్రాశాడట. అక్కడ జరిగిన జననష్టం

గురించి. నాథుడు లేక నల్దిక్కులకు చెదిరి, పారిపోయి వస్తున్న మహారాష్ట్రదళాలు దారిపొడుగు బలహీనులను కొల్లగొట్టుకొని పొట్టపోసుకొంటున్నారు.

మహారాష్ట్ర సైన్యం ఓడిపోయినందున వారి పొరుగు రాజ్యాలన్నీ సంతోషిస్తున్నాయి. పాపిష్ఠి చౌతుపేర మహారాష్ట్రులు వసూలు చేస్తున్న కప్పముల బాధ తొలగితే అంతేచాలు ! ఆపై విషయా లెవరికి కావాలి!

మహారాష్ట్ర సైన్యమిలా బయట చావుదెబ్బలు తింటున్నప్పుడే నిజాం తన పగసాధించేదుకు సైన్యాలను పూనాకు నడుపుతున్నాడు. తారాబాయి బ్రహ్మద్వేషాన్ని పురిగొల్పుతూ పీష్వాల పీచమడచి తాను సతారా నుండి రాజ్యమేలాలంటూంది. ఇందుకోసం నిజాము తమ్ముడూ దివానూ అయిన నిజామాలీతో కుట్ర పన్నుతూంది. పీష్వా నిస్సహాయుడై ఇంగ్లీషువారి సాయమర్థిస్తూన్నాడు. ఇంగ్లీషువారు చేస్తే నిజాముకు సాయము చేస్తారుగాని, మహారాష్ట్రులకు చేయ రనుకొంటున్నారు. ప్రబలుడైన శత్రువుతో బలహీనుడుపోరాడుతున్నప్పుడు బలహీనుణ్ణిబలపరిస్తే ప్రబలశత్రువుకు కొంత అడ్డుగా ఉంటాడు మరి.

ఫ్రెంచివారికి దక్షిణాదిని గల స్థానాలన్నీ ఇంగ్లీషువారి వశమైనాయి. వందవాసివద్ద ఫ్రెంచివారు చావుదెబ్బతిన్నారు. పాండుచేరి యావత్తూ ఇంగ్లీషువారి చేతుల్లో సర్వనాశనమైంది,

బంగాళంలో సన్యాసులు కొందరు తిరుగుబాటును లేవదీశారు

"దేశమంతా ఒకేసారి మంటలు చెలరేగుతునాయిరా ! ఆర్పగలవారు కన్పించడంలేదు ! భూమిమీద మంటలను నీటితో ఆర్పుతాము. సముద్రమే మండేందుకు మొదలైతే ఆర్పే దిక్కెక్కడిది?" అన్నాడు భైరి తండ్రి.

"ఇంత జరుగుతున్నా మనగ్రామాల్లోచూస్తున్నావా? చీమకుట్టినట్టైనా లేదు."

ఒక్కొక్కసారి తామింకా బంగాళంలో ఉంటే బాగుండేదేమో అనుకొనేవారు. కానీ ఇప్పుడు వెనుకకుతిరిగి వెళ్ళాలన్నా సాధ్యపడేవిషయంకాదు.

వారు నిర్మలలో కొన్నాళ్లు గడిపి హైదరాబాదు దిశగా బయలుదేరినారు. దారిలో గోదావరి దాటి కొన్న క్రోసులు ప్రయాణం చేసిన తరవాత ఖైరి తండ్రికి జ్వరం తగిలింది. సమీపంలోని ఒక గ్రామంలో వారికాతిథ్యం లభించింది. గ్రామస్థులు వారిని చేరదీసి తగు వైద్యం సహాయం చేశారు. స్వస్థత చేకూరి మరల ప్రయాణం కొనసాగించేందుకు కొన్నాళ్లుపట్టింది.

ఈలోపున వారున్న గ్రామంలో ఒక నరబలి జరిగింది. ఆ గ్రామవాసుల నాబలినుండి మాన్పించడానికి కృషిచేసి కూడ వారు ఫలితం పొందలేకపోయారు.

ఆ ప్రక్క గ్రామంలోనే మరొకచోట ఒక స్త్రీ సహగమనంచేసింది. దాన్ని గురించి గొప్పలు పల్కుకొంటూంటే మనవారికి వినడానికే కష్టంగా ఉండేది, దేశంలో ఎన్నో విషయాలు జరుగుతూన్నప్పటికీ గ్రామవాసులకు వాటిని గురించింతైనా పట్టకపోవడ మాశ్చర్యంగా ఉంది. "రాముడైతేనేమి రావణుడైతేనేమి మన పిండి మనం విసురుకొనక తప్పదుకదా" అంటూ రాజకీయంకోసం పోరాడుతున్న శక్తులన్నిటినీ గ్రామీణులొకవిధమైన నిర్లక్ష్యంతో చూస్తూన్నారు. ఒక్కొక్కప్పుడు యుద్ధభూములకు కనుచూపుమేరల్లో ని పొలాల్లోకూడా అరకలు విప్పక పోవడం కద్దు.

కొన్నాళ్ళింకా విశ్రాంతి తీసుకొనవలసి ఉన్నప్పటికీ మనసు నిలవకవారు ముందుకు సాగినారు. త్రోవలో దట్టమైన అడవిగుండా కొన్ని రోజులపాటు ప్రయాణం. అడవిలోని అందానికి వారు పరవశులయ్యేవారు. అడవిలో భయంగొల్పే కారణాలున్నప్పటికీ ప్రకృతి కొలిపే ఆకర్షణంతా ఇంతాకాదు. కాలపురుషుని కనుపాపలో తన ప్రతిబింబం చూసుకొని ప్రకృతి
స్వేచ్ఛగా స్వైరంగా రూపు దిద్దుకొన్న రూపమిది.

క్రమంగా అడవి దట్టమౌతూంది. దారిరుకౌతూంది. తగిన సంఖ్యలో కాకుండ కొద్దిమందితో ప్రయాణం చేయడం ప్రమాదమనీ, తగు రక్షణతో పయనిస్తున్నవా రెవరైనా లభించేవరకు ఆగాలనీ, ఆ మొగలోనివారు మన వారిని హెచ్చరించారు, కాని వీరాగలేదు.

"మన వద్దేముందని మనము దొంగలకు భయపడాలి?"అనుకొన్నారు వారు. అందుచేతనే కొందరు బైరాగులతో కలిసి ప్రయాణం కొనసాగించేందుకే నిర్ణయించారు. గోసాయీల తోడుండటంవల్లా కాలక్షేపంబాగా ఔతూంది. ప్రయాస ఆట్టే తెలియడం లేదు.

ఒక్కొక్కప్పుడు వారు భజన చేస్తూ పరవశులై నడుస్తారు. ఒక్కొక్కప్పుడు రాధా మాధవుల రతికేళుల నుగ్గడించి శ్రావ్యంగా పాడుతూ నడుస్తారు. ఒకసారి తాము చూసిన యాత్రాస్థలాల్లోని విశేషాలు ముచ్చటించుకొంటూ నడుస్తారు. కొంతదవ్వు తమకు నచ్చని మతాలను, మతాధిపతులను అపహసిస్తూ గడుపుతారు. కొంతదూరం తమ పూర్వాశ్రమ విశేషాలను గుసగుసల్లోను, సంకేతాలతోను స్మరించుకొంటారు. ఇవన్నీ ఒకెత్తు. వారు గంజాయి పీలుస్తూ ప్రసంగాలు చేయుట మొక ఎత్తు.

ఒకడు రసవాదాన్ని చెప్పుతూ పరుసవేదిని తయారుచేసే సామగ్రిని, ప్రక్రియలను వర్ణిస్తాడు. ఒకడు స్త్రీ వల్లనే ఈ ప్రపంచంలోని పాపమంతా పుట్టిదంటాడు. ఒకడు స్త్రీ శక్తి స్వరూపిణి, స్త్రీ లేనిదే సృష్టేలేదు పొమ్మంటాడు. ఒకడు స్త్రీ పురుషుల భోగార్థమై సృష్టింప బడింది, ఇతర జంతుజాలానికివలె, స్త్రీకి కూడా స్వర్గసౌఖ్యంగానీ ముక్తి చెప్పబదలేదు అంటాడు. సృష్టిలో కులమన్నది బ్రాహ్మణులు కల్పితమేకానీ, ఈశ్వరుడు చేసింది కాదంటాడు. కులం నడవడివల్లనే కానీ జన్మలవల్ల కాదంటాడు వాడే. అన్నీ ఈశ్వరార్పణం చేస్తేచాలు, ఏ పాపమూ లేదంటాడొకడు. పాపమేమిటి పుణ్యమేమిటి అంతా ఈశ్వర విలాసం !

బ్రాహ్మణులు క్షత్రియుల నొకప్పుడు చిత్రహింసచేసి విడిచారు. తరువాత బ్రాహ్మణులను క్షతియులను కలిపి ముసల్మానుల ప్రాణంతీశారు. ఇప్పుడందరినీ అదుపున పెట్టేందు కీశ్వరు డింగ్లీషువారిని మనదేశం మీదికి పంపినాడు! అంటున్నాడొకడు.

ఒక్కొక్కప్పు డందరూ వింతగా మర్మ ప్రసంగాలు నెఱపుతారు.

"చిదిమిపట్టిన బంటుకై వడి చీమ ఏనుగు మింగెరా

విగ్రవీగుచు కేకవేయుచు ఈగ మంచము మింగెరా
చిచ్చు కడుపున చీకటి బుట్టె
చీకటి కడుపున చిచ్చుబుట్టి
చిచ్చు చీకటేకమైతేనూ
ఓ యాగంటి లింగా !
చిన్నెలాడి బాలపుట్టెనూ"
గంగ యమునల నడుమరా
సంగమున్నది చూడరా
సంగములో స్నానం చేసితె
లింగ రూపము నీవెరా
నక్కయొక్కటి యుండెరా
కుక్కలను ఎగదోలెరా
చిక్కుచేతను చీమ మకరిని
కప్ప నొకటిని చూచెరా
చప్పుడేమియ చేయకుండగ
నిప్పులోబడి చచ్చెరా"
ఒకడు విలువైన జీవితాన్ని నికృష్టంచేసి ఓంద్ర పెట్టాడు.
"ఏమి జన్మం బేమి జీవనము ఈ మాయకాయం
బేమిజన్మం బేమి జీవనము.
ఏమి జన్మం బేమి జీవన మేమిశాశ్వత మేమి సౌఖ్యము"
ఒక సారి,
"ఏమి నాప్రారబ్ధకర్మము
స్వామి నన్నిటుచేసి మరచెను"
అంటూ మెట్ట వేదాంతం వినిపిస్తారు.

లేదా ఈ కలికాలాంతం సమీపించిందనీ ఎవరో ఒక మహానుభావుని రూపంలో భగవంతుడవతరించి దుష్టసంహారం చేస్తాడనీ పాడేవారు. లేదా సంఘంలో వస్తున్న మార్పుల మంచి చెడులను వివేచన చేయలేక అన్నిటికీ ఏడుస్తూ భగవంతు డవతరించి తిరిగి నీతి, రీతి ఏర్పరుస్తాడని ఆశించే ప్రసంగాలు చేసేవారు. విధవ పెళ్లాడినా, రాజే ప్రజలను పీడించి కొల్లగొట్టినా,తురకలు దేవాలయాలను భ్రష్టుచేసినా, రాజాశ్రయంలో నీచులు, స్వార్థపరులూ బలుస్తూండినా, రాజాధికారులను సామాన్య డొక దెదిరించినా అన్నిటికీ వారొక మాదిరి ఏడ్పే ఏడ్చేవారు.

సజీవసమాధి, గండకత్తెర మధ్య మెడ కత్తిరించుకోవడం, సిడికి వ్రేలాడటం, పేరంటాలుకావడరా ఇటువంటి ఘాతుక కృత్యాలను గొప్ప చేస్తూ ప్రసంగిస్తా డొక్కడు.

సత్తు, చిత్తు పరమాత్మ అంటూ జీవితాని కర్థాలు తీయను ప్రయత్నిస్తా డొక్కడు.

“అల్లాపంపిన ప్రవక్తకాక నిజం చెప్ప గల్గిన వాడెవడ్రా ప్రపంచంలో. అల్లా ప్రవక్తద్వారా పంపిన సందేశాన్ని అక్షరాల పాటించవలసిందే కానీ దాన్ని మామూలు తర్కంతో పరిశీలించడం దైవద్రోహమే. ప్రవక్త తలపాగా కట్టినప్పుడు మూర భుజాలమధ్యగా దిగవిడిచేవాడుకదా, నేటివాళ్లు ఎడమవైపుకోకుడివైపుకో ముందు కెదమీదికి లాగుకొంటున్నారు. అదేమందమో! అదీ ప్రవక్తపట్ల అపచారమే నంటాను నేను” అంటా డొక్కడు.

“అదేమిటిభాయీ ! కొరానులో చెప్పిందేమిటి ? ఎక్కడ తిరిగి చూచినా దేవుడే కన్పిస్తాడనిలేదూ ? ఇబ్న్ అరాబీ ఏమన్నాడు?”నా మతం ప్రేమమతం. నాహృదయ మన్ని రూపాలనూ స్వీకరిస్తుంది. నా ఎడద గజళ్ళ ఉద్యానం. అదిక్రైస్తవ సన్యాసులకు కాన్వెంటు విగ్రహాలకాలయం. యాత్రికుల కాబా, యూదుచట్టాలు కొరాను చెక్కబడిన ఫలకం,”

వీటిలో భైరీ, భైరి తండ్రీ యిష్టమైనప్పుడు  మాట కలిపేవారు. లేదా దూరంగా నడిచేవారు. భజనలైతే మాత్రం భైరి పాల్గొనేవాడు,

భైరి తండ్రికీ వ్యాసంగాలు కొత్తకాదు. భైరికి మాత్ర మీ వ్యాసంగాలతో మునుపెన్నడూ పరిచయం లేదు. "ఇంత పౌరుషహీనంగా  ఉన్నాయేం నాన్నా వీళ్ళల్లో చాలమంది ఆలోచనలు?  అనడిగాడు  తండ్రి నొకసారి.

"వీళ్ళల్లో ఒక్కొక్కరినీ దేవుండ్లతో సమానంగా కొలిచేవారు. చాల మందే ఉన్నారు మన దేశంలో ! అది మరచిపోకు !"

"నిజమే!"

"ఇదే నేను  నీతో చాలాకాలంగా చెప్పుదా  మనుకొంటున్నా. పాశ్చాత్య వర్తకుల  బలం మీ రనుకొన్నట్లుగా  ఒక్క  నౌకాసైన్యంలోమట్టుకే లేదు. ఇంగ్లీషువారికీ, ఫ్రెంచివారికీ మధ్య యుద్ధంలో నౌకాసైన్యాలు ప్రధాన పాత్ర వహించిన  మాట  నిజమేమోకానీ ఇప్పుడు పరిస్థితి చాలా మారిపోయింది. ఇప్పటి వారి వారి స్వదేశాలతో ఎడతెగకుండా సంబంధాలు పెట్టుకొనడానికీ, ఇతర యూరోపుదేశాలతో పోటీలో నిలదొక్కుకోడానికీ నౌకాసైన్యమే ముఖ్యకారణం కావచ్చు. కానీ మనదేశంలోవారు ప్రధానశక్తి కావడానికీ ? దీన్ని  గురించే నేను కొంత కాలంగా అలోచిస్తుచున్నాను. కాలపురుషుని లీలలంత సులభంగా అర్థంకావు !"

"మన రాజులయోగ్యులు కావడమే కారణం"

"వారి రాజులంతకంటే  తక్కువ  తిన్నారా ?  ఏ కంపెనీ వారితో మాట్లాడినా ఇట్టే తెలుస్తుంది. మనరాజుల్లో నవాబుల్లో ఎన్నెన్ని అవలక్షణాలున్నాయో పాశ్చాత్యదేశాల్లో రాజుల్లోనూ అన్నీ ఉన్నాయి. స్త్రీలోలురు, పానమత్తులు, పిరికివారు సాహసానికి వెరచేవారు, రాజనీతిలో ఓనమాలు కూడా రానివారు, పరస్పర విద్వేషాల్లోను, అనుమానాలతోను మండిపోయేవారు, విపరీతమైన మూఢ విశ్వాసాలు కలవారు, సాగితే ఎంత దౌర్జన్యమైనా  కించిత్తు విమర్శ లేకుండా  జరిపేవారు

అక్కడా ఇక్కడా ఉన్నారు. వ్యక్తిగతంగా సుగుణాలులేవు. రాజకీయాలైనా ప్రయోజనకారులైతే చాలు ఫరవాలేదను కొంటే అదీ కరువాయె."

"అలాకాదు నాన్న ! అక్కడి రాజులెలాటివారైనా ఇక్కడికి వచ్చిన వారిలో సమర్ధులున్నారంటాను."

"వర్తక కేంద్రాల్లోనా ! సామర్ధ్యమంటే అన్ని నీతులూ తోసివేసి ప్రవాహంలోపడి కొట్టుకొని పోవడమా ? క్లైవు చేసిన పనులు బూసీచేసిన పనులూ అలాంటివే! వారికంటే మన సైన్యాధిపతుల్లో యోగ్యులూ, సమర్ధులూ చాలమందున్నారు !"

"ఆయుధాలు ?"

''వారి ఆయుధాల నిప్పుడు మనవా రుపయోగిస్తున్నా గెలవలేకపోతున్నారు. వారే మన సైన్యాలను నడిపినా మనపక్షంవా రోడిపోతున్నారు. అదే మన సిపాయిలతో నిండిఉన్నా వారిసైన్యాలు విజయం సాధిస్తున్నాయి.''

ముసలాయ నింకా కొనసాగించాడు.

"మనకంటేవారు నాగరికులందామా ? అదీకాదు. వారి స్వదేశ పరిస్థితులను గురించి వింటే అక్కడా ఇక్కడా ఒకలాగే ఉంది. లండన్‌లో నిరాయుధులై తిరగడం క్షేమంకాదంటున్నారువారు. నీతి, మర్యాద చట్టమూ ఏవీ జనాన్నదుపులో పెట్టటంలేదు. అన్నిరకాల నేరాలు జరుగుతున్నాయట అక్కడ ! జూదం, దొంగవర్తకం, దొంగవిదేశీవర్తకం, జంతువులతో పందేలు, వ్యభిచారం అన్నీ పెచ్చుమీరి ఉన్నాయట. ఇంక వారి కాపురాలమాట, రామ రామ ! లేచిపోవడాలు, బహుభార్యాత్వం, బహుభర్తృత్వం, దొంగపెళ్ళిళ్ళూ మొదలైనవన్నీ ఎక్కువౌతున్నాయట. పెళ్ళాలను వేలంపాటలో అమ్మివేయవచ్చుటకూడా. కాబట్టి వారుత్తములై యుండి మనం హీనులైమైఉండి ఓడిపోవడం లేదు.

"అయితే ఏంకారణ మంటావు నాన్నా!"

"మన తత్వాల్లోనూ మతాల్లోనూ గొప్పను మరచిపోయి హీనాచారాలు పట్టుకొని ప్రాకులాడుతున్నాం. జనంలో వీటివల్ల మనిషి ప్రాణం కంటే పిడిసూత్రాల

కెక్కువ విలువ నిచ్చే అవగుణం పెరిగిపోయింది. ఇప్పుడూ ఎందునా విశ్వాసంలేక తమ స్వార్ధమే చూసుకొనే నికృష్టులు ఏస్థాయికా స్థాయిల్లోపెత్తనాన్ని తమగుప్పెటలోపెట్టుకొని ఈపిడిసూత్రాలపేరిట జనంలో ప్రతిక్రియను మనసా, కర్మణా అణగ గొట్టున్నారు. మనజనంలో విధి, అదృష్టం, కర్మ ఇటువంటివన్నీ దౌర్జన్యాన్ని, దుర్మార్గాన్ని సహిస్తూచచ్చిపోయే మానసిక దౌర్బల్యమెక్కువగా ఉంది. దీనికి తోడు మనలో మనమంతా ఒకటన్న భావమూలేదు. మనందరికీ ఒక లక్ష్యముందనీ, మనలోమన మెన్ని తగాదాలుపడినా ఆ సమిష్టి లక్ష్యం దెబ్బతింటున్నప్పుడేకమైతేగానీ బ్రతకలేమనీ ఒక భావనలేదు. కులాలూ, ధర్మశాస్త్రం ఈ సామరస్యాన్నే నాటినుంచో వమ్ముచేశాయి. కనీసం నేరవిచారణలోనూ, నేరానికి శిక్షలోనూ కూడా సమానత్వంలేదు. ఖాజీల ధర్మశాస్త్రాంలో ముస్లిం వ్యతిరేకంగా కాఫర్ సాక్ష్యం చెల్లదు. హిందూ ధర్మశాస్త్రంలో పై కులాలవారికి వ్యతిరేకంగా కింది కులాలావారి సాక్ష్యం పనిచేయదు. శిక్షలూ అంతే. ఒకే నేరానికి బ్రాహ్మడికి తక్కువ శిక్ష శూద్రుడి కెక్కువ శిక్ష”

ముసలాయన క్షణంపాటు మౌనం వహించాడు, కుమారుడి ముఖంలోకి దీక్షగా చూచాడు. కుమారుడు శూన్యంలోకి చూస్తున్నాడు, ఆయనింకా ఇలా అన్నాడు.

“మన సామాన్య జనుల్లో ప్రాణానికి విలువ పెంచాలి. శరీరహింస పారమార్థిక సాధనమన్న భావం తొలగించాలి. కులాలూ, ఇతర కృత్రిమవిభేదాలూ మనిషికీమనిషికీమధ్య సమాజంలో అసమానతను సృష్టించే అడ్డుగోడలు కాకూడదు. వారి స్వవిషయంలో ఎవ్వరేం పాటించు కొంటేనేం? ఏమతం పాటించు కొంటేనేం ? సామాజిక వ్యవహారాల్లో సత్ఫలితదృష్టి ఒకటే కల్గి కలిసి మెలిసి పనిచేయాలి. ఇదేర్పడితే తప్ప మనకు ముక్తి లభించదనిపిస్తోందిరా !” అని ముసలాయన చాలించాడు.

కుమారుడు వాదం మరిపెంచలేదు. కానీ ఆవిషయాలనే మననం చేసుకొంటూ నడుస్తున్నాడు. కుమారుని మౌనం చూసి ఆయన–

"లెక్చర్ చాలించాడు."

పడవతను వాక్యం పూర్తిచేయకుండానే విద్యార్థి ఒకడు మధ్యలో పుల్లవేశాడు.

"నోరుమూసుకో" దానికి మరొక విద్యార్థి అసహనం చూపినాడు.

"సింహం వచ్చి పెద్దపులి మీద పడితే దానికి సిద్ధాంత మేమిటి ?"

"జింకల మాట ?"

"జింకల జింకలే. ఎల్లప్పుడూ వేటాడబడటం. ఇతరుల కాహారం కావడం (అలంకారానికి జూలోనే ఇంట్లోనో ఉంచుకొన్నప్పుడు తప్ప) వాటి ధర్మం !"

"ధర్మం కాదు, కర్మ !"

"నీవు చెప్పే దొక విధంగా రైటే," విద్యార్థినాయకుడు కలుగజేసుకొన్నాడు. "కానీ, మనిషి తెలివితేటలున్న ఉత్తమ జీవి, కనుక చిరంజీవి. కనుక జింకలా ప్రకృతి ధర్మానికే కట్టుబడీ అంతరించిపోక ప్రకృతిని జయించు కోగలడు. మనమంద ఎదగడానికేం చేయాలో ఆలోచించుకోగల్గిన సామర్థ్యమున్న వాళ్ళం . మనం అది ఉపయోగించుకోవాలి"

ఆ ఆలోచనేదో మా అందరిపరంగా నీవుచేయి. మేం కథ వింటాం. "ఏమయిందయ్యా ప్రయాణం ?"

పడవవాడు : "ఇలా వెడుతున్నంతలో వీరి గుంపుయావత్తు దొంగల చేత చిక్కినారు. అన్ని పారమార్థిక చర్చలూ కట్టుపడిపోయి దొంగలను కాళ్ళావేళ్ళాపడి ప్రాణభిక్షనడుగుకొంటున్నారు గోసాయిలు. (దొంగలూ మిథ్యే, బ్రతిమిలాడడము మిథ్యే, వారి పూర్వచర్చలన్నీ మిథ్యేకాబట్టి ఇక్కడ వారి ప్రవర్తనను గురించి చర్చించే ప్రసక్తిరాదు.) వీరికి ప్రాణమంటే తీపేగానీ అభిమానాన్నంత సులభంగా దాచుకోలేకుండా ఉన్నారు. నాయకరూ భైరి సంపన్నులని దొంగలు పసిగట్టినారు. తమడబ్బునే వజ్రాలు గానో మార్చుకొని కడుపునదాచుకొని ఉ

ండాలని అనుమానించారు. నిజస్థితి వివరించినా వారు నమ్మలేదు. పొట్టచీలుస్తామన్నారు. తండ్రి కొడుకు లెంతగానో వారికి చెప్పిచూచారు. "ఇదేం వృత్తిరా, మా ఇండ్లకు రండి. మీవంటివారి కుటుంబాలు పదిపుంజీలకన్నం పెట్తాముర్రా! ఇది కానికాలమైందికానీ'' అంటూ నాల్గుతిట్లు తిట్టినారు. వేడుకొన్నారు. మంచిని రెచ్చగొట్టే మాటలాడినారు. తప్పించుకొనే ప్రయత్నంచేశారు. ఇతర ఆశలుచూపారు. అన్నీ విఫలమయ్యాయి.

ముసలాయనింకా ప్రయత్నంలాభంలేదనుకొని చివరిసారిగకొడుకుతో నాల్గుమాటలు చెప్పాలని మొదలుపెట్టాడు.

''నాయనా పూర్ణాయువుపోసుకొని బ్రతకాలనే ఉందిగానీ అంతమాత్రంచేత చావంటే వెరపులేదురా నాకు! ఓడల్లో తిరిగే మనకు అకాలమరణాలూ సంభవమేకద! నిన్నైనా వీళ్ళు మిగిలించి, నీ విల్లుచేరితే అక్కడవాళ్ళు సజీవంగా మిగిలిఉంటే చిన్నాన్నకు, అత్తయ్యకు నా చివరి నమస్కారాలు తెలుపు. మీ అమ్మను తల్చుకొన్నానని చెప్పు.

నీ వంటి కొడుకును కన్నందుకు గర్వంగా ఉందిరా అయినా ఒకటి జ్ఞాపకముంచుకో! ఇప్పుడు దేశం బాగుపడేందుకు రాజులచుట్టు తిరిగితే లాభం లేదురా జనుల మనస్సులు మార్చాలి. వారాలోచించే పద్ధతిని సంస్కరించాలి. ఉన్నత లక్ష్యమొకటి నిర్ణయించుకొని దానికవసరమైన త్యాగం ప్రతివారు చేసి సాధించే ఉదారులుకావలి మనవాళ్లు ! ఈ కృషిలో ఆయ్యావ్యక్తులు చూపించే శక్తిసామర్థ్యాల తారతమ్యంవల్ల కలిగే అంతరం మినహ మిగిలిన ఎక్కువ తక్కువలేవీ సమాజంలో ఉండరాదు. దీనినిప్పుడు సమాజంలో నిష్ప్రయోజకంగా గొప్ప ననుభవిస్తున్నవారు కొందరడ్డుకొనవచ్చు. అసమర్థులైన రాజులు, రాజోద్యోగులు, విద్యాగంధమబ్బని అగ్రవర్ణాలవారూ ఇల్లాగ. వారిని నిర్దాక్షిణ్యంగా పడగొట్టియైనా సమాజంలో అభివృద్ధిసాధించాలి. దీనికి చాల సాహసమూ పట్టుదల కావాలి. బొబ్బిలియుద్ధభూమిలో మనవారుచూపిన శౌర్యం కంటే ఎక్కువైనదికావాలీ కృషికి...''

ఇంకా ఆయనేదో చెప్పబోతున్నంతలోదొంగలాయనపొట్టను చీల్చనే చీల్చారు. భైరి అఘాతుకాన్ని చూస్తూ మూర్ఛపోయాడు.

కథ చెప్తున్న పడవవాని గొంతికక్కడ కొన్ని వాక్యాల్లో జీరచూపింది.

విద్యార్థులందరూ విచారంగా ఉన్నారు. ఒకరిద్దరికి వెక్కిళ్ళు పట్టాయి కూడా. విద్యార్థి నాయకుడు దీర్ఘాలోచనలో ఉన్నాడు. రాముడు కన్నీళ్ళను అతి కష్టంమీదాపుకొంటున్నాడు. ఎవరూ మాట్లాడే స్థితిలోలేరు,

పడవవాడు క్షణమాగినాడు. చుట్టూ నిశ్శబ్దం. మబ్బుకమ్ముతున్నట్లు పసిగట్టాడు. ఒకసారి వెళ్ళి పడవకు నీళ్ళువచ్చాయేమో చూద్దామనుకొన్నాడు. కానీ విద్యార్థులు కథలో చూపుతున్న ఆసక్తి చూడగా అతనికి మధ్యలో వెళ్ళాలని పించలేదు. ఈపాటికి నీళ్లెల్లాగారావు. కథ కొనసాగించాడు.

"మూర్ఛతేరేప్పటికి అల్లంతదూరంలో తండ్రి మృతదేహమూ, తాను మిగిలినారు, ఆ స్థితిలో కట్టలు తెంచుకొన్న ప్రవాహంలా అతనిలోని దు:ఖం పెల్లుబికింది. అతని శోకాలకు కొండలు అడవులూ దద్దరిల్లినాయి. తరువాతెట్లో ఆకొండంత దు:ఖాన్నీ అతడు దిగమింగినాడు. మనసు రాయిచేసుకొన్నాడు. తండ్రి శరీరాన్ని సమీపగ్రామానికి చేరవేసినాడు. అక్కడ వీలైన శవ సంస్కారం జరిపించాడు. ప్రయాణం సాగించాడు

హైదరాబాదు చేరినాడు. సేదదీరేందుకతనొకటిరెండురోజులున్నాడు. ఎరిగున్న వర్తకుల జాడ తెల్సుకొని వారి సహాయంకోరడానికే భైరికి మనస్కరించలేదు. ఇంక నవాబుగారి ఆస్థానంలో ఎవరినైనా కల్సుకొనేమాటడిగే దేముంది? నిజామాలీ ఇప్పుడు మహరాష్ట్రులతో మంచి అనుకూలమైన సంధికుదుర్చుకొనివచ్చి బీదరులోఉన్నాడు. నిజాం గద్దెకోసం అన్నగారిమీద కుట్రలు పన్నుతున్నాడు. మహారాష్ట్రులతోను మైసూరుతోను యుద్ధాల్లో ఫ్రెంచి ఇంగ్లీషూ ఈ ఇద్దరిలో ఎవరిసాయముపయోగంగా ఉంటుందనే ఇప్పుడు వారితాపత్రయమంతా. ఇంగ్లీషువారిపరంగా కొందరువాదిస్తే ఫ్రెంచి వారి పరంగా కొందరు వాదిస్తున్నారు. సర్కారులనేంచేయాలన్న సమస్య ఒకటుండనేఉంది.

ఈ పరస్పరం పెద్దవాళ్ళలో రాయబారాల సందర్భంగా బహుమానాలకు పనికివచ్చే అపూర్వ వస్తువులకు గిరాకీ బ్రహ్మాండంగాపెరిగిపోయింది. దాన్ని చాకచక్యంగా ఉపయోగించుకొనగల వర్తకులుగొప్పగా లాభ పడుతూ, ఈరాయబారాలను నానుతూండేలా చేయగల్గింది చేస్తున్నారు.

తల్చుకొంటే భైరికూడా ఆవర్తకులతో ఒక అంగీకారానికి వస్తే కోరంగి నుండి అట్టి వస్తువులు బోలెడు సరఫరా చేయవచ్చు. భైరి ఇవేవీ పట్టించుకొనలేదు. ఒక్కబిగిని హైదరాబాదు నుండి బందరుచేరుకొన్నాడు.

పరదేశి అత్తవారిల్లు యావత్తు నాశనమైంది. సంపద యావత్తు దోచుకోగా తీసుకొనిపోలేని మొండి గోడలు మాత్రం మిగిలిపోయున్నాయి. వారి జాడ చెప్పేవారూ కన్పించలేదు. అక్కడినుండి అతను కోరంగికి బయలుదేరినాడు.

కోరంగి సమీపిస్తూన్నకొలది అతని కాళ్ళు గబగబ నడుస్తున్నాయి. మనస్సు మాత్రంవెనుక కీడుస్తూంది. గ్రామంలో తనేయే అనాహుతాలు చూడాలో! ఏయే కుటుంబాలే దుర్గతి పాలయ్యాయో! తన పిన తాతగార్కి తన తల్లికి, అమ్మమ్మకు తండ్రి మరణవార్త ఎలా తెలుపాలి? వారు క్షేమంగా ఉన్నారా? ఈ ప్రశ్నలతని ప్రాణాలను తోడేస్తున్నాయి. కోరంగి సమీపగ్రామాలు చేరుకొనగానే భైరయ్య తన్నెవరైనా ఈ స్థితిలో గుర్తిస్తారేమోనని బిడియపడుతూ చీకటిని ప్రయాణం సాగించాడు.

అతను కోరంగిచేరుకొనే సమయానికి రాత్రిచాల భాగం గతించిపోయింది. అతన్ని చూచి కుక్కలు మొరుగుతున్నాయి. దొంగలా ప్రవేశించవలసివచ్చినందుకతని మనస్సెలా అయిందో ఏం చెప్పను? అయినా ముందింకా ఎంతటి కఠోరాన్ని చూడాలో అని అతను మనస్సును దృఢపరుచుకొన్నాడు. "ఎవరది?" అని గ్రామస్థుడొకడు నిద్రలోనేఆవలించి ఎవరో పరదేశి లెమ్మని పడుకొన్నాడు.

అతని గొంతు భైరికి పరిచితమే. మారు పల్కకుండా ముందుకుసాగినాడు. ఇంటి ముంగిట చేరుకొన్నాడు. ఇంటిలో ఏఅలికిడి

లేదు. అందరూ నిద్రిస్తునారా? ఇంట్లో ఎవ్వరూ లేరా? ఇంటిముందు మామూలుగా వెలిగే వీధిదీపమూలేదు. ఇంటరుగు మీద గూటిలో దీపమూ లేదు. ఇంటి ముందుభాగాలన్నీ కళమాసి ఉన్నాయి. పిలిచేందుకు భైరికి నోరు పెగలలేదు. అయినా సర్వశక్తులూ కూడా గట్టుకొని "అమ్మా" అన్నాడు. అతను తారాస్థాయిలో అరిచానను కొన్నాడుగానీ పిలుపు చాల నీరసంగా వచ్చింది. ఇలా అతను రెండు మూడు సార్లరచి ఇంకరవలేక పడిపోయినాడు.

ఇది లోపలివారికి అలికిడిలా విన్పిస్తూంది. ఇంట్లో కుక్కమాత్రం మొరుగుతూ కట్టుతెంపుకొని ఇవతలికి వచ్చేందుకు గింజుకొంటూంది.

ఇంట్లో ఎవ్వరూలేరు. మందీమార్బలమూ అంతా ఐశ్వర్యంతోపాటే పోయారు. లోపలిద్దరాడవాళ్ళు మాత్రమే ఉన్నారు. అమ్మమ్మ, భైరితల్లీ.

భైరి పినతాతగారు చాల విషాదకర పరిస్థితుల్లోమరణించి మూడేళ్ళు కావస్తున్నాయి. భైరి తల్లి మంచం మీదుంది. తమ ఓడలకు పట్టిన దుర్గతి, తన భర్త కుమారుడు వీరిజాడింత వరకు తెలియకపోవడరాఇవామె మనస్సుకు పట్టిపోయి ఆధితో మంచం పట్టింది. ఈమె మంచం పట్టిన మొదట్లో ఒక రోజు రాత్రి ప్రాణానికి ముప్పు వస్తూందేమోనన్నంత భయం కలిగింది. ఘన వైద్యుడొకడు యానాంలో ఉన్నాడనీ అతని కొకసారి చూపించవలసిందనీ చుట్టుప్రక్కల వారందరూ సూచించారు. అప్పుడు మనిషిని పంపితే వారు రాకపోవచ్చునన్న అనుమానంతో ఆయనే ఇద్దరిని తోడు తీసుకొని ఫ్రెంచి ఫాక్టరీ వాసులున్న చోటికి గుర్రాలమీద దౌడు తీస్తూ వెళ్ళినారు. క్షణాల ఆలస్యము కూడ ఒక్కొక్కప్పుడు ప్రాణాలకు ముప్పు తేవచ్చు!

కానీ యానాం చేరుకొన్నాక వైద్యునికోసం వీరు వెతుకుతున్నంతలో వీరువచ్చిన విషయం ఫాక్టరీ ప్రధానోద్యోగికి తెలిసింది. అతను ముసలాయనను మిగిలినవారి నుండి తప్పించి బందీచేసి ఫ్రెంచివారి దురాగతాలను దూషిస్తున్నందుకూ, అడ్డుకొంటున్నందుకూ ప్రతీకారంతీర్చుకొన్నాడు. తప్పతాగి

మూర్ఖుల నతనిపై కెగ్రదోసి కలహంపెంచి అందులో అతని ప్రాణాలు తీసినాడు. ఒకవైపు మిగిలినవారి వెంట వైద్యుని పంపినాడు ఎంతో ప్రేమను నటిస్తూ.

ఇక్కడ కోడలు ప్రమాద దశదాటి కొంత బాగుపడింది, కానీ రోజుల గడిచినా ఆయన జాడలేదు. ఆయనెక్కి వెళ్లిన గుర్రం మాత్రం తిరిగి వచ్చింది. దాన్ని చూడగా అదెక్కడో ఇన్నాళ్ళూ నీళ్ళూ నిప్పులూ లేకుండా చూచేవారు లేక కట్టివేయబడి ఉందనీ, పెనుగులాడి కట్లుతెంపుకొని వచ్చిందనీ ఆ ప్రయత్నంలో తుపాకిగుండు కెరయైందనీ తెలుస్తూంది. పాపం ఇంటి ముందుకు వచ్చి ఇల్లంతా తన రౌతుకోసం తిరిగి ఆయన కానరానందుకు బాధతో సకిలించి ప్రాణాలు వదిలింది. అప్పుడేదో మోసం జరిగిందని అంతటా వెతికినారు. వెతగ్గా ఒకచోట మారుమూల సముద్రం వార తిల్ల పొదల్లో సంస్కార విహీనమై కుళ్ళిపోతున్న అతనిశవం కన్పించింది. కోరంగిలో పెద్ద గగ్గోలు బయలుదేరగా ఫ్రెంచి వారసలు హంతకులను దాచి, విచారణతంతు జరిపి ఎవరో తాగుబోతుల మధ్య జరిగిన కలహంలో ప్రమాదవశమున హతుడైనట్లు తేల్చినారు.

కానీ నెలలు గడువగా క్రమంగా జరిగిన ఉందంతం తెలియవచ్చింది.

తిరిగి భైరి తల్లి మంచం పట్టింది.

భైరి బయట ఆస్థితిలో అమ్మాయని పిలిచి తలుపు తట్టేందుకుకూడ శక్తిచాలక సొమ్మసిల్లిపడి ఉన్నాడు. లోపల జీవచ్ఛవాలై నిస్సహాయులైన స్త్రీలు భీత భీతలై జీవనం చేస్తున్నారు. వారికి బయట అలికిడైనట్లు విన్పించింది. అయినా తలుపు తీయడానికి భయం. పసిగట్టిన కుక్క మాత్రం గింజుకొంటూ దీనంగా ఏడుస్తూంది,

మీరయ్య కొన్నాళ్ళు ఫ్రెంచివారు గెలుస్తున్నందుకు తాను గొప్పగా ఉత్సాహపడినా త్వరలోనే అది నిష్ప్రయోజన కరమైందని అర్థం చేసుకొన్నాడు. దానితో జాగ్రత్తపడినాడు. బహిరంగంగా తటస్థంగా ఉంటున్నాడు. ఇప్పుడు తన బావగారి పినతండ్రిని హత్యచేసిన సందర్భంలో వారితో దాదాపు తెగతెంపులు చేసుకొన్నాడు. ఇంగ్లీషు వారితో (రహస్యంగా) ఒప్పందాలు కుదుర్చుకొన్నాడు.

తరువాత తన వియ్యాలవారు మచిలీపట్నంలో సర్వనాశనమై కూతురు పుట్టిల్లు చేరేందు కింగ్లీషువారి దాడియే ప్రధానకారణమని తెలిసినా అది అతను వారితో తెగతెంపులు చేసుకొనడానికి నిమిత్తం కాలేదు. ఇక్కడ బహుశ బంగాళంలో ప్రవర్తించినంత విచ్చలవిడిగాను, నిర్హేతుకంగాను ఇంగ్లీషువారు ప్రవర్తించలేదేమో. ఎంతైనా ఈ ఉద్యోగుల స్థాయి చిన్నది కదా!

సంవత్సరానికి పదహైదు పౌండ్ల (సుమారు మూడువందల రూపాయల) జీతానికి పొట్టబట్టుకొని వేలమైళ్ళు దేశాంతరం వచ్చినవారు ! జీతంకంటె ఇక్కడ పై ఆదాయాలేవారికి కావాలి. అందుకవసరమైన తోడ్పాటునిచ్చేవారిని ధ్వంసం చేసుకొని కామధేనువు పొదుగులు కోసేంతటి పొరలు వారి కళ్ళను కప్పకపోయి ఉండవచ్చు.

మీరయ్య తన తోబుట్టువునూ తల్లినీ ఆదుకొనడానికి ముందుకు వచ్చాడు. కానీ వీరు దాన్నభిమానంతో త్రోసిపుచ్చారు. అతన్నింటి చాయలకైనా రానివ్వలేదు.

"నేనేం చేయను! ఇక్కడికే వచ్చేయమంటున్నాను. వారు రారు,. పోనీ వారి నిక్కడ ఆరడిపెట్టగల నాభార్యైనా కన్నవారి దుర్గతికి గుండె పగిలి పిచ్చిదై ఉంది. పరదేశివారికి పరాయిదేంకాదు. వచ్చిహాయిగా ఉండవచ్చు. కానీరారు. నా దురదృష్టం, పోనీ అక్కడికే అన్ని సదుపాయాలందజేయడానికి సిద్ధంగా ఉన్నాను. దాన్నీవారు నిరాకరిస్తున్నారు. గుండెల్లో అన్ని కుంపట్లు పెట్టుకొని బ్రతకాలని నాకురాసి ఉంది." అని ఊరందరితోనూ చెప్పుకొనేవాడు. వారాడిన నాలుగు సానుభూతి వాక్యాలే అతనికితాత్కాలికమైన ఉపశమనాన్నిస్తున్నాయి.

ఇంట్లో కుక్క ఎంతసేపైనా గింజుకోవడం చాలించకుండా మొరుగుతూనే ఉండటం చూసి ముసలామె విసుగుకొంటూ తిట్టుకొంటూలేచింది.

ఆమె సమీపించిన కొలదీ కుక్క తన ఘోషనెక్కువ చేస్తూరెండు కాళ్ళమీద నించుంటూ పడిలేస్తూంది. ఆమె దాని కట్టువిప్పింది. అది ఒక్కుదుటున తలుపు వద్దకుచేరి విపరీతంగా మొరగసాగింది.

ఆమె తలుపు తీసింది. కుక్క పరదేశి శరీరాన్ని పసిగట్టుతూ నాకుతూంది. ఆమె భయంతో "ఎవరో పరదేశిని చంపేశావుగనక వెర్రిముండా! ఎంతసేపూ దొంగల భయమే నీకు. ఇంటికొక్క మనిషిని చేరనివ్వవు." అంటూ దాన్ని లాగుతూంది. కానీ ఆమెకు దాన్ని నిగ్రహించే శక్తిలేదు.

భైరికిదంతా కలలోలాఉంది. "అమ్మమ్మ ఈ కొద్ది సంవత్సరాల్లోనే ఎంత ముసలిదైంది ! ఏం ఇంకెవ్వరూ బయటికి రాలేదేం?"

"అమ్మమ్మా" అన్నాడు. అది బయటికొక్క నీరసమైన మూల్గులా మాత్రమే విన్పించింది. చేతులు చాచాడు. బయట కదిచేయికదిలి నీరసంగా వాలిపోయినట్లు మాత్రమే కన్పించింది.

ముసలామె కతదెవ్వరో సొమ్మసిల్లినట్లర్థమైంది. తాగిన మైకంతో పడున్నాడో లేక ఈ మధ్య తిండిలేక ఇలాపడిపోయే వారిని గురించి ఆమె విన్నది. నీళ్ళుతెచ్చిచల్లుదామనుకొన్నది. "కొంపదీసి కుక్క మెడ కరచి చంపేస్తుందేమో" అని భయపడి లాగుకొనిపోయింది. "ఎందుకిలా చంపుతావే అరవకు" అంటూ లాగలేక లాగుతూంది.

"ఎవరమ్మా" అంటూ కూతురు తల్లిని నీరసంగా అడిగింది. కుక్క ఆమె పాదాల వద్దకువెళ్ళి నాకుతూ అరుస్తూంది."ఏమైందిరా వెర్రిముండా" అంటూ ఆ కుక్కను ఆమె లాలిస్తూంది. ఆమె ప్రశ్నకు మాత్రం సమాధానంలేదు.

"ఛీఛీ, మీకెలా చెప్పాలో నాకర్థంకాదు." అంటూ జాలిగా విసుగుకొంటూందో అన్నట్లు మొరుగుతూ వీధికేసి పరుగెత్తింది.

"అయ్యయ్యో అన్యాయంగా దిక్కులేని వాణ్ణెవణ్ణో చంపేస్తుందో ఏమో. పాడు కుక్క "అంటూ ముసలామె విసుగుకొంటూ నడుస్తూంది.

తల్లిప్రాణం అని మనవారూరికే అనలేదు. ఆమెకు కుక్క చేష్టలూ. తల్లి మాటలు వింటూనే వెంటనే తన వారెవరో వచ్చి ఉండాలని స్ఫురించింది. అంత జబ్బులోనూ మెల్లిగాలేచి తలవాకిలివద్దకు నడిచింది.

ముసలామె శైత్యోపచారాలకు భైరి కొంచెం తెప్పరిల్లే సమయానికి ఆమె కూడ అక్కడికి చేరుకొంది.

"అమ్మా! అమ్మమ్మా! అంటూ భైరి వారిమీద వాలిపోయాడు. కోరంగి పాపం పుట్టెడు దు:ఖాన్ని దిగమ్రింగి, కన్నీళ్ళ వెచ్చదనం గాని, కడలి నీళ్ళ ఉప్పదనం గాని, తగులకుండా, జాగ్రత్తపడి శీతవాయువులను వారి నోదార్చేందుకు పంపింది.

ఉదయానికే భైరి వచ్చిన వార్త ఊరంతా పాక్కిపోయింది.

పరామర్శ చేసేందుకు వచ్చిన వారితో తెరిపిలేకుండా రోజులు గడిచిపోయాయి. భైరయ్య తండ్రి గతించినందుకు గ్రామమంతా సంతాపం వహించింది. ఆయన గుణగణాలను స్మరించుకోవడంలోనే ఊరందరికీ రోజులు గడుస్తున్నాయి.

మీరయ్య తానే ఆధ్వర్యం వహించి బావగారి కార్యాలు నిర్వహిస్తున్నాడు. యాంత్రికంగా భైరిపురోహితుల ఆదేశాలను నిర్వహిస్తున్నాడు. అన్నమూ నీళ్లూమానివేసిన భైరితల్లిచేత ముందు తాగించడానికి పరదేశి శత సాహసం చేస్తూంది.

"నన్ను చూడత్తా ! నాకేం మిగిలిందని నేనింకా బ్రతికున్నానత్తా !"

అంటూ పరదేశామెను మందు పాత్ర పట్టుకొని బ్రతిమాలు తూంది. పరదేశి పుట్టిల్లుచేరి కొన్నివారాలే అయ్యాయి. భూమిమీద స్వర్గ సౌఖ్యాలనుభవించవలసిన వయస్సులో ఆమెకు జీవితం హలాహలాన్నందించింది. మామగారు, అత్తగారు, భర్తా అందరూ పోయారు. పసికందును నమ్ముకొని ఆమె అక్కడే పువ్వులమ్ముకొన్నచోట కట్టెలమ్ముకొంటూ కొన్నాళ్ళూ బ్రతుకు కొనసాగించింది. ఆమాత్రమూ ఓర్వలేని బావగా రొకరు దాపురించారు. మొదట నమ్మించి ఆమెను తన వలలో వేసుకొందామని శతధా ప్రయత్నంచేశాడు. కానీ పరదేశి ఆవలలో పడలేదు. వాడు విషంపెట్టి శిశువును చంపించాడు. ధ్వంసమైపోయినది పోగా మిగిలిన ఆస్తికి వారసు దతడేకదా ! ఆ ఆస్తితనకు తనపిల్లలకే దక్కాలని అతని తాపత్రయం. ఇంకక్కడ తన ప్రాణాలనూ, మానాన్నీ కాపాడే దిక్కులేక నానాపాటూపడి నమ్మిన బంటుసాయంతో ఇక్కడికి చేరుకొంది.

రంగన్నా మంజరీ ఆమెకు దారిలో తటస్థపడ్డారు.

మచిలీపట్నం ముట్టడిలో ఆండ్రూస్‌కు ప్రమాదకరమైన దెబ్బలు తగిలాయి. కుడిచేయి పోయింది. కాలికి పెద్దదెబ్బ తగిలింది. మామూలు నడక తిరిగి రావడ మసాధ్యమన్నారు వైద్యులు. కొంత స్తిమితపడి ప్రయాణం చేయగల స్థితికి వచ్చాక అతన్ని ఇంగ్లాండు వెళ్లే ఓడలో ఒకదాంట్లో వెనక్కు పంపేశారు. అతని కింకా ఇక్కడే పనిచేయాలని ఉందిగానీ అతని శ్రేయోభిలాషు లతన్ని బలవంతంగా స్వదేశం పంపేశారు. మాథ్యూస్ దక్షిణాదికి వెళ్ళే దళాలతో వెళ్ళిపోయాడు. వారికి వీడ్కోలిచ్చి మంజరి రంగన్నా స్వగ్రామం బయలుదేరారు.

దారిలో పరదేశి తారసిల్లింది.

కోరంగిలో ఆమె రాకడ కొన్నాళ్లెవ్వరికి తెలియకుండా ఉంచారు. ఆమెకు బయటివా రెవ్వరికంటా పడడం ఇష్టంలేదు, ఒకటి రెండుమార్లు మాత్రం భైరింటికివచ్చి ఏడ్చుకొనిపోయిందంతే. ఒకరోజు భైరి తల్లి స్థితి చాల విషమించిందని అర్థమై-

"భైరి నేనూ ఇంకాబ్రతికే ఉన్నాము కదత్తా ! నీవు లేకపోతే మమ్మల్నెవరుచూడాలత్తా" అంటూ ఆమె బ్రతిమాలింది? అక్కడికీ ఆమె మనస్సు కరుగకపోగా "ఇంకా నామీద కోపమేనా అత్తా" అంటూ ఏడుస్తూ కాళ్ళమీద వాలింది.

ఆమె చిరునవ్వు తెచ్చుకొని పరదేశి నక్కువ చేర్చుకొని తల నిమురుతూ "నీమీద నాకెందుకే కోపం పిచ్చిపిల్లా ! నిన్నేమైనా అనుకొంటే పాపం చుట్టుకొంటుందే తల్లీ" అంటూ మందు తాగేసింది.

ఆమె మందు తాగిన విషయం గ్రామమంతా వార్తగా చెప్పుకొన్నారు. తరువాత లోపంలేకుండా ఆమెకు(ఆమె శరీరాని కందామా?) వైద్యం జరిగింది. ఇంగ్లీషువైద్యుడూ వచ్చి చూశాడు. డచ్చి వైద్యుడూ వచ్చి చూశాడు. కోరంగివైద్యుడే వారి నాహ్వానించి రోగివద్దకు గౌరవంగా తీసుకొని వెళ్ళినాడు. వారు "మీ కంటే వైద్యం చేయగలవారమా ?" అన్నారు.

"ఏమో ఎవరి చేతివాసి ఏక్షణాన ఎలాపనిచేస్తుందో ! కానివ్వండి శరీరశాస్త్రం ఎంత పరిశీలిస్తే తరుగుతుంది. అజ్ఞానులే సర్వజ్ఞత్వంతో విర్ర వీగుతారు. రోగి బాగు కావడమే అందరమూ కోరుకొంటాము." వారు తమకు తోచిన మందు లిచ్చారు. ఏంచేసినా ఆమెను మాత్రం దక్కించు కొనలేకపోయినారు. పదవరోజు దాటకుండానే ఆమె భైరి తెచ్చిన గంగాజలం లోను తులసీదళంతోనూ పుణ్యాత్ముఁరాలై తనువు చాలించింది. చివరిరోజుల్లో, విదేశీయుల చేతుల్లో (మందు) నీళ్ల తాగినందుకు ప్రత్యేక సంస్కారాల మిషపై పురోహితులు కొంత డబ్బు గుంజి కానీ వదల్లేదనుకొండి. అది వేరే విషయం.

మనస్సుకు కలిగిన ఈగాయాలు మానిన తరువాత భైరి ఇకముందేం చేయాలన్న ప్రశంసను గ్రామంలోని హితైషులందరూ చర్చించారు. గతాన్ని విస్మరించి భైరయ్య మీరయ్యతో కలసివృత్తిలో దిగాలని అందరూ ఒక గొంతై చెప్పినారు. హితాన్ని పెడచెవిని పెట్టగల శక్తి భైరయ్యకు లేదు.

ముసలామె మాత్రం మీ పినతాతగారి మరణానికి పగతీర్చుకోరా అంటూ భైరికి చెప్తూంది. ఆపగతీర్చుకోవడ మెలాగో ఆమెకే తెలీదు! "పినతాతగారి చావుకు కారణమైన వారింకా యానాంలో ఉన్నారనా అమ్మమ్మా ! వారేనాడో ఈకలోల్లపు రోజుల్లో మడిసైనా ఉంటారు. లేక స్వదేశాని కుడాయించైనా ఉంటారు !" అని దీనంగా నవ్వేవాడు! ఆమె పళ్ళు పట పట కొరుకుతూ "పగతీర్చుకోవాలిరా" అనేది.

"సరేలే సమయంరానీ" అనేవాడు.

ఆమెకు తాను చూసిన చరిత్ర చెప్పాలనీ తండ్రి చివరి మాటలామెకు చెప్పాలనీ అనుకొనే వాడు. కానీ ఆమెకు తెలియజెప్పడ మసాధ్యమని విరమించుకొనేవాడు.

భైరయ్య తిరిగి వృత్తిలో పడిపోయాడు. సాహసంచేసి పెద్దపోకడలేవీ పోకుండా పరిస్థితులెదురైనప్పుడు తల ఒగ్గి ఉంటూ వ్యాపారమూ నౌకానిర్మాణమూ నౌకలను బాగుచేయడమూ కొనసాగిస్తూ! అందులో మంచిపేరు తెచ్చుకో నారంభించాడు. ఎప్పుడూ తండ్రి చివరి పల్కులు చెవుల్లో మార్మోగుతూండేవి. తనకు తోచినట్లుగా సమాజం ఎలా ఉండాలో దానికెవరేం చేయాలో వాదిస్తూండేవాడు.వాటి ఫలితం తనకు తృప్తిగా ఉండేదికాదు. భైరివాదాలు లక్ష్యపెట్టేవా రరుదు.వెడనవ్వు నవ్వి వదేలేశేవారు.

బంగాళం ఇంగ్లీషువాళ్ళకు ప్రధాన స్థానమయ్యాక కలకత్తాదాక ఓడల రాకపోకలు తూర్పుతీరాన విస్తారమయ్యాయి. మద్రాసు మొదలు కలకత్తాదాక ఓడల నిర్మాణానికి, రిపేరీలకు కోరంగివంటి అనువైన ప్రదేశం మరివేరే లేదు. తుఫానుల ప్రమాదంతక్కువ, పనివాళ్ళు సమృద్ధి.పరిస్థితులు ప్రశాంతం. అందుచేత కోరంగివారికి గిరాకీ ఎక్కువైంది. ఎవరి పనుల్లోవారు. ఎవరికీ తీరుబడిలేదు జరుగుబాటుకు లోటులేదు. భైరి మాట లెవ్వరికి కావాలి

భైరి చాల ఏకాకియై భాదపడేవాడు. సంసార వ్యవహారాల్లో మరింత తలమునకలుగా ఈదేవాడు. భైరి పనులన్నిటినీ, రంగన్న ఉద్దారుడుగా చేయించేవాడు.

చుట్టుపట్ల గ్రామల్లోనూ, ఇతరత్రా చాలకల్లోలాలు జరుగుతున్నట్లు వార్త లొస్తూండేవి. కోరంగిలో మాత్రం పని ముమ్మరంగా జరుగుతూండేది. ఇంగ్లీషువాళ్ళ సైనికులకు సప్లైలు ప్రధానం. ఆ ఇంగ్లీషువాళ్ళు మనదేశంలోనే మరొకచోట మనప్రజలనే మన సంఘాన్నే ధ్వంసం చేస్తున్నారు. అది మనవారికి పట్టదు. భైరికిది విచిత్రస్థితి. రంగన్న మాత్రం వీరావేశంలో ఆపనులు చేసేవాడు. అతడు పడవ చక్కలవద్ద సుత్తితో కొట్టూంటే చూడాలి అతను మేకును కొట్టున్నట్లుగా ఉ

ండదు. తానెరిగిన సంస్థానాలవ్యవస్థలను కూలుస్తున్నట్లుగా ఉంటుంది. పంచాయితీ పెద్దల కులపెద్దల బుర్రలు బద్దలు కొట్టున్నట్లుగా ఉంటుంది. అతని పరిస్థితి భైరికి తెలుసు.భైరి స్థితి అతనికి తెలుసు.

ఇద్దరి స్థితి మంజరికి తెలుసు. అమె తన బాధను తన మేళం నడపడంలో పోగొట్టుకొంటుంది. ఆమె మేళంబృందమిప్పుడు చాల ప్రసిద్ధి చెందింది. భారతీయ విదేశీయ సంగీతాలను రెంటినీ సవ్యసాచిలా శుద్ధంగాను కలగల్పుగానూ పాడగలదు, ఆమె తాండవ నృత్యం ప్రకృతి లయ స్వభావాన్ని కళ్ళకు కట్టినట్లు చూపి ప్రేక్షకులను తన్మయులను చేస్తుంది.

కోరంగి కెవ్వరి స్థితీ అర్థంకాదు. ఓడలు తెరిపిలేకుండా రావడమెంతో ఆనందంగా ఉంది కోరంగికి, కానీ రక్తమయంగా వచ్చి ఎగువనీళ్ళు కలుస్తూండటం బాధాకరంగా ఉంది. ఈ చరిత్రగమనాని కర్థం చెప్పమంటుంది కోరంగి. వ్యాఖ్యానం చేయమంటుంది. ఆమె వేదన ఎవరికీ తెలియదు !

భైరి ఏకాకిత్వాన్ని పారదోలగల శక్తి పరదేశికే ఉన్నదని గ్రహించిన మొదటి వ్యక్తి మంజరి. ఇద్దరిని కలపాలని నిర్ణియించుకొంది. అటూ ఇటూ చాలా చాలా నరక్కొంటూ వచ్చి కృతకృత్యురాలైంది.

పరదేశి తిరిగి జీవితంలో ప్రవేశించి వెన్నెలలు వెలయించింది. మొదట్లో భర్తను మరచిపోలేకపోయినా ఆమె ప్రకృతిని జయించ లేకపోయింది. భైరికొక కొడుకునూ కన్నది. ఇప్పుడందుకు తప్పుపట్టగల వారూలేరు. మీరయ్య మొదట్లో వారించ జూచినాడు గానీ పరదేశతన్ని నోరుమూయించింది. భైరయ్య మీదనే పెత్తనమంతావదిలి ఇప్పుడతనెప్పుడూ తాగిన మైకంలోనే ఉంటాడు. పిచ్చి భార్య కొక కుమారుడు కల్గినాడు. వారిద్ధరినీ పెంచుకొంటూ గ్రామంలో ఒక పెద్దగా ఇప్పుడు భైరయ్య వెల్గుతున్నాడు. కొన్నేళ్ళు భైరయ్యా అతని అమ్మమ్మా

వేరుకాపురముండే వారు కానీ క్రమంగా ముసలామె నొప్పించి భైరయ్య మీరయ్య ఇంట్లోనే
ఉండేదుకు ఆరంభించాడు.

కొంచెం కుదుటపడిన నాటినుంచీ తండ్రి మరణిస్తూ అన్నమాటలనెలా నెరవేర్చాలా అని అతను తాపత్రయపడుతూనే ఉన్నాడు. కానీ ఏమిచేయవలసిందీ మాత్రం గోచరించదు. అతనిలో రగులుతున్న ఈనివురుగప్పిన నిప్పును కాంచలేని బయటి ప్రపంచాని కతను మచ్చికైన ఏనుగు. చిన్నతనంలో ఎలా ఉన్నా ఇప్పుడు దశనందుకొన్న అదృష్టవంతుడు.

## XV

మనుషుల జీవితాలు ఒక్కొక్కప్పుడు విచిత్రమైన మలుపులుతిరుగుతాయి. అందుకు నిమిత్తాలూ బహు స్వల్పమైనవే కావచ్చు.

మొదటిది మంజరి జీవితంలో. రెండవది మీరయ్య జీవింతంలో.

ఒక రోజు మనోధర్మం కుదిరి ఝుమ్మని సంగీత కచేరి చేస్తున్న మంజరి గొంతు ఉన్నదున్నట్లుగా జీరపోయింది! అది భావావేశమనకొన్నారు శ్రోతలు. వారికది మరింత రంజుగా ఉంది. మంజరి అది తన శరీరం శిధిలమౌతున్నందుకు సూచనేమో అనుకొంది. ఎందుకో అనుక్షణం ఆండ్రూస్ తలపుకు వస్తున్నాడు. కారణం తెలీదు. అతనూ నన్నుతల్చుకొంటున్నాడా. లేక అతని కేమైనా ప్రమాదం వాటిల్లిందా? ఇవే ఆలోచన లామె నాతరువాత కొన్నాళ్ళపాటు పీక్కుతిన్నాయి. ఎంత మరచిపోదామన్నా మరుపుకు రాకుండా ఉంది. ఆండ్రూస్ క్షేమంకోసం చర్చిలోప్రత్యేక ప్రార్ధనలు చేయించింది.

తరువాత కొన్నాళ్లకు కంపెనీ ఫాక్టరీ వద్దనుండి ఒక ఉత్తరం వచ్చింది. అదెప్పుడు రాసిందో తెలియరాకుండా కొంత శిధిలమై ఉంది. దాన్ని చదివి మంజరి నిలువునా నీరైపోయింది. ఆపళంగా భైరింటికి వెళ్లి ఉత్తరం ఊపుతూ బాధనంతా ఒక్కసారి వెళ్ల గక్కి బావురుమంది.

"ఆంద్రూస్  దేశం చేరలేదులా ఉంది.  ఏ ఆనామక ప్రదేశంలో అనామకుడుగా మట్టిలో కలిశాడో!" అంది వెక్కిళ్లమధ్య.

భైరి ఓదారుస్తూ ఉత్తరం చదువ సాగినాడు.ఉత్తరంనిండా ఆదిలేని ఆక్రోశం !

"..........ఆంద్రూస్ ! ఎక్కడున్నావు ? నన్ను మరచిపోయావా? నీకోసం నిరీక్షిస్తూండమని నాకు చెప్పింది మరచావా? తొందరలో వచ్చేస్తానని చెప్పలేదా? ఏమయ్యావు?ఎక్కడున్నావు ? వెంటనే తిరిగొచ్చేయి. నీసంపద లేవీ నాకువద్దు. ఇద్దరమేదైనా కూలినాలితో బతుక్కొందాం. నా తండ్రి నన్నమ్మేయాలని చూస్తున్నాడు. ఏం చేస్తాడు? విధిలేకపోతే? ఇల్లు సగం కూలిపోయింది. మిగిలిన సగంలోనే కొరికేస్తున్న చలికి గడ్డకట్టు కొని పోతూ కాలక్షేపం చేస్తున్నాం. మంచాలు, టేబిల్స్, కుర్చీలు పాత్రలు విలువైన వస్తువొక్కటి మిగల్చకుండా అప్పులవాళ్ళు పట్టుకపోయారు. మూకుళ్లతో సంసారం, చెల్లీ, చిన్నతమ్ముడూ రోగాలు పడిపడి మరణించారు. అమ్మ సరే. ఏనాడో వెళ్లిపోయిందికదా ! నాకు మాత్రం చావురాదు. నాన్న ఇంట్లోఉండడు. ఉన్నప్పుడైనా తాగొచ్చి ఒకటేగోల. ఒకసారి కూతురనైనా లేకుండా అసభ్యంగా ప్రవర్తిస్తే చుట్టుపక్కలవాళ్ళు మెత్తగాతన్ని బుద్ధిచెప్పారు. అన్నయ్య అమెరికాలో ఎలా ఉన్నాడో తెలీదు. ఉన్న ఒక్క తమ్ముడూ అల్లరి చిల్లరగా తిరుగుతూ కొట్లాటలు తెస్తూంటాడు. వాడైనా ఎప్పుడింట్లోంచి లేచిపోతాడో తెలీదు. నీవు పెంచిన కుక్కపిల్ల పెద్దదైంది. నీవెప్పుడొస్తావని అడిగేందు కదొక్కటే మిగిలుంది. అది ఊః ఊః అని ఒక్కటే ఏడ్పుతో జవాబిస్తుంది. చర్చివారికి పన్ను కట్టనందుకు ఇంటినుంచి వెళ్లగొడ్తా మంటున్నారు. నేనీఇల్లు విడిస్తే నాఉనికెవ్వరు చెప్తారు? నన్ను గురించి నీవెక్కడ వెతుకుతావు? అందుకనే ఈ పాడుకొంపనే అంటిపెట్టుకొని ఉన్నాను. నాతమ్ముణ్ణి అప్పుడప్పుడూ కంపెనీకి తరుముతూంటాను, నీవార్త చెప్తారేమోనని. వాడు నిరాశగా తిరిగివస్తాడు. ఇంకా దరిదాపుల కెప్పుడూ వెళ్లనని అల్టిమేటం ఇచ్చేశాడు క్రితంసారి.

అస్తమానం రాజసేవకుల్లో ముఖ్యాతి ముఖ్యుడుగా దూరమైన outpostకు వెళ్తున్నానేవాడివి. నీపని నెరవేరలేదా? ఒకవేళ తిరిగివచ్చి ఐశ్వర్యం, హోదా, పెరిగిపోయి మమ్మల్ని మరచావేమోనని రాజసభలకు పార్లమెంటుకు, పెద్దచర్చీలకు ప్రభుత్వభవనాలు, పార్కులు ఇలాంటి ప్రదేశాలకువెళ్ళే దారులుకాచి పరిశీలనగాచూస్తూంటాను. అలంకరింపబడిన గుర్రాలపై చక్కని యూనిఫారంలోని ఠీవిగా లయబద్ధంగా ఊరేగుతున్న వారిలో నీవుకన్పడవు. కోచీలలోనూ కన్పడవు.కాఫీక్లబ్బుల్లో కన్పడవు.ఎక్కడున్నావు? ఏమైనావు? నన్నీ నరకంనుండి ఎప్పుడుద్ధరిస్తావు? ఎక్కడున్నా ఈ ఉత్తరం చూస్తూనే వచ్చేస్తావుకదూ?

ఇట్లు

దేశసేవకుల్లో ముఖ్యాతిముఖ్యుడైన

నీప్రియాతి ప్రియమైన

**సుసాన్**

దు:ఖావేశాలు చల్లారాక పరదేశి ఒకసలహచెప్పింది. సుసాన్ కేదైనా డబ్బుసాయం పంపండనీ, జరిగిన విషయాలు తెలియజేస్తే ఆమె తనైనా ఒకదారి చూసుకొంటుందనీ.

మంజరి తనకున్నదియావత్తూఇచ్చేస్తానంది. భైరీ పరదేశీ వారించారు,“అసలామెకు నీత్యాగం చేరుతుందనిగానీ, అందితే ఆమె బాగుపడుతుందనిగానీ గ్యారంటీఏమిటి? ముందొకవిడత సామాన్యంగా పంపిచూద్దాం. తగుసమాధానంవస్తే తరువాతచూద్దాం.” అన్నారు. భైరి ఆరోజే ఫ్యాక్టరీ వాళ్ళతో మాట్లాడాడు. దానంగాఅయితే వాళ్ళుపుచ్చుకోమన్నారు. తరువాత ఇది ఆంద్రూస్‌సొమ్మని నమ్మించాక పంపేఏర్పాటు చేశారు.

దీనితరువాత మంజరి చాలవిరక్తివహించింది. సమయంకోసం వేచి ఉన్న మంజరి సేవకురాలొకతె కొత్తమేళం తెరిచింది ఈ అవకాశం తెల్విగా వినియోగించుకొని.

మరొకరోజు భైరయ్యకొడుకూ మీరయ్య కొడుకూ ఆటలో దెబ్బలాడుకొన్నారు. భైరయ్యకొడుకు బహుదుండుడుకు వాడని అయిదారేళ్ళకే పేరుతెచ్చుకున్నాడు. మీరయ్యకొడుకు మెత్తన. నెలలతేడాయే అయినా ఇద్దరి శరీరనిర్మాణాల్లో చాలాభేదం. భైరికొడుకులా మీరయ్యకొడుకు దృఢకాయుడూకాడు. చాకచక్యంకల్గినవాడూకాడు. వారిద్దరూ తరచు దెబ్బలాడుకొనే వారు. వారిదెబ్బలాటవల్ల భైరీ పరదేశీకూడా ఎప్పుడైనా చిన్నగా కలహించుకొనేవారు. భైరయ్య సందర్భాన్నిబట్టి తప్పెవరిదైతే వారిని దండించాలనేవాడు. పరదేశి తమ్ముని మీదెప్పుడూ మాట పడనిచ్చేదికాదు.

ఈ రోజు మామూలు బొంగరాల దెబ్బలాటలాంటిదికాదు వస్త.

పెద్ద ఏడుపుతో మీరయ్యకొడుకు పరుగెత్తుకుంటూవచ్చి అక్క అక్కునచేరాడు. అతన్ని తరుముతూ భైరికొడుకు వెన్నంటి వచ్చాడు. వారివెనుక ఇరుపక్షాలుగాచీలి వాదులాడుకొంటూ చాలమంది పిల్లలువచ్చారు.

పిల్లలందరూ పడవలు కట్టుకొన్నారు. వాటినినీళ్ళలో విడిచి ఎవరి ఓడబాగపోతుందోచూస్తూ వాటితోపాటుపరుగెత్తుతున్నారు. భైరికొడుకుది తెల్లఓడ. మీరయ్యకొడుకుదింగ్లీషుఓడ. ఇంకొకరిది ఫ్రెంచి ఓడ. ఇలాగే కొందరివి డచ్చిఓడలు, మసూలాపడవలు, కటమరాన్, పటెల్లా, బూరాపారూ. కొందరివి రెండుకొయ్యల ఓడలు, మరికొందరివి మూడుకొయ్యలఓడలు: కొన్ని ఒంటికొయ్యవి. భైరికొడుకుఓడకు నాలుగుకొయ్యలు. అతని ఓడకువేసిన రంగుతెలుపు, ముఖానికమర్చింది ఏనుగుతల. కొందరు ఓడముఖాలకు పాముపడగలమర్చారు.కొన్నిటికి సింహంతలా, చిలుక, బాతు, భూతాకారాలు ఇలాఅమర్చారు. కొందరి ఓడల్లో మందిరాలూ ఉన్నాయి.

పిల్లలందరూ తేలుతూ పోతున్న ఓడలను చూచి ఆనందంతో కేరింతాలు కొట్టూ అటూఇటూ ఉరకలు పెట్టున్నారు. అన్ని ఓడల్లోనూ భైరి కొడుకు చేసిన తెల్లఓడ ఝామ్మని తేలుతూంది. అందరూ దాన్నే మెచ్చుకొంటున్నారు. కష్టాల పరంపరలో కృంగిన కోరంగి ఈ పిల్లల ఆటలు చూసి కొంచమూరట చెందింది.

ఇలాంటప్పుడేగా తంటాలు పెట్టేవారికి పండుగులా ఉండేది ? మీరయ్య కొడుకు నాటపట్టిస్తూ ఈర్ష్యను రెచ్చగొట్టారు. అతడసూయతో తెల్లుగ్గోడ కొయ్యలు విరిచేసి చాప పీలికలు చింపేసి అక్కడికీ అది వాలిపోకుండా తేలుతూంటే కాలితో తొక్కి బురదలో కూరేశాడు.

భైరికొడుకు కోపంతో తన్నేందుకు వస్తూంటే ఇంటికి పరుగెత్తుకొంటూ వచ్చేశాడు.

విషయమేమిటో తెలుసుకోకుండా పరదేశి తమ్ముణ్ణి చాటుపెట్టి కొడుకుకు రెండు వడ్డించాలని ముందుకు వస్తూంది. భైరి భార్యనువారిస్తు జరిగిందేమిటో తెల్సుకొనే ప్రయత్నం చేస్తున్నాడు.

"తల్లిలేని పిల్లవాడంటూ అతిముద్దుచేసి వాణ్ణిలా పాడుచేయకపోతే జరిగిందేమిటో తెల్సుకో ముందర" అంటూ కొడుకును చాటుచేసుకొన్నాడు.

పరదేశికి కోపంవచ్చింది. మాటకుమాట పెరిగింది. అందులోనే సందుచేసుకొని చుట్టుఉన్నవారూ తలాఒక మాటందుకొంటున్నారు.

భైరికోపమూ పెరిగింది. కోపంలో వళ్ళుమండింది. "రక్తసంబంధమైనా చూడకుండా పరాయివారి మాటలువిని తనవారిని పాడుచేసే కుళ్ళు గుణం మీవంశంలోనే ఉంది."

అనుకోకుండా అన్నాడు చివరిమాటగా. అన్నవెంటనే నాలుక కరచుకొన్నాడు. కానీ పెదవిదాటిన మాట విల్లువిడిచిన అమ్ము ఏంచేస్తే వెనక్కి వస్తాయి?

పరదేశి ఏడుస్తూ లోపలికి వెళ్ళింది. ఏనాటివో పాతవిషయాలు మనస్సులో పెట్టుకొని దెప్పుతున్నందుకామె మనస్సు చాల నెప్పిపడింది

భైరి తన పొరపాటు నొప్పుకొని"మామయ్యవింటాడు! హంగామా చేయకు !" అని చేతులు పట్టుకొని బ్రతిమలాడినాడు. పరదేశి ఆవేశం తగ్గిందికాదు.

పిల్లల ఎదుట జరిగింది కాబట్టి వారినోళ్ళ మీదుగా ఊళ్ళోకి పాకింది. వారిద్వారా మీరయ్య చెవిలోనూ పడింది.

ఆ దెప్పినందు కిప్పుడాతనాగ్రహించే స్థితిలోలేదు. పశ్చాతాపమే పడినాడు. అతను గతాన్ని స్మరించుకొన్నప్పుడల్లా ఏదో ఒక తెలియని అశాంతి అతన్ని వ్యథపెట్టుతూంది. ఈ చిన్నకలహం అతనిలో అసాధారణ పరివర్తన తెచ్చింది. ఈమధ్య, దేశంలో చాలమంది జోగులైనారు, వస్తువుల ఉత్పత్తి, పంపకం, ఉ త్పత్తి, ఈచక్రం మామూలుగా తిరిగేందు కేర్పడిన పద్ధతులు ఆచారాలు విచ్ఛిన్నం కాగా జరుగుబాటుకాక దేశ ద్రిమ్మరులైనవారనేకులు. కొందరు సంఘంలో వచ్చిన ఒడుదుడుకులవల్ల మనసులో పుట్టినకలతలను తట్టుకొనలేక ద్రిమ్మరులైనవారు. ఇట్లా అనేకు లనేకమార్గాల్లోజోగులైనారు. అందరూ అన్వేషణ సాగిస్తూ తమకుతోచిన అభిప్రాయాలను ప్రచారంచేస్తూ ఊరూరూ తిరుగుతున్నారు. అందులో ఒకసాధువు నాయకత్వాన గుంపొకటి కోరంగివచ్చింది. వారు కాశికి పయనమై వెడుతున్నారు. మీరయ్య వారితో పోవ నిచ్చగించినాడు. భైరి పాదాలుపట్టి వద్దని వారించినాడు. పరదేశి తమ్ముని ఆయన పాదాలమీద పడవేసి వారించింది. ఊరందరూ ఆయనను వారించినారు. రోజులు బొత్తిగా బాగలేవు. కాశికి పోయినవాడు కాటికి పోయినవాడు ఒకటే, ఇంక తిరిగివచ్చేదికల్ల, అన్నంత నిరాశ ప్రబలిన రోజులు. మీరయ్య ఆరోగ్యమూ అంతంతలోనే ఉంది. ఇది అందరి దృష్టిలోనూ ఆత్మహత్యా సదృశంగా కన్పించింది. ముసలమ్మ వారించిచూసి తనమాట కొడుకు పెడచెవినిపెట్టగా తానూ అతనివెంట సిద్ధమైంది.

మీరయ్య తన ఈ నిర్ణయానికింట్లో క్షుద్రాలు కారణం కావని స్పష్టంచేసినాడు. తనకింట్లో ఎవ్వరూ లోటుచేయలేదని. భైరికూడ తన్ను కన్నతండ్రిని గౌరవించినట్లే ఏలోటూ లేకుండా చూస్తున్నాడనీ, అనేకులతో చెప్పినాడు. “నా జీవితకాలం అంతం కావస్తూంది. ఇంతచేసీ, ఇంత సంపాదించీఈవయస్సులోనైనా ముక్తిమార్గం చూసుకోవాలన్న కోరికతప్ప మరేకారణము లేదు. ఎవరో కొందరు మ్లేచ్ఛులూ, ఛోటారాజులూ, నవాబులూ తమ స్వార్థాలకు అరాచకాలను రెచ్చగొట్టూంటే దానికి జడిసి యాత్రలు మానుకొంటామా ? ఆవిశ్వేశ్వరుని మీదనే భారంవేసి బయలుదేరు తున్నాను. అతని ఇష్టమెలాఉంటే అలా జరుగనీ” అని

అందరినీ సమాధానపరిచినాడు. ఆయన ప్రస్థానానికి పెట్టుకొన్న ముహూర్తమాసన్న మౌతూంది. గ్రామంలో ఆయనకందరూ వీడ్కోలు విందులిస్తూన్నారు. మీరయ్య
యింట్లోకూడా గ్రామస్థులందరికీ పెద్దవిందు చేశారు. ముహూర్తం సమీపిస్తున్న కొలదీ భైరయ్యకు దు:ఖమాగకుండా ఉంది. అదిగమనించి మీరయ్య ఒకరోజు పరదేశినీ, భైరయ్యనూ ఏకాంతంగా పిలిపించి తాను నిజంగా విరక్తుడై తనముక్తి చూసుకొనేందుకే ఈయాత్ర తలపెట్టినాననీ మరొక కారణం కాదనీ వివరించి చెప్పినాడు. తనతల్లి నిక్కడే ఉంచేందు కేర్పాటు చేశాననీ, ఆమెనొప్పించాననీ చెప్పి తన కుమారుణ్ణి పిచ్చిభార్యనూ వారికప్పగించినాడు. ఇంట్లో రహస్యాలను వివరించాడు.

రహస్యంగాఉన్న ఐశ్వర్యాన్నంతా వారికిచూపి అప్పగించాడు. "వెర్రివాడా, ఈ డబ్బుతో ఇప్పుడుతల్చుకొంటే నేనువిడిపోయి వేరేవర్తకం పెద్దఎత్తున ప్రారంభించకలను. కానీ ఆఉద్దేశంలేదు. ఏదోఅనాలోచితంగావచ్చిన మాట పట్టుకొని ఇంతరాద్ధాంతం చేసేందుకు నేనేంకుర్రావాణ్ణా? మీమనస్సులో ఏకల్మషమూలేదని నేనెరుగుదును" అనివారినిసమాధానపరచినాడు. "నీవు నా మీద నమ్మకంముంచినందుకు నాకొక్కతూర్యాణంచాలు. మీరుతుదిసారి ప్రయాణంలో మీసర్వస్వాన్నీ అమ్ముకొన్నసొమ్మునాకందిందనీ, అదినావద్దనేఉందనీ నీకుతెలుసు. అయినా నీవేనాడూ దానిప్రశంసైనాతేలేదు. దాన్నిగురించి అడుగవలసిందిగా నిన్నెగద్రోసినవారిని నీవునోరుమూయించావని తెలుసు. అనేక సందర్భాల్లో నీకూనాకూమధ్య కలతలు తెచ్చేందుకు పరులాడిన మాటలను నీవెలాఈసడించావోతెలుసు. అట్టినీపైనాకాగ్రహమా? నీవొకవేళ నిజంగానే ననేన్నొకమాటన్నా తప్పులేదు. కానీనీవెన్నడూ అలాంటిపనిచేయలేదు నాయనా! ఆవేళైనా నీనోటవచ్చినవాక్యం విధిప్రేరితంగానే భావిస్తున్నాను, కానినీతప్పనిఅనుకోవటంలేదు. నాకువైరాగ్యంగరిపేందుకే ఆమాటఅప్రయ త్నంగా నీనోటినుండివచ్చిందని నావిశ్వాసం"

బైరికి ప్రత్యేకంగా చివరిఉపదేశంచేశాడు."నాయనా, నీవుచిన్నవాడివైనా నీఅనుభవంగొప్పది. ఊహలూచాలగొప్పవి. కానీ దేనికైనా కాలమూ కలిసిరాకపోతే మనిషేమీచేయలేడలేని నాకనిపిస్తూంది, ఈవిదేశీ వర్తకులనుపారద్రోలేవిషయంలో నీకుగలఊహాలాచరణలో పెట్టేకాలం నీవుబ్రతికుండగావస్తే నాకంటేసంతోషించేవాడుండడు. మీ నాన్నచివరిమాటలను నేనూ చాలసార్లాలోచించాను. మాణిక్యాల్లాంటి మాటలుచెప్పిపోయాడాయన. వారిబలం వారిలోలేదు. వారిబలము మనబలహీనతలోఉంది. మనబలహీనత మన అనైక్యతలోఉంది, మనఅనైక్యతలకుమూలం మనవ్యవస్థలోఉంది. దీన్నెలా పరిష్కరించాలో నాకైతేమాత్రం అంతుచిక్కటంలేదు. నీవు విడువకుండా అన్వేషణకొనసాగించు. దానికై ఈఐశ్వర్యమంతా వినియోగించు. మనవృత్తి భవిష్యత్తుకూడా చాలాఅనుమానాస్పదంగానే కనిపిస్తూంది. విదేశీవర్తకులు మనలను బ్రతుకనివ్వరులాగేఉంది చూడగా. ధైర్యంవహించు, భగవంతుడు నీకుమేలుచేస్తాడు" అని ఆశీర్వదించాడు.

మీరయ్య బయలు దేరేరోజున భైరి అమ్మమ్మ చాలా రాద్ధాంతం చేసింది తానూ బయలుదేరుతానని. కానీ అందరూ ఆమెను నిర్బంధించి నిల్పివేశారు, వారిని సాగనంపుతూ వెళ్ళిన వారొక్కక్కరూ తిరిగివస్తూ కొన్నాళ్ళపాటు వారి ప్రయాణ వార్తలు తెచ్చేవారు. కొన్నివారాల తరువాతవీ ఆగిపోయాయి.

మీరయ్య వెళ్లిపోయిన తరువాతగానీ భైరయ్య తన మామయింటినీ, ఓడలనూ నడపటంలో ఎంతటిపాత్ర వహించాడో అర్థం కాలేదు. మన కుటుంబ జీవనంలో యజమానికున్న పాత్ర చాల గొప్పదనే చెప్పాలి. అందుకే కాటికి కాళ్ళుచాచిన వారైనా సరే యజమాని కన్ను మూస్తే ఆ ఒడుదుడుకులు తీరి తిరిగి కుటుంబయానం సాఫీగా నడిచేందుకు మామూలుగా కొన్నేండ్లు పట్టుతూంటుంది. మీరయ్య ఎప్పుడూ ఇంటిపట్టున మైకంలోపడి ఉంటున్నట్లే కన్పించినా ఎప్పుడు చక్కబెట్టే వాడో చాల వ్యవహారాలు చక్కబెట్టేవాడని అతని కర్థమైంది. ముఖ్యంగా ఇంగ్లీషు వారితో ఈ మధ్య ఆయన చక్కని సంబంధాలు

నెలకొల్పుకొన్నాడు. అట్లని మిగిలినవారితోను ఆయన సంబంధాలు చెడుగాలేవు. అయితే ఇంగ్లీషువారు తాను పూర్వం చూచిన ఇంగ్లీషువారు కారు. ఏ పాశ్చాత్యుడూ పూర్వపూ పాశ్చా
త్యుడు కాడు. తన చిన్నతనంలో వారికీ దేశంలోవన్నీ గొప్పవింతలే. ఇక్కడి వాటితో పోల్చి చూసుకొంటే తమ దేశంలోని వన్నీ వారికల్పంగా కన్పించేవి. మనదేశంవారికి నోరూరించే ఐశ్వర్యానికి గని. దానికిక్కడి దేశీయులు యజమానులు. వారి వద్ద విదేశీకంపెనీ ఉద్యోగులు, సంపన్న గృహస్థుల పిల్లలను బెల్లించి వారివద్దనున్న వాటిని పెట్టించుకొనడానికి వచ్చిన బీదపిల్లల్లా ప్రవర్తించేవారు. కానీ నేడు ? ఇప్పుడు వచ్చిన వారందరూ ఇక్కడికి రాక మునుపే విషపుటాలోచనలతో వచ్చినవారు. దోచుకొనిపోయేందుకు వచ్చిన వాడింటివారి నెలా చూస్తాడో అలాఉంటుంది వీరి ప్రవర్తన. ఇంటివారే మాత్రం మెలకువ ప్రదర్శించినా దొంగకు కడుపులో మండుతూంటుంది. తాను కొనిపోగల్గిన సంపద కింటివారనవసరమైన అడ్డుగా మాత్రమే కన్పిస్తారు, ఆయింట్లో ఎవరైనా వెంగళప్పలుంటే వారతని
కాప్తులౌతారు. తన పన్నాగంలో వారి తోడ్పాటవసరమైనంత వరకు ఎన్ని తియ్యని మాటలు చెప్పినా చివరకు క్షవరం చేయవలసి వచ్చినప్పు డందరూ సమానమే.

భైరయ్య కీ విషయం త్వరలో తెలిసి వచ్చింది. చివరి రోజుల్లో తన మామ అశాంతికి విదేశీవర్తకు లాయన్ను చిన్న చూపు చూస్తూండటమూ ఒక కారణమై ఉండవచ్చు ననిపించింది. ఈ వాగురంనుండి తప్పుకొనే మార్గం మాత్ర మతనికగమ్యంగా ఉంది. ఎక్కడా పట్టు దొరక్కుండాఉంది,

రోజు రోజుకూ ఇంగ్లీషువారి ప్రాబల్యం పెరుగుతూంది, ఇప్పుడు ఢిల్లీ పాదుషానుండి నిజాం ప్రభువునుండి కూడా తమ సర్కారులు ఇంగ్లీషు కంపెనీకి దత్తం చేయబడినాయి. ఇప్పుడింక వారి నడ్డుకొన గల్గిన శక్తి లేనేలేదు. ఫ్రెంచివారూ బిడతకీచులూ వారి కిక్కడ అడుగులకు మడుగులొత్తేవారైనారు.

భైరివృత్తిలోనూ ఇప్పుడు గుణాత్మకమైనమార్పు పూర్తిగావచ్చింది. ఇప్పుడు ప్రాధాన్యత వ్యాపారానికి లేనేలేదు. స్వంతంగా ఓడలు కట్టుకోవడమూ ముఖ్యంకాదు. ఇతరుల కోడలుకట్టించివ్వడమూ, పాతవాటికి రిపేరీచేయడమూ వీటివల్లనే ఆదాయమెక్కువ వస్తూంది. ఆ ఓడలన్నీ ఎక్కువ ఇంగ్లీషువారివీ, లేక వారితో భాగంకలిసినవారివీ. చేనేతవారివృత్తి యావత్తూ ఈమధ్య కొన్నేళ్ళలోనే చాలవంతులుపడిపోయింది. చేనేతవారి వైభవాన్ని తలుచుకొంటే గారడివాని ఇంద్రజాలంలో మామిడిచెట్టుపూచి ఫలించి మాయమైన విధం గుర్తుకు వస్తూంది.

ఇప్పుడు వారిలో జోగులైనవారు పోగా కొందరోడలపని నేర్చుకొన్నారు. కొందరింగ్లీషువారివద్ద సిపాయిలుగా చేరినారు. వారినింగ్లీషు వారు చిన్నచూపుచూస్తూంటే వారికి భైరివలె ఒళ్ళుమండదు. వారుపుట్టినప్పటినుండి దానికలవాటు పడిఉన్నారు. ఆ మాటకొస్తే బ్రాహ్మణులు ఇతర అగ్రకులజులూ చూపించే ఈసడింపులతో పోలిస్తే ఇంగ్లీషువారు తమ్ము చాల మర్యాదగా చూస్తూన్నట్లే ఉంది వారికి. పైగా వారిసైన్యంలో పనిచేస్తున్నప్పు డెదుటిపక్షాన అగ్రకులజులమంటూ విర్రవీగుతున్నవారు ముప్పువచ్చినప్పుడు పడేపాట్లు చూసే అదృష్టము కలుగుతూంది. ప్రాణాలపై తీపితో వారెంతకైనా దిగుతారు. ఇంగ్లీషు దొరలకు సిఫార్సు చేయవలసిందిగా ఒక్కొక్కప్పుడు రాజబంధువులంతటి వారున్నూ ఇంగ్లీషు కంపెనీలో చిన్నఉద్యోగివద్దకు బ్రతిమాలుతూ వెళ్ళడమూకద్దు. అందులోవారికొక ఆనందం కల్గుతూంది. వెర్రిఅభిమానాలకుపోనివారందరికీ ఇంగ్లీషు కంపెనీ ఉద్యోగం ఒకవృత్తి కల్పిస్తూంది. ఈమధ్య వారివద్ద ఉద్యోగాలూ పెరుగుతున్నాయి. వారివద్ద పనిచేయడంలో ఇంకొక సుగుణమూ ఉంది. వారికి నమ్మకంగా పనిచేసినవారి నింగ్లీషువారెంతో మర్యాదగా చూసేవారు. తమక్రిందివారు కంపెనీ ఆదాయాన్ని పెంచగలమార్గంలో ఏమాత్రం తెలివి తేటలు చూపినా వారినాకాశాని కెత్తేవారు. ఇంతకింతచేసినా రాజుకొలువులోమెప్పేదీ? గంగిరెద్దుల్లా దివాన్లకు తలూపటమొకటే తెలుసు నాటి రాజులకు.

ఇలాక్రమంగా ఇంగ్లీషువారియడల క్రిందివర్ణాల్లో పెద్దలకు సుముఖత ఏర్పడుతూంది. వారికున్న అజ్ఞానంవల్ల పెద్దవిషయాలు వారికర్థంకాక ఇంగ్లీషువారి మంచితనాన్నిగురించి తమపలుకుబడిలోగల వారికెక్కిస్తూ ప్రచారంచేస్తున్నారు. తమఉద్యోగం నిలవడానికీ, అందులో మరొకమెట్టు సాధించడానికి ఇదేఉత్తమమార్గంమరి! అగ్రకులాల హిందువులూ కంపెనీలో చేరేవారు. వారుముస్లిము అధికారుల చేష్టలకువిసిగి ఇందులో కొచ్చినవారు. అత్యధిక సంఖ్యాకులు విదేశీవర్తకులవల్ల నష్టపోయినవారు. వారిపట్ల కరుడుకట్టుకొనిపోయిన ద్వేషాన్ని మాత్రమేపెంచుకొన్నవారు, ఇంగ్లీషువారు మనసాంఘిక రాజకీయ వ్యవస్థలో దేన్నివిమర్శించినా దాన్నొప్పుకోక ఆ విమర్శను(వితండవాదములతోనైనాసరే) ఎదుర్కొంటూ జనుల్లో ప్రచారం సాగించేవారు. విదేశికంపెనీల విధానాలవల్ల దరిద్రం పెరిగినట్లల్లా ఇటువంటి వారిసంఖ్య అమితం కాజొచ్చింది.

భైరిమాత్రం ఇంగ్లీషువారు మన వ్యవస్థను కించపరుస్తూ చేసే విమర్శల్లో సబబుకూడా ఆలోచించేవాడు. సరిగ్గా ఇవేకాకపోయినా ఇటువంటి లోపాలే పాశ్చాత్య సమాజాల్లో కూడ ఉన్నట్లు అతనికి తెలియదు. కాబట్టి తలవంచుకొనేవాడు. వాటిని మనం మార్చుకోవాలని దేశీయులలో ప్రచారం చేసేవాడు. దీన్ని వినియోగించుకొని భైరిమీద ఛాందసులంతా పెద్ద దుమారం ప్రారంభించారు. భైరికీదుమారమెంతో వ్యథ కల్గించేది. అయినా ధైర్యంగా తనసోదరదేశీయుల నెదుర్కొంటూ నిర్భయంగా తన వాదాలు చెప్తూండేవాడు. ఇతన్ని విదేశీ ఉద్యోగుల్లో ఉత్తములు చాల మెచ్చుకొనేవారు. అతని కవసరమైనప్పుడు చేదోడూ ఇచ్చేవారు. ఈ పరిభ్రమణంలో భైరి ఇంగ్లీషువారి శిబిరానికి చేరువౌతూ వస్తున్నాడు. అతని వృత్తికూడ ఇందువల్ల వృద్ధిపొందుతూ వస్తూంది.

ఇప్పుడతని కాలమంతా రేవులో లంగరువేసిన ఓడలమీదే గడుస్తూంది. లేనప్పుడు ఇంటివద్ద గ్రామస్థులతోకూడి ఘాటు చర్చలు జరుగుతూంటాయి. ఒకరోజున ఈగ్రామానికి బొబ్బిలికథను గానంచేసే భిక్షగాండ్రు వచ్చారు. ఆ విషయం గ్రామమంతా గొప్పగా చెప్పుకొన్నారు. భైరయ్య వారికి తనవంతు

సన్మానం చెల్లించాడు గానీ వారికథ వినేందుకు వెళ్లలేదు. వారితను కథవినకుండా ఇచ్చేసన్మానం పుచ్చుకోలేదు. అందరూ ఆకథ వినితీరాలి చాలా అద్భుతంగా ఉందని నిర్బంధించారు. "యుద్ధభూమిలో కత్తులతోనిలబడి, తుపాకుల కెదురొడ్డినవారి శౌర్యాన్ని తాను మెచ్చలేనన్నాడు భైరి. అయితే మరొక కథ చెప్పిస్తామన్నారు. "దేశింగురాజు" కథను వారు గానంచేస్తారు వినండన్నారు. ఆ కథకు భైరయ్య సకుటుంబంగా హజరైనాడు. అతణ్ణాకథ చాలా ఉత్తేజితుణ్ణి చేసింది.

"పాశ్చాత్యులు వచ్చాక కాదు. అంతకు మునుపే సాంఘికంగా క్రింది మెట్టుపైనున్న మన వీరులే నవాబుల పాదషాల మహాసైన్యముగాలిబుడగ లాంటిదని చూపించారన్నమాట" అనుకొన్నాడు.

తరువాత సర్వాయి పాపని కథను వినిపించినారు. కల్లమ్ముకొనే కుటుంబంనుంచీ వచ్చిన ఒక సాహసి గోల్కొండ సామ్రాజ్యాన్నాపి (కొన్ని గడియలే అయితేనేం) గోల్కొండ నేలిన కథ విన్న భైరి నీరే అయిపోయినాడు. పరదేశి పక్కనుండబట్టి సరిపోయిందిగానీ, వారి కత నెంతటి సన్మానమైనాచేసి ఉండును !

సర్వాయి పాపని కథ చాల రోజులతని చెవుల్లో రింగు రింగు మంటూనే ఉంది. దానిని మననం చేసుకొన్నకొద్దీ అతని కెంతో అర్థం స్ఫురించింది.

తానింతవరకూ రాజులూ, మహారాజులూ వణిక్కులూ ఒకతాటి మీద నడిచి సుశిక్షితసైన్యాన్ని లేవదీసి దానికండగా గొప్ప నౌకాసైన్యాన్ని నిర్మించి దేశంలో ఈ విదేశీవర్తకుల అల్లరిని మాన్పాలనీ అటువంటిరోజు వస్తుందనీ కలలు కంటున్న దెంత నిరర్థకపుటాలోచనో అతనికి తెలిసివచ్చింది. సాహసికులైన యువకులు క్రిందినుండే అట్టి సామ్రాజ్యాన్ని నిర్మించవచ్చునని పాపడు చూపినాడు. విఫలమైతేనేం అతని యత్నం చాల గొప్పది అనుకొన్నాడు. అతని క్షణికమైన విజయమూ తరువాతి వినాశమూ రెండూ గ్రామీణుల అజ్ఞానం మీద ఆధారపడినందువల్లనే అని కూడ భైరి భావించాడు. తన తండ్రి, మామయ్య చెప్పిన మాటల పూర్తి అర్థమీ నాటికిగానీ అతని స్ఫురణకు వచ్చిందికాదు. గ్రామీ

ణుల మనస్తత్వాన్ని సువిశాలపరచేందు కతని పట్టుదల మరింత గాఢమైంది.

సతీసహగమనము, తాంత్రికుల బలులవంటి ఆచారాలు మొదలైన వాటిని తీవ్రంగా ఎరుర్కొన సాగినాడు.

అతనికి రసవాదపు పిచ్చితో దేశాలు తిరిగి అనుభవం గడించి కోరంగిచేరిన విశ్వబ్రాహ్మణుడీ విషయాల్లో తోడ్పడేవాడు.

"అందరికీ భర్త భగవంతుడని మహసాధ్వి మీరా బోధించిందే. ఆమెను తులసీదాసంతటి మహమహుడు బృందావనం చేరమని ఉపదేశించాడే, అటువంటప్పుడు స్త్రీకి సహగమన సమస్యెక్కడిది ? భగవంతునికి మరణముందా ?"

"భగవంతుడు తాను సృష్టించిన జీవిని తానే బలికోరుతాడా ?"

"అన్ని అవయవాలు మనిషి కవసరమే. ఏ అవయవంలేకపోతే మనిషి శరీరం పరిపూర్ణ మౌతుంది ? అటువంటప్పుడీ బీభత్స మర్మావయవ పూజ లేమిట్రా"

"అర్ధం విడిచి, భావం విడిచి ఆచారాలు పాటిస్తే ముక్తినిస్తయ్యా?"

ఇటువంటి భావాలకు భైరయ్య చురుకైన ఆలంబనం కాసాగినాడు. ఇటువంటి భావాలను ప్రచారంచేసేవారికి అతని సహాయమూ పుష్కలంగా లభించేది,

అతను ఛాందసులను పరిహసించడమూ ఎక్కువైంది. అగ్రహరికుల్లో ఇతని భావాలు మరీ సంచలనాన్ని కల్గిస్తున్నాయి. వారు ఓడ యజమానుల్లో అగ్రకులజులైన వారి ధనసహాయంతో ఈ వాదాలకు ఎదురు ప్రచారాలు చేసేవారు.

ఇదిలా ఉండగా భైరి కుమారుడూ, బావమరిదీ ఇద్దరూ చక్కగా ఎదిగి వస్తున్నారు. వారి మధ్య గిల్లి కజ్జా లిప్పుడు సమసిపోయాయి. వారి చదువువిషయంలో పంతుళ్ళకూ భైరికీ ఎప్పుడూ వివాదమే. పంతుళ్ళకు భైరి ఆవేశ మర్థమయ్యేది కాదు. తమ పద్ధతి ప్రకారం తాము చెప్తూంటే చెప్పనివ్వడు. అతను కోరింది వారు చెప్పలేరు. వారికి చేత నైందల్లా ఏళ్ల తరబడి ఇసుకమీద వేళ్లు కాయలు

కాచేలా దిద్దించడము, తిథివార నక్షత్రాలు, కార్తులు, సంవత్సరాలుపేర్లు, ఎక్కాలు, పిల్లలగొంతు చినిగేలా బట్టీ పెట్టించడము, కూడికలు తీసివేతలు, మానికలు, తూనికలు, చిల్లర లెక్కలు,వడ్డీలెక్కలు బట్టీపెట్టించడము. ఇంకా తెలివైన పిల్లలకైతే వీటికి తోడు అమరకోశము, సంస్కృత శబ్దాలు, ధాతువులు కంఠత పెట్టించేవారు. ఇసుకలో వ్రాత ముగిసిన తరువాత తాటాకుమీద పుల్లలతోనో , లేక గంటంతోనో వ్రాయటం నేర్పేవారు. మసి ఉపయోగించేది తరువాత. అరటి ఆకుమీద వ్రాయడమూ వచ్చాక చివర కాగితంమీద వ్రాత నేర్పేవారు. కౌలుపత్రాలు విన్నపాలు, దానపత్రాలు, క్షేమ సమాచారపు టుత్తరాలు వ్యవహారానికి సంబంధించిన ఉత్తరాలు, క్రయవిక్రయాలు ఇవి వచ్చేటప్పటికి చాలమంది చదువైపోయేది, ఇక్కడికి పిల్లలకి పెళ్ళీడుదాటిపోయేది.

"భైరి అనేవాడుకదా "ప్రపంచంలోని దేశాలు, ఆ దేశాల్లో జనంనివసించేతీరు, వారి ఆచారాలు, వేషభాషలు, వారి రాజ్యాలు ఇలాంటివి చెప్పండి. ఆ దేశాలు పైకి వచ్చినతీరు, పడిపోయిన తీరులు చెప్పితే మనం వహించవలసిన జాగ్రత్తలైనా తెలుస్తాయి. పొరుగు రాష్ట్రాల భాషలతో పరిచయమేర్పరచండి. ఒక సంస్కృతంతోనే ప్రాణాలుతీస్తారేం! అపురూప ప్రయోగాలు, అపురూప వ్యాకరణ విశేషాలతో బుద్ధి ననవసరమైన శ్రమ పెట్టారెందుకు ?"

ఇదంతా ఉపాధ్యాయులకు కొరకరాని కొయ్యగా ఉండేది. "కాశీలో కూడా ఇంతకంటే బాగాచెప్పరే. మాచదువుకు పేరుపెట్టాడా?" అని వారనుకొనేవారు. బాబయ్య లేనిలోటు భైరి నీవిషయంలో ఎంతో బాధించేది. తానే ఓపికున్నప్పుడు పిల్లలకు పంతుళ్ళు చెప్పలేనివన్నీ చెప్పేవాడు.

ఎలాగో పిల్లలకీమాత్రం చదువు వచ్చాక కావ్యాలయిందనిపించాడు. తరువాత న్యాయం, తర్కం, మీమాంస, వ్యాకరణం, అలంకారశాస్త్రం, వేదాంతం మొదలైనవన్నీ బ్రాహ్మణులకే పరిమితమనీ వాటివల్ల తమకు పెద్దప్రయోజనమూలేదనీ వాటిజోలిమానుకొని కొంతధర్మశాస్త్ర ప్రవేశమూ, యుక్తి కల్పతరువూ చెప్పిద్దామనుకొన్నాడు. దానివల్ల సాటివారితగాదాల్లో నీతితప్పకుండా

మెలగటం వస్తుంది. వజ్రాలు, రత్నాలు, కత్తులు, కఠారులు, గుర్రాలు, ఏనుగులు, ఛత్రాలు,ఓడలు, రాజనీతి ఓడలు నడిపే పద్ధతులు మొదలైనవి క్షుణ్ణంగా వస్తాయనీ ఆశించాడు.

అందుకుగాను ప్రత్యేకంగా ఉపాధ్యాయుణ్ణి దూరదేశంనుండి పిలిపించాడు, ఆయన ఓడల నిర్మాణానికి పనికివస్తుందని వృక్ష ఆయుర్వేదం మొదలుపెట్టాడు.

"లఘయత్ కోమలం కాష్ఠం
సుఘటం బ్రహ్మజాతితత్
దృఢాంగం లఘుయత్కాష్ఠం
అఘటం క్షత్ర జాతితత్
కోమలం గురుయత్కాష్ఠం వైశ్యజాతి తదుచ్యతే
దృఢాంగం గురుయత్కాష్ఠం శూద్రజాతి తదుచ్యతే
లక్షణద్వయ యోగేన ద్విజాతి: కాష్ఠ సంగ్రహ:
క్షత్రియ కాష్ఠై: ఘటితా బోజమేతే సుఖసంపదం నౌకా."

ఉపాధ్యాయు ధీపద్యం పిల్లలచేత చదివించి దానికర్థం చెప్పబోతుండగా భైరయ్యకు మామూలుగా రాకూడదని కోపం వచ్చింది.

"ఓడల్లోనూ, కర్రలోనూ ఏమిటి మీ పిండాకూడు వర్ణాలు ? వివిధ వృక్ష కాష్ఠాల గుణాలు నిరూపించి వాటిలో ఏవి ఓడల నిర్మాణాలకు యోగ్యమైనవో ఎందువల్లనో చెప్పితే పోలే ?......" అంటూ శాస్త్రాలను పట్టుకొని తిట్టినాడు.

శాస్త్రనింద ఓర్చుకొనలేని ఉపాధ్యాయుడు "సేవావృత్తే నీచమైంది. అందులో శూద్రసేవ అయితే చెప్పేదేముంది ? నాయెత్తు ధనంపోసినా నాకీ కొలువు వద్ద" ని మానివేశాడు.

ఇప్పటికే ఇద్దరుముగ్గురు ఒజ్జలను మార్చి విసిగిన భైరయ్య మరి పంతులకోసం ప్రయత్నించలేదు. వారిచదువు బాధ్యత తనమీదనే వేసుకొన్నాడు. తనవెంట తీసుకొనివెళ్ళుతూ పనిసులువులు తెలుప నారంభించినాడు. తనకు

తెలిసిందంతా వారికి గరపినాడు. ఎదిగివచ్చిన వారిద్దరి ప్రకృతులను బట్టి బావమరిది నింటి వద్ద వ్యవహారానికీ కొడుకును రేవులోనూ నిల్పితాను పై పై పనులు చూసుకొంటూ విశ్రాంతి తీసుకొన నారంభించినాడు. సరైనవని ఋజువైన తన భావాలను లోకం నిరాదరించి తృణీకరిస్తే కలిగే శల్య మెక్కటి మినహాయిస్తే మరేబాధా లేకుండా గడుపుకొస్తున్న భైరికీ ఆనందమూ ఎక్కువకాలం నిలవలేదు.

భైరి కొడుకు రేవులోనూ ఓడలమీదా పనిబాధ్యత స్వీకరించిన కొన్నాళ్ళకే పాశ్చాత్యులు తమ్ముచాల నీచభావంతో చూస్తున్నారని అర్థం చేసుకొన్నాడు. కొన్నాళ్ళది బాధగా నలిగి తరువాత క్రోధమై, ద్వేషమైచివర గ్రుడ్డిపగగా మారిపోయింది.

భైరయ్య అటుంటి గుడ్డిపగవల్లకల్గే అనర్థం కొడుకుకు తెలియజెప్పడానికి ప్రయత్నించిన్నీ ఫలితం లేకపోయింది.

ఇంగ్లీషువారి వశమైనప్పటినుండీ కోస్తా సర్కారులలో సామాన్య ప్రజల ఆర్థిక పరిస్థితి దుర్భరమైపోయింది. తిండిలేక మలమలమాడి పోయేవారి సంఖ్య రోజురోజుకూ విస్తారంగా పెరుగజొచ్చింది. పన్నుల భారంకూడ చాల పెరిగిపోయింది. మొగలాయి పాలనలోగానీ, నిజాంశాహీయుల్లో అంతవరకుగానీ ఎన్నడూ అంతపన్నులభారం ప్రజలమీద పడలేదు. శ్రీకాకుళం మొదలు బందరువరకుగల కోస్తాసర్కారులన్నీ ఇంగ్లీషువారికి సుమారేడులక్షల రూపాయల శిస్తుకు దత్తం చేయబడినవి. యుద్ధాలలో ఇంగ్లీషువారు నిజాంపక్షాన సాయం చేసినప్పుడదీలేదు.

అయినావారొక పెద్దాపురం సంస్థానంవారివద్దనే సుమారారు అక్షల రూపాయలపన్ను వసూలు చేశారంటే వసూలెంత ఎక్కువైందో ఊహించవచ్చు. ఈ పన్నులు వసూలుచేసివ్వలేని సంస్థానాధీశులు క్రమంగా సంస్థానాలమ్ము కొనవలసిందే. కొల్లగొట్టే రాజ్యాంగానికి తగినట్లుగా కంపెనీ ఉద్యోగులు కొన్నేండ్లే ఉండి మారిపోయేవారు. అందువల్ల ఎప్పటికప్పుడు కొత్త దాహంతో ఆవురుమంటూ కంపెనీ అధికారులు వచ్చేవారు. కానీ ఎప్పుడూ జనులకు ముఖం చూపవలసిన

సంస్థానం వారంత నిర్దాక్షిణ్యంతో క్రూరంగా ప్రవర్తించే అలవాటు నంత త్వరలో అలవరచుకొనలేకపోయేవారు. ఈ రీతిగా పెరిగిన పన్నులభార మొకవంక, కాలువలు నీటివనరులూ వీటిపట్ల ఏమాత్రమూ శ్రద్ధవహించకపోవడం మరొకవంక ఇవన్నీ కలిసి ప్రజల జీవనాన్ని ఛిన్నాభిన్నం చేశాయి.

ఎంత నికృష్టంగా బ్రతుకుదామనుకొన్నా సాధ్యపడక పోయినప్పుడు జనులెక్కడికక్కడ తిరుగబాటుచేయనారంభించారు. ఇటువంటివారిని జమీందారి కుటుంబాల్లో, రాజకుటుంబాల్లో అసంతృప్తిచెందినవారు కూడదీసేవారు. అటువంటి తిరుగబాటులోనే ఒకచోట భైరి కుమారుడు పాల్గొని ఇంగ్లీషువారికి పట్టుబడినాడు. వారతన్ని శతఘ్నిముఖానికి కట్టివేసి పేల్చివేయపోతూ చివరికోరికఏదైనాఉంటే కోరమన్నారు, అతడు "కట్లుకట్టించుకోవడం నాకు బాగలేదు.చావంటే నాకుభయంలేదు. తప్పనిసరైతే పౌరుషపుచావేచస్తాను. కట్లు విప్పండి ఆకంతై నా కదలకుండా ఉంటాను" అన్నాడుట. వారుకట్లువిప్పారు. తనమాట ప్రకారమే చిరునవ్వు నవ్వుతూ నిబడ్డాడు "ఓడిపోయినా న్యాయంమాదే" అని మాత్రం అరిచాడు.

ఎన్నో కష్టాలు భరించాడు కానీ భైరి దీనితోక్కుంగిపోయాడు. కొంత కాలం బయటికి రావడమూ తగ్గించివేశాడు. పరదేశి అవతారం ధరించిన శోకమూర్తయింది.

భైరిప్రాణం కూడ తీయాలని ఇంగ్లీషు అధికారుల తలచారు గానీ రెండుమూడు కారణాలతన్ని కాపాడాయి. కొంతకాలం క్రితమే. సహగమనం చేయనున్న స్త్రీని ఇంగ్లీషుకంపెనీ ఉద్యోగి చితిమీదినుండి కాపాడి తనవద్ద ఉంచుకొన్నాడు. అప్పుడు పంచాయితీ పెద్దలు కులపెద్దలు రాజోద్యోగులు పెద్దగోల ప్రారంభించి, ఆమెను తమ స్వాధీనం చేయాలన్నారు. భైరి ఒక్కడూ ఆమెపక్షం వహించి, పోరాడి ఆమెనతను వదిలేయకుండా కాపాడాడు. ఆ అధికారి ఇతనిపరంగా ఇప్పుడు కంపెనీ సమితిలో ఓటు వేశాడు. రేవులో పనిచేసే

వారందరూ ఒక్కుమ్మడిగా అతనిపై ఎవ్వరూ చెయ్యి చేసుకోవడానికి వీల్లేదని ఘోషించారు. అందుచేత అతని వ్యతిరేక వాదాలను సహిస్తూ బ్రతుకనివ్వవలసి వచ్చింది.

భైరి చిట్టిబావమరిదితో ఇంగ్లీషువారికున్న సంబంధాలు కూడ భైరిని బలవన్మరణం నుంచి కాపాడేయి.

కొన్నాళ్ళు పుత్రశోకంతో కుమిలినా తిరిగి భైరి మామూలై లోకంలో తిరుగ సాగినాడు.

నిస్సహాయులై భైరిదంపతులెన్నో గాలివానలు చూచారు. గరిక పోచలు ప్రవాహనికి తలవంచినట్లుగా జరుగుతున్న సంఘటనలకు తలవంచారు. చేయగల్గిన కృషిలో మాత్రమెన్నడూ లోపంచేయలేదు. ఎన్ని నిష్ఠురాల నెదుర్కొనవలిసి వచ్చినా జడవలేదు.

తమ వృత్తి ఒక వెలుగు వెలగడమూ పడిపోవడమూ ఆ కళ్లతోనే చూచారు.

ఆకాలానికి బ్రిటిషువాళ్ల చేతుల్లోని బెంగాల్ సుభాలో దాదాపు నేటి బంగాళము బీహారు. ఒరిస్సా రాష్ట్రాలుండేవి. అంటే ఉత్తరసర్కారుల సరిహద్దు వరకుండేదన్న మాట. సరే, శ్రీకాకుళం రాజమండ్రి సర్కారులు వారి వశమైనాయి. గుంటూరు సర్కారుకోసం బేరాలు నిజాముతో ఎప్పటి నుండో సాగుతున్నాయి. దక్షిణాదిన కూడా చాలారాజ్యం వారికలాగే దఖలు పడింది. కాబట్టి మద్రాసునుండి కలకత్తాకు, కలకత్తానుండి ఇటుమైపుకు రవాణా విపరీతంగా పెరిగింది. అదేవిధంగా భారతదేశంలో ఇంగ్లీషువారి వ్యవహారాలు పెరిగినట్లల్లా ఇంగ్లండునుంచి వచ్చేఓడల సంఖ్యకూడ పెరిగింది. సూరత్ ప్రాముఖ్యత పడిపోయింది. బొంబాయి మద్రాసు కలకత్తాలు ముఖ్యకేంద్రా లయ్యాయి. అనేక కారణాలవల్ల కోరంగి ఆరోజుల్లో దేశంలోని చిన్నరేవు లన్నిటిలోను ఓడలనిర్మాణానికి, రిపేరీలకు పేరు పొందింది. చక్కని టేకు అడవులు సమీపంలోనే ఉండటం, ఇక్కడితెలింగవారి కాంగ్లేయులను నాశనం చేయాలన్నంత ద్వేషం లేకపోవడం, ఇదివారి ఆప్తమిత్రుడు నిజాం

రాజ్యంలోనిది కావడం, సహజంగా రేవు చక్కనిది కావడం, దక్షిణాదికీ కలకత్తాకు మధ్యగా ఉండడం మొదలైన కారణాలవల్ల కోరంగి వారికనుకూలమనిపించి ఉండాలి. అందువల్ల ఓడల రిపేరీపని చాల పెరిగింది. కొత్తకోరంగిలో చాల భవనాలు లేచాయి. ఇంగ్లీషువారు, వారికిలోబడిన డచ్చివారు ముఖ్యంగా ఇక్కడ వర్తకమూ ఓడలపనీ చూచేవారు. వారితో మనవారు భాగంకలిసేవారు.

భైరిఒకప్పుడు ఓడపనివారితో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా కట్టుకట్టించాలని చూచాడు. పాశ్చాత్యుల ఓడలురిపేరీ చేయడంద్వారా వారు మనదేశాన్నాక్రమించేందుకు తోడ్పడుతున్నామని నచ్చచెప్పేందుకు ప్రయత్నించాడు. దేశీయులప్పటికప్పుడు కలిగే లాభమే చూచుకొన్నారు. ఆంగ్లేయులు కొల్లగొట్టి కోట్లుసంపాదిస్తున్నవారు. అవసరమైతే నాల్గురాళ్ళెక్కువ పారవేయవలసి వచ్చినా వెనుదీయరు. దేశీ ఓడ యాజమానులకా సామర్థ్య మెక్కడిది? అసలే మునుగుతున్నవారైరి. గొఱ్ఱె కసాయివాణ్ణే నమ్ముతుంది. దూరం చూడలేదు. నేతవృత్తిలో దెబ్బతిన్నవారు, పడిపోయిన ఇతర వృత్తులవారు అందరికీ ఓడలనిర్మాణం, ఓడల రిపేరీ ఒకఆసరా కల్పించింది. దాన్ని వాళ్ళు వదలుకొనేందుకు సిద్ధపడలేదు,

ఇదెనాళ్లో జరుగదని భైరి మొత్తుకున్నా వినేవారులేరు, తాము కూలి ఇవ్వలేరు; ఇస్తున్న చోటికిపోతే ఓర్వనైనాలేరు అనుకొనేవారుజనం.

కంపెనీ వారిక్కడ మనదేశతీరాల్లో రవాణా యావత్తూ మనఓడల మీదనే జరిపేవారు. ఈదేశంలోనివారి నౌకాసైన్యానికీ మన ఓడలనేవాడేవారు యూరోపియన్ ఓడలకంటే మన ఓడలు చాలనాణ్యమైనవి. వాటినిమించి దృఢమైనవి, ఎక్కువబలాన్ని మోయగల్గినవీ(వెయ్యిటన్నులు) యాభై యేళ్ళు సుమారు మన్నగల్గినవీ. వారిఓడలు మహాఅయితే ఇరవై ముప్పై టన్నులు. బరువు మోయగల్గినవి. ఆయుస్సు పరిమితి పదిపంద్రెండేండ్లు. అందువల్ల కంపెనీవారు మన ఓడలనేవాడేవారు. వారువృద్ధి చెందినట్లల్లా ఓడలపరిశ్రమ వృద్ధి చెందింది. ఇలా మననౌకలకు గిరాకీహెచ్చి. మనపరిశ్రమ గొప్పవెలుగు వెలిగింది.

ఆరోజులను తల్చుకొంటే కోరంగి నేటికి వణికిపోతుంది. ఆతెల్లవారి ఓడలను రానివ్వకండిరా అని మొత్తుకొంది. ఆమె ఆవేదనెవ్వరికీ విన్పించలేదు. మాపుట్టింటివారిని (మహరాష్ట్రులను) నాశనంచేస్తున్నారురా వీరు! ఈనాడు మీమేనమామలైంది రేపుమీరౌతారురా! అని రోజూ నెత్తిన నోరుపెట్టుకొని అరచేది ! తమసుత్తుల టకటకల ఇంపులో మనవారికానాడు కోరంగి ఆక్రోశం వినిపించిందికాదు. తల్లి కోపం నీళ్ళల్లో నిప్పువంటిదని ఎంత మందికి తెలుస్తుంది? కోరంగి నిగ్రహించుకొంది. కోపం కడలిరాజుమీద చూపింది. అతన్నవతలికిత్రోసివేయ నారంభించింది. అతను తన్ను చేరకుండా మేటవేయనారంభించింది. నావారిని నాశనంచేస్తున్నవారి ఓడలను ముంచివేయవేమయ్యా అని కడలిరాజును దూరింది. “మనిషికిలేని స్వాతంత్ర్యం నాకెక్కడిదే బ్రతుకులో? త్రొక్కిసలాడుకుంటున్న క్రిక్కిరిసిన జనసమూహంలో ఎవ్వడూ తనకదలికకు బాధ్యుడు కానట్లే అనేక ప్రకృతి శక్తుల్లో నేనూ ఒకణ్ణి ఏంచేయగలను?” అంటాడు కడలిరాజు. కోరంగి “నీవుతల్చుకొంటే క్షణంలో వారిని ముంచేయలేవా?” అని రెట్టిస్తుంది. “నీమాటేనీది” అని విసుగుచూపి విసురుగా కోరంగిమీద చేయివేయబోయి అంతలోనే తమాయించుకొని దూరంగా వెళ్తాడుకడలి. కోరంగి మనస్సంతా ఇంకాచేదౌతుంది.

ఎప్పుడైనా తీరికగా భైరి కోరంగిఒడ్డుమీద మౌనంగావచ్చి పడుకొంటాడు. తనకు కల్గిన కష్టమోసుఖమో ఇతరులతో పంచుకొనడానికి వీల్లేకపోతే ఆ సందర్భాల్లో అతనిక్కడే విశ్రాంతి తీసుకొనేవాడు.

ఊళ్లోకి కొత్తరకం సంగీతం వచ్చింది నీవు వినాలని మిత్రులు నిర్బందించి తీసుకొనివెళ్లారు. త్యాగరాజు కీర్తనలభ్యాసంచేసిన పిల్లాడు చక్కని కచేరీచేశాడు. భైరయ్య ఆపిల్లాణ్ణెంతగానోమెచ్చుకొని త్యాగయ్యగారి కీర్తనలన్నీ పాడించుకొని గొప్పగా

సన్మానించాడు. "గ్రామంలో ఎవరైనా నేర్చుకొనేవారుంటే వాళ్లకు వచ్చినంత నేర్పండిస్వామీ. నేనుఖర్చులు భరిస్తాన"న్నాడు. త్యాగయ్య కీర్తనలు శాస్త్రీయం కావన్న దేవదాసి ఇంటిపైకి జోడు తీసుకొని బయలుదేరాడు. అందరూఆపారుకాబట్టి సరిపోయింది కానీ. అతనికి కల్గిన ఈఅనంతావేశ మితరుల కర్థమైందికాదు. జనందృష్టి తప్పించుకోవడానికి భైరికి కోరంగి ఒడి కాక మరే శరణ్యముంది ?

మరొకసారి వేమనపద్యాలంటూ కొందరు కొత్తపద్యాలు వినిపించారు. అదివిని ఎగిరి గంతువేశాడు. ఎంతోడబ్బు వెచ్చించి వేమనపద్యాలన్నీ తెప్పించుకొన్నాడు. ఓడల్లో వెళ్ళే మిత్రులతో వేమన పద్యాలను గురించే చెప్తూండేవాడు

ఇప్పుడతని మనస్సు నర్థంచేసుకొనే వాళ్ళే గ్రామంలో కరువైనారు. అతని చేష్టలే ఎవరికీ అర్థంకావు. కంపెనీలో సత్పురుష లెవ్వరైనాఉంటే వారిచెలిమి చేసేవాడు. వారు తమ సాహిత్యాన్ని విన్పించితే వినేవాడు. మన సాహిత్యంలో తనకు నచ్చినవి వారికి వినిపించేవాడు. వారి దేశంలో వస్తున్న మార్పుల నెవ్వరైనా చెప్పితే అటువంటివి మాకూ కావాలని ఆవేశపడేవాడు.

ఆవేశాన్ని భరించలేక తన ఒడిలో ఆశ్రయం కోరిన కొడుకు తల నిమురుతూ ఊరివైపు జాలిగా చూస్తుంది కోరంగి. తాము కూర్చున్న కొమ్మను తామే నరుక్కొంటున్న ఊరివారిని తల్చుకొని ఇద్దరూ కన్నీళ్ళింకేదాక ఏడుస్తారు. వీలైనంత తక్కువ దెబ్బలతో ఈ ప్రమాదంనుండి మనవారు బయటపడాలని నిశ్శబ్దంగా కాలపురుషుణ్ణి ప్రార్థిస్తారు

## XVI

ఇలా ఉండగా కంపెనీకొక కొత్తఉద్యోగి వచ్చాడు. ఐదారేళ్లుగా యానాంకూడా ఇంగ్లీషు కంపెనీలో ఉందిగా ! ఆ యానాం, సుంకరపాలెం మొదలైన ఫ్యాక్టరీలతని అధీనంలో నడిచేవి. అతను రాకముందునుంచే అతనసాధ్యుడనీ, అతనిముందిక మిగిలినవారి ఆటలు సాగవనీ ఇలా రకరకాలుగా అందరూ చెప్పుకున్నారు.

తీరా వచ్చాక అతడు మంచివాడనీ, దుర్మార్గులనైనా పగబట్టి శిక్షించకుండా గుణం మార్చేందుకు తన్పనిసరైనంత మాత్రమే శిక్షిస్తాడనీ తేలింది. కంపెనీ ఉ ద్యోగుల్లో మంచివారు సంతోషించారు. దుర్మార్గుల ఆటలు కట్టినాయి.

అతనికి తెలుగు బాగావచ్చు. ఉచ్చారణ సరిలేకపోయినా బాష క్షుణ్ణంగా తెలుసు. ఇంతకు పూర్వం వచ్చిన కంపెనీ ఉద్యోగులకు దేశీభాషలు చాల కొద్దిగామాత్రమే తెలుసు. తెలుగు మరీతక్కువ. ఉంటేగింటే ఉర్దూలో కొంత మేలుగా ఉండేవారు. దుబాసీలందువల్లనే వారివెనుక చాలా నాటకాలాడగలిగేవారు.

అతను కొత్తకోరంగిలో ఒక భవనంలో మకాం పెట్టాడు.

అతని కటాక్ష వీక్షణలింత సోకితే చాలని ఆశ్రయించే వర్తకులు, సరంగులూ, ఖర్వాలు, భండారీలు పడిగాపులు పడి ఉండే రోజులవి. వీరందరినీ కాదని అతను భైరితో కోరి చెలిమి చేసినాడు.

ఆయన విద్యాపక్షపాతి. వీరెవ్వరికీ విద్యాగంధ మింతైనాలేదు. అంతోయింతో చదువుకొన్న ఇతరులున్నారు గానీ వారికి వల్లమాలిన అహంకారము, మ్లేచ్ఛులతో ఆముష్మిక విషయాలు మాట్లాడేందుకాచారా మడ్డువస్తుంది. కావ్యాలైనా చదువవచ్చుకదా అంటే దేవుండ్ల ప్రసక్తిలేని మంచికావ్యా లెక్కడున్నాయి మనకి ? ఆ ప్రసక్తివస్తే దేవుండ్లను గురించి కిరస్తానీ ఇంగ్లీషువాని ప్రశ్నలకు జవాబులు చెప్పాలిగా ?

ఆయనకెవ్వరో భైరిపేరు సూచించారు. కానీ అతన్ని నిఘాలోపెట్టి ఉ ంచామనీ, అతను ప్రమాదకరమైన వ్యక్తిఅనీ టొపాసీలు చెప్పారు. దుబాసీలూ దాన్ని బలపరిచారు. కానీ ఒకరోజు కోరంగి గట్టుమీద వాహ్యాళికి వెడుతూ ఏకాంతంలోఉన్న భైరినాయన చూచాడు. పలుకరించి ఎవరైందీ తెలుసుకొన్నాడు. త్వరలోనే వారిపరిచయం రాజకీయాలు మాట్లాడుకొనేవరకు పోయింది ( ఈరోజుల్లో సినిమాలకంటె చులకనగా రాజకీయాలు మాట్లాడినట్లుకాదుగా ఆ రోజుల్లో!) వారురోజూ కలుసుకో నారంభించారు. మామూలుగా ఉద్యోగి కొత్తకోరంగి గట్టుమీద

నడిచివచ్చేవాడు. భైరి ఇవతలి గట్టుమీద నడిచి వచ్చేవాడు. అనుకూలమైన చోట ఎవరో ఒకరు కోరంగిని దాటి వచ్చేవారు. ఇద్దరూ కలిసి కూర్చొనేవారు. దూరప్రాంతపు బంధువుల పిల్లలవురూపంగా కలిసినప్పుడున్నంత అమాయకంగానూ, అరమరిక లేకుండానూ ఉండేది వారికలయిక.

ఇంగ్లాండులో ఇతర యూరోపియన్ దేశాల్లో రాజ్యవవస్థ ఎలా ఉండేదదీ కుతూహలంగా వినేవాడు భైరి. ఇంగ్లీషుపార్లమెంటు నిర్మాణము, వారి హక్కుల రక్షణకై జరిగిన ఎడతెగని పోరాటము విన్నప్పుడు భైరి "మీదేశమూ గొప్పదే. తప్పనిసరైన వ్యాపార విషయాల్లో తప్ప మిగిలిన వాటిలో మీతోసంపర్కంవల్ల మైలపడి పోతామనే వాళ్ళెంతటి మూర్ఖులో ఇప్పుదర్థమౌతూంది" అనేవాడు. బైబిల్‌ని ఇంగ్లీషులోనికి అనువదించిన సాహసికుని కథను విన్నప్పుడు భైరిఒప్పుకొన్నాడు. "పురోహితులు సంస్కృతంలో వచ్చీరాకపలికే అర్థంలేని శబ్దాలుగానే ఉంటున్నాయి. మాతత్వనిధులన్నీ మాకీనాటికీ ! అనేక విషయాల్లో మీ కంటే మేము వెనకబడి ఉన్నాము. మీనుండి నేర్చుకొనవలసింది చాలాఉంది."

ఇంక బర్కుమహాశయుణ్ణి గురించి తెల్సుకొన్న తరువాత భైరికింగ్లీషువారంటే సామాన్యంగా ఏర్పడిఉండిన ద్వేషం తొలగటమేకాక గౌరవమూ కలిగింది. క్లైవు, హేస్టింగ్సు వీరి దుశ్చర్యల ప్రసక్తిరాగా ఇంగ్లాండువారు వాటిని చాల అసహ్యించు కొంటున్నారనీ, వారిని విచారించాలని అనేకులు కోరుతున్నారనీ కంపెనీ ఉద్యోగి చెప్పాడు.

భారతీయ సమస్యమీద బర్కుమహాశయుని ఉపన్యాసభాగాలను వినిపించాడు. పాల్‌బెన్‌ఫీల్డు తెలివిగా దొంగలెక్కలు సృష్టించి ఆర్కాటు నవాబుద్వారా కోట్లధనాన్ని సంపాదించిన నీచవిధాన్ని తూర్పారబట్టిన ఉపన్యాసమొకసారి విన్నప్పుడు బెన్‌ఫీల్డు మీదకంటే భైరికి స్వదేశీరాజుల మీదనే ఎక్కువ అసహ్యం కల్గిందంటే విశేషంలేదు.

మనదేశంమీద పూర్వందండెత్తిన  వారికీ, ఇంగ్లీషు వారికీ భేదాన్ని చూపుతూ, ఇంగ్లీషువారి దండయాత్ర  ఎలా అన్నిటికంటే  క్రూరమైనదో పార్లమెంటుకు బర్కువివరించిన ఉపన్యాసమతనికి గొప్ప  కనువిప్పు కల్గించింది. బర్కుమాటల తాత్పర్యమిది.

ఇండియామీద మనకంటె ముందెందరో దండయాత్ర చేసిఉండవచ్చు. ఆ ఆసియా విజేతలూ ఎన్నో  క్రౌర్యాలు నెరపి ఉండవచ్చు. కానీ కొంత కాలానికవన్నీమానిపోయేవి. విజయం సాధించేవరకే కాని  అదిసుస్థిరమైన తరువాత తామూ ఆదేశంలో ఒకరై వారుకలిసిపోయేవారు. తాము జయించిన దేశస్థుల మంచిచెడ్డలతో వారిమంచిచెడ్డలూ  పెనవేసుకపోయేవి. తమవారసుల తరతరాలపాటిక్కడే స్థిరపడగల భవిష్యత్తుకోసం వారు పునాదులు వేసేవారు. అటువంటప్పుడీరాజ్యంలో యావన్మందీ  తమ్ముశపిస్తూండేలా ఉంచుతారా? కాబట్టి క్షణమేమరితేచాలు  తమమీదగానీ, తమవారసులమీదకానీ దేశీయులంతా పగతీర్చుకొనే స్థితిలో జనాన్నుంచుతారా ? ప్రకృతి సిద్ధంగానే జనం  సుఖంగాఉ ండే  వ్యవస్థ ఏర్పడేది.  ఆ విజేతలు  సంపద హరించినా సంపదలనూరించే ఊటలను పాడుచేసేవారుకారు.

కానీ మన ఇంగ్లీషురాజ్యంలో ఇదంతా తారుమారైంది. మన 'మైత్రి' 'రక్షణ' దేశాన్ని  ధ్వంసం చేస్తున్నాయి. వెంట్రుకలు నెఱసిన  ఇంగ్లీషువాడెల్లా ఉ ంటాడో ఇప్పటికాదేశీయులు చూడలేదట. అంతా  కుర్రకారక్కడికి వెడుతున్నారు. వారికాదేశపు పద్ధతులు తెలియవు. ఏళ్లతరబడి  అక్కడ నివాసమున్నాసరే మనవారా జీవితాన్ని  తెలుసుకొనే  ప్రయత్నమైనా చేయరు.

ఇక్కడనుండి వెళ్ళేప్పుడు మనవారికున్న  ఏకైకాశయమేమిటి ? సంవత్సరానికైదు పౌనుల ఉద్యోగాన్ని  ఐదువందల పౌనుల ఖర్చుచేసైనా సంపాదించేందు కెందుకు మనవారు వెనుకాడరు ? అక్కడ చేరుకొన్న నాటి నుండి మనవారు  దేనికోసం  వెతుకుతారు ?  లబ్బీలకోసం ! తరువాత జీవితాంతం

సుఖపడేందుకు వీలైనంత సొమ్మెంత త్వరలో వస్తుందని ! ఎంతతొందరగ సొమ్ము చేసుకొని మాతృదేశంలో సుఖంగా మిగిలినకాలం గడుపుతామని!

వెనువెంటనే విరుచుకొనిపడే అంతులేని కెరటాల్లా ఈ ఆశపాతకుల మూకలా దేశంమీద పడుతున్నారు. ఇప్పటికా దేశీయులకేఆశామిగలలేదు. అంతకంతకు రాశి తరిగిపోతూంది. అయినా ఆవురావురుమంటూ వచ్చిపడి అందినంత నోటకరచుకొనిపోయే పక్షులకంతు కనిపించడంలేదు. ఎగిరేవెగిరి పోతుండగా వచ్చేవి వస్తూనే ఉన్నాయి.

నిస్సహాయులై ఈ ఘోరాన్ని చూస్తున్న ఇండీవాసుల కింకెక్కడి ఆశ ! ఒకటే నిరాశ !

ఇంగ్లీషువారు లాభంపొందిన ఒక్కొక్క రూపాయినీ ఇండియా శాశ్వతంగా నష్టపోతూంది.

భైరి ఈభాగం విన్నప్పుడాశ్చర్యంతో ఇలా అన్నాడు "నేటి మా పరిస్థితినింత బాగా అర్థంచేసుకొన్నవారు మాదేశీయుల్లో ఒక్కరూ లేరేమో ! అనునిత్యం కళ్లఎదుట కనబడుతున్న ప్రపంచంమావాళ్లకర్థంకాలేదు ! కానీ అంతదూరంనుంచి ఇంత అర్థంచేసుకొన్న మేధావులు మీలో ఉన్నారంటే మీ వ్యవస్థ చాలాగొప్పది. ఆ గొప్పతనాన్నాకళింపు చేసుకోనిదే మాకు మిమ్మల్ని జయించే శక్తిరాదు."

దీనికతను నవ్వుతూ యిచ్చిన సమాధానం భైరిని మరింత ఆశ్చర్యపరచింది. "రాబర్టు ఓవెన్ అన్న మహాత్ముడొకాయన మాదేశంలో కొత్త సిద్ధాంతం లేవదీశాడు. ఆయనప్రకారం మనిషి మంచిచెడులతనున్న పరిస్థితులను బట్టి ఉంటాయి. అంతేగానీ పూర్వజన్మ వాసన, భగవంతుని కృప ఇటువంటివికావు. మనిషి బాగుపడాలంటే అతనున్న పరిస్థితులను బాగుచేయాలి. ఆయన లాభాలార్జించే పద్ధతికి వ్యతిరేకి. భూమిమీదనే స్వర్గం నిర్మించాలని ప్రయత్నాలు చేస్తున్నాడు. అతని ప్రయోగాలు జయప్రదమైతే ఇంకేముంది ? ప్రపంచమంతా సౌఖ్యంగా ఉంటుంది. ఒకరి నొకరు జయించడమూలేదు, కొల్లగొట్టడమూ లేదు. ఒకరినొకరు తరిమివేయడమూ లేదు."

అమెరికనుల యుద్ధాన్ని గురించిమాత్రమే ఇంగ్లీషుద్యోగి చెప్పలేదు.

ఉద్యోగుల్లో మంచివాళ్లనొక చోటే ఉంచితే ఆ ప్రాంతీయుల పట్ల పక్షపాతం చూపినట్లౌతుంది! కనుక వారిని మారుస్తూఉండాలి. వీలైనన్ని ఎక్కువ ప్రాంతాలలో త్వరత్వరగా తిప్పాలి! కాబట్టి ఈ ఇంగ్లీషు ఉద్యోగి మరొక ఊళ్లో ఫ్యాక్టరీకి వెళ్లిపోయాడు.

పాశ్చాత్యులవద్ద తెలుసుకొనవలసిన విషయాలు పూర్తిగా తెలుసుకోక తానింతకాలమూ చాలనష్టపోయాననుకొన్న భైరి తరువాత ఆలోటు తొలగించుకోవాలనుకొన్నాడు. ఫ్రెంచివారితోను, డచ్చివారితోను, ఇంగ్లీషువారితోను. ఆర్మీనియన్లతోను, అందరితోను కలసిమెలసి ఉండేందుకు ప్రయత్నించేవాడు.

ఈసారి పరాసువాళ్ళ సావాసంలో అతనికి వాల్టేర్ రూసోల రచనలతో పరిచయం కలిగింది. ఫ్రాన్సులో రెండువర్గాలున్నాయనీ, రాజులు, వారి బంధువులు, భూస్వాములు, వారి బంధువులు చర్చిలో స్థానంకల్గినవారు వీరంతా ఇతరులకులేని అనేక హక్కులననుభవిస్తున్నారనీ అతనికి తెలిసివచ్చింది. వారుపన్నులు పేరుకు మాత్రమే చెల్లిస్తారు. వారినేరాలకు శిక్షలు తక్కువ. వారిమాటలకు విలువెక్కువ. వారికి వ్యతిరేకంగా తక్కువ వర్గాలవారి సాక్ష్యాలు చెల్లవు. ఈ రీతి వారితరులమీదొకప్పు డెంతెంత దౌర్జన్యాలైనా చేస్తూంటారు. ఈ అన్యాయానికి వ్యతిరేకంగా ఫ్రాన్సు మేధావులు తిరుగబడుతూ ప్రజలకు కనువిప్పు కల్గిస్తూ న్నారు. అందెన్ని సాధక బాధకాలు కల్గినా వారోర్చుకొంటున్నారు. ప్రభుత్వ మన్నది సమాజంలో అందరూ సుఖంగానూ, శాంతితోనూ జీవించేలాచూస్తూ సమాజాన్ని ముందుకు తీసుకుపోవాలనీ, ఆ ధర్మాన్నది నిర్వహించనివాడు ప్రజలకు దాన్ని మార్చే అధికారం సహజంగా ఉంటుందనీ వారుభావిస్తూన్నారు. భైరి ఫ్రెంచివారిద్వారా అమెరికా స్వతంత్ర యుద్ధాలను గురించి కూడా విన్నాడు.

ఫ్రాన్సులో పైవర్గాల సౌఖ్యంమాత్రమే చూసే ప్రభుత్వాలను మార్చేందుకు సంఘాలేర్పరుస్తున్నారని కూడ అతనికి తెలియవచ్చింది. జనుల్లో పారమార్థిక

చింతనను పెంచవలసిన చర్చివారు రాజులతోను చక్రవర్తులతోనూ, వారి తాబేదార్లతోనూ ఏ స్థాయికాస్థాయిలో ఒక్కటై చేస్తూన్న ఘోరాలకు వ్యతిరేకంగాకూడ పాశ్చాత్య మేధావులు తిరుగుబాటు చేస్తున్నారు. ఇవన్నీ భైరికి పూర్తిగాతెలిసి జీర్ణమయ్యాయని కాదు. అందుకవకాశ మెక్కడిది ? దిగ్బంధం చేయబడినవ్యక్తి చుట్టూఉన్న బండరాళ్ల గోడలు హఠాత్తుగా నెరదవిడిస్తే ఏర్పడే చూరులో ఎంతప్రపంచం కన్పిస్తుంది కనక? ఐనా భైరి దానికే ఉబ్బి తబ్బిబ్బయ్యేవాడు. తనకుతెలిసిన ఆ కొద్ది విషయాలనే నిర్భయంగా గ్రామంంలో అవకాశం కల్గినప్పుడల్లా చాటేవాడు. గ్రామస్థులు దాన్ని సగంపిచ్చిక్రింద లెక్కగట్టి తోసేసేవారు. ఈ నిర్లక్ష్యమే అతని ప్రాణాలను కృంగదీసేది.

కోరంగి గట్టుమీద ఏకాంతంలోతప్ప అతనికి వేరెక్కడా శాంతిలేదు. కోరంగి పాపం పాతకాలపుతల్లి ! అతన్నేమని ఓదారుస్తుంది ? కడలిరాజుతో మొరబెట్టుకొనేది. నిస్సహాయుడైన తండ్రిలా అతడోపికున్నప్పుడామెకు ధైర్యం చెప్పి ఓదార్చేవాడు. లేనప్పుడు కసిరికొట్టేవాడు. అమాయకులైన కోరంగివాసులు దాన్ని తుఫాననుకొనేవారు.

ఎంతటి బాధలైతేనేం ? జీవితంలో నిరాశకు తావుందా ? అంతవ్యధ కున్నూ పరిష్కారం చూపించగల మిత్రుడొకడు భైరికి తటస్థపడనే పడినాడు. అతనిపేరు కన్నయ్య. అతడెన్నడో చిన్నప్పుడే ఊరువిడిచి వెళ్లాడు. కారణం మరేమీకాదు. అతనికి సైనికి వృత్తిమీద మక్కువెక్కువ. ఆ మక్కువ తీర్చుకొనేందుకతడు దేశాలమీదపడి పోయాడు అతడిన్నాళ్ళకూరుచేరుకొన్నాడు, ఇక్కడమట్టిలో కలవాలని. ఒక కన్నులేదు. ఒక పాదంలేదు. ఎడమచేతికి రెండు వేళ్ళులేవు. గాయాలమచ్చలు లెక్కపెట్టి చెప్పటం కష్టం. అయితేనేం, ధైర్యమీనాటికీ చెక్కుచెదరలేదు. కన్నయ్యెందరో రాజులవద్ద కొలువుచేశాడు. సైన్యాధికారులవద్ద కొలువుచేశాడు. మహారాష్ట్రులవద్ద చేశాడు. నవాబులవద్ద చేశాడు. ఇంగ్లీషువారి వద్దాచేశాడు. తుదకు ఫ్రెంచివారివద్ద ఉద్యోగంచేస్తూ ఇక్కడకి తిరిగివచ్చేశాడు.

రాజులు నవాబులు వీరివద్ద కొలువు ప్రారంభించిన రోజుల్లో తన వృత్తిపట్ల తీవ్రమైన అసంతృప్తితో ఉండేవాడు. అదతని ప్రాణాలను దీర్ఘ వ్యాధిలా తినివేసేది. తనధైర్యసాహసాలకు తన యోగ్యతకు తగిన స్థానమతనికి సైన్యంలో దొరికేది కాదు. అవన్నీ రాజబంధువుల సొత్తు. కాక వారినెంత నీచానికైనా దిగి ఆశ్రయించేవారిసొత్తు. యుద్ధరంగంలో తమకంటే తక్కువ నేర్పుగలవారిక్రింద పనిచేస్తూ వారి అవివేకపుటాజ్ఞలు పాలించవలసి వచ్చేది. ఇదెంతటి పరాకాష్ఠ చేరుకొన్నదంటే ఒకచోట పోరు మంచిఊపున ఉండగా ఫిరంగులు పేల్చకుండా ఆపమని ఒక నవాబుఉత్తర్వుచేశాడు. కారణమో? అతని బీగంలలో ఒకతె ఆ అలవాటులేని చప్పుడుకు జడుసుకొని శిబిరంలో ఉండలేకపోతూందిట! ఇలాటి ఉత్తర్వు లిచ్చే అయోగ్యులక్రిందకూడా తమసాహసాలు చూపెట్టి సామాన్య సైనికులు విజయం తెచ్చారు పో! అయోగ్యులైతేనేం? ఎంతైనా తమపైవారు కదా అన్న భక్తిభావంతో తమప్రాణాలకు తెగించి వారిని రక్షించారు పో! పైవారవన్నీ ఆ యుద్ధరంగంలోనే మరచేవారు.

మెప్పు గొప్పలంతా క్షత్రియులో, బ్రాహ్మణులో లేక సాహేబులో కొట్టేసేవారు. పోనీ కొల్లగొట్టిన సొమ్ములు పంచుకొనడానికైనా ఒక వితరణ ఉ ండేదికాదు. విజయం సాధించాక ఆసైన్యాధిపతి ఎక్కడ బలీయుడై పోతాడోనన్న భయానికి రాజులు నవాబులు సైనిక ఖర్చులకు సరిగా పంపేవారుకారు. దానితో సైనికులు విజయం సాధించిన తప్పుకు జీతాలు లేక బాధపడేవారు. ఇట్టివే ఇతర భయంకర పరిస్థితులనుండి తప్పించుకొనేందుకు కన్నయ్య దేశీప్రభువులను చాలమందిని మార్చి ఎక్కడా తృప్తికానక చివర కంపెనీకొలువు చేరాడు.

కంపెనీ కొలువు పదిపదిహేనేళ్లు సుఖంగా గడిచింది. గొప్పపేరు, పదవి సంపాదించాడు. ఇంగ్లీషుసైనికులుకూడా ఇతని క్రింద పనిచేసేవారు, తెలింగసైనికులంటే గొప్పవారన్న పేరాకాలంలో కన్నయ్యవంటి వారివల్లనే వచ్చింది. పై అధికారులుకూడా ఇతనితో కలిసిమెలసి ఉంటూండేవారు. కవాతులోను యుద్ధరంగంలోనూ పెద్దరికంగానీ, మిగిలినప్పుడంతా సమానులుగా ఉండేవారు.

యుద్ధవిద్యలో ఇంగ్లీషువారి నేర్పుకూడా గొప్పది. వారిక్రింద పనిచేయడమంటే ఆనందంగా ఉండేది. కానీ ఇవన్నీ కంపెనీవారి దివాన్గిరీ రోజులనుండీ తారుమరౌతున్నాయి. ఏదేశీ ప్రభువుక్రింద కూడా చూడనంతటి మోసము, నైచ్యము వారిలో ఇన్నాళ్లు దాగిఉందని ఇప్పుడు బయటపడింది. తెల్లవాళ్ళు దేశీయులను నీచంగా చూచేందుకారంభించారు. ఇటువంటి పరిస్థితుల్లో అతనొక ఫ్రెంచిసేనానివద్ద గుంటూరులో కొలువుకు కుదిరాడు. ఆరోజుల్లో గుంటూరు సర్కారు నిజాంకుమారుల్లో ఒకరిచేతుల్లో ఉండేది. దాన్నెలాగైనా కాజేయాలని ఇంగ్లీషువారి తాపత్రయం. అలాఔతే మద్రాసు మొదలు కలకత్తావరకు అడ్డులేకుండా తమ రాజ్యంలోనే రాకపోకలు చేసుకొనవచ్చు. దీనికి వ్యతిరేకంగా నిజాము కుట్రలు చేస్తూండేవాడూ చివరకింగ్లీషువారి స్వాధీనంలోనికి గుంటూరు సర్కారు వెళ్ళనేవెళ్ళింది.

ఆకోపంతో నిజాము ఫ్రెంచివారిని చేరదీసి వారి సైన్యాన్ని పోషించాడు, కల్లోలాలనణచే నెపాన ఆసైన్యం కడపకు వెళ్ళింది.

ఈ ఫ్రెంచి సైన్యంలో అధికారులు సైనికులు కొందరు ఫ్రాన్సులో రహస్య విప్లవ సంఘాలతో పరిచయమున్నవారు. తమదేశంలో విప్లవం తెచ్చేందుకు కృషిచేసేవారి విజయంకోరేవారు. వారివల్ల ఫ్రాన్సులో ఈ ప్రజలను పీడించుకొని తినేవారి ప్రభుత్వానికి వ్యతిరేకంగా జనం తిరుగబడేందుకు ఎలాసిద్ధమౌతున్నదీ తెలిసివచ్చింది. అందులో ముఖ్యంగా పారిస్ జనమెలా దేశానికి బాటచూపుతున్నదీ విని ఉత్తేజంపొందాడు. జన్మవలన రాజైనవానిచేతిలో విశృంఖలంగా ఉండకుండా అధికారం తమప్రతినిధుల చేతుల్లో ఉండాలని పట్టుబట్టి ఫ్రాన్సుదేశీయు లెలావిజయం సాధించిందీ వారిదేశవార్తలు తెలిపేవి. ఇంకా ప్రజాస్వామ్యం పిల్లగాలిలా వీస్తూంది. త్వరలోనే తుపానుగామారి సమాజంలో చెత్తనంతా ఊడ్చి పారేస్తుందని ఆ వార్తలు తెల్పుతూండేవి. ఫ్రెంచి విప్లవ సంఘాలు పనిచేస్తున్నతీరు, అవి ఎదుర్కొంటున్న కష్టాలు అవి సాధించబోయే ఆశయాలుకన్నయ్యకొక కొత్తఉత్తేజాన్నిచ్చాయి.

ఇంగ్లీషు వారిని తిట్టిపోస్తూన్న ఫ్రెంచివారు చెప్పిన విషయాలనేకం కన్నయ్యలో చాలమార్పు తెచ్చాయి. నిజాంప్రభువు, మహారాష్ట్రులు, మైసూరు నవాబు ఈ ముప్పురు ఏకమయ్యే యత్నం కొంతజరిగిన్నీ చివర ఒకేఒక్క తుచ్ఛవిషయంవల్ల ఆగిపోయిందని విన్నప్పుడతని రక్తం ఉడికి పోయింది. టిప్పూనిజాముతో వియ్యంకావాలని షరతు పెట్టాడు. దీనిమీద పట్టుబట్టాడు. నిజామునకది ఇష్టంలేకపోయింది. నిన్నగాకమొన్న వీధుల్లో పడి తిరిగే వాడీరోజున ఎక్కడో సుడిఉండి ఏదోఇంత రాజ్యం సంపాదిస్తే మాత్రం సామంతుడు కాకపోతాడా? అట్టివాడు నాతోవియ్యం కోరుతాడా? ఇప్పుడే ఇంతపొగరుమోతుతనం చూపితే రేపింకా పెద్దవాడైతే ఇంకెంత చూపుతాడో ! అబ్బే ! వారిని పైకిరానివ్వకూడదు అనుకొన్నాడు నిజాము. మహరాష్ట్రులు, నిజాము, టిప్పూ, కలిసి ఆ దశలోనైనా ఇంగ్లీషువారిని ఓడిస్తే ఎలా ఉంటుందో అనుకొంటున్న కన్నయ్యకు పాపం ముగ్గురిమీద విరసం కల్గింది. అయినా 'సిటిజన్' టిప్పూ అంటేమాత్రం కొంత అభిమానముండేది కన్నయ్యకు ! ఈ స్థితిలో కన్నయ్యకు దండులో కొలువు చాలని పించింది. తానూ ఒక సంఘం స్థాపించి రాజుల అధికారాల నదుపునపెట్టే పరిషత్తుల నీదేశంలోనూ ఏర్పరచాలని అతననుకొన్నాడు. దానికి గ్రామాల్లోనూ, నగరాల్లోనూ, రాజాస్థానాల్లోనూ, నవాబుల దర్బారుల్లోను తగుకృషి చేయాలని దానికే తనజీవిత మంకితం కావాలనీ అతను నిర్ణయించుకొన్నాడు. అంతే. వెంటనే తనతో వచ్చేవారిని, విశ్వాసపరులను కలుపుకొని గుంపుకట్టాడు. అవకాశంచూసుకొన్నాడు. కొత్తగా ఇంగ్లీషువారివద్ద వేలంలో కొంతప్రాంతం పుచ్చుకొని పండిందీలేనిదీ చూడకుండా శిస్తు బ్రహ్మాండంగా పెంచి దానికోసం రైతులను కాల్చుకొని తింటున్న ఒకమాంచి కరోడా జమీందారుణ్ణొకణ్ణి ఎన్నికచేసి కొల్లగొట్టి దాన్నీసారి సానివారి పాలుగాకుండా కాపాడుకొనివచ్చి బలగంతో ఇల్లుచేరాడు.

ఇక్కడ అతని ప్రయత్నానికి తోడ్పడగలవారి కోసం గాలించి మొదట భైరిని కనుగొన్నాడు.

కలుసుకొన్న మొదటి రోజునుండే వారాప్తమిత్రులైపోయారు. రంగన్నను ఓడల పనినుండి తప్పించి కన్నయ్యకు సహచరుడుగా పనిచేసేందుకు భైరి వీలుకల్పించినాడు.

ఒకరిద్దరై ప్రజల్లో ఇంగ్లాండు ఫ్రాన్సుదేశాల అనుభవాలను తెలియజెప్పి ప్రభుత్వాలపట్ల గల గుడ్డి విశ్వాసాలను పోగొట్టే ప్రయత్నం మొదలు పెట్టారు. పెచ్చు శిస్తులకోసముద్యోగులు పీడిస్తూంటే విధి అని వహిస్తూ కూర్చొనకుండా, మనమేం చేయగలమని చేతులు ముడుచుకోకుండా,ఎదుర్కోనడమే ధర్మమని బోధచేసేవారు.

పండితుల వద్దకు, చదువుకొన్న వారివద్దకుపోయి సమకాలిక విషయాల మీద చర్చలు జరిపేవారు. కోరంగిలోనేకాక చుట్టుపట్ల ప్రాంతంలో కూడ ఈ కార్యక్రమం సంచలనాన్ని లేవదీసింది.

ఈ సంచలనం రామనవమి ఉత్సవాలనాటికి పరాకాష్ఠ నందుకొంది.

భైరి, కన్నయ్య కలిసి కోరంగిలో ఏటేటాజరిగే రామనవమి ఉత్సవాలనీయేడు కొత్తతీరున నడిపించారు. ఖర్చులన్నీ భైరి స్వయంగా భరించాడు కాబట్టి కోరంగి పెద్దలూ ఏమీ అడ్డుచెప్పలేదు. కంపెనీ ఉద్యోగుల్లో ఒకనికి ఆ సందర్భంగా పెట్టినకొట్లమీద యాజమాన్య మిచ్చినందుననూ, పాశ్చాత్య దేశాల్లో అభ్యుదయాన్నే ఇక్కడ ఆదర్శంగా దేశీయులకు చెప్తున్నామని వారిని నమ్మించటంచేతనూ కంపెనీవారు కలుగజేసుకొనలేదు. కొందరు సాయంకూడ చేశారు. జనం తండోపతండాలుగా ఈ కొత్త ప్రదర్శనలను చూచేందుకు వాచ్చారు. వారికిదంతా కొత్తలోకంగా ఉంది.

ప్రదర్శనలన్నీ శ్రేష్ఠంగా ఉన్నాయి. వాటిలో కొత్తదనమందరికీ కన్పిస్తూంది. ఏదో కొత్తసందేశం వినవస్తూంది.

కథచెప్పడంలో హాస్యగాండ్రకు భైరి ప్రత్యేకమైన శిక్షణనిచ్చాడు. రామాయణ భారతకథల్లో సందర్భానుసారంగా ఆదర్శరాజధర్మాలు చెప్పుతూ వాటిని ప్రస్తుతం రాజులెలా పాడుచేస్తున్నారో వారుచెప్పేవారు. వేషగాండ్ర బళ్లన్నీ

కొత్తవేషాలతో నిండిఉన్నాయి. జోన్‌కుమారిని సజీవదహనం చేస్తున్న దృశ్యాన్నొక బండిమీద చూపితే మరొకబండిమీద ఇంగ్లీషు చక్రవర్తికి మరణశిక్ష విధిస్తున్న దృశ్యముంది. హరిహరబుక్క సోదరుల వేటలో కుందేళ్ళువేటకుక్కలను తరిమే దృశ్యమొకబండిమీద చూపబడగా, మహరాష్ట్ర నౌకాసైన్యం నెరపిన వీరకార్య మింకొక బండిమీద.

బళ్ళమీద వేస్తున్న వేషాలు జనానికి తెలియజెప్పే మనుష్యులు వేరుగా ఉంటూండేవారు.

అన్నిటికంటే ఎక్కువ ఆకర్షించింది అవిరిశక్తితో నీళ్ళుతోడే ఇంజను, బొదులలో నీళ్ళుతోడడం యాతనగా ఉండేది. ఇంజన్‌తో అయితే అందులో నాల్గవవంతుకాలం కూడపట్టదు.

తరువాత ప్రపంచరూపం తెల్పుతూ ఏర్పాటుచేయబడిన గోళమొకటి కూడ జనాన్నాకర్షించింది.

ఇలా కొత్తతీరున జరుగుతున్న ఉత్సవాలకు కోరంగితల్లి సంబరపడిపోవడంలో ఆశ్చర్యమేముంది ? ఎండలు మాడ్చివేయకుండా జనంమీద పూలవానలూ కురిపించేది. ఇంత ఆనందంగా ఆమెకీ మధ్యెన్నడూ లేదూ.

ఈ ఉత్సవాలకు వచ్చిన గ్రామాలవారు తమ గ్రామాల్లోనూ సంఘాలు పెట్టాలని భైరిని కోరసాగినారు.

ఇతరచోట్ల సంఘాలేర్పరచేందుకు వీలుగాను, సంఘాల ఆశయాలను నిర్దుష్టంగా నిర్వచించేందుకూ ఈ ఉత్సవాల సందడి తగ్గాక ఒకరోజు ప్రశాంత వాతావరణంలో ఆయా గ్రామాల ముఖ్యులు కలవాలని నిర్ణయించుకొన్నారు.

ఇవన్నీ చూడగా కొందరికి కన్నుకుట్టింది. ఫ్యాక్టరీ ఉద్యోగుల్లో ఒక వర్గం, కోరంగిలో వ్యాపారులు వడ్డీవ్యాపారులు, చుట్టుపట్ల తమ ప్రతిష్ఠ దెబ్బతిన్న రాజోద్యోగులు సరేసరిదీనికి ప్రతీకారం చేయకపోతే లాభం లేదని భావించారు

సంస్థానాదీశులవద్దకు పరుగెత్తారు. వారె కంపెనీవారితో వెంటనే మంతనాలు జరిపారు.

"శుద్ధక్రైంచివాళ్ళ తత్వాల్లో అపవిత్రుడైన భైరిచేయి విడవాలని కంపెనీవారు తమ ఉద్యోగులందరికీ హుకుం చేయించారు.

తరువాత కొందరు రాజోద్యోగులకు సైనికులను తోడిచ్చి కన్నయ్య మొదలైన వారిని పట్టి తెమ్మని ఉత్తర్వుచేశారు, భైరిని కూడా సందర్భానుసారంగా పట్టితేవడమో లేక మట్టుపెట్టడమో చేయాలని చెప్పి పంపారు. శరణు వేడితేమాత్రం విడువ వచ్చునన్నారు.

ఆమూక ఇంకా త్రోవలో ఉండగానే కోరంగికా వార్తలందాయి.

కన్నయ్య వారికి దొరక్కుండా తప్పించుకొని తరువాత తగురీతిగా సిద్ధమై వారి నోడించాలన్నాడు. భైరి అంగీకరించాడు. కన్నయ్యకు, రంగన్నకు ఇతరులకు అవసరమైన సొమ్ము లిచ్చి పంపేశాడు.

రాజోద్యోగులూ, వారి వెంట సైనికులు తిన్నగా కోరంగి చేరుకొనలేదు. త్రోవలో పన్నులు వసూలు చేసే ఉద్యోగుల పగవారిని క్రూరంగా హింసిస్తూ వస్తున్నారు. ఈవార్తలందినట్లల్లా కోరంగివారికి దడ పుట్టుకొస్తూంది,

భైరయ్యను పారిపొమ్మంది పరదేశి, భైరి ఒప్పుకోలేదు. "రానీ చూద్దాం ! పరుగెత్తిపోయి దాక్కునేందుకీ రాక్షస శక్తులు లేని ప్రదేశమంగుళమైనా లేదు" అన్నాడు భైరి.

ఇది జరిగిన రెండుమూడు రోజులకే సైనికులు కోరంగికి వచ్చి చేరారు. తెల్లవారకమునుపే చేరుకొని కన్నయ్య, రంగన్న మున్నగు ముఖ్యులకై వెతికారు. వారు దొరకనందు కుగ్రులై మిగిలిన అమాయక జనంమీద కోపం తీర్చుకొన్నారు. ఆ ఆక్రోశాల మేల్కొల్పులతో మేల్కొంది కోరంగి. ఆరోజు భైరిని బయటికి రానివ్వకుండా పరదేశీ మరికొందరాప్తులూ ఇంట్లోఅతి కష్టంమీద బంధించి ఉంచారు.

ఇలా బయటికి రాని భైరిని పిరికిపందకింద గేలిచేస్తూ అతని వ్యతిరేకులా పూటంతా శివాలు తొక్కారు. ఎవరూ దొరకలేదు కాబట్టి మధ్యాహ్నా మతన్నైనా

బంధించి సంస్థానానికి తీసుకొని వెళ్ళాలని నిర్ణయించారు. అతను తప్పించు కొనకుండా గ్రామంచుట్టు, అతనింటిచుట్టు కాపలా వేశారు.

మధ్యాహ్నం సుష్ఠుగా విందులు గుడిచి నిద్రతీసిన పిదప సైనికులు ముప్పొద్దువేళ భైరి ఇంటిమీద దాడికై గుణ్ణాల కట్లు విప్పసాగినారు.

ఎన్నో అన్యాయాలను చూసి ఓర్చుకొన్న కోరంగి దీన్ని మాత్ర మోర్చుకొనలేక పోయింది. ఆమె సహనం నశించింది. ఈసారి కడలిరాజు వద్ద తెగపోరు పెట్టింది. అతనిలో ఈసారి కోపావేశం పెచ్చురేగింది.

తల్లి పురెక్కించగా కోపంతో తండ్రి చేస్తున్నపని వదిలేసి బెత్తం తీసుకొని లేచినట్లుగా కడలిరాజు లేచాడు. అతని చూపుకు పడమరగాలి స్తంభించింది. తూర్పుగాలివైపు చూచాడు. అతని చూపు తప్పితే చాలని అది ఊరిమీదకు వేగంగా పరిగెత్తింది.

కోపంతో విచక్షణ నశించిన తండ్రి తల్లిని వ్యధపెట్టుతున్న పిల్లల మీదలా కడలిరేడు లేచాడు, అప్పటికి కోరంగివాసులు రెండురోజుల తుపానును రుచిచూచారు. తమజీవితంలోనే వారింతటి తుపానుచూచి ఎరుగరు. శతవృద్ధులు కొందరు మాత్రం తమ చిన్నతనంలో డెబ్బై ఎనభై సంత్సరాల క్రిత మొకసారిలాంటి తుపాను చూచాము, మరి తరువాత నేటికే అనుకొన్నారు.

కుండపోతలా వర్షం. పగలు సైతం చిమ్మచీకటిమెఱుపులు మెరిసిన క్షణాల్లోతప్ప. ఉరుములు పిడుగులు. చెట్లు కూలిపోయిన చప్పుడు.

ఎక్కడివా రక్కడే తలుపులు బిడాయించి ప్రాణాలరచేతపట్టుకొని బిక్కుబిక్కుమంటూ కూర్చున్నారు. సైనికులమాట వేరుగా చెప్పాలా ? వారి గుణ్ణాలేనాడో భయం పసిగట్టి కట్లు తెంచుకొని పారిపోయాయి. తెల్లదొరలు కొత్తకోరంగిని వానలోనే ఖాళీచేసి కాకినాడ, ఇంజరం మొదలైన సురక్షితప్రాంతాలకు పరుగులెత్తేరు. పిచ్చిదొాకతె మాత్రం మిగిలింది, అది కీచుగొంతులో దిక్కులు పగిలేలా అరుస్తూంది.

అందరూ ఆపిచ్చిదాన్నెరుగుదురు. అదిక్కడ ఒక పెద్దయింటి అపురూపపు కోడలు. అత్త కొడుకు మనసు విరిచి పాడుచేసి మరొాకపెళ్ళిచేసింది. ఆ సవతీమెకు ముందుపెట్టి బుద్ధిచెడిపిందంటారు. ఏదేమైనా ఆమె నీక్షణాన తల్చుకుంటే జడుపు వస్తూంది.

రెండవరోజు సాయంకాలానికి కోరంగి పొంగ నారంభించింది. ఆ రోజమావాస్యని గుర్తురాగానే ప్రాణాలమీద దాదాపందరూ ఆశ వదులుకొన్నారు. చీకటి పడవచ్చింది.

పిచ్చిదాని అరుపు లంతకంతకూ జాలిగొల్పుతున్నాయి. ఏమేమో మాట్లాడుతూంది. ఎవరినో తిట్టుతూంది. ఉన్నదున్నట్టుగా ఒక్కసారి ఆమె కేక గొప్పగా వినవచ్చి ఆగిపోయింది.

తిరిగి సముద్రుని ఘోష వానదేవుని ఘోష మామూలుగానే ఉన్నాయి.

మగతగా కనుమూసిన భైరి దంపతు లాధ్వనికి మేల్కొన్నారు. ఆయువతి దీనస్థితికి విచారిస్తూ అలాగే పడుకొని ఉన్నారు.

బయట సముద్రపుహోరు! గాలి రివ్వునవీస్తూండగా దీనంగా ఆర్చే ఈలచెట్లకూతలు. ఇంట్లో చిన్న ప్రమిదవెల్తురులో గది మసకగా కన్పిస్తూంది. భవనద్వారాలన్నీ బంధించినా ప్రకృతి కరాళరూపం ఆ ధ్వనుల వల్ల వీరిముందు ప్రతక్షమౌతూంది. అందరూ భయంగానే పడుకున్నారు. ఏమాత్రం ప్రకృతి చిన్నచూపుచూచినా ఈపరిస్థితుల్లో తాము సర్వనాశనం కావడమేకానీ వేరుగతిలేదని అందరికీ తెలుసు. అయినా ఒక ఆశ. దేవుడంతటి శిక్ష తమకు విధిస్తాడా? ఇంతలోనే కోరంగినదికివతల పల్లంలోని ఇండ్లనుండి ఆర్తనాదాలు, కలకలమూవినవచ్చాయి. కోరంగితల్లికి దయతప్పి ఊరిని ముంచేస్తూంది! ఇళ్ళన్నీ జలమయమౌతున్నాయి. అందరూ మిట్టప్రదేశాలవైపు కెగ్రబాకుతున్నారు. ప్రమాదం ముంచుకొనివస్తున్న విషయం భైరిదంపతుల కిట్టే అర్థమైంది. వెంటనే అందరినీ లేపినాడు, ఇంట్లోవారందరూ లేచేలోపుగానే బయటనుండి ఆర్తులు ఆశ్రయానికైవచ్చి

తలుపులు తట్టుతున్నారు. ఇండ్లకప్పులపైకి కుటుంబాలకు కుటుంబాలు ఎగబ్రాకినాయి.

ఇప్పుడు చలిబాధలేదు. నిండా మునిగినవారికి చలేమిటి, గాలేమిటి? ఇళ్ళన్నీ జలమయమౌతున్నాయి. ఎంత భయంకరమైన రాత్రి! రేవులోని ఓడలు దిక్కులకు కొట్టుకొనిపోతున్నాయి. ఇళ్లలో కొన్నిరుక్కొని ఊగుతున్నాయి. కొన్ని భవనాలను గుద్ది కూల్చేస్తున్నాయి. అటువంటి కప్పుపై ఆశ్రయం తీసుకొన్నవారందరూ అమ్మో నాయనో అని కేకలు వేస్తూ నీళ్ళలో మునిగిపోతున్నారు. ఒకొక్క మెరుపు మెరిసినప్పుడల్లా ఇళ్ళపై కప్పులమీద నున్నవారికి నీటిమట్టం పెరుగుతూందని తెలుస్తూంది.

పూర్వం తమస్మృతుల్లో ఎప్పుడెప్పుడు నీటిమట్టంమెంత ఎత్తువరకు వచ్చిందో చూపే గుర్తులు పెద్దచెట్లమీదా, దేవాలయంమీద ఒక్కొక్కటీ నీటమునిగి కన్పించకుండా పోతుండగా అందరి రక్తమూ గడ్డకట్టుకొని పోతూంది. ఇప్పుడు శోకాలుపెట్టేందుకైనా ఎవరికీ ప్రాణంలేదు. అందరి గొంతుకలు ఎలుగురాసి పోయాయి, పూర్వపు గుర్తులన్నీ నీట మునిగిపోయాయి. నీటిమట్టం పెరుగుతూనేఉంది. ఇంతలో తూర్పునుంచే కాక పడమరనుంచికూడ నీరు తగులు తున్నట్లనుమానంగా ఉంది. అంటే ఎగువనెక్కడో గండి పడిందన్నమాట! ఇక ఇది జలప్రళయమే.

ఉదయమైంది. ఇళ్ళపైకప్పులు, ఏపుగా పెరిగిన చెట్లపై కొమ్మలు ద్వీపాల్లా కన్పిస్తున్నాయి, వాటిమీద ఏక్షణాన కడతేరుతామోనని బెంబేలు పడుతున్నారు మనుష్యులు. తక్కినదంతా జలమయమే!

తిండి తిప్పలు లేనందున తాళలేక చిన్నపిల్లలు పెద్దపెట్టున ఏడుస్తున్నారు. అయినా సముద్రం హోరుముందు వారి ఏడుపులెంత? వాన తగ్గుముఖం పట్టింది.

ఇకనైనా తెరిపి స్తేబాగుండునని జనం వేయిదేవుండ్లకు మొక్కుకొంటున్నారు. కొట్టుకొనిపోతున్న నావలను సాహసంతో ఈదుకొంటూ

పోయి పట్టుకొని యువకులు కూలిపోవనున్న చోట్లనుండి జనులను సురక్షిత ప్రాంతాలకు చేరుస్తున్నారు.

ఇంతలో ఊరు ఊరంతా ఒక్కుమ్మడి సముద్రంకేసి చూసి ఓ యని శోకాలు పెట్టారు. తాడెత్తుకెరటమొకటి కోరంగికేసి వస్తూంది. క్షణం పాటందరూ కళ్లుమూసుకొని భోరుమన్నారు. అంతే! కళ్లు తెరచేప్పటికి నీటి మట్టం చాల ఎత్తుపెరిగింది. ఇంతకు మునుపు కన్పిస్తున్న పైకప్పులు చెట్లకొమ్మలు సగంపైగా మునిగిపోయాయి.

అమ్మా! గంగమ్మతల్లీ! ఏమిటీ పరీక్ష?

ఆ కెరటండపడి విరిగిన తరువాత మరి మట్టం పెరుగలేదు. కొన్ని గంటల తరువాత తీయ నారంభించింది.

నీరుతీత క్రమంగా ఎక్కువౌతూంది. నీరెక్కుతూన్నప్పటికంటే తీసేప్పుడు వడిఎక్కువ. అందువల్ల ప్రమాదానికెక్కువ అవకాశం. భైరికీ విషయం జ్ఞాపకంరాగానే నావేదైనా దగ్గలోఉందా అని చుట్టూచాశాడు. ఒక్కటీలేదు. దిక్కుల కొకటి తీసుకొనిపోయారు. ఈమిగిలిన వారినైనా తమ ఇంటికప్పు మరికొన్ని గంటలపాటెలాగో రక్షిస్తే తరువాతెలాగో చూసుకొనవచ్చునని మధనపడసాగినాడు. కానికప్పుమీద జనమమితంగా ఉన్నారు. అందరూ తన్నునమ్మివచ్చినవారు. వారిని బ్రతికించుకొని తానుబ్రతకగల్గటముందా? ఇంతభారాన్ని వాస్తులక్ష్మి మోస్తుందా? ఇప్పుడింక మనిషి ప్రయత్నంలో చేయగల్గిందిలేదు. నావఒక్కటైనా అట్టిపెట్టుకోవలసింది !

దిగువ ఎక్కడో పెటపెటమంటూ సన్నగా వినిపించింది. అంతే. వెంటనే భైరయ్య లేచాడు. ఇంతవరకూ మూలను పురమాయిస్తూ కూర్చొన్న భైరయ్య తనబలమంతా కూడగట్టుకొని సహజంగా సంక్రమించిన పెద్దరికాన్ని యావత్తూ నిర్వహించసాగినాడు. ఏదెటుపోయినా ఈ మధ్య కొత్తగాకట్టిన కొన్ని అంకణాలైనా నిలుస్తాయని అతని నమ్మకం. ఆ మూలలోనే పెద్దనాగుపామొకటి భద్రత సూచిస్తూ పడుకొంది. చిట్టెలుకలుకొన్ని దానికి సమీపంలోనే నీటిమీదకొట్టుకొనివచ్చిన

తుక్కులోనుండి పైకెగ్రబాకి భీతిభీతిగా కదులుతున్నాయి. అక్కడ పిల్లలనూ యువకులనూ నిల్పితే వారైనా బ్రతికి దీపంనిలబెట్ట వచ్చునని ఆలోచించి ఇంటికొకరు ఇద్దరు చొప్పున అక్కడకి చేర్చాడు. ఇంకాస్థలం మిగిలితే నడివయస్సు వారిని చేర్చాడు! అతని మనసు తెలుసుకొనలేక అక్కడా కుల వివక్షత చూపబోయిన వారతని చూపుకే తట్టుకొనలేక నోరుమూసుకొన్నారు.

అతని కదలికలు కొద్దిసేపైన తరువాత పరదేశి అర్థంచేసుకొన్నది.

"మా:వా ! ఈక్షణాన నిన్నొకకోరిక కోరుతున్నందుకేమీఅనవుకదూ !" అని జాలిగా అడిగింది. భైరి ఆమెతల నిమిరి"నీమాటకు నేనెక్కడ కోపగించు కొన్నాను ? నామీద నీవలిగి మాటలు విడిచిన సందర్భాలున్నాయి కానీ!" అంటూ ఫక్కున నవ్వినాడు. "ఫో మా:వా:!" అన్నది పరదేశి.

"ఇదిగో ఇక్కడే పుట్టింది దృష్టాంతం" అంటూ మరొక నవ్వు విసిరాడు.

"నన్ను నీపక్కనే ఉండనీమావా:!" కళ్ళు తడుపుకొని చిరునవ్వు నవ్వింది. భైరి క్షణమేమీ పల్కలేదు. తరువాత ఒక దృఢాభిప్రాయానికి వచ్చి 'సరె' అని ఒప్పుకొన్నాడు. వెంటనే ఆమె కడసారి మరదలును. మేనల్లుండ్రనూ చూచి హెచ్చరిక చేసి వచ్చింది.

"నీవెక్కడికీ వెళ్ళకమ్మా" అంటూ బ్రతిమాలింది మరదలుపిల్ల.

"నేనెక్కడికి వెడతాను ! ఇప్పుడేవస్తాను" అని భైరివెనకాలే అతని పురమాయింపులకు తాళం వేస్తూంది.

ఇంతలో హఠాత్తుగా వీరున్నచోట క్రింద ఫెటపెటమన్నది.

'పిల్లా!' అంటూ అమాంతంగా భైరి పరదేశిని దగ్గరకు లాగుకొన్నాడు.

ఏమిటేమిటని అందరూ కదిలారు.

"ఎవ్వరూ కదలకండి!" కఠినంగా ఆజ్ఞాపించాడు భైరి. అందరూ ఏమి జరుగుతుందోనని ఊపిరిబిగబట్టి మెదలకుండా నిల్చున్నారు. తన క్షేమం చూసుకొని మిగిలినవారిని ముంచేస్తున్నాడని కొందరతన్ననుమానించారుకూడ.

భైరి చుట్టూ చూచాడు. కనుచూపుమేరలో నావ ఏదీలేదు. నావ కోసం కేకవేశాడు. బదులులేదు. అంతే తన వెనుకనున్నవారిని నీళ్ళలో దూకి తూర్పు తప్పించి ఏ దిక్కుకైనా ఈదమన్నాడు. వారలాగే చేశారు. తరువాత ఎదుటనున్న వారిని చూసి "సెలవురా! తిరిగి అదృష్టముంటేనే చూస్తాం! మరి ఇప్పటికైనా దూరపుచూపలవర్చుకొని వృద్ధికి రండి. మనకంటే తెల్లవారాలోచనల్లో చాల ముందున్నారు. మనగుండె కుంచించుకొని ఉంటే ఆ విషయాలర్థంకావు. ఆలోచనలో సాహసం చూపేందుకు ప్రారంభించండి. ఎవరి సంపదలూ శాశ్వతంకావు, చివరికన్నీ దేవునికేచెందుతాయి." భైరి మాటలు పూర్తికాకుండానే క్రింద మరింత ఎక్కువగా పెటపెటమని ఆ భాగమంతా కూలిపోయింది.

భైరీ పరదేశీ ఈదుకొంటూ పోవడం అందరూ ఎలుగురాసిన శోకాలతో చూస్తూనేఉన్నారు. మిగిలినవారి అజాపజా కనుపడకపోయిన తరువాత కూడా వారిద్దరూ చుక్కల్లా ప్రవాహనికెదురీదుతూ పోవడమందరూ చాలసేపు గమనిస్తూనే ఉన్నారు."

ఆ కథ నింక కొనసాగించలేక ఆ పడవవాడు ఏడవటం ప్రారంభించాడు. దాదాపు చుట్టూ కూర్చుని వింటున్న విద్యార్థులందరి పరిస్థితీ అలాగే ఉంది, రాముడు పాపం బలవంతాన ఎక్కిళ్ళనాపుకొంటున్నాడు.

పైన ఆకాశం మేఘావృతమైన విషయం వారెవ్వరూ గమనించలేదు. సన్నగాచినుకులు పడనారంభించిన విషయమూ వారికిస్మృతిలో లేదు.

వారీలోకానికి దిగివచ్చేసరికి వాన జోరైంది. ఎక్కడా నిలువ నీడలేదు. అందరూలేచి నిల్చుకొన్నారు. పడవవాడు మెల్లిగా లేచినిల్చున్నాడు.

తరువాత గబగాబవెళ్ళి పడవనుచేరుకొన్నాడు. కాలవకు నీరెక్కింది. వేగిరం రండి బాబులూ. పోదాం" అన్నాడు.

వాన ఎక్కువైంది. మెరుపులు మెరిసినప్పుడు తప్పితే అంతా చిమ్మచీకటి. పూర్తిగా వానకు తడిసే పోయారు కాబట్టి ఇంక చలివదిలేపోయింది.వాన వెలిసేవరకు బాధలేదు.

# XVII

పడవ తిరుగు ప్రయాణ మారంభించింది. కొంతసేపటికి వాన జోరు తగ్గి తుంపర మాత్రం పడుతూంది. కానీ పట్టిన ముసురు మాత్రం పట్టినట్టే ఉంది

పడవవాడు వేస్తున్న గెడలవిన్యాసం తప్పితే మరే చప్పుడూ సమీపంలోలేదు. దూరాన సముద్రఘోష. వీచినప్పుడు గాలిహెూరు. "తొమ్మిది కావస్తూంది" అన్నాడు నిశ్శబ్దం భరించలేని స్థూలకాయుడైన విద్యార్థి,

" ఈరోజు ఉడిపిహెూటలు వాడు బ్రతికి పోయాడు నీవు వెళ్లనందుకు" ఒక విసురు విసిరాడు నాయకుడు.

"బ్రెడ్డు, బిస్కెట్ పొట్లాలు ఇంకా పొరపాటు నేమైనా మిగిలాయేమో !" అన్నా డొకడు

"అబ్బె అటువంటిచోట ఎప్పుడూ పొరపాట్లు జరుగవు" అన్నాడు మరొక విద్యార్థి సంచులన్ని చీకట్లో తడుముతూ

"మీకు చాల ప్రయాసైంది. పాపం ! మన్నించండి. ఇంత ఆలస్యమౌతుందనుకోలేదు" అన్నాడు నాయకుడు రామునితో

స్థూలకాయుడు కోపగించుకొన్నాడు "సిగ్గులేక మన్నించమంటున్నావా ? ఇంతాలస్యమూ నీవల్లనేగా"

"అతనిదేముంది ? ఎక్కడా నడవలేక వెనుక బడుతూ నీ వాలస్యం చేస్తూవచ్చావుగాని" మిగిలినవారు పరిహాసోక్తులు పల్కినారు.

రాముడు "పరవాలేదులెండి. అనుకోకుండా గొప్ప అనుభవం" అన్నాడేగానీ అతనింకా ఈలోకంలో కాకుండా ఊహాలోకంలోనే ఉన్నాడు.

''సరి. మీకూ మావాడి పిచ్చి కొంత ఉంది !'' అని స్థూలకాయుడందుకొన్నాడు. "దుష్ట ప్రపంచంలో ఆదర్శాలు నిజంగా నమ్మి బ్రతికితే.....శివా శి వా ! మీ కానందమన్నదుండదు. May god bless you, మీరుగెలవడముండదు ! భైరిలా................"

విద్యార్ధినాయకుడీ విసురు తనమీదేనని తెలుసుకొని "వారె నోరు మూసుకో. నీవాదంలో ఒకటికాదు రెండు తప్పులున్నాయి. మొదటిది ఆదర్శ జీవి జీవితంలో గెలుపు ఓటముల ప్రశ్నలేదు. కృషిలో లోపం లేకుండా చూసుకొంటాడు. ఫలితం ఎలావచ్చినా స్వీకరిస్తాడు. ఆశించిన ప్రతిఫలమే కలుగకపోవచ్చు గానీ అతని ప్రయత్నాల్లో ప్రతి ఒకదాని ప్రభావమూ పరిసరాలమీద లేకుండాపోదు.

''రెండవది. మాటవరునకుపోనీ జయాపజయాలు కూడా ముఖ్యమనుకొన్నా, భైరి కాలం మనదేశచరిత్రలో సాయం సంధ్యాకాలం. నేడిది ప్రాతస్సంధ్య ! తెలిసిందా! మాట్లాడితే ఇంక తంతాను" అన్నాడు.

అందరూ నిశ్శబ్దంగా కథ నెమరు వేసుకుంటున్నారు.

పడవ ఒడ్డు చేరేందుకు రెండు మూడు గంటలు దాదాపు పట్టినా ఎవరూ మాట్లాడలేదు.

"కోరంగి చేరుకొంటే రిక్షాలు దొరుకుతాయిబాబూ. కాకినాడ రాత్రే చేరుకొనవచ్చు." అన్నాడు వాడు, పడవదిగిన వాళ్లతో.

"అయితే రా!మాకుదారిచూపించిరిక్షాలెక్కించితిరిగివద్దువుగాని! రా. "

అతనంగీకంరించి త్రోవచూపి యానాం బస్సులు నడిచే రోడ్డుమీద వారి నాపినాడు.

పోలీసు స్టేషన్లో చిన్న దీపం మినహా మిగతా అంతాచీకటి. ఇప్పుడా వీధిలో నడుస్తూంటే ఆ విద్యార్థి బృందానికేదో ఆ కరిగిపోయిన ఫెయిరీలాండులో నడుస్తున్నట్లుగా ఉంది.

"ఇక్కడ నిల్చుకొంటే రిక్షాలు వస్తాయి బాబూ :"

కొంతసేపు నిల్చుకొన్నాక వారిలోఒకడు జానపదుణ్ణి అమాయికంగా అడిగినాడు "తరువాతింకా ఉందాకథ ?"

"నాకు వివరం తెలియదుబాబూ ! ఎన్ని మార్లుచెప్పినా కథింతవరకు వచ్చాక మా గురువుగారు మౌనంగా చింతచేస్తూ కూర్చొనేవారు. నేను మీకులాగే అడిగేవాణ్ణి."

"ఇంకేముందిరా ! అక్కడినుంచి మనదేశమొకటి శతాబ్దాలు వెనుకబడి పోయిందిరా !" అని పేలవంగా నవ్వేవారు."

స్థూలకాయుడు "ఒరే నీపెట్‌కవి గురజాడ "వెనుకబడితే వెనుకెనోయ్" అన్నారు కదా. అందువల్ల మనమింకెప్పుడూ వెనకే. ఫలించని ప్రయత్నం కూడనిది కనక..........."

రాముడు : బాగుంది. అదేంమాట ? వారికంటే రెండురెట్లు వేగంగా పరుగెత్తి వారిని కలుసుకోవడమే కాదు. ముందుకు వెళ్ళాలనుకోవాలిగానీ.

బృందనాయకుడు: నాకు చెప్పిచెప్పి చాలైంది. మీరైనా మాబద్ధూకు నచ్చజెప్పండి.

పడవవాడు "ఈ తుఫాను తరువాత కూడ ఒకపాతికేళ్లు మన ఓడల పరిశ్రమ బ్రతికేఉంది. కానీ పూర్వవైభవాన్ని కోల్పోన్నది లేదు. కొన్నేళ్లింకా వాపులాంటి లావుచూపింది. యూరోపులో నౌకాయుద్ధాలవల్ల నౌకలకెద్దడికల్గి కంపెనీనౌకలను ఇంగ్లాండు ప్రభుత్వం స్వాధీనం చేసుకొంది. ఆయెద్దడివల్ల మన నౌకల కట్టుబడికి దేశంమొత్తంమీద గిరాకీ పెరిగింది. ఇది సాగినన్నాళ్ల బాగానేఉంది. ఆరోజుల్లోనే భారతీయ ఓడలు కొన్ని లండన్ రేవు చేరుకొన్నవి.

లండన్‌లో లంగరువేసి నిల్చిన మనఓడల గొప్పతనాన్ని చూసి ఆదేశంలో ఓడ యజమానులు పెద్దగగ్గోలు లేవదీసినారు. థేమ్సు నది (ఆ పేరు సరైనదేనా బాబూ) యావత్తూ భగభగ మండుతున్నట్లు వారు గగ్గోలు పెట్టారు. శత్రుదేశపు యుద్ధనౌకలక్కడ లంగర్లుదించినా అంతభయం వారు చూపి ఉండరు. వారినోదార్చేందుకాప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకొంటూ వచ్చింది, అక్కడినుండి మన ఓడలమీది దెబ్బతరువాత దెబ్బ పడుతూ వచ్చింది.

నౌకల భారతీయులవే ఔగాక ఇంగ్లాండు భారతదేశ వాణిజ్య సంబంధంగా తిరిగే నౌకలో భారతీయులు బాధ్యతగల హెూదాల్లో పనిచేయ డానికి వీలులేదని ఇంగ్లీషు పార్లమెంటు 1801లో చట్టంచేసింది. తరువాత కొన్నేళ్ళకు బ్రిటిష్ నావికులకూ, భారతీయనావికులకూ అంతరం పెంచుతూ మరొకచట్టం చేసింది.

తరువాత ఇంగ్లీషువాడు ఆధిపత్యం వహించని నౌకలను లండన్ పోర్టులో ప్రవేశాన్ని నిరాకరిస్తూ మరొకచట్టం చేశారు. ఇంతచాలక భారతీయనౌకల్లో ఎగుమతయ్యే సరుకులమీద సుంకాలను బ్రిటిష్ నౌకల్లో రవాణాఅయ్యే అవేసరుకులపై కంటే తేడాగా ఎక్కువవేస్తూ వచ్చినారు. భారతీయుల ఓడలు తుపానువల్ల మునిగినప్పుడు కల్గిన నష్టాలను ఓడ యజమానులపైననే వేస్తూ వారిని నష్టపరచడమూ ఎక్కువచేశారు. తరువాత భారతీయకంపెనీ నౌకా సైన్యవిభాగాన్ని రద్దుచేశారు.

వీటన్నిటి ప్రభావమూ కోరంగిమీద ప్రత్యేకించి ఎలా పడుతూ వచ్చిందో చెప్పలేము. కానీ, ఇంత నిజము! మీరయ్యకుమారునికి పెద్దవయస్సు వచ్చేనాటికీతని వంశపరంపరాగతమైన ఓడల పరిశ్రమ అధోగతికి వచ్చింది. ఈగ్రామంలోనే కాదు వారెరిగినమట్టుకు కోస్తాల్లో అంతటా ఈపరిశ్రమ పరిస్థితిలాగేఉంది. మాసికల తెరచాపలు, అతుకుల ఓడ కొయ్యలూ ఇవే మిగిలినాయి. అయినా మనపరిశ్రమ ఇంకా కుంటి నడకలు నడుస్తూనేఉంది. చావలేదు, మన్యంనుంచివచ్చే టేకుకూడ రేవులకు చవకగా అందకుండా కంపెనీవారు మన సంస్థానాధిపతులతో సుంకాలు వేయించారు. తరువాత తరువాత బర్మావ్యాపారం వృద్ధియైన తరువాత బర్మానుండివచ్చిన టేకు మనటేకుకంటే చవకగాఉండేంత ఎక్కువగా ఈ సుంకాలుండేవి. బయట కొనే వాడులేక టేకు అడవులను మన్యప్రజలు శ్రద్ధగా చూడటం మానేశారు. అవీ ధ్వంసమైపోయాయి. చిరుగాలికైనా రాలిపోసిద్ధంగాఉన్న పండుటాకునుపోలిన మన ఓడల పరిశ్రమమీద మన ప్రకృతే తుది మొట్టికాయవేసింది. 1839 లో అనుకోకుండా హఠాత్తుగా

పెద్దయెత్తున మరొక తుఫానువీచింది దానికి సముద్రుని ఉప్పెనాతోడైంది. కోరంగి, ఆ చుట్టుప్రక్కల గ్రామాలూ యావత్తూ తుడిచిపెట్టుకొనిపోయాయి, ఆ దెబ్బనుండి కోల్కొని తిరిగి గొప్పదశ నందుకొనే జవసత్వాలు మన పరిశ్రమకులేవు. ఇంగ్లీషు ఇంజినీర్ల మాటలు నమ్మకూడనివి కానీ, రేవుకువచ్చేపాయ మెరకవేసిందంటారు. అయినా అది మనిషికి సాధ్యంకానంత పాడైపోయి ఉండకపోవచ్చు. కానీ దానిమీద పెట్టుబడిపెట్టే నాథుడెవ్వడు? కోరంగి వాళ్ళగతి ఏమైతేనేం?

కోరంగిలో పెద్దకుటుంబాలన్నీ నాశనం కావడమో వలస వెళ్ళడమో జరిగింది. కోరంగివారు మరొకతరంపాటు ఓడలు నడిపినారు. అయితే అందులో గర్వించేదేమీలేదు.

కొత్తగా ఇంగ్లీషువారివశంక్రిందికి వస్తున్న బర్మాలో ఎక్కువ భాగం హీనవృత్తులవలంబించేవారుగా అక్కడికి వెళ్ళేవారినీ, అక్కడినుండి వచ్చేవారినీ మోసుకొనే ఓడలేఅవి. జంతువులు, నూనె, బట్టలు మొదలైనవి కూడ కొద్దిగా ఎగుమతయ్యేవనుకొండి. అక్కడినుండి బియ్యం ఇక్కడికి వచ్చేది. కలపవచ్చేది. ఆయనెవరో కవి 'రంగూన్ రౌడీ' వ్రాశారే అలా అయిపోయింది.

"ఆ పద్యాలు నీకువచ్చా?"

"ఎందుకురావుబాబూ? నేనూ వేషాలు వేసినవాణ్ణే బాబూ"

"ఏదీ. అను"

"ఇప్పుడా?ఇక్కడా" అంటూ వాడు సిగ్గుపడిపోయాడు.

"ఫరవాలేదు. మెల్లగా అనవోయి"

"మావాడికి నచ్చితే నీకు బహుమాన మిస్తాడులే కానీవోయ్"

"జనులనందరను కంచరగాడిదలట్లు మీ

రక మోయువారు కోరంగివారు

గౌరవ వ్యాపార కార్యంబు సేయనే

రని కూలివారు కోరంగివారు

అన్ని జాతుల కాలిపన్నాల దెబ్బల

శ్రమకోర్చువారు కోరంగివారు

మానంబు పోనాడి మలమూత్రములను శు

భ్రముచేయువారు కోరంగివారు

కొట్టినను తిట్టిన సహించి గొడ్లవోలె

లొంగియుండు బానిసలు మీకోరంగివారు

నాగరికతయు దేహసౌందర్య గరిమ

యుం గలుగనట్టివారు కోరంగివారు.”

“అక్కటక్కట పూజ్యమైనట్టి ఆంధ్రజాతి

గౌరవముమాని కోరంగి వారటంచు

హీనముగపల్కువారె కోరంగిలోన

ఇతర జాతుల కంటికి హీనముగను.

“ఆందోళికలనెక్కు నాంధ్రజాతికినేడు

లంచాల నీడ్చు కాలంబువచ్చె

అవనిపాలించిన ఆంధ్రజాతికి నేడు

కూలిచే జీవించు గోడువచ్చె

అతిశౌర్యవంతమౌ నాంధ్రజాతికి నేడు

పన్నాల దెబ్బల పాట్లువచ్చె

అధిక గౌరవనీయ మాంధ్రజాతికి నేడు

శుద్ధంబు తుడిచెడి క్షోభవచ్చె

అసమసాధ్యత్వంబున కీర్తినందినట్టి

ఆంధ్రజాతికి లౌంజలౌనపయశస్సు

వచ్చెనాగరికతకల్లు వారికిపుడు

మోటువారను కట్టడిమాటవచ్చె”

నాయకుడు నెత్తికొట్టుకొంటూ “నీకు దండంపెట్తాము! చాలించరా నాయనా నీపాట” అంటూ వాడినాపివేశాడు.

ఇంతలో రిక్షాలువస్తున్న చప్పుడు విన్పించింది. పడవవాడు వారికి బేరంకుదిర్చి వారిచ్చిన సొమ్ము సంతోషంగా అందుకొని వెళ్ళిపోయినాడు. రిక్షాల్లో కాకినాడ బయలుదేరి నారందరు విద్యార్థులూ. రాముఢూ బృంద నాయకుడూ ఒకరిక్షాలో కూర్చొన్నారు.

## XVIII

రిక్షాలో పయనిస్తూ రాముడు విద్యార్థి నాయకునితో అన్నాడు: "స్వాతంత్ర్య దినోత్సవంనాడు మా కాలేజీలో చూసిన Shadow Play గుర్తుకువస్తూంది ఈ రోజిదంతా విన్నాక. కోరంగివాలా నాటకంలోలా నీచానికి దిగజారలేదు మనజాతి. కోరంగిపతనం పాశ్చాత్య పారిశ్రామిక విప్లవం పూర్తికాకముందే జరిగిపోయింది. పాశ్చాత్య విప్లవం తరువాత మనదేశమింకా ఎన్నో ఇక్కట్లు పడింది. పాశ్చాత్య పారిశ్రామిక విప్లవం మనకు తెచ్చిన కష్టాలను షాడోప్లే చూపింది. దాని పర్యవసానంగా బయలుదేరిన స్వాతంత్ర్య పోరాటమూ చూపింది."

"ఏమిటా షాడోప్లే ?"

" Steel king Versus the Elephant and after అని దానిపేరు. కొత్తగా రైలువేస్తున్న రోజుల్లో ఒకచోట ఏనుగొకటి ఇంజన్ను గుద్దిందన్న ఘటన ఆదారంగా దాన్ని రచించారు."

దాని వివరం చెప్పరూ ?

రాముడి ఆలోచనలు కాలేజిలో జరిగిన ఆగస్టు పదిహేను దశాబ్ది ఉత్సవాలవైపు వెళ్ళింది.

కాలేజిలో ఓపెన్ ఎయిర్ థియేటరు.

తెల్లని తెర-రంగంమీద బిగించి కట్టబడిఉంది. ప్రేక్షకులు నిశ్శబ్దంగా ఉన్నారు. మైక్‌లో ప్రకటన జరుగుతూంది. ప్రకటన జరుగుతూండగా తెరమీద అరణ్యాన్ని స్ఫురింపజేసే నీడలు కన్పించినవి. వాటిననుసరించి ఒక

ఏనుగులగుంపు సూచించే నీడవచ్చి నిలిచినది. ప్రకటన వెనుక మైకులో కొనసాగుతున్నది. ప్రకటన కనుగుణంగా నీడలు కదులుతున్నవి.

"పందొమ్మిదవ శతాబ్దపుటుత్తరార్థం నాటి భారతదేశము. అందులో కీకారణ్యము. అందులో ఒక కుంజరయూథము వాసముంటున్నది. ఎన్ని తరములుగా అక్కడాఅరణ్యము నేలుకొంటున్నదో ఎవరూ చెప్పలేరు. ఏయే వన్యకుంజరజాతులు సంకరమై ఈ యూథము నిలద్రొక్కుకొని వెలసినదో కూడ ఎవరూ శాస్త్రీయముగా పరిశీలించి తేల్చలేదు. కాని ఆ యూథము లోటు లేకుండా కాలం వెళ్లబుచ్చుతున్నది. ఆ యూథమునకు కావలసిన ఆహారమును సమకూర్చు వృక్షరాజము లున్నవి. సంవత్సరం పొడవునా ఏవో పండ్లు కాయలు సమృద్ధిగా ఉంటూనేఉన్నవి. జలసమృద్ధి నొనగూర్చు కాసారము లున్నవి. సెలయేళ్ళున్నవి.

వసంతశోభలో అరణ్యమలరారి నప్పుడాయూథములోని గజములు తమ తొండములు సాచి పల్లవశోభిత శాఖాగ్రములను విరిచి కరేణువులకు ప్రేమమీర తినిపించి ఆ శేషమును తాముకూడ నోటబెట్టుకొని ఆనందించుతాయి. పుష్పిత వృక్షములను తమ గండములతో ఊపి ఊపి, అందు మూలముగా రాలిన పుప్పొడి ధూళిలో ఆనందించుతూ ఆడుతాయి. ఏపుమీరి పెరిగిన దంతములతో కరేణువులను లీలగా కుమ్మి వాటి ఘీంకారమునకు పులకించుతాయి. బలిసిన ఏనుగులు ఎత్తైన కొమ్మలను వంచి పిల్ల ఏనుగులకు చివుళ్ళనందించుచు తమ అనుభవములను నేర్పుతున్నాయి. బలిసిన ఏనుగులనడుమ గున్నఏనుగులు నలిగి జాలిగా ఘీంకరించినప్పుడు కరేణువులు పరుగిడి వాటికి సహాయము వెళ్ళి బలసిన ఏనుగులనవతలికి తోస్తున్నవి. ఒక ఏనుగు తొండముసాచి మరొక ఏనుగు తోకను పట్టుకొంటున్నది. ఇతర ఏనుగులన్నియు అట్లేచేయగా ఏనుగులవలయ మేర్పడుచున్నది. వలయం చెడకుండా ఏనుగులన్నీ నాట్యంచేస్తున్నవి. దాన్ని చూడగా కొండలకు రెక్కలువచ్చి ఎగురుతున్నట్లుగా ఉంది. ఎండవేడికి తాళలేనప్పుడాఏనుగుల కాసారములను చేరుకొంటున్నవి. పల్వలములందు కలియద్రొక్కుకొంటూ

కాసారమధ్యమునకేగి తొండముల నిండుగ నీరునింపి పరస్పరం చిమ్ముకొంటున్నవి. ఏన్గుల జలకేళిఅందము మనమెరుగనిదికాదు. సూర్యుడస్తమించనుండగా జలకేళి చాలించి ఒడ్డు చేరుతాయి. చేరి ఎత్తైన కొమ్మ లను విరిచి తాము తింటూ పిల్లఏనుగులకు పెడ్తూ అరణ్యంలోనికి తిరోగమించ నారంభిస్తాయి. హఠాత్తుగా ఏమాధ్వని? కోలుపులి గాండ్రించినదా? ఔను గజరాజు ఘీంకరిస్తున్నాడు. హటాత్తుగా ఏన్గులాగినవేమి? ఒకవరుస నొకటి ప్రక్కగా నొకటి నిల్చినవేమి ? అటుఇటు చివరలలో బలిసిన ఏనుగులు తరువాత లోపల ఎత్తునుబట్టి చిన్నవి, ఇంకా చిన్నవి ఈరీతి. మరల మధ్యను రెండుమూడు మదించిన ఏన్గులు. అన్నీ తదేక దీక్షతో తొండముల నటునిటు ఊపుతూ వాసన చూస్తున్నవి. ఔను ఇది విన్యాసము శత్రువు నెదిరించుటకు. యూథమును రక్షించుకొనుటకు సహజముగా ఏర్పరచుకొన్న వ్యూహము: ఒకరు నేర్పినదికాదు. సాధనచేసి అలవరుచుకొన్నదికాదు. ప్రకృతిసిద్ధముగా అలవడినది. వ్యూహముగా ఏర్పడిన ఏన్గులన్నియు ఒక్కసారి ఘీంకరించినవి. అడవి యంతయు దద్దరిల్లినది, అల్పప్రాణులు త్రాసతో దిక్కులకు పరుగులు పెట్టినవి, కోలుపులి వాసన క్రమముగా దూరమైనది. ఇక పరవాలేదు. పులి ఇక తమమీద పడదు. తనకు కావలసిన మరొకప్రాణిని వేటాడుకొని తింటుంది. శతృభయము తొలగిన సైనికులవలె యధేచ్ఛగా ఇక విశ్రమించవచ్చు. వసంతం గడిచింది.

గ్రీష్మఋతువు ప్రవేశించినది. ఏన్గు లిప్పు డెండవేడిమికి తాళజాలక ఎప్పుడూ నీళ్ళల్లోనే ఉంటున్నాయి. అయినా ముసలి యేన్గులు దుర్భరా తపవేదన భరించలేకుండా ఉన్నాయి.ఇంకా యింకా దట్టమై సూర్యరశ్మి చేరరానిచోట్లు వెతుకుతూ యూథమును అరణ్య మధ్యంలోనికి నడిపించుకొనిపోతున్నాయి. అరణ్యమధ్యమందే తమ సంతతి వృద్ధిచేసుకొంటున్నవి. కొన్నిపిచ్చెక్కి ఆరణ్యం వెలికిపోవచ్చు. అవి యూథంలో మరికలవవు.

వర్షర్తువు రాగా ఆకాశంలోని మేఘములకు భూమిపై ప్రతిరూపములనగా ఆ ఏన్గులు సంచరిస్తూఅరణ్యంలో క్రీడిస్తూంటాయి. వర్షధారకవి ఎంత ఆనందిస్తాయో ఉరుములకు మెరుపులకు అంతగా భయపడతాయి. పిడుగులు మాట చెప్ప వలసినదేమున్నది? పిడుగుపాటుకుచెదురగా ఒక ఏన్గు నీల్గవచ్చు. దాని వల్ల యూథమునకు లోటురాదు. యూథం మూమూలుగా జీవయాత్ర సాగిస్తూంటుంది. ఇంక ఎండవేడి దుర్భరంకాదు. అరణ్యం మధ్యలోనే దాగియుండ నవసరములేదు. శరదృతువు వచ్చింది. వెన్నెల అమృతం కురిపిస్తుంది. అడవికాచిన వెన్నల అని నానుడెందుకు వచ్చినదో కాని అది సరైనది మాత్రంకాదు. అరణ్యానుభవం లేనివారే అది కల్పించి ఉండాలి. శరత్కాలపు వెన్నెల ననుభవించడంలో నేటి మనుష్యులకంటె నాటివన్యములేమెఱుగేమో. కొన్ని యేన్గులకు పిచ్చెత్తుతుంది. మదధార కుంభస్థలము నుండి కారుతుండగా కొండంత శరీరాల నవలీలగా కదిలించుతూ అటూ ఇటూ పరుగెత్తుతాయి. పిచ్చెత్తిన ఏన్గులే యూథాన్ని అధిగమించి గ్రామాల మీద పడితే మనుష్యులు వాటి సంగతి చూసుకొంటారు. కాని పిచ్చెక్కి అరణ్యంలోనే ఉండి అరణ్యాన్ని పాడుచేస్తూ యూథ ధర్మములను ధిక్కరిస్తూఉంటే యూథమే దాని విషయమై శ్రద్ధ వహించాలి. ఒకవేళ పిచ్చికాకపోయినా యూథపతి పదవికైనా. స్పర్థ బయలుదేరవచ్చు. అదిగో. యూథములో గజరాజుకు ప్రత్యర్థి బయలుదేరినాడు. కరేణువు లాతనినుండి చూపులు మరల్చలేకపోతున్నవి. పిల్లయేన్గు లతనిని వచ్చీరాని దంతములతో పొడిచి తొండములతో తట్టుతున్నవి, నిమురుతున్నవి. అతనిలో రాజసం మేల్కొంటున్నది. అతన్ని మదించిన గజరాజు కూడ గమనిస్తున్నాడు. ఈనాడేకాదు. కొన్నినాళ్ళనుండి కూడ గమనిస్తూనే ఉన్నాడు. ఈరోజిక భరించలేడు. వేగం పుంజు కొనేందుకు వెనకకు పరుగెత్తుతున్నాడు. అదిగో ఎత్తైన కొమ్మల్లో బలీయమైన దాన్నొకటి విరిచి నేలకు విసిరికొట్టున్నాడు. తొండాన్ని బలంగా ఊపి పరుగెత్తుతున్నాడు. ఏమాకదలిక? ఓహో ! ఏమావేగం ? ఇంతసేపూ అతని ప్రత్యర్థి కదలలేదు.

మెదలలేదు. మిగిలిన ఏనుగులు మాత్రం దూరంగానిల్చి ఈ పోరాటాన్ని చూస్తున్నవి, ప్రత్యర్థి కదలలేదు. క్షణంలో గజరాజు ఢీకొన నుండగా కొద్దిగా పక్కకు నడిచినది. అంతటి గజరాజు ముక్కరించి పడబోయి తమాయించు
కొని నిలబడినాడు. తొండం గాలిలో వేగంగా ఊపుతూ ఘీంకరించినాడు. అది పూర్వంవలె నాయకుని మందలింపుకాదు. ఆజ్ఞ ప్రతిహతంకాగా భరించలేని ఆగ్రహం. తిరిగి గజరాజు ప్రత్యర్థివైపు ఘీంకరిస్తూ పరుగువెట్టినాడు. ఈసారికూడ ప్రత్యర్థి ఒడుపుగా పక్కకు జరిగినాడు. గజరాజీసారి ముక్కరించలేదు, తక్కునఆగి ఘీంకరించినాడు. ఇది ఆగ్రహ ప్రకటన మాత్రమేకాదు. ఇందులో దురాగ్రహ పరాకాష్ఠమైన కసి వ్యక్త మౌతున్నది. ఈసారి ప్రత్యర్థి ప్రతి ఘీంకారం చేసినాడు. 'సవాలుకు సిద్ధం'. గజరాజు సమాధానంగా ఘీంకరించివాడు, "నీవో ! నేనో". ఇద్దరూ ముంగాళ్ళు కొద్దిగా వంచి కుంభస్థలములతో ఢీకొన్నారు. తొండాలతో ఒకరి నొకరు కొట్టుకుంటున్నారు. ఒకరి తొండ మొకరు లాగుకొంటున్నారు. దంతములతో ఒకరినొకరు పొడుచుకొంటున్నారు.

వెచ్చనిరక్త మిరువురి శరీరాలనుండి కారుతున్నది. రక్తస్పర్శ, రక్తగంధం ఇద్దరిలోనుమరింత కసిని పెంచుతున్నది. వారి పోరాటధ్వని కరణ్యంలోని సకల జంతువులూ కలిగిపోతున్నవి. వాటి త్రొక్కిసలాటకు భయపడి ప్రాణభీతిచే ఒకటేపరుగు పెట్టున్నవి. నక్కలు మొదులకొని చిరుతపులుల వరకు హింస్రములన్నీ ఆసగా తమతమ నెలవులనుండి యుద్ధ పర్యవసానంకోసం ఎదురు చూస్తున్నవి. కొండంత మాంసమాయె మరి !

ఎంతటి వాడైనా గజరాజు వృద్ధుడు. ద్వంద్వయుద్ధంలో ఎంత ఆరితేరిన వాడైనా జవములుడిగినవాడు. అందువల్ల నీల్గసాగినాడు. ప్రత్యర్థి అతనిని మరి లేవలేనంతగా పడదోసి త్రొక్కి కుమ్మి పొడిచి తన విజయమును ఘీంకారముతో చాటినాడు. పడిపోయిన గజరాజు ఆర్తఘీంకారంకూడా గుండెలు చీల్చేలా విన్పిస్తూనేఉంది కాని యూథమునకది చెవిని పడదు.

ఇక ఆ పదవీ భ్రష్టుడైన యూధపతిని నక్కలుసైతం యధేచ్ఛగా పీడిస్తాయి, అయినా అది యూథం కంటబడదు. నూతన గజరాజుతో కరేణువులు సరసంగా ఆడుకొంటాయి. ఇతన్ననుసరించడమే యూధధర్మం ఒక్కొక్కప్పుడిట్టి గజరాజుల ద్వంద్వయుద్ధంలో ఎవ్వరూ నిర్ద్వంద్వవిజయం సాధించలేకపోతే ఇద్దరివెంటా చెరికొన్ని ఏనుగులు చేరి పరస్పర సంబధం లేకుండా రెండు యూథములై విడిపోతాయి. ఎట్టైనా యూథమునకు లోటులేదు.

హేమంత ఋతువు మనుష్యులకు వలెనే ఏనుగులకూ పర్వఋతువు. యధేచ్ఛగా గ్రామాలపై దాడిచేసి చక్కని పంటలు మేయవచ్చు. చెరుకుకూడ విస్తారంగా దొరుకుతుంది. అరటిగెలలూ విస్తారంగా తినవచ్చును. ఎవరిపంటలు వారు ముందుగా కోసుకొని నిల్వ చేసుకొనేందుకే మనుష్యులు తాపత్రయం పడుతూంటారు. తమ నొక్కుమ్మడిగా ఎదుర్కొనే ప్రయత్నం చేయలేరు.

తరువాత శిశిరఋతువు ప్రమాదం యూధానికి. గ్రామాలవెంబడి దోచుకొని తినేందు కలవాటుపడిన ఏన్గులు తిరిగి అరణ్యం మధ్యలోకి వెళ్ళేందు కలసత్వం కనుపరుస్తాయి. యూధపతి కూడా ఈ విషయంలో యూధమునొత్తిడిపెట్టి అరణ్యం మధ్యలోని కీడ్చుకొనిపోలేదు. అరణ్యం చివరల్లో తారట్లాడతూంటాయి. ఉన్నంటుండి అరణ్యంలో కొత్త శబ్దాలు బయలుదేరుతాయి. ఆ శబ్దా లేజంతువులవల్ల కాని కల్గినవికావు. అవి తప్పెట మ్రోతలు. కుక్కలు మొరుగుతాయి. ఇదిచాల అశుభసూచకం, యూధమంతా మేల్కొంటుంది. ఇక్కడిక్కడే అనవసరంగా చాలకాలం గడిపిన విషయం వాటికిప్పుడు గుర్తుకువస్తుంది. ఇది యూధమున కావత్కాలము. ఎటువెళ్ళినా బానినగజములపై మనుష్యులాయుధాలతో ఎదిరిస్తారు. తెరువివ్వరు. ఆ వలయాన్ని చీల్చుకొని వెళ్ళేందుకు ప్రయత్నించడం వృధా అయినా ఎదురించక విడువవు. ఎదిరించి ఛేదించుకొని పోగల్గినవి పోగా మిగిలినవి ఉన్న ఒకటేతెరువు చూసుకొని భయంతో

భీకరంగా పరుగెత్తుతాయి. గోతులో పడతాయి కొన్ని ఉచ్చులో తగులుకొంటాయి. గోతుల్లో పడినవి పడగా ఉచ్చులలో దొరికినవి దొరికిపోగా మిగిలినవి అరణ్యంలో దారి చూసుకొంటాయి. కొత్త వసంతాన్ని చవిచూస్తాయి. మనిషి చేతిలో దొరికిన ఏన్గుల భీకరార్తనాదాలు వినబడనంతటి దూరంగా అవి అడవిలోకి చొచ్చుకొని పోతాయి. నిజమే. ఆ దీనాలాపములు గాయపరిచినంతగా ఏన్గుల మనుస్సులను మరేదీ గాయపరచవు. పాపం ! మనిషి చేతిలో వాటికి ముందుముందెట్టి బానిస బ్రతుకున్నది ! చీ ఛీ. అంత ఏనుగు ఇంతమనిషికి లొంగి ఆతని ఆజ్ఞలు పాటించాలి. అతడు తమవారిచేత దుంగలు మోయిస్తాడు. మద్యంతాపి మనుష్యులను తొక్కిస్తాడు. గోడలకు తలుపుచెక్కలకు ఢీ కొట్టిస్తాడు, లావులావు మేకులు కుంభస్థలాన్ని చీల్చుతున్నాసరే. మనిషిచేసే నాటి యుద్ధాలతీరూ, కోటలు నిర్మాణం కోటద్వారాల విచ్ఛేదం ఇవన్నిటి ఆంతర్యాలు పాపం ! వాటికేం తెలియదు. ఈ బానిసబ్రతుకు నందుకే అమితంగా ద్వేషించటం మొక్కటే యూధానికి తెలుసు. బద్ధగజ దీనాలాపాలనవి భరించలేవు. దూరంగా వసంత మాధుర్యంలో మరచిపో గోరుతాయి. ఇట్టి చక్రభ్రమణములా యూధ చరిత్రలో ఎన్ని గడిచినవో ఎవరు చెప్పగలరు ? వందలో !వేలో ! లక్షలో ! కానీ –

పంతొమ్మిదవ శతాబ్దం మధ్యలో ఈ గజములు యూధచరిత్రలో ఎప్పుడూలేని వింతలు చూడనారంభించాయి. వాటికది ప్రళయకాలముగా కన్పించింది. ఈ సారి మనుష్యులు బాగా అడవిలోపలికి చొచ్చుకొని వస్తున్నారు. పూర్వం వచ్చిన మానవులవలె వీరు తామూ మేయగల పంటలు పండించుటలేదు. వచ్చినవారు పోనీ తమకు రావలసిన ఫలములో ఎండిపోయిన చెట్లమోడులో మరొకటో తీసుకొని వెళ్ళిపోవడంలేదు. పూర్వంతాము చవిచూచిన దండయాత్రలకూ వీటికీ పోలికేలేదు. వీరరణ్యాన్ని నాశనం చేస్తున్నారు. కొండలను పిండికొట్టుతున్నారు. పైగా తమ అధికారాన్ని సుస్థాపితం చేసుకొంటున్న గుర్తుగా రాళ్ళముక్కలు పరచి అందుపై పలకలుపేర్చి తామెప్పుడూ చూడని వింతవస్తువులను

పొడుగునా  పేర్చుకొని పోతున్నారు. ఒకసారి యూథం వారి ప్రయత్నమును వమ్ముచేసింది. కొందరు మనుష్యులను పడత్రొక్కి కమ్ములు, పలకలు  మొదలైన వానిని వికావికలుగా విసరికొట్టి నానాభీభత్సం చేసినవి. మనుష్యులు కొన్నినాళ్ళు కనబడలేదు. ఇంకభయంలేదు. వారు రారనుకొన్నది యూథం. పాపం!కాని ఈసారి వారినుమడించిన బలంతో వచ్చినారు. వారిపై యూథం తిరుగబడినది కానీ యూథమునకది గెలువగల పోరాటంగా కన్పించలేదు. ఎంతేసి ఏన్గులో దెబ్బదెబ్బకే కూలినవి.  యూథం వెనుదిరిగింది. అందులో మరణించినవి పోగా పరుగెత్తి తప్పించుకొన్నవిపోగా ఒకబలిష్ఠమైన ఏనుగుమాత్రం కాలికి తీవ్రమైన  గాయం కావడంవలన  యూథమును  కలుసుకొనలేక ఆదరిదాపులను మిగిలిపోయినది. రైలుమార్గం వేస్తున్న  మనుష్యుల  కడవిలోనికి పోయేందుకు  భయంకాబట్టి ఏనుగు ఉనికి తెలియలేదు. ఇప్పుడిప్పుడే దానిగాయంమాని నడవగల్గుతూంది. ఈ లోపుగా ఎన్ని రోజుల గడిచాయో ఎన్ని నెలలు గడిచాయో ఏనుగుకేం తెలుసు పాపము? ఒకరోజున చెట్లబాటు నుంచి చూచింది. ఏ అలికిడీలేదు. మనిషివాసనకూడా అందటంలేదు. జాగ్రత్తగా తొండంఊపుతూ మనిషినిల్పిన గుర్తును సమీపించింది. రైలుబద్దీలునాటి మానవలోకానికే కొత్తగదా పాపం ఏనుగుకేంతెలుస్తుంది? కమ్ములను తడిమి చూచింది చల్లగాను కఠినంగానుఉంది. రాళ్ళముక్కలు తడిమింది. విశేషంలేదు,  వాసనమాత్రం  నూతనంగాఉంది. ఓపినమట్టుకు  రాళ్ళన్నీ చిందరవందర చేసింది. కమ్మీలుమాత్రం లొంగివచ్చుటలేదు.

కమ్మీలు  అదురుతున్నట్లుగా  అనుమానం  తోచింది.  ఔను.దూరాన ఏదో చప్పుడుకూడ  వినవస్తూంది.  ఆవైపూ ఈవైపూ ఎంత దూరం చూచినా ఒక్కటేమార్గం.  అడవుల్లో ఇట్టి అనుభవం లేదు.

కమ్ములమీద దూరాన అదిగో ఏదో కన్పిస్తున్నది.  ఏదో వింత వాసన! అపూర్వం! తనవైపే కమ్ములపై  వస్తున్నది!  ఇంత చుక్కవలె పూర్వం కన్పించిందిప్పుడు తనంత,  కాదు తనకంటే ఇంకా పెద్దదిగా పెరిగి సమీపిస్తున్నది. ఏమది? ఆచప్పుడింతకుముందెప్పుడు తాను వినినట్టిదికాదు. ఆ రూపం తాను

కనినట్టిదికాదు. ఆ రూపం కీచుగొంతుకలోఅరిచింది ఏమని? ఆభావమూ తనకు బోధపడలేదు. తనకు తెలియకుండానే ఏనుగు వెనుకడుగు వేసింది. ఆరూపం సమీపించిన కొలది అది మరింతవెనుకకు కదిలి తుదకు చెట్లచాటున దాగింది. ఇంజన్, దానివెనుక కొన్ని పెట్టెలూ వరుసగా ఒకే మాదిరి వేగంతో పోతున్నాయి. రైలు కూ అంటూ కూతవేసింది దాని భావమేమైయుంటుందా అని ఏనుగు చాల ఆలోచించింది. జంతు వాకలి గొన్న అరుపుకాదు. భయపడిన అరుపుకాదు ఏమది? ఎంతవేగంగా వచ్చిందో అంత వేగంగా వెళ్ళిపోయిందది.అందంతా ఒక జంతువేనా లేక అది యూథమా?అవికూడ ఏన్గులేనా? అయితే తొండములు? కాళ్ళు? దంతములు?ఏనుగుకంతా అయోమయంగా ఉంది. రైలు దూరంగా వెళ్ళినపిదప ఏనుగివతలికి వచ్చింది. వన్యసహజమైన జాగ్రత్త వారించబట్టి కానీ లేకపోతే ఆరక్కసిని ఢీకొని ఉండును, తాను! ఈసారి ఢీకొంటుంది. తిరిగి పూర్వంవలెనె నిశ్శబ్దవాతావరణం. వెక్కిరిస్తూ పడుకొన్న రైలుమార్గం ఏనుగు చూట్టూచూచింది. తాను సంతోషంగా ఒళ్లురుద్దుకొంటున్న రాతిగుండేదీ? పిండి కొట్టేశారు.తను తొండంసాచి అందుకొంటున్న పువ్వులకొమ్మలేవి? ఆచెట్టుమొదలు నరికివేశారు. ఎంతసేపైనా విడువకుండా చల్లగా పండుకొనెడు పల్వలమేదీ? దాన్ని కప్పిపెట్టినారు. గజరాజు మనస్సు ద్వేషంతో నిండిపోయింది. పూర్వమెవ్వరూ తమకింత అన్యాయం చెయ్యలేదు. పూర్వం తమయూథ మెప్పుడును ఇంతటి అన్యాయానికి గురికాలేదు. అరణ్యాన్ని కొల్లగొట్టిన వారున్నారుగాని మరి పెరగకుండా చేసినవారులేరు.

అదిగో తిరిగి అదేధ్వని, అదే కదలిక. అదే కూత. తనున్నట్టైనా లక్ష్యపెట్టకుండా అదేపయనం. ఒకటేవేగం. మనస్సు ఢీకొనమని పురిగొల్పుతూంది. శరీరం జంకుతూంది. ఏ ప్రాణికూడ కోరికోరి ఆత్మ వినాశాన్ని వరించదు. అది మనిషికొక్కనికే అలవడిన దుర్వ్యసనం.ఈ విధంగా ఎన్నాళ్ళు గజరాజు మాటువేసినాడో తెలియదు. ఎన్నోసార్లు రైలు మార్గమున కవతల ఇవతలున్న ఆరణ్యంలోనికి వెళ్ళిపోయేవాడు, దీనిజోలి మానుకుందామని. అయినా మనస్సెక్కడా ఉండనిచ్చేదికాదు. తనకు తెలియకుండానే రైలుమార్గాన్ని చేరుకొనేవి కాళ్ళు.

కొన్నిసార్లు మార్గం పొడుగునా అటూఇటూ నడిచి చూచింది. ఏం ప్రయోజనం? దానికంతుఉన్నట్లు కనిపించదు.

ఈ విధముగా ఆరైళ్ళను చూస్తు కొన్నాళ్లు గడిపిన గజరాజుకు లోలోపలే కసి రగిలి కాలిపోతున్న గజరాజుకు, ఒక రోజున చక్కని అవకాశం రానే వచ్చింది. ఈసారి ఇంజన్ ఒకటే వచ్చింది. వెనుక పెట్టెలులేవు. ఈ అవకాశం జారువిడువ కూడదు. ఈసారి దానిని తప్పించుకొనిపోనివ్వకూడదు. అల్లంత దూరాన ఉండగానే రైలుమార్గంమీదికి నడిచింది. మార్గంమీద నిలువుగా నిల్చుకొన్నది. కుంభస్థలం ఎదురిచ్చి ! అది ఎంత బలంగా ఢీకొంటుందో పరీక్షించ దలచిన గజరాజుకు చాల ఆశాభంగంకల్గింది. తనకు కొన్నిమీటర్లు దూరంలోనే హటాత్తుగా నిల్చిపోయింది. ఇంజన్ నిల్చుకొని కూతవేస్తున్నది.కూత వినిగానే గజరాజకు కసి పెరిగిపోయింది తిరిగి అదేకూత! ఏభావమూలేదు. గజరాజుకు నిగ్రహం తప్పినది. ఆకారం వైపు పరుగుతీసినాడు. ఆ ఆకారం వెనకకు పోతుందేం? గజరాజింకా వేగం పెంచినాడు.

ఇంజన్ డ్రైవర్ఈ మదగజం గురించి ఈ తప్పిపోయిన ఏనుగు గురించి – ఇంతకు ముందు విని ఉండాలి. ఇతర డ్రైవర్లూ చుట్టు ప్రక్కల స్టేషన్వాళ్ళు స్టేషన్వాళ్ళు దీన్నిగురిచి మాట్లాడుకొంటూనే ఉండిరాయె. అతని కీవేళ హుషారుగా కూడ ఉంది. అందుచేత తెగించి ఏనుగు నాటపట్టిస్తున్నాడు. ఏనుగు పట్టాలమధ్య నున్నంతవరకు తనకు భయంలేదు కదా. ఏనుగు గుద్దితే ఇంజనుకు వచ్చే నష్టమేముంది కనక? పడితే నాలుగు సొట్టలుపడవచ్చు. పొట్టకోసం వేలమైళ్ళు స్వదేశం విడిచి వచ్చిన ఆ ఇంజన్ డ్రైవరుకు పాపమా మాత్రం తుంటరితనం ఉ ండడంలో ఆశ్చర్యమేమీలేదు. కొన్ని గజాలు వెనుకకు వెళ్ళి ఆపినాడు.బ్రేక్ నొక్కిపట్టకుండానే నిల్పినాడు. గజరాజు పరుగుతీసినాడు. పాప మతనికీ వ్యవహారమేం తెలుసు ? వెళ్ళినదే తడవు గుద్దినాడు. ఇంజన్ బాయిలరు మోసే చట్రం మోటు కతని కుంభస్థలం గుద్దుకొంది. ఇంజ నమాంతం వెనుకకు కదిలింది.

గజరాజు తొట్రుపాటు పడినాడు. తమాయించుకొని తిరిగి దానిమీద కురికినాడు. ఈసారి డ్రైవరు బ్రేక్‌నొక్కి పట్టినాడు. గజరాజు బలమంతా వినియోగించి ఢీకోనగా ఇంజన్ వణికింది గాని కదలలేదు. కుంభస్థలం మాత్రం ఒక్క దెబ్బకు పగిలింది. వెచ్చని రక్తం కారుతున్నది. అయినా తొండంతో కొట్టుతూ తిరిగి తిరిగి ఢీకొట్టుతున్నది. ఇంజను కదలలేదు! ఇప్పుడు వణుకు కూడలేదు. కూత మొదలుపెట్టింది. అదే కూత. ఏం మార్పులేదు. తన ఘీంకారం ఎంత ఆవేశం కక్కుతూందో. ఆ చప్పు దంతమామూలుగా ఉంది. తన రక్తమా ఆకారాన్ని తాకినదే తడుపు గడ్డకడుతున్నది. ఆకారం యొక్క రక్తమాంసాంలు తన స్పర్శకు తెలియుటలేదు. గజరాజుకు తన ఓటమి తెలిసివచ్చింది ఎంతో దీనంగా ఘీంకరించాడు. ఇంజ నీసారి ముందుకు కదులుతూ తనను వెనుకు తోస్తూంది. ఏనుగు మరల ఒకసారి గుద్దింది. తన సర్వశక్తూలూ కూడ గట్టుకొని. అబ్బా ఇంతదెబ్బ తానెప్పుడూ తినలేదు. ఈసారి గజరాజు సల్పిన ఆర్తనాదానికి అడవియావత్తు 'ఓ' యని ఏడ్చినది. సెలయేళ్ళు భోరుమని పారినవి. గాలి హోరుమని వీచినది. ఇంక తాను నెగ్గలేదు. వెనుకుకు పరుగెత్తినాడు. ఆ ఆకారంతన్ను తరుముతున్నది. అంతకంతకు దానివేగం ఎక్కువౌతున్నది గిరుకున్న అడ్డంతిరిగినాడు. అరణ్యంవైపు పరుగెత్తినాడు. అంతలో ఆ ఆకారంతన వెనుక పాదం ముక్కను కొంత తినివేసినది దారి పొడుగునా రక్తంకాల్వలై పారుతుండాగా సంజెవేళ నల్లని మబ్బుల మధ్య ప్రకాశిస్తున అరుణిమవలె, తలమీద గాయములు, కమ్ముకొననున్న చీకట్లను సూచించుచుండగా గజరాజు చెట్లమాటునకు చేరుకొన్నాడు.

తరువాత గజరాజు ఏమైంది మనకు సరిగాతెలియదు. ఆరోజు ఇంజన్ డ్రైవరువద్ద తుపాకియేగాని ఉండిఉంటే ఇంతకథేలేదు. తరువాత సకలసన్నద్ధులై ఆ యేనుగును వేటాడేందుకెందరో వెళ్ళినట్లు చెప్పుకొంటారు. వారుచెప్పేకథల్లో గజరాజునుగురించిన కధకంటె స్వోత్కర్షే ఎక్కువగా ఉంటుంది. యుద్ధభూమినుండి వచ్చినారు, వేటకువెళ్ళివచ్చినవారూ చెప్పేకథలంతకర్ణపేయంగా

మరేకథలుంటాయి? నాటికామార్గాన ప్రయాణీకులు ప్రయాణించేసేవారోలేదో మనకుతెలియదు. ప్యాసింజర్లే కనుక ప్రయాణం చేసి ఉన్నట్లైతే వారిపిల్లలుకూడ మిత్రులతో ఏన్గనుచూచినట్లు గొప్పలుచెప్పుకొనిఉంటారు. ఆ ఘీంకారాన్ని తామువిన్నట్లుకూడా చెప్పుకొంటారు. వాటితోమనకేంవని? కానిఒకటిమాత్రంనిజం. ఆ ఏన్గుచేసిన ఆర్తఘీంకారాంవంటిదే ఆకాలంలో యావద్భారత ప్రజలూచేసారు. ఆసియా ఖండం యావత్తూచేసింది. తమ సంపదయావత్తూ తమకుకాకుండాపోయి ఓడలుబండ్లై, బండ్లోడలై సమాజం విశిష్టశక్తులఒత్తిడిలో చిత్రమైన మార్పులకు గురికాగా, కారణాలూహకందక, చరిత్రగతి తెలియరాక భారతీయులందరూ ఎన్ని అగచాట్లోపడినారు. భారతచరిత్రలోనే అంత విషాదకర యుగమింకొకటిలేదు. ఈ పరిస్థితిలోనుండి బయటపడి, భారతీయులు మానవజాతిలో ఉచితస్థానంమాక్రమించేందుకు, భారతీయులు మానవజాతిలో ఉచితస్థానం గడించుకొనేందుకనేక ఘర్షణలు పడినారు. ఆ ఘర్షణలన్నీ పెరిగిపెరిగి బలంపుంజుకొని భారతీయ స్వాతంత్ర్య సంగ్రామమైవెలసినది. ఇక్కడ ఉక్కురక్కసికి గజరాజుకు జరిగిన ఘర్షణలో గజరాజు తిరోగమించి ఉండవచ్చు. భారతీయులు సామ్రాజ్యవాదంతో జరిపిన ఘర్షణలో తుదకు జయమే సాధించారు. సుమారు ఒకశతాబ్దంపైగా జరిగిన ఈ సంగ్రామం ఒకతీరున నడుస్తుందని ఎట్లనుకొనగలము? ఎన్నిరంగములలోనో ఎన్నివిధములుగానో అదినడిచింది. ఎన్నో మజిలీలున్నాయందులో"

ఈ విధంగా సాగుతూంది మైకులో వాగ్ధోరణి. దానిననుసరించి తెరపై నీడలు నిశ్శబ్దంగా కదులుతున్నాయి. నీడలు మాట్లాడుటలేదుగానీ అడవులు శబ్దాలు, ఇంజన్ శబ్ధాలు ఏన్గుల ఘీంకారాలు గజరాజు ఘీంకారం ఇవిమాత్రం ఆయాసందర్భాలలో వినిపిస్తున్నాయి. ఛాయాప్రదర్శనం కొనసాగుతూంది. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామములో ఘట్టాలు, కాంగ్రెస్ పుట్టుక, పలుచోట్ల జరిగిన కాంగ్రెస్ మహాసభలు, తిలక్‌నౌరోజీల నాయకత్వం, టెర్రరిష్టుల వీరగాథలు, హోంరూలు ఉద్యమం, గాంధీగారి ప్రవేశం, జలియన్‌వాలాబాగ్ మారణహోమం, భగత్‌సింగ్

మొదలగువారి సాహస కృత్యాలు, బార్డోలీసత్యాగ్రహము, కాంగ్రెస్ రాష్ట్రప్రభుత్వాల నాక్రమించుకోవడం, క్విట్టిండియా ఉద్యమం, మతకల్లోలాలు, భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించుట ఈ ఉదంతాలన్నీ ఆ ఛాయాప్రదర్శనంలో చూపించారు.

నీడల కదలికలకూ. ప్రకటనకూ ఒక్కొక్కసారి సామరస్యం కుదరకపోయినా విషయం గొప్పదికనుక ప్రేక్షకు లౌదార్యం వహించి ఎంతో నిశ్శబ్దంగా విన్నారు. టెక్నిక్ అక్కడక్కడా దెబ్బతినకపోతే ఇంకాబాగుండును కానీ దానితోనే ప్రేక్షకులు తృప్తిపడినారు.

అదంతా రాముడు విద్యార్థి నాయకమిత్రునికి వర్ణించి చెప్పినాడు విద్యార్థి నాయకుడు ఆ ఛాయానాటక నిర్మాతలకు జోహరులర్పించి"మనం దేశమాత ప్రియతమ పుత్రులు కావాలి ! అంతకంటే గొప్పఏముంది?" అన్నాడు.

రాముడారాత్రి విద్యార్థి నాయకుని గది లోనే పడుకొన్నాడు.

రాత్రతనికి బాగా జ్వరం కాచింది. అదలాగే వరుసగా మూడురోజులు కాచి మిత్రుడు చేయించిన వైద్యంవల్ల తగ్గింది. ఇంక రాముడి మనస్సింటి మీదకి మళ్ళింది, మిత్రుడు వారిస్తున్నా ఒప్పుకోక జ్వరం తగ్గిన మరుసటి రోజే ఇంటికి బయలుదేరి పోయాడు."మనమైత్రి ఇంకా వృద్ధిపొందాలి. ఉత్తరాలు వ్రాసుకొందాం" అనుకొన్నా రిద్దరూ.

రాముణ్ణి సాగనంపి స్టేషన్నుండి గదికివెళ్తూన్న మిత్రుని చెవిలో రాముడు జ్వరంలో ఉండగా కలవరించిన కలవరింపే గింగురు మంటూంది.

"మరికొన్ని శతాబ్దాలు నాదేశాన్ని వెనుబడ నివ్వను" "వెనుకబడనివ్వను"

ఆ పల్కులే నెమరువేసుకొంటూ ఆమోద సూచకంగా తలూపుకొంటూ అతను గదిచేరుకొన్నాడు.

రాముడిల్లు చేరుకొన్నాక తిరిగి జబ్బు తిరగబెట్టింది. అతను కోల్కొని మూమూలు మనిషయ్యేందుకు నెల రోజులు పట్టింది.

రాముడి తండ్రిగారైన శాస్త్రిగారొక రోజున కొడుకుతో నెమ్మదిగా "ఎప్పుడూ కలవరించని వాడివి ఈసారి జబ్బులో ఏమిరా అలా పలవరించినావు." అనడిగినారు.

"ఏం పలవరించాను, నాన్నా ?"

"మరికొన్ని శతాబ్ధాలు దేశాన్ని వెనుకబడ నివ్వను ఉఃహు: వెనుక బడనివ్వ"నంటూ అరిచావు. ఇంకా సందర్భశుద్ధి లేని మాటలన్నావు గానీ, నాకు జ్ఞాపకంలేవు."

రాముడు సీరియసు ముఖంపెట్టాడు. తరువాత బిడియపడినాడు. "నిజంగానా ?"

"నిజంగానే. దీనికబద్ధం ఎందుకు ?"

రాముడు తనకు కోరంగిలో కల్గిన అనుభవాన్ని, తాను విన్న కథను తండ్రికి వివరించాడు. ఆయనదంతావిని స్వాతంత్ర్యోద్యమంనాటి రోజులు తల్చుకొని, "నిజమేనాయనా ! మాకాలంలో స్వాతంత్ర్యానికై మా విధి నెరవేర్చినాము. మా కలలింకా పండలేదు. నేటి యువకులు నడుం కట్టకపోతే మనదేశం తిరిగి శతాబ్దాలు వెనుకబడే ప్రమాదముంది. సాహసంతో దీక్షవహించి నడుముకట్టితే అందుకొనడ మదెంత ? దశాబ్దాల్లో అందుకొనవచ్చు" అన్నారు.

ఇంతలో రాముని అక్కగారికొడుకో పుస్తకం చేతబట్టుకు వచ్చాడు."తాతయ్యా నాకీబొమ్మల పుస్తకంలో కథలు చెప్పవూ ? " అంటూ.

"నా కోపిక లేదు. మామయ్యనడుగు" అని ఆయన లేచిపోయారు,

రాముడా పిల్లవాణ్ణి ఒడిలో కూర్చుండ బెట్టుకొని ఆ పుస్తకం చేతిలోకి తీసుకొన్నాడు. జంతువుల తెల్వితేటలపై ప్రయోగాత్మకములైన కథల పుస్తకమది. ఆ అట్టమీద ఒక ఏనుగు స్టూల్‌మీద కూర్చొని రైలిం జన్ను తొండంతో నడుపుతూంది !



# స్వస్తి

శుభము శుభము నవ భారత
నిర్మాతల కమరు శుభము
దేశ భాగ్య మినుమడించు
శ్రామికులకు కలుగు సుఖము.

కరువు వరద పెను తుఫాను
రుజల పీడ తొలగ వలెన్
వ్యవసాయం వాణిజ్యం
పరిశ్రమలు పెరుగ వలెన్.

బ్రతుకు బరువు మోయలేక
నరు డెవడూ కృంగ రాదు
అంకినంత ఆర్జించగ
జనులు నీతి తప్పరాదు.

నిర్జీవపు గర్భంవలె
గని సంపద మూల్గరాదు
వ్యర్థముగా వలవలమని
నదులు కడలికేగరాదు

ఆనకట్ట లడుగడుగున
నదుల మీద వెలయవలెన్
సీమ సీమ తనిపి నదులు
నవ జీవం పోయలెన్.

శత్రు దుర్ని రీక్ష్య రక్ష
మనకెప్పుడు నిలువ వలెన్
తిరుగు లేని ప్రగతి నావ.
ఎదురు లేక సాగవలెన్.

సిరుల కళల మేటి యనగ
అవని మనల మెచ్చవలెన్
సకల జనులు సములు కాగ
భువిని న్యాయ మేల వలెన్.

శుభము శుభము నవభారత
నిర్మాతల కమరు శుభము
దేశభాగ్య మినుమడించు
శ్రామికులకు కలుగు జయము.

